# శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాముల వారి

# జీవిత చరిత్ర







శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి

# శ్రీ విద్యాప్రకాశానందస్వామి జీవిత చరిత్ర



రచయిత
సాహిత్య శిరోమణి
శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, M.A.
తిరుపతి

1992

ప్రకాశకులు
శ్రీ శుకబ్రహ్మాశ్రమం
శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా.



Be Fearless

# దైవప్రార్థన

కరుణామూర్తి యగు ఓ దేవా! మాచిత్తము సర్వకాల సర్వావస్థలయందును మీ పాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుడు!

పరమదయానిధీ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువరకును మనోవాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగ కుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయు లాగునను సద్బుద్ధిని దయచేయుడు.

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మా యంతఃకరణమునందు ఎన్నడును వివిధ మైన దుష్టసంకల్పము గాని, విషయవాసన గాని, అజ్ఞానవృత్తి గాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుడు!

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మా యందు భక్తి, జ్ఞాన, వైరాగ్యబీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధము లగునట్లు ఆశీర్వదింపుడు. మఱియు ఈ జన్మము నందే కడతేరి మీసాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తిసామర్థ్యములను కరుణతో నొసంగుడు!

దేవా! మీరు భక్తవత్సలురు! దీనులపాలిటి కల్పవృక్ష స్వరూపులు! మీరు తప్ప మాకు ఇంకెవరు దిక్కు! మిమ్ము ఆశ్రయించితిమి. అసత్తునుండి సత్తునకు గొనిపొండు! తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొండు! మృత్యువునుండి అమృతత్వ మును పొందింప జేయుడు! ఇదే మా వినతి. అనుగ్రహింపుడు. మీదరి జేర్చుకొనుడు. పాహి మాం! పాహి మాం! పాహి మాం! పాహి!!

ఓం తత్ సత్.

---

(ఈ ప్రార్థనము ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునపుడును మనఃస్ఫూర్తిగా పఠించుదురో, అట్టివారికి జీవితమునందేలాటి దోషములును కలుగకుండుటయే గాక భగవంతుని యొక్క యనుగ్రహమునకును వారు పాత్రులు కాగలరు.)

# ముందు మాట

'ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు' అంటారు. అలాంటి స్థితిని వారు పొందటానికి అహర్నిశలు ఎంత తపస్సు చేశారు? ప్రకృతిలోని ఆటుపోట్లను ఎలా ఎదుర్కొన్నారు? ఎంత శ్రమపడ్డారు? అన్న విషయం ప్రజానీకం తప్పని సరిగా తెలుసుకొన్నప్పుడే ఆ మహానుభావులపై భక్తి శ్రద్ధలు కలిగి వారు చూపిన సన్మార్గంలో పయనించగలరు.

అలాంటి మహనీయుల చరిత్రలను అందరికీ అందుబాటులోకి తేవాలన్నా, తెలియజెప్పాలన్నా రచయిత పాత్ర ముఖ్యాతిముఖ్యం అవుతుంది.

ఆనాడు జరిగిన మహాభారతయుద్ధ సంఘటనలనూ, అవతారమూర్తి శ్రీ కృష్ణుని దివ్యసందేశమైన గీతాబోధనూ ఈనాడు మనం తెలుసుకొంటున్నామంటే - ఆ పుణ్యం రచయిత శ్రీ వేదవ్యాస మహర్షిదే.

అదే విధంగా రామాయణదివ్యగాథను లోకానికి అందించిన ఘనత శ్రీవాల్మీకి మహర్షిదే.

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి జీవితవిశేషాలను చక్కని శైలిలో సామాన్య పాఠకులకు సైతం అర్థమయ్యే రీతిలో అందించిన సుకృతం శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారిదే. తద్వారా వారు అందరికీ సుపరిచితు లయ్యారు.

వారు శ్రీ మలయాళసద్గురు దేవులు వ్యాసాశ్రమంలో స్థాపించిన సంస్కృత పాఠశాలలోనూ, తిరుపతి సంస్కృత కళాశాలలోనూ విద్య నభ్యసించి పండితు లయ్యారు. పారమార్థికక్షేత్రంలో ప్రయాణం చేస్తూ తిరుమల తిరుపతి దేవ స్థానంవారి ధర్మప్రచార పరిషత్తుకు కార్యదర్శిగా ధార్మికోపన్యాసాలతో ఎనలేని ధర్మప్రచారం చేశారు. అనేకగ్రంథాలు వ్రాశారు. ప్రస్తుతం దేవస్థానంవారి ప్రాచ్య కళాశాలలో సంస్కృత సాహిత్య శాఖాధ్యక్షులుగా విద్యార్థులను తీర్చి దిద్దుతున్నారు.

శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారి సన్నిధానంలో వుంటూ, శ్రీ కాళహస్తిలో శ్రీవారు స్థాపించిన శ్రీ శుక బ్రహ్మాశ్రమం అభివృద్ధికి విశేషకృషి చేస్తూ శ్రీ స్వాములవారి జీవితచరిత్రను 35 పుటల సంక్షిప్తగ్రంథంగా వ్రాసి వుండినారు. వేలకొలది భక్తులు ఆ చరిత్ర చదివి ఆనందించినారు. అనేకులు శ్రీవారి చరిత్ర ఇంకా విపులంగా ఉండడం అవసరమన్న అభిప్రాయం ప్రకటించారు. వారి అభిప్రాయాన్ని శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికి తెలుపగా వారు అలాంటి రచనను చేపట్టడానికి అంగీకరించారు. తమ సమయం కొంత గ్రంథరచనకు కేటాయించి తక్కువ సమయంలో ఎక్కువ విషయాలుగల ఈ రచనను పూర్తి చేశారు.

ఈ గ్రంథాన్ని శ్రీ శుకబ్రహ్మాశ్రమం ఆవరణలో స్థాపించిన భక్త కన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి ప్రారంభోత్సవ సందర్భంలో ఆవిష్కరించడానికి అనువుగా అతి స్వల్పకాలంలోనే సాంగోపాంగంగానూ, సమగ్ర సుందరంగానూ ముద్రించి యిచ్చిన శ్రీ జగదీష్ పేపర్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్., - విజయవాడ- వారు అభినందనీయులు.

రచయిత శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికీ, లోగడ సంక్షిప్త చరిత్రను వ్రాసిన సద్గురువాణి సంపాదకులు శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారికీ, తమ అమూల్యమైన సందేశాలనూ, సలహాలనూ ఇచ్చిన పెద్దలకూ మా ధన్యవాదాలు.

ఈ జీవితచరిత్ర భక్తులను ఉత్తేజ పరచగలదని ఆశిస్తున్నాము.

శ్రీకాళహస్తి

2-3-1992

(శివరాత్రి)

ఓం

ఇట్లు,

ప్రకాశకులు

# ప్రస్తావన

శ్రీ మద్భగవద్గీతా ప్రబోధంతో, దిగంతాలు ప్రతిధ్వనించే దివ్యోపదేశాలతో ఆంధ్రావనిని పునీతంచేస్తూ, క్రాంతదర్శిగా గ్రంథరచనా కౌశలంతో ఆధ్యాత్మిక ప్రచారం సాగిస్తూ, అనుష్ఠానపరులుగా సదాచార సచ్ఛీలాలతో సాధు సజ్జనులందరికీ మార్గదర్శకులైన మహనీయులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు. నిత్యనూతనోత్సాహంతో నిరంతరాయంగా మానవాళికి శ్రేయోమార్గాన్ని చూపిస్తూ ఆధ్యాత్మికంగా, సాంఘికంగా నిద్రాణమైన మానవసమాజాన్ని జాగృతం చేస్తున్న అలాంటి మహామనీషి జీవితచరిత్ర ఆంధ్ర పాఠక మహాశయులకు అందుబాటులోకి రావడం ఆనందదాయకం. దీన్ని జగద్ధితం చేయడానికి పూనుకున్న పుణ్యపురుషులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు అభినందనీయులు.

విశిష్టకళావైభవంతో విలసిల్లుతూ అవని కంతటికీ ఆధ్యాత్మిక జ్యోతిర్లీలా రోచుల్ని ప్రసరింపజేస్తున్న పుణ్యనిలయం శ్రీ కాళహస్తికి అతిసమీపంలో అలరారుతున్న శ్రీ శుకబ్రహ్మాశ్రమం భక్తుల్ని అపారంగా ఆకర్షిస్తున్నది; నేల నాలుగు చెరగులా ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని విస్తరింప చేస్తున్నది.

ఆ ఆశ్రమ వ్యవస్థాపకులు శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి విరాడ్రూపాన్ని వీక్షిస్తే అర్జునుడు విశ్వరూపం దర్శించి సమ్మోహితుడైనట్లే మనమూ సమ్మోహితుల మవుతాము. ఒక వైపు గీతాజ్ఞానయజ్ఞాలు, మరో వైపు సనాతనధర్మ ప్రచార సభలు నిర్వహిస్తూ పుంఖానుపుంఖంగా, ప్రామాణికంగా రచనలు చేయడంలో శ్రీ స్వామిజీ సాధించిన నైపుణ్యం అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది.

ప్రజల్లో పాతుకుపోయిన మతమౌఢ్యాలనూ, వర్ణవిషక్తతనూ సంస్కరించి, సామాన్య ప్రజల్లో సైతం సరికొత్త ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కలగజేసిన అవతార పురుషులు శ్రీ సద్గురు మలయాళస్వాములవారు. ఆదర్శవ్యాసాశ్రమ స్థాపకులుగా, ఆజీవితనైష్ఠిక బ్రహ్మచారిగా, అపూర్వసామాజిక జాగృతి ప్రదాతగా, సర్వమత సమన్వయ స్థాపనాచార్యులుగా, సంస్కృత ప్రచారకులుగా, సాహిత్య పరాయణులుగా విఖ్యాతులైన ఆ దివ్యపురుషుడి అనుగుశిష్యులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్వాములవారు సరసోక్తులు, సూక్తులు, హితోక్తులు, వ్యంగ్యోక్తులతో చేసే గీతాప్రవచనం సామాన్య మానవుడికి అభిరుచి కలిగేటట్లు, ఆసక్తిని పెంచేటట్లు వుంటుంది. ఏ మారుమూల ప్రాంతంలో వారు గీతాజ్ఞానయజ్ఞం చేసినా అసంఖ్యాక జనసందోహం ఆనందోత్సాహాలతో, సంతోష సంరంభాలతో పాల్గొనడం సర్వసామాన్యమైన విషయం.

ప్రాపంచిక జీవితం నుంచి విముక్తిపొంది మోక్షగాములం కావడానికి వేదవ్యాస మహర్షి మనకు ప్రసాదించిన భగవద్గీత ప్రాచ్యపాశ్చాత్యులచేత ఏకైక పుణ్యగ్రంథంగా కీర్తించబడుతున్నది. ఆ పరమ పవిత్ర గ్రంథానికి అతిసరళమూ, మనోజ్ఞమూ అయిన చక్కని భాషాశైలిలో శ్రీస్వామీజీ రచించిన వ్యాఖ్యానం గీతామకరందంతో పాటు రామాయణ భారత భాగవతాది గ్రంథాలూ సర్వవిధాలా ప్రశంసార్హాలు.

ఆధ్యాత్మిక సంస్కారాన్ని ఉద్బోధించే ఉద్దేశంతో శ్రీస్వాములవారు చిరకాలంగా నడుపుతున్న "వేదాంతభేరి" అనే మాసపత్రిక ఆంధ్రుల ఆదరాభిమానాలు అపారంగా చూరగొంటున్నది. ఆశ్రమ నిర్వాహకులు శ్రీ బి. ఈశ్వర్‌గారి సంపాదకత్వంలో వెలువడుతున్న ఈ పత్రికకు శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారూ, నేనూ గౌరవ సంపాదకులం కావడం మా పురాకృతపుణ్య విశేషం.

తమ సృజనశక్తితో ఆంధ్రభాషావధూటిని ఆరాధిస్తున్న ఆప్తమిత్రులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు ఎంతటి భాషాసంపన్నులో అంతటి నిరాడంబరులు. ఎంతటి సాహిత్యప్రజ్ఞా ప్రాభవాలు కలవారో అంతటి నిగర్వి. వీరి రచనల్లో ధార్మిక చింతన పరాకాష్ఠ పొందింది. అనర్గళ వాగ్ధోరణితో శ్రోతల్ని ఉర్రూతలూపే ఈ అప్రతిమాన ప్రతిభాశాలి ప్రజ్ఞోపజ్ఞల్ని రసజ్ఞులూ, విజ్ఞులూ వేనోళ్ల ప్రస్తుతిస్తున్నారు.

శ్రీస్వాములవారి మీద వున్న అపారమైన భక్తితో, విశ్వాసంతో చాలా పరిశ్రమించి, పరిశోధించి రచించిన ఈ జీవితచరిత్రలో శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి అన్వేషణ, ఆశ్రమస్థాపన, ఆధ్యాత్మిక ప్రబోధం, అనేక గ్రంథాల రచన, ఆత్మతత్త్వ ప్రచారం, అసంగత్వం ఆదిగాగల అనేక అంశాలు కళ్లకు కట్టినట్లు చిత్రించారు. నిరాడంబర ప్రియత్వానికీ, నిరంతర కార్యానురక్తికీ నిదర్శనంగా నిలిచిన శ్రీ స్వాములవారి చరిత్రను తెలుసుకోవడంతోపాటు నిత్యజీవిత పరమావధుల్ని గ్రహించడానికి ఇది దర్పణం.

జీవితచరిత్రల లక్ష్యాలూ, లక్షణాలూ సామాన్యంగా, సారూప్యంగా కనుపిస్తాయి. అలాకాకుండ విశిష్టమూ, విలక్షణమూ అయిన విధానంలో వాగ్దేవీవరకృపా విశేషంతో అవతరించిన ఈ రసవద్రచనలో ప్రతివాక్యమూ శ్రీ సముద్రాల వారి భాషణానికీ, ప్రతిభకూ ప్రతీక.

దేశంలో నానాటికీ నాస్తికత ప్రబలుతున్న ప్రస్తుత తరుణంలో ఇలాంటి ఆధ్యాత్మిక విషయ ప్రబోధకాలైన గ్రంథాలు అత్యంత ఆవశ్యకాలు. ఈ తరహా రచన సాగించడానికి అవసరమైన లోకజ్ఞానం, గాఢ పరిశ్రమ, చిత్తశుద్ధి పుణికి పుచ్చుకున్న భాషా సంపన్నులు కావడం వల్ల శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు శ్రీ స్వాములవారి చరిత్ర రచనలో కృతకృత్యు లయ్యారు. సమగ్రమూ, సర్వాంగ సుందరమూ అయిన ఈ గ్రంథం సర్వజన సమాదరణీయ మవుతుందనడంలో సందేహం లేదు.

తిరుపతి
మార్చి 1, 1992.

-డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి
ఎం.ఏ. డి. లిట్.,
పౌరసంబంధాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానాలు

# నివేదన

అది 1947 వ సంవత్సరం. మా స్వగ్రామానికి సమీపంలోనే ఉన్న వ్యాసాశ్రమ సంస్కృత పాఠశాలలో ఆ సంవత్సరమే నేను విద్యార్థిగా చేరాను. అప్పటికింకా నాకు పదేండ్లు నిండలేదు. అక్కడ నా చదువు ఏడేండ్లు కొనసాగింది.

మహనీయుల సాన్నిధ్యం పూర్వపుణ్య ముంటే కానీ లభించ దంటారు. ఆధునిక వ్యాసులుగా, అపర శంకరులుగా ప్రసిద్ధి కెక్కిన వ్యాసాశ్రమస్థాపకులు శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి పాదపద్మాల చెంతనే విద్యాభ్యాసం చేసే సదవకాశం నాకు కలిగింది.

శ్రీవ్యాసాశ్రమ కుటీరాలలో ఏకాంత ప్రదేశంలో ఉన్న ఒక కుటీరానికి 'గుహాశ్రమం' అని పేరు. అందులో పూజ్యపాదులు శ్రీవిద్యాప్రకాశానంద స్వాములవారు పన్నెండు సంవత్సరాలు తపోనిష్ఠ కొనసాగించారు. 1947లోనే శ్రీ సద్గురుస్వాములవారి నుండి వారు సన్న్యాసదీక్ష స్వీకరించారు. 1950లో వారు శ్రీకాళహస్తిలో శ్రీ శుకబ్రహ్మాశ్రమం స్థాపించారు. అప్పటి వరకూ వ్యాసాశ్రమంలో వారి దర్శనం కూడ మాకు తరచు లభించేది.

కాని ఆ మహనీయమూర్తుల మహానుభావత్వాన్ని అవగతం చేసుకొనే సామర్థ్యం ఆ లేత వయస్సులో నాకు లేదు.

తిరుపతి ప్రాచ్యకళాశాలలో విద్యాభ్యాసం కొనసాగిస్తున్న దశలో లోకానుగ్రహ కాంక్షతో శ్రీమలయాళయతీంద్రులు నిర్వహిస్తున్న వివిధకార్యక్రమాల స్వరూపం కొంచెం కొంచెం గోచరిస్తూ వచ్చింది.

1959 లో నెల్లూరు జిల్లా పరిషత్తులో సంస్కృతోపాధ్యాయుణ్ణిగా చేరాను. అప్పుడు శ్రీగురుదేవుల పట్ల నాలో పొటమరించిన భావాలు అక్షరాకృతి దాల్చి ఒక శతకంగా రూపొందాయి. అదే శ్రీమలయాళ సద్గురుశతకం.

1962 మాఘమాసం గురుపూజాసమయంలో శ్రీసద్గురుదేవుల సన్నిధియందు ఆ శతకం పఠించి నేరుగా శ్రీవారికి భక్తితో సమర్పించుకునే అదృష్టం నాకు సమకూడింది. అలా ఆ మహనీయుని అనుగ్రహానికి పాత్రుణ్ణి కాగలిగినందుకు పులకించిపోయాను.

తదుపరి తిరుపతి ప్రాచ్యకళాశాలలో అధ్యాపకుడుగా పనిచేస్తూ శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారి ఆదేశం మేరకు శ్రీ సద్గురుమలయాళ స్వాములవారి జీవిత చరిత్ర రచించాను. 424 పుటలకు విస్తరించిన ఆ గ్రంథాన్ని భక్తజనులు మిక్కిలి ప్రీతితో ఆదరించారు. దానికి ఆంగ్లం, హిందీ, మలయాళ భాషల్లో అనువాదాలు కూడ వెలువడ్డాయి.

పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు ఆంధ్రావనిలో అఖండంగా గీతా జ్ఞానయజ్ఞాలు నిర్వహించారు. వారి 'గీతా మకరందం' అనితరసాధారణమైన వ్యాప్తి పొందింది. వారి మహోపన్యాసాలు లక్షల కొలది ప్రజలలో చైతన్యం రేకెత్తించాయి. శ్రీమలయాళ స్వాములవారి బ్రహ్మవిద్యాప్రచారోద్యమం వీరి గీతాజ్ఞాన యజ్ఞాలలో పరాకాష్ఠ నందుకొన్నది.

నిర్గళ వాగ్వైభవం వారికి భగవంతు డొసగిన వరం. సకల మతాలకూ, సమస్త యోగాలకూ సమన్వయం ప్రతిపాదిస్తూ వారు ధీరంగా, గంభీరంగా, చతురంగా ఉపన్యసిస్తారు.

గీతామకరంద మొక్కటే కాక శ్రీవారి ఇతర రచనలు కూడ తపోబలంతోనూ, అనుష్ఠాన బలంతోనూ కొనసాగినవే. ఆ గ్రంథాలవల్ల జిజ్ఞాసువులు ఆత్మోన్నతి పొందడానికి అవకాశ మేర్పడింది.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ రక్షణ సంస్థకు ప్రత్యేకాధికారిగానూ, కార్యదర్శిగానూ నేను పని చేస్తున్నప్పుడు శ్రీవారి గీతాజ్ఞాన యజ్ఞాలు దేవస్థానం యాజమాన్యం క్రిందనే జరిగాయి. ఇంచుమించు ఆ కార్యక్రమాలన్నిటిలో నేను స్వయంగా పాల్గొన్నాను. శ్రీస్వాములవారి ప్రవచన పాటవాన్ని చెవులారా విన్నాను. అసంఖ్యాకంగా వారి ఉపన్యాసాలకు హాజరయ్యే ప్రజానీకాన్ని కళ్లారా చూచాను. ఈ రీతిగా శ్రీస్వాములవారితో నాకు నా బాల్యంనుండీ అనుబంధ మున్నది.

ఇటీవల కొంతకాలం క్రిందట శ్రీ శుకబ్రహ్మాశ్రమం మేనేజర్ ఆత్మీయులు శ్రీ ఈశ్వర్ గారు శ్రీస్వాములవారి జీవిత చరిత్ర వ్రాయవలసిందిగా నన్ను కోరారు. చరిత్రరచన చాల శ్రమతో కూడిన పని. ఈ విషయం శ్రీ సద్గురు దేవుల చరిత్ర రచించేటప్పుడు స్వానుభవంతో గ్రహించాను. ఎంతో ఓపికతో అనేక విషయాలు సంగ్రహిస్తే కాని రచన సమగ్రం కాదు. అయితే రచయిత శ్రమ పడినా మహనీయుల చరిత్ర గ్రంథంగా తయారైనప్పుడు అది లోకానికి ఎంతగానో ఉపకరిస్తుంది.

శ్రీ స్వాములవారు కూడ చరిత్ర రచన కనుమతినిస్తూ నన్ను ప్రోత్సహించారు. అందు కవసరమైన సామగ్రినంతా నాకు అంద జేయవలసిందిగా శ్రీ ఈశ్వర్ గారికి నిర్దేశించారు. శ్రీవారి అనుగ్రహంతో రచన పూర్తి చేయగలనన్న ధైర్యం నాకు కలిగింది.

శ్రీ శుకబ్రహ్మాశ్రమానికి ప్రారంభ దశలో గణనీయమైన సేవ చేసిన శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు శ్రీవారి జీవితంలో ముఖ్యాంశాలను కొన్నింటిని పొందుపరుస్తూ ఒక లఘుగ్రంథం రచించారు. ఈ రచనలో అది నా కెంతో తోడ్పడింది. అంతే కాక ఇంకా కొన్ని విశేషాలను శ్రీగోపాల్ గారు నాకు దయతో తెలియజేశారు. వారికి సదా కృతజ్ఞుణ్ణి.

1990 వేసవి సెలవుల్లో కొన్నిదినాలు శ్రీశుకబ్రహ్మాశ్రమం లోనే ఉండి చరిత్ర రచన కవసరమైన సామగ్రిని సేకరించాను. పాతరికార్డులు, వేదాంత భేరి మాసపత్రికలు, ఆశ్రమ ప్రచురణలు వగైరాలు పరిశీలించి ముఖ్యాంశాలు గుర్తించుకొన్నాను. ఈ పనిలో నాకు బాసటగా నిల్చిన ఆత్మీయుడు డా. మల్లెల గురవయ్య గారు. వారికి నా ధన్యవాదాలు.

తరువాత తీరిక దొరకినప్పుడు రచన కొనసాగిస్తూ 31-12-1991 నాటికి గురుకృపతో గ్రంథం పూర్తిచేయగలిగాను.

నిండుప్రేమతో ఈ రచనను పరిశీలించి అమూల్యమైన తమ ప్రస్తావనతో నన్ను ధన్యుణ్ణి కావించిన మాన్యచరిత్రులు డా. రావుల సూర్యనారాయణమూర్తిగారికి నా నమోవాకాలు.

ముద్రణ ప్రతి తయారు చేయడంలోనూ, ప్రూఫులు చదవడంలోనూ సహకరించిన చిరంజీవి సముద్రాల దశరథునికి నా ఆశీస్సులు.

గ్రంథరచన కవసరమైన సామగ్రినంతా నాకు అందజేయడమేకాక ఆశ్రమంలో నేనున్నప్పుడు సకల సౌకర్యాలు సమకూర్చిన ఆత్మీయులు శ్రీఈశ్వర్ గారికీ, వారి అనుయాయులకూ నా కృతజ్ఞతాభివందనాలు.

మహనీయు లనేకులు వివిధ సందర్భాలలో శ్రీస్వాములవారిని గూర్చి చెప్పియుండిన మాటలనూ, పత్రికా విలేకరుల వ్రాతలనూ సందర్భానుగుణంగా ఈ

రచనలో వాడుకొన్నాను. ఆయా పెద్దలందరికీ కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలి సమర్పించుకుంటున్నాను.

గ్రంథం చివర అనుబంధం-1 లో శ్రీస్వాములవారి ఉపదేశవచనాలను కొన్నింటిని చేర్చడమైనది. శ్రీవారిని గూర్చి సంస్కృతాంధ్ర కవులు పలువురు రచించి వుండిన పద్యాలలో ఎన్నుకొన్న కొన్నింటిని అనుబంధం-2 లో ప్రచురించడం జరిగింది.

శ్రీవారు నిర్వహించిన అనేక కార్యక్రమాల వివరాలు గ్రంథాంతంలో చేర్చబడ్డాయి.

ఈ గ్రంథం సాధక లోకానికీ, భక్త కోటికీ ఉపయోగపడి తద్వారా నా కృషికి సాఫల్యం సమకూరగలదని విశ్వసిస్తున్నాను.

తిరుపతి — సముద్రాల లక్ష్మణయ్య

మార్చి 1,1992

## విషయసూచిక



# శ్రీ విద్యాప్రకాశానందస్వామి జీవితచరిత్ర

## ప్రథమ ప్రకరణం

వికిరన్తం సదా గీతా
మకరందం మహీతలే ।
యతిశ్రేష్ఠం భజే విద్యా
ప్రకాశానంద సద్గురుమ్ ॥

దక్షిణ భారతదేశంలో గణనీయమైన ఎన్నో పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. అందులో శ్రీకాళహస్తి చాలా ప్రసిద్ధి వహించిన శైవక్షేత్రం. ఇక్కడ వాయులింగరూపంలో జ్ఞానప్రసూనాంబాసమేతుడైన పరమేశ్వరుడు నెలకొని వున్నాడు. ఈక్షేత్రాన్ని దక్షిణ కైలాస మని కూడా వ్యవహరిస్తారు. అపురూప మైన శిల్పకళాసంపదకు నిలయ మైన దాక్షిణాత్యదేవాలయాలలో ఇది ఒకటి.

కృతయుగంలో ఒక సాలెపురుగు శివుణ్ణి సేవించి ఆ దేవుని అనుగ్రహానికి పాత్రమై ముక్తి జెందింది. అదేరీతిగా త్రేతాద్వాపరయుగాల సంధికాలంలో ఒక పాము, ఒక యేనుగు ఇక్కడ పరమేశ్వరుణ్ణి భజించాయి. ఆయన కృపవల్ల పరమపదం పొందాయి. అందుకే ఈ క్షేత్రానికి 'శ్రీకాళహస్తి' అని పేరు కల్గినట్లు పురాణాలు పేర్కొంటున్నాయి.

కన్నప్ప అనే బోయజాతివాడు మహాభక్తితో ఈ క్షేత్రంలో శివుణ్ణి పూజించి భక్తావతంసుడై తరించాడు. ఇంకా ఎందరో భక్తులు శ్రీకాళహస్తీశ్వరస్వామిని ఆరాధించి భవబంధం నుండి విముక్తి పొందినట్లు పురాణకథలనుండి తెలుస్తున్నది.

పరమపావన మైన సువర్ణముఖీనది ఆలయానికి సమీపంలో ఉత్తరవాహినిగా ప్రవహించడం ఒక విశేషం. దక్షిణదిశలో సుదీర్ఘ మయిన పర్వతశ్రేణి కనిపిస్తుంది. సంవత్సరమంతా ఎడతెగకుండా వేలకొలది యాత్రికులు ఈ శివాలయాన్ని

సందర్శించడానికి వస్తూవుంటారు. మహాశివరాత్రి ఉత్సవాలు ఇక్కడ పెద్ద వైభవంతో జరుగుతాయి.

దేవాలయానికి దక్షిణదిశగా అనతిదూరంలో పైజెప్పిన పర్వతశ్రేణికి పడమర వైపున, సువర్ణముఖీనదికి తూర్పుతీరంలో వివిధ ఫలవృక్షాలతో నిండిన తోటలు కానవస్తాయి. నయనానందకర మైన ఈ దృశ్యం చూచి తీరవలసిందే కాని వర్ణించడానికి వీలుకాదు.

శ్రీకాళహస్తికి వచ్చేవారికి సందర్శనీయమైన స్థలాలలో శ్రీశుకబ్రహ్మాశ్రమం ఒకటి. పైతోటల మధ్యలోనే ఈ ఆశ్రమం నెలకొని వున్నది. ఆశ్రమస్థాపన 1950లో జరిగింది. నాటినుండీ క్రమక్రమంగా అభివృద్ధి చెంది ఆంధ్రావనిలో అగ్రశ్రేణికి చెందిన ఆశ్రమాలలో ఒకటిగా అది రూపొందింది.

శ్రీ వ్యాసాశ్రమస్థాపకులైన మహర్షి సద్గురు - శ్రీ మలయాళస్వాములవారి ముఖ్యశిష్యులు, గీతామకరందాది బహుగ్రంథ రచయితలు, అష్టోత్తర శతగీతాజ్ఞానయజ్ఞ నిర్వాహకులు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు, పరమహంసపరివ్రాజకాచార్యులు, పూజ్యపాదులు శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు శ్రీశుకబ్రహ్మాశ్రమాన్ని స్థాపించారు. కడచిన నలభై సంవత్సరాలలో ఆశ్రమం ఎన్నోవిధాల అభివృద్ధి చెందింది. ఇప్పు డది ఒక ప్రకృష్ట మైన ఆధ్యాత్మికకేంద్రంగా రాణిస్తున్నది.

శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు భగవద్గీతకు అనన్యసామాన్య మైన ప్రచారం కలిగించారు. బ్రహ్మవిద్యను విస్తృతంగా వ్యాపింపజేశారు. గీతామకరందంతోపాటు, యోగవాసిష్ఠం మొదలైన గ్రంథాలను పెక్కింటిని ఆశ్రమం తరపున ప్రచురింపజేశారు. గీతాయజ్ఞాలతో ఆంధ్రావనిలో అపూర్వమైన ఆధ్యాత్మిక చైతన్యం కలిగించారు.

శ్రీ స్వాములవారి జీవితచరిత్రను భక్తలోకానికి వివరించడానికే ఈగ్రంథం ఉద్దేశింపబడింది. మహనీయుల జీవితాలు లోకానికి వెలుగును ప్రసాదిస్తాయి. అవి ప్రజానీకానికి తెలియవలసిన అవసరం ఎంతైనా వున్నది. మహాత్ముల పవిత్ర జీవితాలను ఆదర్శంగా స్వీకరించే సాధకులు సంసారసాగరాన్ని అనాయాసంగా తరించగలరనడంలో ఏమాత్రం సందేహం లేదు కదా!

లోకప్రతిష్ఠ ధర్మంపై ఆధారపడివున్నది. ధర్మ మేదో తెలిస్తే కానీ దానికనుగుణంగా నడచుకోవడం కుదరదు. ధర్మాధర్మాల స్వరూపం తెలిసికోవడం



సామాన్యమానవులకు సాధ్యం కాని పని. అందుకే –

" ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గత స్స పంథాః | "

"ధర్మతత్త్వం పరమరహస్య మైనది, పెద్దలు ఏబాటలో నడిచారో ఆబాటే మనకు అనుసరణీయం" అని మహనీయులు బోధించారు. ధర్మమూర్తులయిన మహాత్ముల అడుగుజాడలలో పయనించినవారే ధన్యులు. అందుచేత మహనీయుల జీవితచరిత్రలు లోకానికి, ముఖ్యంగా సాధకలోకానికి ఎంతో ఉపకరిస్తాయి.

## శ్రీ సద్గురు మలయాళస్వాములవారు

తిరుపతి - శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రాల మధ్య ఏర్పేడు రైల్వేస్టేషను వున్నది. ఇది రేణిగుంట - గూడూరు రైలుమార్గంలో వస్తుంది. ఏర్పేడుస్టేషన్‌నుండి శ్రీకాళహస్తివైపు వెళ్లే రైలుప్రయాణీకులు స్టేషన్‌కు సమీపంలోనే రైలుదారికి ఉత్తరదిశలో ఒక సమున్నతపర్వతాన్ని చూడవచ్చు. దాన్ని 'నంది' పర్వతం అంటారు.

ఆ కొండ క్రిందిభాగంలో కొన్ని దట్ట మైన చెట్లూ, చెట్లమధ్యలో సుందర మైన కట్టడాలూ, ఎత్తైన గోపురశిఖరంతో విలసిల్లే ఒకమందిరమూ కనిపిస్తాయి. ఆంధ్రావనిలో అత్యంత ప్రసిద్ధమైన శ్రీవ్యాసాశ్రమం అదే. 1926లో శ్రీవ్యాసాశ్రమం స్థాపించబడింది. స్థాపించినవారు శ్రీ సద్గురు మలయాళస్వాములవారు. వారి శిష్యులే శ్రీ విద్యాప్రకాశానందులు. అందువల్ల వీరిని గురించి తెలుసుకోవడానికి ముందు శ్రీ సద్గురు మలయాళస్వాములవారిని గురించిన సంగ్రహపరిచయం ఈసందర్భంలో పాఠకులకు అవసరం.

ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతిలాగానే కేరళరాష్ట్రంలో గురువాయూరు అతిప్రసిద్ధ మైన పుణ్యక్షేత్రం. ఆక్షేత్రానికి సమీపంలో ఎన్‌గండ్యూర్ అనే గ్రామంలో 1885 మార్చి 27వ తేదీన నొట్టియమ్మ, కరియప్ప అనే పుణ్యదంపతులకు ఒక పుత్ర రత్నం జన్మించాడు. అతనికి 'వేలప్ప' అని నామకరణం చేశారు. గుమ్మడి తీగ పాదు విడిచి సుదూరంగా సాగి ఫలించునట్లే ఆ బిడ్డ పెరిగి పెద్దవాడై జన్మస్థలం వదలి దూరప్రాంతానికి పోయి అక్కడ లోకోద్ధారక కార్యక్రమాలు ఆచరిస్తా డని ఆ శిశువు జాతకం పరిశీలించిన దైవజ్ఞులు ఆనాడే వక్కాణించారు.

వారి మాటలు అక్షరాలా నిజ మయ్యాయి. వేలప్ప సహజంగానే జపతపోధ్యానాదులైన అనుష్ఠానాలను బాల్యంనుండీ శీలించాడు. ఆకాలంలో కేరళలో సుప్రసిద్ధ యతీంద్రుడుగా, ఆధ్యాత్మిక విజ్ఞానఖనిగా, సమాజసంస్కర్తగా పేరొందిన శ్రీనారాయణగురువు అనే ఒక మహనీయు డుండేవాడు. ఆయన శిష్యుడు శ్రీసిద్ధశివలింగ గురువు స్థాపించిన గురుకులంలో వేలప్ప విద్యాభ్యాసం చేశాడు. బాల్యదశలోనే అతడు దైవగుణసంపన్నుడుగా, భక్తాగ్రేసరుడుగా, అనుష్ఠాననిష్ఠాగరిష్ఠుడుగా పేరు పొందాడు. పరమ విరక్తుడై రెండు పదులు నిండక ముందే పాదచారిగా బయలుదేరి అతడు ఆసేతు హిమాచలం తీర్థయాత్ర చేశాడు. అనేక పుణ్యక్షేత్రాలనూ, ఉత్తరభారతంలో మహనీయులు స్థాపించిన ఆధ్యాత్మికసంస్థలనూ సందర్శించాడు.

తీర్థయాత్రానంతరం మళ్లీ జన్మస్థలానికి వెళ్లాడు. కొంతకాలం అక్కడ ఉండి తరువాత నేరుగా తిరుమలక్షేత్రానికి వచ్చాడు. అక్కడి గోగర్భతీర్థస్థలంలో పండ్రెండు సంవత్సరాలకు పైగా తీవ్రమైన తపోనిష్ఠ కొనసాగించాడు. కాలక్రమంలో తిరుమల యాత్రికులకు శ్రీ వేంకటేశ్వరస్వామి లాగానే ఒక సందర్శనీయమూర్తిగా రూపొందాడు. ఊరూ పేరూ తెలియనివారు ఆయన మలయాళదేశీయుడు కాబట్టి 'మలయాళస్వామి' అన్నపేరుతో వ్యవహరించారు. తరువాత ఆపేరే వారికి స్థిరపడిపోయింది.

గోగర్భంలో ఉన్న కాలంలో ఆయన రచించిన శుష్కవేదాంతతమోభాస్కరం అన్న గ్రంథం ఆయనకీర్తిని దశదిశలా చాటింది. ఆధ్యాత్మికవిప్లవాన్ని రగుల్కొలిపే ఆగ్రంథరాజం పలువురు సాధకులకు నిత్యపఠనీయ మయింది. శ్రీ మలయాళస్వామీజీ వేలకొలది శిష్యభక్తజనానీకానికి ఆరాధ్యదైవంగా విలసిల్లారు.

తరువాత కొన్నికారణాలవల్ల శ్రీ సద్గురుస్వాములవారు తిరుమలకొండ దిగి ఏర్పేడు వద్ద ఉండే నంది పర్వతమూలంలో వ్యాసభగవానుని పేర 1926లో ఆశ్రమం స్థాపించారు. అక్కడ లోకోద్ధారకమైన అనేక కార్యక్రమాలను చేపట్టారు. ఆర్షధర్మప్రచారానికి అనుగుణంగా ఒక సంస్కృతపాఠశాలను స్థాపించారు. జాత్యాదిభేదాలను పాటించకుండా అన్ని తెగలవారికీ అందులో విద్యాభ్యాసానికి అవకాశం కలిగించారు. సనాతనధర్మపరిపాలన సేవాసమాజం (సనాతనవేదాంత జ్ఞానసభ) అన్నపేరుతో ఆధ్యాత్మిక ధర్మప్రచారానికై ఒక సంస్థను స్థాపించారు. కర్మ భక్తి ధ్యాన జ్ఞాన యోగాల ప్రచారానికై 'యథార్థభారతి' అనే ఒక మాస



పత్రికను ప్రారంభించారు. వేదసారసంగ్రహమైన భగవద్గీతకు అనన్యసామాన్యమైన ప్రచారం కలిగించారు. భక్తుల ఆహ్వానం మేరకు ఊరూరా పర్యటించి అధ్యాత్మవిజ్ఞానబీజాలను వెదజల్లారు. వ్యాసాశ్రమానికి అనుబంధంగా అనేకసంస్థలను ఆంధ్రదేశ మంతటా నెలకొల్పారు. సాంఘిక-ఆధ్యాత్మిక సంస్కరణలను ప్రబోధిస్తూ, వేదాంతసందేశాన్ని వెలయిస్తూ, జిజ్ఞాసువులకు తగిన సాధనలను ఉపదేశిస్తూ స్వయంగా అనేక గ్రంథాలను రచించి ప్రచురించారు. 'యోగవాసిష్ఠం' మొదలైన ఉద్గ్రంథాలను పెక్కింటిని అనువదింప జేసి ప్రచురించారు. భగవద్గీత, కఠోపనిషత్తు మొదలైన కొన్ని గ్రంథాలకు స్వయంగా వ్యాఖ్యలు రచించారు. మహిళాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని కన్యా గురుకులం స్థాపించారు.

ఈ విధంగా ఆంధ్రదేశంలో సమాజసంస్కరణలతో కూడిన ఆధ్యాత్మిక క్రాంతిని కలిగించి అపూర్వమైన చైతన్యాన్ని ప్రజానీకంలో ఉద్దీపింపజేశారు. కేరళలో నారాయణగురువు ఏ లక్ష్యం సాధించడానికి ఉద్యమించారో, ఆ లక్ష్యాన్ని ఆంధ్రదేశంలో సాధించడానికే శ్రీసద్గురుమలయాళస్వాములవారు కృషి చేశారు. ఆంధ్రదేశచరిత్రలో శ్రీవారి కృషి స్వర్ణాక్షరాలతో లిఖింపదగి వున్నది. అజ్ఞానాంధకారంలో అలమటించే జనానీకానికి విజ్ఞానతేజాన్ని సమకూర్చడానికే అలాంటి మహనీయు లవతరిస్తారు.

ఆధునిక మహనీయులలో అగ్రశ్రేణికి చెందిన శ్రీవారు* తాము తరించి ఇతరులను తరింపజేయడానికే పాటుపడిన అవతారపురుషులు. వారి దివ్యానుగ్రహానికి పాత్రులైన వేలకొలది జనానీకంలో సన్న్యాసులు, బ్రహ్మచారులు, గృహస్థభక్తులు వివిధప్రాంతాలకు చెందినవా రున్నారు. వారి నిస్స్వార్థ నిరంతరసేవాధర్మం పరమాదర్శమై భాసించింది.

శ్రీ సద్గురుస్వామీజీ తీర్చిదిద్దిన పరివ్రాజక ప్రముఖులలో శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు అగ్రగణ్యులు. గురుదేవులకు అత్యంత ప్రీతిపాత్రమైన గీతాప్రచారం మహోన్నతస్థాయిలో జరిపిన ఘనత వారికే దక్కింది.

శ్రీ సద్గురుస్వాములవారికి దత్తపుత్రులుగా, అనుంగు శిష్యులుగా, వారి అమృతహస్తాలనుండి సన్న్యాసదీక్ష గైకొన్న యతిశ్రేష్ఠులుగా, గీతకూ, యోగవాసిష్ఠానికీ

---

* శ్రీ సద్గురు మలయాళస్వాములవారి జీవితవిశేషాలను విపులంగా తెలిసికొనగోరేవారు ఈ గ్రంథకర్త రచించిన 'శ్రీమలయాళస్వామి జీవితచరిత్ర'ను పఠించండి.

అద్భుతమైన ప్రచారం కలిగించిన ప్రబోధకులుగా, నిరుపమానమైన వక్తృత్వకౌశలంతో లక్షలకొలది భక్తప్రజలను ఆకట్టుకొన్న ఉపన్యాసకసార్వభౌములుగా సుప్రతిష్ఠితులైన శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములవారి జీవితం సాధకలోకానికి ఎంతైనా ఆదర్శమై విరాజిల్లుతున్నది. వారి పవిత్ర జీవితచరిత్ర పాఠకులకు ఆత్మోన్నతిని ప్రసాదించుగాక !!



# ద్వితీయ ప్రకరణం

పవిత్ర భారతభూమి 1947లో పరదేశీయుల పరిపాలననుండి విముక్తి పొంది స్వతంత్రరాజ్యంగా అవతరించింది. ఆ తరువాత భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి. మద్రాసు రాష్ట్రంతో కలిసివుండిన ఆంధ్రదేశం ప్రత్యేకరాష్ట్రంగా విడిపోయి 'ఆంధ్రప్రదేశ్' అన్న పేరుతో ప్రసిద్ధి కెక్కింది. ఇందులో రాయలసీమ, తెలంగాణా, సర్కారు ప్రాంతాలు కలిసి వున్నాయి. గోదావరి, కృష్ణ, పినాకిని మొదలైన నదులు తెలుగు భూమిని సస్యశ్యామలం చేసి దీనికి అన్నపూర్ణ అనే ఖ్యాతి కల్గించాయి.

కృష్ణానదీ తీరంలో వెలసిన ప్రధాన పట్టణం విజయవాడ. ఆ నగరానికి సమీపంలోనే దక్షిణదిశలో వున్న మరొక పట్టణం తెనాలి. గుంటూరుజిల్లాకు చెందిన తెనాలి త్యాగధను లైన ఎందరో మహానుభావులకు కాణాచిగా ప్రశస్తి వహించింది. రాజకీయంగానూ, సాంఘికంగానూ చైతన్యవంత మైన ఈ ప్రదేశంలో ఎన్నో గొప్ప జాతీయోద్యమాలు నడిచాయి.

## పుణ్యదంపతులు

వైదికధర్మం తు.చ. తప్పకుండా పాటించే అనేక కుటుంబాలు తెనాలిలో భారతీయసంస్కృతికి ఆటపట్టులై విలసిల్లాయి. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే నాలు గాశ్రమాలను వైదిక ధర్మానుయాయు లైనవారు పాటిస్తారు. అందులోనూ గృహస్థుడు తక్కిన మూ డాశ్రమాలకు ఆధారం కాబట్టి గృహస్థధర్మాన్ని శాస్త్రాలు ఎంతగానో ప్రశంసిస్తున్నాయి.

యథా వాయుం సమాశ్రిత్య
వర్తంతే సర్వజంతవః ।
తథా గృహస్థ మాశ్రిత్య
వర్తంతే సర్వ ఆశ్రమాః ॥ (మనుస్మృతి - 3-77.)

ప్రాణులన్నీ ప్రాణవాయువును ఆశ్రయించి జీవించినట్లే ఆశ్రమా లన్నీ గృహస్థుణ్ణే ఆశ్రయించి వుంటాయి.

తెనాలిలో ఆదర్శగృహస్థులుగా, సనాతన ధర్మపరాయణులుగా పేరొందిన సుశీలా దేవీ - రామస్వామి దంపతుల కుటుంబం సజ్జనుల ప్రశంసకు పాత్ర మయింది. శ్రీతూనుగుంట్ల రామస్వామిగారు బి.ఎ., బి.యల్. పట్టభద్రులు. న్యాయవాద వృత్తిలో నిపుణులు. ఆర్షధర్మాన్ని అనుష్ఠానంలో పెట్టిన పవిత్రవర్తనులు. ఏ కార్యం చేపట్టినా లక్ష్యశుద్ధితో తుదముట్టా దాన్ని నెరవేర్చాలి అనే పట్టుదల గల ధీరులు. కులమతాదిభేదాలతో అనేక విధాల విచ్ఛిన్న మైన హైంద వసమాజాన్ని సంస్కరించా లనే దృఢసంకల్పంతో పనిచేసిన సంఘసంస్కర్త. నిరుపమానమైన దేశభక్తి కలవారు. గాంధీ మహాత్ముని నాయకత్వంలో స్వాతం త్ర్యసముపార్జనకై జరిగిన శాంత్యహింసామయ మైన పోరాటంలో అగ్రశ్రేణిలో నిలిచిన యోధాగ్రేసరులు.

మనోనిగ్రహం, వైరాగ్యం, త్యాగం మొదలైన ఆధ్యాత్మికసాధనాపరులకు అవ సరమైన సద్గుణాలు శ్రీ రామస్వామిగారిలో పుష్కలంగా వుండేవి. తత్త్వజిజ్ఞాసతో ఆయన ఆధ్యాత్మిక వాఙ్మయాన్ని మథించారు. భగవద్గీతనూ, ఉపనిషత్తులనూ, బ్రహ్మసూత్రాలనూ వారు భాష్యంతోసహా అధ్యయనం చేశారు. శిష్టాచారసం పన్నులైనవారు అనేకులు వారి యింటికి తరచు రాకపోకలు సాగించేవారు. ఇంటికి వచ్చిన సాధుపుంగవులతోనూ, విద్వాంసులతోనూ శ్రీరామస్వామిగారు వేదాంతగోష్ఠి కొనసాగిస్తూ వుండడం పరిపాటి.

వచ్చిన పెద్దలను ఆదరించడంలోనూ, ఆతిథ్యం సమకూర్చడంలోనూ భర్తకు అన్ని విధాలా తోడ్పడిన ఇల్లాలు శ్రీమతి సుశీలాదేవి. సాధ్వీమణి అయిన తన సహధర్మచారిణి సహకారంతో రామస్వామిగారు తమ గృహాన్ని ఒక పవిత్ర మైన ఆశ్రమంగా తీర్చిదిద్దా రని చెప్పడంలో అతిశయోక్తి లేదు. సౌశీల్యవతు లైన సతుల తోడ్పాటు లేనిదే గృహస్థధర్మం రాణించదు కదా! వివేకం, వినయం, పతిశు శ్రూష, పరమార్థచింతన, ధర్మానువర్తనం — ఇత్యాది సద్గుణాలు సుశీలాదేవికి సహజంగానే అలవడ్డాయి. పవిత్ర మైన పతివ్రతాధర్మాన్ని పాటిస్తూ గృహస్థధర్మ నిర్వహణలో నేర్పు చూపే రామస్వామి ధర్మపత్ని తనపేరును అన్నివిధాలా సార్థకం చేసుకొన్నది.

కృష్ణాజిల్లాకు కేంద్రమైన మచిలీపట్నం సుశీలాదేవి జన్మస్థలం. ఆ పట్నాన్ని 'బందరు' అని కూడా వ్యవహరిస్తారు. పూర్వం రేవుపట్టణంగా ప్రసిద్ధి గన్న బందరు ఎన్నో జాతీయోద్యమాలకు కేంద్రమై విలసిల్లింది.



## ఆనందమోహనుని జననం - బాల్యం

ఆ ఉత్తమ దంపతులకు కాలక్రమంలో గృహస్థాశ్రమాన్ని సఫలంచేస్తూ ఐదు గురు మగబిడ్డలు, ముగ్గురు స్త్రీ శిశువులు - మొత్తం ఎనిమిదిమంది పిల్లలు జన్మించారు. ప్రథమ పుత్రునికి రంగనాథు డనీ, ద్వితీయ పుత్రునికి రాధాకృష్ణు డనీ నామకరణాలు జరిగాయి.

అది ఆనందనామ సంవత్సర చైత్ర బహుళ తృతీయ క్రీ.శ. 1914 ఏప్రిల్ 13 వ తేదీ, సోమవారం. విశేషించి ఆనాడు సౌరసంవత్సరాది. సౌరసంవత్సర సంప్రదాయం పాటించే తమిళులు మొదలైనవారు ఉగాది వేడుకలు జరుపు కొనే సుదినం. నాడు అనూరాధానక్షత్రం ప్రథమపాదంలో శ్రీరామస్వామిగారికి మూడవపుత్రుడు సుశీలాదేవి జన్మస్థలమైన బందరులో ఉదయించాడు. ఆబిడ్డ భావి కాలంలో ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారంతో ఆంధ్రావనిని ఆనందపులకితం చేయగల డని బహుశా ఆనా డెవరూ గుర్తించి వుండరు.

'ఆనంద' సంవత్సరంలో పుట్టాడు కాబట్టి నామకరణ సందర్భంలో పేరులో 'ఆనంద' శబ్దం ఉండాలని పెద్దలు భావించారు. పైగా నాటి కాంగ్రెసు నాయ కుల్లో అగ్రేసరు డైన ఆనందమోహన్‌బోసు గారు రామస్వామిగారి మనసులో మెదలడంవల్ల బిడ్డకు 'ఆనందమోహన్' అని నామకరణం చేశారు.

తల్లిదండ్రులనూ, తక్కిన బంధువర్గాన్నీ ఆనందంతో మోహింపజేస్తూ పుట్టిన ఆశిశువే తర్వాత విద్యాప్రకాశానందుడై, బ్రహ్మానందసాగరంలో తాను ఓలలాడినాడు. తన ప్రబోధనైపుణ్యంతో జిజ్ఞాసువు లైన శ్రోతలను కూడా ఓలలాడించినాడు.

ఆనందమోహనుడు జన్మించిన తర్వాత సత్యజ్ఞానం (స్త్రీ), సరోజిని (స్త్రీ), కల్యాణభారతి (పురుషుడు), బాలగంగాధర్‌తిలక్ (పురుషుడు), ఓంకారం (స్త్రీ) అనే వారు ఆదంపతులకు పుట్టారు.

న్యాయశాస్త్రంలో పట్టభద్రులైన రామస్వామిగారు తెనాలిలో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. కొద్దికాలంలోనే వారు ఆవృత్తిలో అసాధారణనైపుణ్యం గడించారు. వారి పేరుప్రఖ్యాతులు ఆప్రాంత మంతటా వ్యాపించాయి.

ఆనందమోహనుడు శైశవదశలోనే ప్రజ్ఞాప్రాభవం ప్రదర్శించాడు. అందువల్ల నాల్గవ యేటనే అతనికి అక్షరాభ్యాసం జరిగింది. పూవు పుట్టగనే తావి ప్రసరిస్తుంది

కదా! బాల్యదశలోనే అతని తెలివితేటలు అందరినీ ఆశ్చర్యపరచాయి.

## ప్రాథమిక విద్య

ఆనందమోహనునికి ఐదేండ్ల ప్రాయం నిండగానే రామస్వామిగారి కుటుంబం తెనాలినుండి బాపట్లకు తరలిపోయింది. అందుచేత మోహనుని ప్రాథమిక విద్యాభ్యాసం బాపట్లలో జరగవలసి వచ్చింది. అక్కడి ప్రాథమిక పాఠశాలలో అతడు ఐదవ తరగతి పూర్తి చేశాడు. అపరిమితమైన అతని గ్రహణధారణశక్తికి అధ్యాపకులు విస్తుపోయారు. పూర్వజన్మసంస్కారాలు గూఢంగా వుండి అదను రాగానే వ్యక్తమౌతాయి. ఆనందమోహనుని విషయంలో అదే జరిగింది.

ముక్కుపచ్చలారని పసితనంలోనే అతనిలో దైవభక్తి పొడచూపింది. బాలురు సాధారణంగా క్రీడాసక్తులై వుంటారు. ఆ క్రీడల్లో సైతం ఆనందమోహనుడు భక్తిభావాన్నే ప్రదర్శించాడు. తోటి విద్యార్థులకు అతడే నాయకుడు. వారిని కూడగట్టుకొని పురవీథుల్లో అతడు చిన్నచిన్న దేవతా విగ్రహాలను ఊరేగిస్తూ ముందు నడిచేవాడు. పళ్లెరాలు వాయిస్తూ సహపాఠకులు అతణ్ణి అనుసరించేవారు. ఇది వారి నాటి నిత్యక్రీడ. అట్లని ఆనందుడు చదువులో అశ్రద్ధ చూపేవాడుకాదు. తరగతిలో ఏ పాఠ్యాంశంలో నైనా ప్రథమస్థానం అతనిదే.

## ఆధ్యాత్మిక వాతావరణం

ఇది ఇలా ఉండగా శ్రీ రామస్వామిగారిలో ఒక అపూర్వమైన మార్పు గోచరించింది. చిన్ననాటినుండీ వారిలో ఆధ్యాత్మిక సంస్కారం దృఢంగా వుండేది. ఆధ్యాత్మికజీవితానికి వైరాగ్యం పునాది. వైరాగ్యం మంద మనీ, మధ్యమ మనీ, తీవ్ర మనీ మూడు రకాలు. పూర్తిగా నివృత్తి మార్గంలో వుండే వారికి తీవ్రవైరాగ్యం అవసరం.

రామస్వామిగారు ఎనిమిదిమంది బిడ్డల తండ్రి. ఆయన వృత్తిలో ఆర్జనకు లోటు లేదు. అయినా ఆయనలో ఉన్నట్లుండి విరక్తి తీవ్రస్థాయి నందుకొన్నది. సత్యపథంలో నడిచేవారికి న్యాయవాదవృత్తి తగినది కా దని ఆయన అర్థం చేసుకొన్నారు. ఆధ్యాత్మిక విషయాలపై అనురక్తి బలపడేకొలదీ ఆయనకు ప్రాపంచిక విషయాలమీద తీవ్రవిరక్తి ఏర్పడింది. ఈ పరిస్థితిలో కుటుంబపోషణ బాధ్యతను



కూడా ఆలోచించకుండా ఆయన వకీలు వృత్తికి రాజీనామా చేశారు. అంతవరకూ తాము నివసిస్తూవుండిన రెండంతస్తుల మేడనుండి ఒక చిన్న పర్ణకుటీరానికి బస మార్చారు.

అక్కడ శ్రీ రామస్వామిగారి జీవితం పూర్తిగా ఆధ్యాత్మికమయం అయిపోయింది. ధ్యానం, జపం, భజన, పారాయణం, అర్చన, ఆత్మవిచారణ, వేదాంతగోష్ఠి మొదలైన నిత్యకార్యక్రమాలకు ఆ కుటీరం ఆలవాల మయింది. కుటుంబంలోని సభ్యు లందరూ ఈ దైవకార్యాలలో పాల్గొనేవారు. సహజంగా ఆధ్యాత్మిక సంస్కార సంపన్నుడైన ఆనందమోహనుని చిత్తవృత్తి దైవమార్గంలో పురోగమించడానికి ఈ ఆధ్యాత్మిక వాతావరణం ఎంతో సహకరించింది.

ఇంతలో కొందరు మిత్రులు శ్రీ రామస్వామిగారిని విజయవాడకు మకాం మార్చవలసిందిగా ఆహ్వానించారు. సర్కారు ప్రాంతంలో విజయవాడ చాలా ప్రధానమైన నగరం. కృష్ణానదీతీరంలో ఈ పట్టణం వర్ధిల్లడంవల్లా, ప్రధానమైన రైలుమార్గాలకు కూడలి కావడంవల్లా, ఆంధ్రదేశానికి నడిబొడ్డు కావడంవల్లా ఈ పట్టణం ఎంతో ప్రాముఖ్యం పొందింది. అంతే కాక కనకదుర్గాదేవి ఆలయంకూడా ఈ నగరప్రశస్తికి కారణ మయింది. నిత్యమూ యాత్రికులు తండోపతండాలుగా వచ్చి కృష్ణానదిలో స్నానం చేసి ఇక్కడి కనకదుర్గమ్మను సందర్శిస్తూ వుంటారు.

## ఓంకారనిలయం

మిత్రుల ప్రోద్బలంతో రామస్వామిగారు విజయవాడకు పయనమైపోయారు. అక్కడ కనకదుర్గాలయానికి సమీపంలో ఒక వసతిగృహం నిర్మించుకొన్నారు. దానికి 'ఓంకారనిలయం' అని నామకరణం చేశారు. ఆ నిలయం ఒక చక్కని ఆధ్యాత్మిక శిక్షణా కేంద్రంగా రూపు దిద్దుకొన్నది.

ఇంటిలోనివారేకాక ఇరుగుపొరుగువారు కూడా తరచు ఓంకారనిలయంలో ఆత్మోన్నతికి ఉపకరించే దైవకార్యక్రమాలలో పాల్గొనడానికి వచ్చేవారు.

వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాం<br>
గృహేఽపి పంచేంద్రియ నిగ్రహస్తపః ।<br>
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే<br>
నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ॥ (శాంతిశతకం -2-28)

వైరాగ్యరహితులు అడవికి వెళ్లి కూర్చున్నా వాళ్ళను దోషాలు వెన్నాడుతూనే వుంటాయి. విరక్తులు ఇంటిలో వున్నా ఇంద్రియాలను నిగ్రహించి తపోనిష్ఠులు కాగల్గుతారు. పవిత్రకర్మలు ఆచరిస్తూ పరమవిరక్తితో ఉండే గృహస్థుని యిల్లు తపోవనమే.

పై సూక్తిలో చెప్పినట్లు శ్రీ రామస్వామిగారి గృహం తపోవనమై భాసించింది. నిత్యమూ అక్కడ కొనసాగే ఆధ్యాత్మిక శిక్షణలో, గీతాపారాయణ జపధ్యానాదులలో ఆనందమోహనుడు చురుకుగా పాల్గొనేవాడు. తక్కిన బాలురకంటె అతనిలో ఆధ్యాత్మికచైతన్యం త్వరితంగా వృద్ధి పొందింది. అతడు శ్రీ శంకరుల అద్వైత వేదాంత తత్త్వాన్ని కూడా బాల్యంలోనే అమితశ్రద్ధగా ఆలకించేవాడు.

## రాణించిన ప్రతిభ

లౌకికవిద్యాభ్యాసం కోసం ఆనందమోహనుడు స్థానికంగావున్న ఎస్.కె.పి.వి.వి. హిందూ హైస్కూల్లో చేరాడు. అతని ప్రతిభ అక్కడ కూడా సర్వతోముఖంగా రాణించింది. ప్రతి తరగతిలోనూ సర్వప్రథముడుగానే ఉత్తీర్ణు డయ్యాడు. ఎన్నో ప్రథమబహూమతులు గెల్చుకొన్నాడు. అధ్యాపకులందరూ అతణ్ణి ఎక్కువగా అభిమానించేవారు. బుద్ధిబలం పెంపొందించే పాఠ్యగ్రంథాలలోనే కాక శరీరసౌష్ఠవాన్ని వృద్ధి పొందించే వివిధక్రీడల్లో కూడా అతడు అగ్రగణ్యుడై ప్రమాణపత్రాలనూ, బహూమతులనూ సంపాదించాడు.

సందర్భానుసారంగా వివిధ సంస్థలు నిర్వహించే వ్యాసరచనల పోటీలలో కూడా ఆనందమోహనుడే ప్రథమస్థానం అలంకరించేవాడు. ఒకనాడు పాఠశాలకు వార్షికోత్సవం జరుగుతున్నది. ప్రధానోపాధ్యాయుడు వేదిక నధిష్ఠించి పాఠశాలా పురోభివృద్ధిని సమీక్షిస్తూ *"The smallest boy in the school got the largest number of books"* - "ఈ పాఠశాలలో అందరికంటె చిన్నపిల్లవాడు అందరికంటె ఎక్కువ (బహూమతి) పుస్తకాలు గెలుచుకొన్నాడు" అని చెప్పాడు. సభాసదు లందరూ "ఎవరా పిల్లవాడు?" అని ఉత్కంఠతో వేదికవైపు చూశారు. ప్రధానోపాధ్యాయుడు మన కథానాయకుణ్ణి వారికి చూపించాడు. అందరూ కరతాళధ్వనులతో ఆ బాలుని ప్రజ్ఞావిశేషాన్ని అభినందించారు.

ఈ రీతిగా పాఠశాలలో లౌకికవిద్యలో పురోగతి సాగిస్తూ ఆనందమోహనుడు ఇంటిలో తండ్రిగారి ప్రోత్సాహంతో అధ్యాత్మవిద్యలో కూడా ప్రావీణ్యం



సంపాదించాడు. బ్రహ్మముహూర్తంలో నిద్రనుండి లేవగానే కుటుంబసభ్యులతో కలిసి అతడు సమష్టిప్రార్థన చేసేవాడు. ఆపైన సమీపంలోనే వున్న కృష్ణలో స్నానం చేసి ఇంటికి వచ్చి గీతాపారాయణం కావించేవాడు. తండ్రిగారు ప్రతి ఆదివారమూ సాధకులకోసం నిర్వహించే పంచదశి, జీవన్ముక్తిప్రకాశిక మొదలైన గ్రంథాల పఠనపాఠనాదుల్లో తాను కూడా పాల్గొనేవాడు. భర్తృహరి సుభాషితం, ప్రశ్నోత్తరి, గాయత్రీరామాయణం, ఆత్మబోధ మొదలైన గ్రంథాలను; కంఠస్థం చేసేవాడు. 'గ్రహణధారణ పటుర్బాలః' అన్నట్లు విషయాలను గ్రహించడంలోనూ, ధారణచేయడంలోనూ సమర్థుడైన ఆ బాలుడు అనేక సమావేశాలలో తాను కంఠస్థం కావించుకొన్న వేదమంత్రాలనూ, శ్లోకాలనూ వల్లిస్తూవుంటే శ్రోతలు తన్మయులై వినేవారు.

ఆంగ్లాంధ్రభాషల్లో శ్రీ రామస్వామిగారు అద్భుతమైన ప్రావీణ్యం గడించారు. వారు అనర్గళంగా గంటలతరబడి ఆభాషల్లో ఆధ్యాత్మిక ప్రసంగాలు చేసేవారు. వారికి పలుప్రాంతాలనుండీ, అనేక సంస్థలనుండీ భగవద్గీతపై ఉపన్యసించ వలసిందిగా ఆహ్వానాలు అందుతూ వుండేవి. ఆసందర్భాలలో ఆనందమోహనుడు కూడా తండ్రిగారితో వెళ్లేవాడు. ఆ సమావేశాలలో అబ్బాయి ఒక్కొక్క గీతా శ్లోకం చదువుతూ వుంటే తండ్రిగారు దానికి వ్యాఖ్యానం చెబుతూ వుండేవారు. ఈ విధంగా గీతావ్యాఖ్యానం తరచు వింటూవుండడంవల్ల ఆనందమోహనుడికి భగవద్గీతతో ప్రగాఢమైన పరిచయం ఏర్పడింది.

నాడు భారతదేశం మీద ఆంగ్లేయుల ప్రభుత్వం అవ్యాహతమై కొనసాగుతూ వుండింది. పరాయిపాలనను అంతంచేసి స్వాతంత్ర్యం సాధించాలనే ఉద్దేశంతో దేశంలో నలుమూలలా జాతీయోద్యమాలు ప్రారంభ మయ్యాయి.

## జాతీయోద్యమం

స్వాతంత్ర్యానికై పోరాటం ముమ్మరంగా కొనసాగిన ఆరోజుల్లో ఖద్దరుధారణ గౌరవచిహ్నంగా భావించబడేది. దేశభక్తి ప్రభావితు లైన శ్రీ రామస్వామిగారు నిత్యమూ తమ వస్త్రాలకు అవసరమైన నూలును తమ యింటిలోనే వడకే ఏర్పాటు చేశారు. కుటుంబంలోని వారందరూ ఖద్దరు వస్త్రాలనే ధరించేవారు. ఖాదీప్రాముఖ్యాన్ని గురించి ప్రచారం చేస్తూ ఆనందమోహనుడు సోదరీసోదరులతో కలిసి ఊరంతా తిరిగేవాడు. ప్రజలు గుమిగూడినచోట ఖాదీ ధరించవలసిన

ఆవశ్యకతను గూర్చి ఉపన్యసించేవాడు. అతని ముద్దుమాటలు శ్రోతలకు ఆనందం కలిగించేవి. విదేశ వస్త్రాలయాల వద్ద అతడు ఒకసారి పికెటింగ్ చేశాడు. కాంగ్రెస్ ఉద్యమానికి ఆ సంఘటన చేయూత నిచ్చింది.

పరోపకారం, దయ, వినయం మొదలైన సద్గుణాలు మోహనునికి ఉగ్గుపాలతో అలవడ్డాయి. నీటబడి తనకలాడే చీమల్ని చూచి జాలితో వాటిని గట్టుపైకి తీసిపెట్టేవాడు. బిచ్చగాళ్లకు భిక్షం పెట్టేందుకు పరుగులు తీసేవాడు. తోటివిద్యార్థులకు అవసరమైన విషయాలలో తగిన సహకారం అందించేవాడు.

పండుగదినాల్లో విశిష్టమైన పూజాకార్యక్రమాలతో వారి యిల్లు కళకళ లాడేది. దీపావళినాడు ఆయింటివారు 108 జ్యోతుల్ని ఓంకారాకారంతో వెలిగించేవారు. ఆ జ్యోతులకు అష్టోత్తర శత ప్రణవనామావళితో పూజలు చేసేవారు. అది కన్నుల పండువైన కమనీయ దృశ్యం. ఆ వీధి వారందరికీ ఆనందదాయకమైన దృశ్యమది. దీపావళి సందర్భములో బాణాసంచాలు కాల్చడం ఆయింటిలో నిషిద్ధం. జ్యోతుల వెలుగులోనే వారు ఉత్సవానందం అనుభవిస్తూ ఇరుగుపొరుగువారికి కూడా ఆనందం పంచియిచ్చేవారు.

శ్రీ రామస్వామిగారు ఆదివారంనాడు ఇంటివా రందరూ అపక్వాహారమే భుజించేటట్లు కట్టడ గావించారు. పండ్లు, పచ్చిదుంపలు, పచ్చికూరగాయలు నాడు వారి కాహారం. ఇంటిల్లిపాదిగా అందరూ మక్కువతో ఆదినం అపక్వాహారం సేవించేవారు. ఈ అలవాటు భావికాలంలో ఆనందమోహనునికి సంవత్సరాల తరబడి అపక్వాహారం స్వీకరిస్తూ ఆత్మప్రాప్తి కనువైన సాధన లనుష్ఠించేటందుకు సహకరించింది.



# తృతీయ ప్రకరణం

## ఉపనయనం

మానవునికి ద్విజత్వం కలిగించే ఉపనయన సంస్కారం ఆనందమోహనునికి పదవయేట జరిగింది.

ఉపనీయ గురు శ్శిష్యం
శిక్షయే చ్ఛౌచ మాదితః ।
ఆచార మగ్ని కార్యంచ
సంధ్యోపాసన మేవచ ॥ (మను. 2-69)

అని మను వన్నట్లు ఉపనయన సంస్కారం చేసిన తర్వాతనే గురువు శిష్యుడికి శౌచం, ఆచారం, అగ్నికార్యం, సంధ్యోపాసనం నేర్పిస్తాడు. దీన్ని బట్టి శౌచాదుల వల్ల కలిగే యోగ్యత లన్నీ ఉపనయనంతో ద్విజత్వం సిద్ధించిన పిమ్మటనే కలుగు తాయని స్పష్ట మవుతున్నది. వ్రతానుష్ఠానంతో పాటు వేదాధ్యయనాధికారం కూడా ఉపనయన సంస్కారం వల్లనే ప్రాప్తిస్తుంది. అందుకే మనువు—

కృతోపనయన స్యాస్య
వ్రతాదేశన మిష్యతే ।
బ్రహ్మణో గ్రహణం చైవ
క్రమేణ విధిపూర్వకమ్ ॥ (మను -2-173)

అని విధించాడు.

సనాతన ధర్మానికి మూలం వేదం. వేదవిహిత ధర్మాచరణ వల్లనే మానవుడు శాంతి సుఖాలు పొందుతాడు. అమృతత్వప్రాప్తికి అవసర మైన ఆత్మజ్ఞానం కూడా వేదాలనుండే లభిస్తుంది. అందుచేత వేదాధ్యయనానికి అధికారం ప్రసాదించే ఉపనయనం అత్యంతముఖ్యమైన సంస్కారంగా భావింపబడుతున్నది.

శాస్త్రవిధుల ననుసరించి ఏవిధమైన ఆడంబరాలూ లేకుండా ఆనందమోహను నికి చతురాహ్నికంగా ఉపనయన సంస్కారం జరిగింది. పాలాశదండం, కృష్ణాజినం, కమండలం ధరించి శిఖాయజ్ఞోపవీతాలతో ముచ్చట గొలుపుతున్న బాలుణ్ణి చూచి

బంధుమిత్రులు పరమానందభరితు లయ్యారు.

ఆ నూతన బ్రహ్మచారి విజయవాడ పురవీథుల్లో బ్రహ్మచర్య ప్రభావప్రతిపాదకాలైన వేదమంత్రాలను ఉచ్చరిస్తూ జోలె కట్టుకొని భిక్షాద్రవ్యం సేకరించాడు. అందులో అర్ధభాగం ఆచార్యులకు సమర్పించాడు. తక్కినదానిని అక్కడ గుమిగూడిన పేదలకు పంచిపెట్టాడు. ఆ దృశ్యం చూచిన పెద్దలు హృదయపూర్వకంగా అతణ్ణి ఆశీర్వదించారు.

## వేటపాళెం - ఉపన్యాసం

ఆపైన కొద్దిరోజులకు సుప్రసిద్ధమైన వేటపాలెంలోని సారస్వతనికేతనంలో ఒక సమావేశం ఏర్పాటయింది. ప్రభుత్వ ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులు ఆ సభకు అధ్యక్షత వహించారు. చుట్టుప్రక్కల పలుప్రాంతాలనుండి పెక్కుమంది విద్వాంసులు, పెద్దలు ఆ సమావేశానికి హాజరయ్యారు.

వేటపాలెంలో తమ బంధువుల యింటికి వచ్చి వుండిన బ్రహ్మచారి ఆనందమోహన్‌కూడా కాకతాళీయంగా ఆ సభకు వెళ్లాడు. అతని ప్రజ్ఞావిశేషాన్ని గుర్తించిన పెద్దలు సభలో మాట్లాడవలసిందిగా అతణ్ణి ప్రోత్సహించారు.

అతడు దండ కృష్ణాజినాది వటు చిహ్నాలు ధరించి వేదప్రతిపాదితాలైన బ్రహ్మచర్యధర్మాలను గూర్చి అనర్గళంగా తనకు సహజసిద్ధమైన వాగ్వైభవంతో సంస్కృతాంధ్రాంగ్లభాషలలో ఉపన్యసించాడు. సభాసదులు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు.

అప్పుడు బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులవారు స్పందించిన హృదయంతో సభలో నిలబడి "ఈ బాలబ్రహ్మచారి సామాన్యుడు కాడు. ఇతని కీర్తి నలుదెసలా వ్యాపించే కాలం రానున్నది. ఇతడు గొప్ప యతీశ్వరుడు కాగలడు" అని ప్రశంసాపూర్వకంగా ఆశీర్వదించారు.

ఈ రీతిగా ఆనందమోహనుడు పరాపరవిద్యలు రెండింటిలోనూ క్రమక్రమంగా అభివృద్ధి సాధిస్తూ అందరి ప్రశంసలకూ పాత్రుడు అయ్యాడు.

ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసం పూర్తి అయ్యేసరికి మోహనునికి ఒక చిక్కు సమస్య ఎదురయింది. అప్పటి కతని వయస్సు 13 సంవత్సరాలే. నాటి విద్యావిధానానికి సంబంధించిన నిబంధనలన ననుసరించి 15 ఏండ్లు నిండనివారు



స్కూల్‌ఫైనల్ పరీక్షకు పోవడానికి వీలు లేదు. ప్రతిభావంతుడైన మోహనుణ్ణి రెండు సంవత్సరాలు విద్యలో పురోగతి లేకుండా ఉంచడం భావ్యం కాదని భావించిన ప్రధానోపాధ్యాయుడు అతని మేధాశక్తిని వివరిస్తూ విద్యాశాఖాధికారులకు లేఖ వ్రాసి వయోనిబంధనలపై మినహాయింపు (*Exemption*) ఉత్తర్వులు తెప్పించాడు. ఆనందమోహనుడు పదమూడవయేటనే యస్. యస్. యల్. సి. పరీక్ష వ్రాసి ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణు డయ్యాడు.

అతని ఉన్నతపాఠశాలా విద్యాభ్యాసకాలంలో విజయవాడ నగరపాలక సంస్థవారు ***'Health is Wealth'*** (ఆరోగ్యమే మహాభాగ్యం) అనే అంశంపై ఆంగ్లంలో పాఠశాలా విద్యార్థులకు వ్యాసరచనపోటీ నిర్వహించారు. అందులో ఆనందునికి ద్వితీయ బహుమతి లభించింది.

## కళాశాలా ప్రవేశం

స్కూల్‌ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడైన తర్వాత 1928లో ఉన్నతవిద్యాభ్యాసానికై రామస్వామిగారు ఆనందమోహనుణ్ణి బందరు నోబుల్ కళాశాలలో చేర్చారు. అక్కడ చదివిన నాలుగు సంవత్సరాల కాలంలో అతడు ఇంటర్, బి.ఏ.లను పూర్తిచేశాడు. బి.ఏ.లో గణితశాస్త్రాన్ని ప్రధానంగా అభ్యసించాడు. 1933లో విశాఖపట్టణంలో జరిగిన విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సభలో అతడు బి.ఏ. పట్టం పుచ్చుకొన్నాడు.

నోబుల్ కళాశాలలో చదివే సమయంలోనే ఆనందమోహనుని ప్రశస్తి చాలా వరకూ వ్యాపించింది. ఆ రోజుల్లో రాజమహేంద్రవరంలోని హిందూసమాజంవారు రాష్ట్రస్థాయిలో భగవద్గీత, శివానందలహరి మొదలైన ఆధ్యాత్మికగ్రంథాలపై ఒక పెద్దపరీక్ష నిర్వహించారు. వివిధ విద్యాసంస్థల నుండి చాలామంది విద్యార్థులు ఆ పరీక్షలో పాల్గొన్నారు. అందులో ఆనందమోహనునికి ద్వితీయ బహుమతి లభించింది.

ఆ బహుమతి పైకంతో అతడు తండ్రిగారి సలహా ననుసరించి ఆంగ్లంలో వున్న శ్రీవివేకానందస్వామి సమగ్రసారస్వతాన్ని తెప్పించుకొన్నాడు. దాన్ని మిక్కిలి శ్రద్ధతో అధ్యయనం చేశాడు. ఈ అధ్యయనం అతని ఆధ్యాత్మిక వికాసానికి ఎంతో దోహదం చేసింది. ఆధునిక యతిలోక సార్వభౌముడైన వివేకానందుని సమున్నతాశయాలు సర్వప్రపంచానికి చైతన్యం సమకూర్చాయి. ఆధ్యాత్మికపథంలో

పయనించే సాధకు లందరూ ఆ మహనీయుని దివ్యప్రబోధాలకు స్పందించిన వారే. అందువల్ల సహజంగానే ఆనందమోహనుడు కూడా ఆ స్పందనకు లోన య్యాడు. పదేపదే వివేకానందుని రచనలను మననం చేశాడు. అందలి తత్త్వం ఆకళించుకొన్నాడు. ముఖ్యంగా *'Be Fearless'* - 'నిర్భయముగా నుండుడు' అన్న వివేకానందుని దివ్యప్రబోధం అతని హృదయంపై ప్రగాఢమైన ముద్రవేసింది. వివేకానందస్వామి ధైర్యసాహసాలు, క్రమశిక్షణతో కూడిన సాధనలు, ఆశ్చర్యావహమైన ప్రజ్ఞాప్రాభవమూ అతనిపై ఎనలేని ప్రభావం చూపాయి.

పోటీ పరీక్షల్లో బహుమతులు పొందడ మనేది ఆనందమోహనునికి వెన్నతో పెట్టిన విద్య. నోబుల్ కళాశాలవారు *"Comparative study of Bhagavadgeeta and Bible"* - "భగవద్గీత - బైబిల్ - తులనాత్మక అధ్యయనము" - అనే శీర్షికపై వ్యాసరచనలో ఒకసారి పోటీలు ఏర్పాటు చేశారు. అందులో ప్రథమ బహుమతి మోహనునిదే. ఈ సందర్భంలో అతడు గీతతోపాటు బైబిల్‌ను కూడా క్షుణ్ణంగా పరిశీలించాడు. అనేక విషయాలలో ఆ రెండు గ్రంథాలకూ ఉన్న సామ్యాన్ని అవగతం చేసుకొన్నాడు. ఉభయగ్రంథ సమన్వయాత్మకమైన అతని వ్యాసం పరీక్షకుల మెప్పు పొందింది. మోహనుని కృషి సారస్వతరంగానికి మాత్రమే పరిమితం కాలేదు. అది సమాజశ్రేయోదాయక మైన వివిధ కార్యక్రమాలకు విస్తరించింది.

## సూత్రయజ్ఞంలో బహుమతి

జాతీయోద్యమంలో భాగంగా స్వదేశీయ వస్త్రధారణ మొదలైన కార్యక్రమాలు ముమ్మరంగా నిర్వహింపబడుతున్న రోజు లవి. అప్పుడు సూత్రయజ్ఞ మన్న పేరుతో రాట్నం నుండి నూలు తీయడం, ఆ నూలుతో వస్త్రాలు నేయించి ధరించడం ఒక మహోద్యమంగా సాగింది.

ఈ ఉద్యమానికి తగిన ప్రోత్సాహం కలిగించేందుకు నూలు వడకడంలో కూడా పోటీలు ఏర్పాటు చేసి బహుమతు లిచ్చేవారు. ఏలూరు కాంగ్రెసు జూబిలీ సంఘంవారు ఇలాంటి పోటీలు ఏర్పాటు చేశారు. అందులో పాల్గొనడానికై ఆనందమోహన్ తన రాట్నాన్ని బస్సుపై ఉంచి విజయవాడ నుండి బయ లుదేరాడు. దారిలో చెట్టు కొమ్మకు తగుల్కొన్న రాట్నం క్రిందపడి ముక్క లయింది. బస్సు నిలిపి ఆ ముక్కల్ని ప్రోగుచేసుకొని అతడు ఏలూరుకు వెళ్లాడు.



అక్కడ చెక్కముక్కల్ని ఒక వడ్రంగి కిచ్చి రాట్నం సరిచేయించుకొన్నాడు. ఆ డొక్కురాట్నంతోనే నూలు వడకి పోటీలో ప్రథమ బహుమతి సాధించాడు.

పై పోటీలోనూ, అలాగే విజయవాడ కాంగ్రెస్ స్వర్ణోత్సవాల చరఖా తకిలీపోటీలలోనూ స్వర్ణపతకరూపంలో ప్రథమ బహుమతులు మోహనుణ్ణే వరించాయి. తండ్రిగారి శిక్షణలో నూలు వడకడం అతనికి చిన్ననాటినుండే అలవాటు కదా! మరొకసారి గుంటూరులో జరిగిన సూత్రయజ్ఞంలో అతడు సర్వప్రథముడుగా గెలుపొందినందుకు వెండితో తయారు చేయబడిన రాట్నం బహుమతిగా ఇవ్వబడింది.

వ్యాసరచనలతోపాటు కళాశాలలో నిర్వహింపబడే వక్తృత్వపు పోటీలలో కూడా అతని కెప్పుడూ ప్రథమ బహుమతులు తప్పిపోయేవి కావు. ఈ బహుమతులు ఒక్కొక్కసారి సువర్ణపతక రూపంలో కూడా ఉండేవి.

## అన్నపూర్ణ మఠం

మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు తిరుమల గోగర్భంలో తపస్సు చేశా రని చెప్పుకొన్నాం. గోగర్భంలో వున్నప్పుడే చాలామంది సాధకులు వారికి శిష్యు లయ్యారు. అలాంటివారిలో శ్రీ అన్నపూర్ణస్వామి ప్రముఖులు. ఆయన శ్రీసద్గురుస్వామి అనుమతితో 1923లో బందరుకు వెళ్లారు. అక్కడి భక్తుల సహకారంతో కాలువగట్టున ఉన్న ఉల్లంగిపాళెంలో అన్నపూర్ణమఠం స్థాపించారు. శ్రీమలయాళస్వామివారి సదాశయాలను ఆప్రాంతంలో విరివిగా వ్యాపింపజేశారు. ఆ మఠం అక్కడ ఒక ఆధ్యాత్మికకేంద్ర మయింది.

నోబుల్ కాలేజిలో విద్యార్థిగా వున్న ఆనందమోహనుడు బందరులోని సర్కిల్ పేటలో ఒక చిన్నగది అద్దెకు తీసుకొని నివసించేవాడు. అక్కడికి కళాశాల రెండు మైళ్ల దూరంలో వుండేది. పైన చెప్పిన అన్నపూర్ణమఠం అతని గదికి ఒక మైలుదూరం మాత్రమే. శ్రీమలయాళస్వాములవారి ప్రథమశిష్యవర్గంలో చేరిన అన్నపూర్ణస్వామీజీని సందర్శించడానికై ఆనందమోహన్ అప్పుడప్పుడూ ఆ మఠానికి వెళ్లేవాడు. అక్కడ ఆస్వామి ప్రబోధాలు వినడం అతని కలవాటయింది.

ఒకనాటి సాయంకాలం కళాశాలనుండి ఆనందమోహన్ తనగది చేరుకొన్నాడు.

తరువాత కృష్ణకాలువకు స్నానానికి వెళ్లాడు. స్నానంచేసి దగ్గరలోనే వున్న మఠానికి పయనించాడు. అక్కడ ఆరాత్రి జరిగిన సామూహిక - ఓంకారజపంలో పాల్గొన్నాడు. తనగదికి తిరిగి రాకుండా ఆరాత్రి అక్కడనే విశ్రమించాడు.

స్నానానికని వెళ్లిన మోహనుడు ఎంతసేపటికీ తిరిగి రాకపోయేసరికి గది సమీపంలో నివసించేవారికి సందేహం కలిగింది. స్నానసమయంలో ప్రమాదం సంభవించిందేమో అని వారు కలవరపడ్డారు. అర్థరాత్రిలో అతనికోసం దీపాలు పట్టుకొని కాలువ ఒడ్డంతా వెదికారు. తుదకు అన్నపూర్ణమఠానికి కూడా వెళ్లారు. అక్కడ ఆనందమోహన్ పరుండి వుండడం చూచారు. అతడు కనిపించగానే వారి ఆందోళన శమించింది. ఈ సంఘటనవల్ల అతనిలోని నివృత్తిపరమైన మనస్తత్త్వం మనకు ప్రస్ఫుట మవుతున్నది.

కళాశాలలో చదివే రోజుల్లో అతడు అపక్వాహారమే స్వీకరించేవాడు. బాల్యంలో అభ్యసించిన ఆదివారాల అపక్వాహారం అతని సాధనకు ఉపకరించింది. ఆధ్యాత్మిక సాధకులకు అపక్వాహారం ఎలా సహాయకారి అవుతుందో పాఠకులు ఈ గ్రంథంలోనే తరువాతి ప్రకరణాలలో గ్రహించగలరు.



# చతుర్థ ప్రకరణం

గోగర్భ తపస్సిద్ధు లైన శ్రీసద్గురు మలయాళస్వాములవారు ఆంధ్రావనిలో ఆధ్యాత్మికజ్యోతిని వెలిగించారు. శుష్కవేదాంతులు అమాయక ప్రజల్లో గురువులుగా చెలామణీ అవుతూ దురాచారాలను వ్యాపింపజేస్తున్న రోజుల్లో ఆంధ్రదేశానికి వారి రాక శుభోదయ మయింది. స్త్రీలకూ, ద్విజేతరులకూ బ్రహ్మవిద్యాధికారం లేదనీ, వారు ఓంకారం ఉచ్చరించరాదనీ ప్రతిపాదించే కృతకశాస్త్రాలు ప్రజానీకంలో అత్యధిక సంఖ్యాకులను జ్ఞానవిహీనులనుగా చేశాయి. ఈ దుస్థితిని రూపుమాపడానికై శ్రీవారు నడుం బిగించారు. 1919లో తిరుమలలో వుండే సమయంలో వారు రచించిన 'శుష్కవేదాత తమోభాస్కరం' అనే గ్రంథం అజ్ఞానాంధకారంలో అలమటించే ప్రజలకు విజ్ఞానదీపికగా విలసిల్లింది.

సాధకలోకం అత్యంతశ్రద్ధతో ఆగ్రంథాన్ని ఆదరించింది. ఆ పుస్తకం చదివిన సాధకు లెందరో శ్రీ మలయాళస్వాములవారికి శిష్యు లయ్యారు. శుష్కవేదాంతుల కపటనాటకాలు చాలావరకూ దానివల్ల అరికట్టబడ్డాయి. ఆ గ్రంథరాజం ఆధ్యాత్మిక విప్లవాన్ని రగుల్కొల్పింది.

ఆధ్యాత్మిక సారసత్వాన్ని అతిశ్రద్ధతో పఠించే రామస్వామిగారి చేతికి ఒకనాడు శుష్కవేదాంతతమోభాస్కరం లభించింది. ప్రశ్నోత్తరరూపంలో సాధకులకు కావలసిన విషయాల నన్నింటినీ సమగ్రంగానూ, శాస్త్రీయంగానూ, యుక్తియుక్తంగానూ విశదీకరించిన ఆ పుస్తకం ఆయనను ఎంతగానో ఆకర్షించింది. అందలి విషయాలను ఆసక్తితో మననం చేస్తూ శ్రీమలయాళసద్గురుదేవులనే తమ గురువుగా రామస్వామిగారు నిర్ణయించుకొన్నారు.

శ్రీ వ్యాసాశ్రమస్థాపన జరిగిన 1926వ సంవత్సరంలోనే సనాతన వేదాంతజ్ఞానసభలు కూడా ప్రారంభమయ్యాయి. సభానంతర సంచార కార్యక్రమాల్లో భక్తుల ఆహ్వానంమేరకు శ్రీమలయాళస్వాములవారు పల్లెల్లో, పట్టణాలలో అధ్యాత్మప్రబోధం కావిస్తూ పర్యటించేవారు. వేలకొలది ప్రజలు వారి ప్రబోధాలు విని తమ సద్గురువుగా వారిని ఆరాధించారు.

## మంత్రోపదేశం

శ్రీ సద్గురుస్వామీజీ తమ పర్యటన సందర్భంగా ఒకసారి మచిలీపట్నానికి విచ్చేశారు. ఆనందమోహనుడు అప్పుడు నోబుల్ కళాశాలలో బి.ఏ. తరగతి చదువుతున్నాడు. రామస్వామిగారు కుమారుణ్ణి వెంటబెట్టుకొని అన్నపూర్ణమఠానికి వెళ్లి గురుదేవులను సందర్శించారు. తండ్రికొడుకు లిద్దరూ శ్రీవారికి సాష్టాంగప్రణామం చేశారు. శ్రీవారు వారిని సాదరంగా చేరదీశారు. వారి అనుగ్రహదృష్టి ఆనందమోహనునిపై ప్రసరించింది.

ఆ శుభసందర్భంలోనే శ్రీగురుదేవులు ఆనందమోహనునికి పంచాక్షరీమంత్రం ఉపదేశించారు. ఆ ఉపదేశంతో వారిరువురికీ గురుశిష్యసంబంధం ఏర్పడింది. సద్గురువులు ఉపదేశించే మంత్రాలు శిష్యులకు పవిత్రతను ప్రసాదిస్తాయి. 'మననాత్ త్రాయతే' అన్న వ్యుత్పత్తిని బట్టి మంత్రమంటే మననం చేసే వారిని రక్షించేది అని అర్థం. గురువుమీద ఎంత విశ్వాసం అవసరమో ఆయన ప్రసాదించే మంత్రం మీద కూడా అంతే విశ్వాసం ఉండాలి. విశ్వాసం ఊర్ధ్వలోకానికీ, అవిశ్వాసం అధోలోకానికీ తీసుకుపోతాయి.

మంత్రమూర్తులైన మలయాళమహర్షులు అనుగ్రహించిన మంత్రంతో ఆనందమోహనుని ఆధ్యాత్మికసాధన మరొక మెట్టు పైకి వెళ్లింది. భావికాలంలో అతడు మహనీయమూర్తిగా రూపొందడానికి అది ఎంతగానో ఉపకరించింది. పరమర్షుల అనుగ్రహం పరమార్థసిద్ధికి హేతువు కదా!

## హిందీ భాషాధ్యయనం

తెలుగులోనూ, ఆంగ్లంలోనూ ఆనందమోహనుడు చక్కని పరిజ్ఞానం సంపాదించాడు. సంస్కృతంలో గూడా అతనికి గాఢపరిచయం ఏర్పడింది. స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా కొనసాగుతుండిన దినా లవి. ఆంగ్లేయుల పాలన అంతమైన తర్వాత భారతదేశాని కంతటికీ అనుసంధానంగా ఒక భారతీయభాషను రూపొందించు కోవాలని నాటి జాతీయనాయకులు సంకల్పించారు. హిందీభాషే అందుకు తగిన దని వారు నిర్ణయించుకొన్నారు.

అందువల్ల హిందీ ప్రచారం ఒక ఉద్యమంగా చేపట్టబడింది. ఆ భాషలో పరిజ్ఞానం జాతీయతకు చిహ్నంగా గౌరవింపబడింది. దక్షిణభారత హిందీ ప్రచార



సభవారు దక్షిణదేశంలో హిందీభాషా ప్రచారానికై ఉద్యమించారు.

ఆనందమోహనుడు బి.ఏ. డిగ్రీ పుచ్చుకొన్నాడు. తరువాత హిందీపరిజ్ఞానం అవసర మని భావించాడు. 1934లో హిందీపాఠశాలలో ప్రవేశించాడు. తదేకదీక్షతో ఆ భాషను అభ్యసించాడు. రాష్ట్రభాష, విశారద మొదలైన పరీక్షల్లో కూడా ఉత్తీర్ణుడయ్యాడు. అతని సంస్కృతపరిజ్ఞానం హిందీభాషాధ్యయనంలో పురోగమించడానికి మిక్కిలిగా తోడ్పడింది.

స్వగృహమైన ఓంకారనిలయంలో వారాని కొకసారి ఆధ్యాత్మికసమావేశం జరిగేది. ఆ సమావేశాలకు శ్రీ రామస్వామిగారు అధ్యక్షత వహించేవారు. అప్పుడప్పుడూ వారి ధర్మపత్ని సుశీలాదేవిగారు గూడా అధ్యక్షత వహించడం కద్దు. కొన్ని సందర్భాలలో ఆనందమోహనుడు సైతం అధ్యక్షపీఠం అధిష్ఠించి సభానిర్వహణ జరిపినట్లు ఆసభలకు సంబంధించిన రికార్డు పుస్తకాన్ని బట్టి తెలియవస్తున్నది.

## విశ్వదర్శనం

1933 మార్చి 21వ తేదీనాడు ఓంకారనిలయంలో ఒక సమావేశం జరిగింది. మాతృశ్రీ సుశీలాదేవిగారు అధ్యక్షపీఠం అధిరోహించారు. ఒకరు, ఇద్దరు ఉపన్యసించిన తర్వాత ఆనందమోహనుని వంతు వచ్చింది. 'విశ్వం' అనే విషయాన్ని గూర్చి ప్రసంగిస్తూ అత డిలా అన్నాడు —

"ఈ కనిపించే జగత్తంతా విశ్వమే. మనం నివసించే ఈ భూగోళాన్ని మాత్రమే విశ్వమని కొందరు భావిస్తారు. అది పొరపాటు. పరమేశ్వరుని లీలావిశేషం వల్ల అనంతమైన ఈ విశ్వం సృష్టించబడింది. మనం సౌరకుటుంబంలో నివసిస్తూవున్నాం. ఈ భూమి తనచుట్టూ తాను తిరుగుతూనే మహావేగంతో సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నది. ఈ భూమివంటి మరికొన్ని గ్రహాలు వివిధ కక్ష్యలలో సూర్యునిచుట్టూ తిరుగుతున్నాయి. భూమికంటే సూర్యగోళం ఎన్నో రెట్లు పెద్దది. అది ఒక ప్రచండమైన అగ్నిమయగోళం. అందలి అగ్నిజ్వాలలు వేలకొలదిమైళ్లు వ్యాపించివున్నాయి. రాత్రివేళల్లో మనకు మినుకు మినుకుమంటూ కనిపించే నక్షత్రాలు కొన్ని సూర్యునికంటే చాలా పెద్దవి. మన ఊహ కందనంత దూరంలో ఉండడం వల్ల అవి మనకు సూక్ష్మంగా కనిపిస్తున్నాయి. ఆకాశం అనంతం. ఇందులో లెక్కలేనన్ని నక్షత్రాలు జాజ్వల్యమానంగా వెలుగుతున్నాయి.

పరమేశ్వరుని ఆజ్ఞ ననుసరించి అవి ఒక క్రమపద్ధతిలో సంచరిస్తూ వున్నాయి. అనంతమూ, అత్యంత విశాలమూ అయిన ఈ మహావిశ్వాన్ని భావించినప్పుడు ఇందులో మన మెంత స్వల్పాతిస్వల్పులమో గోచరిస్తుంది.

రాత్రిపూట ప్రశాంతమైన మనస్సుతో నిర్మలమైన ఆకాశం వైపు చూపు సారిస్తే అనంతమైన భగవంతుని విభూతి గోచరిస్తుంది. అందులో పరమాత్ముని విశ్వరూపాన్ని మనం సందర్శించవచ్చు. ఈ విశాల విశ్వమంతా ఆ పరమ పురుషునిలో నాల్గింట ఒక వంతే అని వేదం చెబుతున్నది. అందుచేత భగవం తుని మహత్త్వం తెలుసుకోవటానికి విశ్వపరిశీలన ఉపకరిస్తుంది. అందువల్ల మన అల్పత్వం గోచరిస్తుంది. మనం అహంకారం వదలిపెట్టి విశ్వానికి హేతుభూతు డయిన పరమేశ్వరుని భజించి ఆయన అనుగ్రహానికి పాత్రులం అగుదుము గాక!"

అతని ధీరగంభీర వచనాలు విని శ్రోతలందరూ తన్మయు లయ్యారు. ఈ విధంగా సునిశిత దృష్టితో ప్రతివిషయాన్నీ పరిశీలించి సభలలో యుక్తియుక్తంగా ఆనందమోహనుడు ఉపన్యసించేవాడు.

శ్రీ మలయాళస్వాముల వారికీ, రామస్వామిగారికీ గురుశిష్యసంబంధం ఏర్ప డిన తర్వాత తరచు వారి మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు నడిచేవి. అనేక తాత్త్వికాం శాలను గురించి గురుదేవులు లేఖలు వ్రాస్తూ వుండేవారు.

మంత్రోపదేశ సమయంలో ఆనందమోహనుని ప్రజ్ఞాపాటవం గురుదేవులు గుర్తించారు. అతడు భావికాలంలో లోకానికి ఎంతో ఉపకరిస్తా డని భావిం చారు. "విద్యాతపోభ్యాం పూతాత్మా" అన్నట్లు మానవుడు పవిత్రుడు కావాలంటే విద్యాతపస్సులు రెండూ సాధించాలని శ్రీవారు నొక్కి చెప్పేవారు. విద్యాభ్యాసదశలో ఉన్న ఆనందమోహనుడు హిందీలో కూడా చక్కని ప్రావీణ్యం సంపాదించడం అవసర మని గురుదేవులు తలచారు. ఈ సంగతి ప్రస్తావిస్తూ ఒక లేఖ కూడా శ్రీ రామస్వామిగారికి వ్రాశారు.

## కాశిలో విద్యాభ్యాసం

అప్పటికే ఆనందమోహనునికి హిందీలో కొంత పరిజ్ఞానం అలవడింది. ఆ భాషలో ఇంకా వున్నతమైన వైదుష్యం సంపాదించడానికి తండ్రిగారు అతణ్ణి కాశీవిద్యాపీఠానికి పంపారు.



అనాదికాలంనుండీ హిందువులకు కాశి పరమపవిత్రక్షేత్రంగా వాసి కెక్కింది. పవిత్ర భాగీరథీనది ఆ క్షేత్రం చెంత ప్రవహిస్తుంది. క్షేత్రంగానే కాక విద్యా విషయంలో కూడా వారణాసీ నగరం ప్రాచీనకాలంనుండీ ప్రసిద్ధి పొందింది. జీవితంలో ఒక్కసారైనా కాశికి వెళ్లి అక్కడ గంగలో స్నానంచేసి విశ్వనాథస్వామిని సందర్శిస్తే జన్మ ధన్య మవుతుందని హిందువులు భావిస్తారు.

పూర్వం విద్యాతృష్ణతో పెక్కుమంది విద్యార్థులు కాశికి పోయి సంస్కృత శాస్త్రాలు చదివి పాండిత్యం ఆర్జించి ప్రతిష్ఠ గడించేవారు. పరమపావనమైన కాశీక్షేత్రంలో వుంటూ విద్యనభ్యసించే సదవకాశం కల్గినందుకు ఆనందమోహనుడు ఉప్పొంగిపోయాడు. కాశీ విద్యాపీఠంలో నాటి విద్వాంసుల పాండిత్యప్రకర్ష చూచి అతడు ఆశ్చర్యభరితచిత్తు డైనాడు. ఏ లక్ష్యంతో తాను కాశికి చేరాడో, ఆలక్ష్య సాధనలో ఏ మాత్రం ఏమరుపాటు లేకుండా అనవరతశ్రమతో అధ్యయనం కొనసాగించాడు. అలసత్వానికి అవకాశం యివ్వకుండా అన్ని పనుల్లోనూ చురుగ్గా పాల్గొనేవాడు. ముఖ్యంగా ఆధ్యాత్మిక సాధనలో మాత్రం ఎట్టి లోటుపాటులు లేకుండా జాగరూకత వహించేవాడు.

## క్రీడల్లో నైపుణ్యం

మానవుడు ఏమి సాధించాలన్నా అందుకు ముఖ్యసాధనం శరీరం. అందుకే మహాకవి కాళిదాసు 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' అని చెప్పాడు. చతుర్వి ధపురుషార్థాలు సాధించడానికి ఆరోగ్యం చాలా అవసరం. ఆరోగ్యాన్ని మించిన భాగ్యం ఏమున్నది ? విద్యావిధానంలో అధ్యయనానికే కాక వ్యాయామానికి కూడా ప్రాధాన్యం కలిగించారు. అందుకు కారణం విద్యార్థులు ఆరోగ్యవంతులుగా వర్ధిల్లా లని భావించడమే.

వ్యాయామం అనేకవిధాలుగా వుంటుంది. నీళ్లల్లో ఈదులాడడం కూడా వ్యాయామమే. అందువల్ల శరీరంలో అవయవా లన్నింటికీ కదలిక కల్గుతుంది. అందుకే ఈత చాలా మేలైన వ్యాయామ మని చెబుతారు.

ఆనందమోహనుడు ఈతలో గూడా నేర్పు గడించాడు. విజయవాడలో ఉన్న ప్పుడు కృష్ణానదిలో స్నానం చేస్తూ నిత్యమూ ఈతకొట్టేవాడు. తీరానికి దాదాపు నూరుగజాల దూరంలో వుండే కృష్ణలంకకు ఈదుకొని వెళ్లి తిరిగివచ్చేవాడు.

అతడు క్రీడల్లో గూడా అభిరుచి కలిగివుండేవా డని ఇంతకు ముందే చెప్పుకొన్నాం. పాఠశాలలో చదివేనాటినుండీ ఆటలపోటీలలో అతడు ఎన్నో బహుమతులు గెలుచుకొన్నాడు. కాశిలో వున్నప్పుడు క్రీడల జట్టుకు నాయకుడై ఫుట్‌బాల్, వాలీబాల్ మొదలైన ఆటల్లో పాల్గొనేవాడు. విద్యాపీఠం నిర్వహించిన సాంవత్సరికక్రీడల పోటీలలో అతనికి లాంగ్‌జంప్‌లో ద్వితీయ బహుమతి లభించింది.

ఈ క్రీడాభిరుచి అతని దేహానికి చక్కని ఆరోగ్యం సమకూర్చింది. తరువాతి కాలంలో అతడు కొనసాగించిన యోగసాధనకు అది ఎంతో సహకరించింది. కాశిలో వున్నప్పుడుకూడా అతడు ప్రాణాయామాది యోగసాధనలను చక్కగా అనుష్ఠిస్తూ వచ్చాడు.

## రచనావ్యాసంగం

ఆనందమోహనునికి బాల్యంనుండీ రచనావ్యాసంగం అలవాటే. వ్యాసరచనల పోటీలలో అతడు ఎన్నో బహుమతులు చేజిక్కించుకొన్నాడు. కాశీవిద్యాపీఠంలో విద్యార్థులు ఒక ఇంగ్లీషు మాసపత్రిక నడిపేవారు. దాని సహాయసంపాదకత్వ బాధ్యతను ఆనందమోహనుడు చేపట్టాడు. అలాగే 'తపోభూమి' అనే హిందీ మాసపత్రికకు సంపాదకత్వం వహించాడు. తన ఉదాత్తరచనలతో ఆ పత్రికలకు గౌరవప్రతిష్ఠలు కలిగించాడు. వాటిని సర్వాంగసుందరంగా తీర్చి దిద్దడంలో అసాధారణమైన మేధావిత్వం ప్రదర్శించాడు. ఈ కారణంగా అక్కడి విద్యార్థుల్లోనే కాక అధ్యాపకుల్లోకూడా అతడొక విశిష్టవ్యక్తిగా గుర్తింపు పొందాడు. అందరి ఆదరాభిమానాలకూ పాత్రు డయ్యాడు.



# పంచమ ప్రకరణం

కాశీవిద్యాపీఠంలో గిరీశ్‌చంద్రపంత్ అనే విద్యార్థి ఆనందమోహనుని గదిలో ఉండేవాడు. ఏ విషయాన్నైనా సాకల్యంగా తెలుసుకోవాలి అనే జిజ్ఞాస అతనికుండేది. వారిద్దరూ అనేక విషయాలపై సుదీర్ఘంగా పరస్పరం చర్చించుకొంటూ కాలం గడిపేవారు. సెలవుదినాల్లో గంగానదిపై పడవలో పయనించి నదీతీరంలో ఉండే మహాత్ములను సందర్శించడం వాళ్లకు అలవాటు.

ఒకనాడు ఇద్దరూ కలిసి గంగానది దాటి ఒక గ్రామం చేరుకొన్నారు. అక్కడ ప్రసిద్ధిగాంచిన ఒక బాబాను చూడాలన్న ఉద్దేశంతో వాళ్లు వెళ్లడం జరిగింది.

## బాబా జోస్యం

వాళ్లకు బాబా సందర్శనం లభించింది. మిత్రు లిద్దరూ ఆయనకు సాష్టాంగప్రణామం చేశారు. ఆయన సూచనమేరకు అక్కడే కొంతసేపు కూర్చున్నారు. బాబా ఆనందమోహనుణ్ణి తదేకదృష్టితో చూచి "మీరు దక్షిణదేశంలో గొప్ప ఆధ్యాత్మికసంచలనం కలిగిస్తారు" అని జోస్యం చెప్పారు. ఆయన మాట ఫలించిందని పాఠకులకు ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు కదా! మహాత్ములు త్రికాలజ్ఞులు. వారి మాట లెన్నటికీ వ్యర్థం కావు.

వాళ్లు ఆ మహనీయుని వద్ద సెలవు తీసుకొని బయలుదేరా లనుకొనేసరికి సాయంసమయ మయింది. బాబా సంపన్నుడైన ఒక భక్తుణ్ణి పిలిచి ఆ రాత్రికి వాళ్లకు వసతి - భోజనాది సౌకర్యాలు కల్గించవలసిందిగా ఆదేశించారు. ఇద్దరూ బాబాగారి సలహా మేరకు అక్కడే రాత్రి గడిపి మరునాటి ఉదయం కాశికి తిరిగి వచ్చారు.

## పెద్దల పరిచయం

కాశీక్షేత్రంలో పలువురు ప్రసిద్ధవ్యక్తులు ఉండేవారు. సుదూరప్రాంతాల నుండి కూడా తరచు చాలామంది విశిష్టవ్యక్తిత్వం కలవారు అక్కడికి వస్తూ పోతూ వుండేవారు. అందుచేత ఆనందమోహనునికి అక్కడ ఎందరో పెద్దలను సంద

ర్శించే అవకాశం కలిగింది. వారిలో కొందరితో గాఢమైన పరిచయం కూడా ఏర్పడింది. పెద్దల పరిచయాలు వ్యర్థం కావు సుమా!

అలా పరిచితులైన వారిలో మహామనీషి శ్రీ రాహుల సాంకృత్యాయనులు ఒకరు. బౌద్ధ-మత-వాఙ్మయాలలో తీవ్రపరిశోధనలు జరిపి అనేక గ్రంథాలు రచించిన మహనీయు డాయన. వారి పరిశోధనలను ఆనందమోహనుడు శ్రద్ధతో పరిశీలించాడు. బౌద్ధమతతత్త్వాన్ని ఆకళించుకున్నాడు.

శ్రీ ఆచార్య నరేంద్రదేవ్‌గారు ఆరోజుల్లో కాశీవిద్యాపీఠానికి ప్రిన్సిపాల్‌గా పని చేసేవారు. ఆయన మహోన్నత వ్యక్తిత్వం అందరికీ ఆయనపట్ల గౌరవం కలిగించింది.

అక్కడి అధ్యాపకుల్లో కూడా శ్రీప్రకాశ్, శ్రీసంపూర్ణానంద్, శ్రీబలబీర్ మొదలైన ప్రముఖులు విద్యాపీఠప్రతిష్ఠను ఇనుమడింపజేశారు. పాండిత్యంలోనేకాక దేశసేవలో కూడా వాళ్లు కాకలు తీరిన కార్యకర్తలుగా ఖ్యాతిగడించారు. సహజసంస్కార సంపన్నుడైన ఆనందునికి ఆ మహామహులతోటి సన్నిహితపరిచయం బంగారానికి తావి అబ్బిన ట్లయింది.

## గాంధీ సందర్శనం

ఆనందమోహనుడు కాశీలో అధ్యయనం చేస్తున్న దినాలలోనే అక్కడ ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశం ఏర్పా టయింది. అందులో పాల్గొనడానికి మహాత్మాగాంధీ, రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయ్‌పటేల్ మొదలైన పెద్దలు అక్కడికి విచ్చేశారు. విద్యాపీఠంలోని విద్యార్థులు సమావేశస్థలంలోనూ, నాయకుల విడిదిలోనూ వలంటీర్లుగా నియమించబడ్డారు. గాంధీజీ బసచేసిన కుటీరంలోనే ఆనందమోహనుణ్ణి వలంటీరుగా నియమించడం జరిగింది. అందువల్ల అత్యంత సన్నిహితంగా వుండి బాపూజీని సేవించే సదవకాశం అతనికి లభించింది.

మహాత్ముని ఆహారవిహారాలూ, ఆచారవిచారాలూ, నియమనిష్ఠలూ, దైనందిన జీవితచర్యలూ అతడు సునిశితదృష్టితో పరిశీలించాడు. పవిత్రమైన ఆలోచనలు, పవిత్రమైన మాటలూ, పవిత్రమైన పనులే గాంధీగారికి లోకంలో సాటిలేని కీర్తిప్రతిష్ఠలు కలిగించా యని అతడు గ్రహించాడు.

గాంధీజీ రాత్రి బాగా పొద్దుబోయే వరకూ చేయవలసిన పనులన్నీ చేసి



పంద్రెండు గంటలు దాటి నిద్రించినా మరునాడు సరిగా బ్రహ్మముహూర్త వేళకు మేల్కొనేవారు. గీత ద్వితీయాధ్యాయంలోని స్థితప్రజ్ఞలక్షణానికి చెందిన పదునెనిమిది శ్లోకాలనూ మహాత్ముడూ, ఆయన అనుచరులూ నిత్యం ప్రాతఃకాలంలో పారాయణ చేసేవారు. సర్వసమదృష్టితో ఆత్మానుభవం పొందిన పూర్ణమానవుడు మాత్రమే స్థితప్రజ్ఞ డనబడతాడు. అతని లక్షణాలెలా వుంటాయో భగవానుడు ఆ శ్లోకాలలో చక్కగా నిరూపించాడు. అలాంటి స్థితప్రజ్ఞస్థితిని పొందడమే ప్రతి మానవుని అంతిమలక్ష్యమై వుండాలి. ఈ సత్యం గుర్తించబట్టే గాంధీగారు ఆ శ్లోకాలను నిత్యం పారాయణ చేసేవారు. వారి నియమపూర్వకమైన ఆచరణ ఆనందమోహనుని చిత్తంలో చెరగని ముద్ర వేసింది.

అతడు ఒక సంవత్సరకాలం కాశీలో తన అధ్యయనం కొనసాగించాడు. హిందీలో ఉన్నతమైన కోవిద పట్టం పుచ్చుకొన్నాడు. అత డక్కడ ఉన్నప్పుడే అతని భావిజీవితాన్ని మలుపు తిప్పిన ఒక విశిష్టసంఘటన విజయవాడలోని స్వగృహంలో జరిగింది.

## ఓంకారనిలయంలో గురుదేవులు

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు ధర్మప్రచారకార్యక్రమంలో ఉన్న సందర్భ మది. పలుప్రాంతాలనుండి వచ్చిన భక్తుల ఆహ్వానాల నందుకొని స్వాములవారు పర్యటనలో ఉంటూ విజయవాడకు విచ్చేశారు. గురుదేవులు పట్టణానికి వచ్చారని విన్న రామస్వామిగారు సంతుష్టాంతరంగు లయ్యారు. పరమ భక్తితో శ్రీవారి చెంతకు వెళ్లి సాష్టాంగప్రణామం చేశారు. ఇంటికి వచ్చి భిక్ష స్వీకరించవలసిందిగా గురుదేవులను ప్రార్థించారు.

వారి ఆహ్వానం అంగీకరించి శ్రీ స్వాములవారు శిష్యసమేతంగా ఆ మరునాడే ఓంకారనిలయానికి వెళ్లారు. ఇంటివారేకాక ఆప్రాంతంలో ఉన్న ఇతర భక్తులు కూడా స్వామీజీని సందర్శించి వారి ఆశీర్వాదం పొందారు. ఆ సందర్భంలో రామస్వామిగారికి పరిచితులైన పురప్రముఖులు గూడా అక్కడ చేరారు. శ్రీవారికి, వారి శిష్యులకు భిక్ష సమర్పించడంతోపాటు అప్పు డక్కడ చేరిన వారి కందరికీ రామస్వామిగారు చక్కని ఆతిథ్యం సమకూర్చారు.

అప్పటికి శ్రీ మలయాళస్వాములవారు సన్న్యాసం స్వీకరించలేదు. అయినా భక్తులు వారిని భగవంతుని ప్రతినిధిగా భావించి ఆదరించేవారు. ఒక సందర్భంలో

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు శ్రీవారిని మంత్రమూర్తులుగా, అపరశంకరులుగా, ఆధునిక వ్యాసమహర్షిగా కీర్తించారు. శ్రీ సద్గురు స్వాముల వారు మానసికంగా బాల్యంలోనే సన్న్యసించిన మహనీయులు. అలాంటి మహాత్ములను ఇంటికి కాహ్వానించి భిక్ష యివ్వడ మనేది ధర్మమార్గంలో జీవించే సద్గృహస్థుల సంప్రదాయం. పవిత్ర చరిత్రుడైన మహనీయు డొకడు ఎవరి యింట భుజిస్తాడో, ఆ గృహస్థుని వంశస్థులు కొన్నితరాలవరకూ తరిస్తారని శాస్త్రాలు పేర్కొంటు న్నాయి. లోకోత్తరచరిత్రులైన గురుదేవులు స్వయంగా తమ యింటికి వచ్చి భిక్ష స్వీకరించినందుకు రామస్వామిగారి ఆనందానికి అవధి లేకుండా పోయింది.

## గురుదేవులకు పుత్ర సమర్పణ

భిక్షానంతరం రామస్వామిగారు, తక్కిన కుటుంబసభ్యులు శ్రీవారివద్ద కూర్చొని సద్గోష్ఠిలో వున్నారు. అప్పుడు శ్రీ స్వాములవారు రామస్వామిగారితో ఇలా అన్నారు —

"రామస్వామిగారూ! మీరు అందరికీ ఆదర్శమైన పద్ధతిలో గృహస్థజీవనం కొనసాగిస్తూ వున్నందుకు చాలా సంతోషంగా వున్నది. భగవంతుడు మీకు ఎనిమిది మంది బిడ్డలను ప్రసాదించాడు. అందరినీ చక్కని క్రమశిక్షణతో పెంచి విద్యాబుద్ధులు నేర్పి మీకర్తవ్యం మీరు నిర్వహించారు. మీకు అయిదుమంది కుమారు లున్నారు. వారందరికీ ప్రాపంచిక విద్యలనే నేర్పడంకంటే అందులో ఏ ఒక్కరికైనా అధ్యాత్మవిద్య నేర్పి అతణ్ణి పరమార్థక్షేత్రంలో ప్రవేశింపజేయడం సముచితం కదా! ఒక్కణ్ణి మా ఆశ్రమానికి పంపితే అతనికి ఆత్మవిద్యానుభూతి కలిగించడానికి వీలవుతుంది. ఈ విషయం ఆలోచించండి!"

గురుభక్తి సంపన్నులైన రామస్వామిగారు గురుదేవుల సూచన విని ఒక్క క్షణం ఆలోచించారు. అందులోని సత్యాన్ని, ఔచిత్యాన్ని గుర్తించారు. 'సరే' అని సమ్మతించారు. స్వాములవారు వారి త్యాగానికి ఎంతో సంతసించారు.

సాధారణంగా గృహస్థులు తమ బిడ్డ లందరూ లౌకికంగా ఔన్నత్యం పొందా లనే ఆశిస్తారు. తమవంశం పుత్రపౌత్రపరంపరాభివృద్ధి చెందాలని కోరుకుంటారు. కన్నకొడుకులను నివృత్తి మార్గంలో ప్రవేశపెట్టే సంసారులు లోకంలో అరుదు. పావనచరిత్రులైన సుశీలా-రామస్వామి దంపతులు ఆపని చేసి తమ త్యాగశీలతను ఋజువు చేసుకొన్నారు. అమృతత్వప్రాప్తికి త్యాగమే కదా మూలం! తర్వాత



శ్రీ సద్గురుదేవులు తమ తదనంతర పర్యటన కార్యక్రమానికై బయలుదేరి వెళ్లారు.

రామస్వామిగారు తమ కుమారు లైదుమందిలో గురుదేవులకు సమర్పించ టానికి తగినవారు ఎవ్వరా? అని దీర్ఘంగా ఆలోచించ నవసరం లేకపోయింది. ఆనందమోహనుని అసాధారాణ వ్యక్తిత్వం లోకవిదితమే. అందుచేత అతడే అన్నివిధాల ఆశ్రమవాసానికీ, పరమార్థ విద్యాగ్రహణానికీ యోగ్యు డని తండ్రి గారు నిర్ణయించారు. వారి నిర్ణయాన్ని కుటుంబసభ్యు లందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. విశేషమేమంటే ఇదంతా ఆనందమోహనుని పరోక్షంలోనే జరిగిపోయింది.

తరువాత రామస్వామిగారు గురుదేవులను ఇంటికి భిక్షకై ఆహ్వానించడం, ఒక కుమారుణ్ణి ఆశ్రమానికి పంపమని శ్రీవారు కోరడం, అందుకు తాము అంగీకరించడం, గురుదేవులకు సమర్పించడానికి అన్ని విధాలా ఆనందమోహనుడే తగినవాడని తాము నిర్ణయించడం - ఇత్యాది విషయాల నన్నింటినీ పూసగ్రుచ్చి నట్లు వివరిస్తూ కాశిలో వున్న కుమారునికి లేఖ వ్రాశారు. ఆనందమోహనుడు ఉత్తరం అందుకొన్నాడు. అందలి విషయాలు అతనిలో కొంత మానసిక సంచలనం కల్గించాయి.

## శ్రేయస్సు - ప్రేయస్సు

అప్పు డతని వయస్సు 21 సంవత్సరాలు మాత్రమే. ఇంతవరకూ విద్యాభ్యా సంతో కాలం గడచిపోయింది. ఇప్పు డతనికి తన భవిష్యత్తును నిర్ణయించుకోవలసిన సమయం ఆసన్న మయింది.

అతని చదువుకు తగిన ఉద్యోగం సులభంగా లభిస్తుంది. ధనార్జనకు ఏ లోటూ వుండదు. గృహస్థుడై తాను ప్రాపంచిక భోగా లనుభవించవచ్చు. ఇది లోకంలో సాధారణంగా అందరూ అనుసరించే ప్రేయోమార్గం.

ఇప్పుడు తన తండ్రిగారు సూచించిన విధానం పైపద్ధతికి పూర్తిగా విరు ద్ధమయింది. ఇందులో సుఖభోగాలను ఆశించడానికి బొత్తిగా అవకాశం లేదు. ఇది శ్రేయోమార్గం. తీవ్రమైన వైరాగ్యం వుంటే తప్ప ఈ దారిలో నడవడం సాధ్యం కాదు. ఇది చాలా దుర్గమమైనది.

అయితే ప్రేయోమార్గం అనుసరించడంవల్ల లభించే సుఖాలు శాశ్వతాలు కావు. ఆత్యంతిక దుఃఖనివృత్తి, పరమానందప్రాప్తి శ్రేయోమార్గగాములకే కలుగుతా యని శ్రుతి ఘోషిస్తున్నది.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతః
తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే
ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే ॥ (కఠ - 1-2-2)

శ్రేయస్సు, ప్రేయస్సు - ఇవి రెండూ మనుష్యుని వద్దకు వస్తాయి. ధీరుడైనవాడు చక్కగా ఆలోచించి అందులోని మంచిచెడ్డలు తెలుసుకొంటాడు. అతడు శ్రేయస్సునే వరిస్తాడు. అల్పబుద్ధి అయినవాడు యోగక్షేమాలు కోరి పశుపుత్రాదిలక్షణమైన ప్రేయస్సునే వరిస్తాడు.

తండ్రిగారు వ్రాసిన ఉత్తరం చదువుకొన్న ఆనందమోహనుడు వెంటనే ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. తన భవిష్యత్తును గూర్చి అతనికి తీవ్రమైన యోచన కలిగింది.

ఇది ఇలా వుండగా అలహాబాదులో విద్యాభ్యాసం చేస్తున్న అతని సోదరి సరోజిని కాశికి వచ్చింది. ఆమె భర్త శ్రీరంగనాయకులు కాశిలోని హిందూ విశ్వవిద్యాలయములో అప్పుడు యం.ఏ., యల్.యల్.బి చదువుతున్నారు. ఆనంద మోహన్ 'కోవిద' పరీక్షలో ఉత్తీర్ణుడు కావడంతో అతని చదువు పూర్తి అయింది. వారు ముగ్గురూ కలిసి కాశినుండి బయలుదేరి హరిద్వారం వెళ్లారు. ఆ క్షేత్రంలోని విశేషాలన్నీ సందర్శించారు. ఆ యాత్ర వారికెంతో ఆనందం కల్గించింది.

అక్కడనుండి బయలుదేరి వారందరూ ఋషీకేశం చేరుకున్నారు. పావన గంగాతీరంలోని పుణ్యాశ్రమాల నన్నింటినీ తిలకించారు. ఆనందమోహనుని దృష్టి కా ప్రదేశం దేవభూమిలా తోచింది. అచ్చటి ప్రజల ఆస్తిక్యభావం అతణ్ణి ముగ్ధుణ్ణి కావించింది.

## గంగలో గీత

ఋషీకేశంలో ఉన్న ఆసందర్భంలోనే ఆనందమోహనుని జీవితాన్ని పూర్తిగా మలుపు తిప్పిన ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది.



అత డొక పడవపై గంగానదిలో పోతున్నాడు. ప్రవాహంలో తేలి కొట్టుకు వస్తున్న ఒక చిన్న గడ్డికుప్ప అల్లంత దూరంలో అతని కంట బడింది. 'ఏమిటది ?' అని అతడు తదేకదృష్టితో దానివైపు చూపు సారించాడు. అది తుదకు తన పడవ చెంతకే వచ్చి చేరింది. అతడు దానిని మెల్లగా తన చేతులతో అందుకు న్నాడు. పడవలో పెట్టుకొని కుప్ప విప్పి చూచాడు. అందులో నాగరలిపిలో వున్న ఒక భగవద్గీతాగ్రంథం కనిపించింది. కుంకుమతోనూ, పుష్పాలతోనూ పూజిం చబడివున్న ఆపుస్తకం అతణ్ణి సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసింది. బావనూ, సోదరినీ పిలిచి వారి కాపుస్తకం చూపాడు. అది చూచి వారూ సంతోషించారు.

ఆనందమోహనుని భావి జీవితగతిని ఆ గీతాగ్రంథం నిర్ణయించింది. భగవం తుడే ఆ పొత్తాన్ని తన వద్దకు పంపినట్లు అతడు భావించాడు. భగవదాయత్త చిత్తులైనవారికి భగవంతుడే దారి చూపుతా డనడానికి ఇంతకంటే నిదర్శనం ఏమి కావాలి ? "మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి" — "నాపై చిత్తం నిల్పితే నా అనుగ్రహంతో అన్ని ఆటంకాలనూ అధిగమిస్తావు" అని భగవానుడే చెప్పినాడు కదా!

ప్రవృత్తి - నివృత్తి మార్గాలలో దేన్ని ఎన్నుకోవాలి ? అన్న సందిగ్ధావ స్థలో ఉన్న తనకు కనువిప్పు కలిగించడానికే ఆ గీత తన చెంతకు వచ్చింది. ఇప్పు డతనికి తన కర్తవ్య మేదో నిస్సంశయంగా బోధపడింది. దైవానుగ్రహం, గురుకృప-రెండూ తోడై ఈ విధంగా అతని భావికాల గమనాన్ని నిర్ణయించాయి.

తానిక వ్యాసాశ్రమం వెళ్లి శ్రీ మలయాళ సద్గురు దేవుని సాన్నిధ్యంలో పర మార్థవిద్యను సాధించాలనీ, జీవితాన్ని భగవద్ధర్మానికి అంకితం కావించాలనీ అతడు నిర్ణయించుకొన్నాడు. లభించిన గీతను పూజ్యభావంతో పదిలపరచుకొన్నాడు.

తరువాత వాళ్లు ప్రసిద్ధమైన కొన్ని యితరక్షేత్రాలను కూడా సందర్శించారు. యాత్ర పూర్తిచేసుకొని ఆంధ్రదేశాభిముఖంగా పయనం కొనసాగించారు. కొద్ది దినాలకు స్వగృహం చేరుకొన్నారు.

బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన శ్రీ మలయాళ సద్గురువులవారికి సమర్పింపబడిన ఆనం దమోహనుణ్ణి ఆకుటుంబంలోనివారే కాక పరిచితులు, మిత్రులు, బంధువులు మొదలైన వారందరూ ఎంతో గౌరవంతో ఆదరించారు. అతడు కూడా ఎవరివద్ద ఎలా ప్రవర్తించాలో, అలా ప్రవర్తిస్తూ అందరికీ ఆనందం కల్గించాడు.

అత డిక ఆశ్రమజీవితం గడపవలసి వున్నాడు. శ్రీ మలయాళస్వాముల వారు వ్యాసాశ్రమాన్ని ఒక బ్రహ్మవిద్యాకేంద్రంగా దిద్ది తీర్చారు. వారికి శిష్యత్వం వహించి అన్ని విధాల ఆశ్రమంలో రాణించాలంటే అనుష్ఠాననిష్ఠతోపాటు వేదాంత విద్యాపరిజ్ఞానం కూడా ఎంతో అవసరం. ఇది గుర్తించిన ఆనందమోహనుడు ఆశ్రమం చేరడానికి ముందే ఇంచుమించు ఒక సంవత్సరకాలం విజయవాడలోనే వుండి పెక్కు ఆధ్యాత్మికగ్రంథాలను గాఢమైన శ్రద్ధతో పఠించాడు. అతని ప్రజ్ఞ క్రమంగా పరిణత మవుతూ వచ్చింది.

1933లో శ్రీ రామస్వామిగారు తమ వంశచక్రాన్ని వ్రాయించి ప్రకటించారు. అందులో ఈ క్రింది శ్లోకం కనిపిస్తూ వున్నది —

ఏకేనాపి సుపుత్రేణ
విద్యాయుక్తేన సాధునా ।
ఆహ్లాదితం కులం సర్వం
యథా చంద్రేణ శర్వరీ ॥

చంద్రు డెలా రాత్రికి ఆహ్లాదం చేకూరుస్తాడో, అలాగే విద్యావంతుడూ, సాధుశీలుడూ అయిన సత్పుత్రుడు కులాని కంతటికీ ఆహ్లాదం కల్గిస్తాడు.

ఈ శ్లోకం ఆనందమోహనుని భావి వైభవ సూచకమని పాఠకులకు ప్రత్యేకించి చెప్పనవసరం లేదుగదా!



# షష్ఠ ప్రకరణం

## శ్రీ వ్యాసాశ్రమం

శ్రీ మలయాళస్వాములవారు పాదచారులై తీర్థయాత్రచేసే సమయంలో ఉత్తర భారతావనిలో ఎన్నో ఆశ్రమాలను సందర్శించారు. బ్రహ్మవిద్య అధ్యయనం చేసే బ్రహ్మచారులకూ, సాధకులకూ అక్కడ ఉచిత భోజన వస్త్రాది సౌకర్యాలు కలిగించే అనేక సంస్థలను గమనించారు. దక్షిణదేశంలో అలాంటి పుణ్యాశ్రమాలు, ధర్మసంస్థలూ లేకపోవటం కూడా వారు పరిశీలించారు. అందువల్లనే ఆరోజుల్లో దక్షిణదేశీయులు అధ్యాత్మవిద్యాభ్యాసానికై కాశి మొదలైన ఉత్తరప్రాంతాలకు వెళ్లేవారు.

దక్షిణదేశంలోకూడా అలాంటి ధర్మసంస్థ లుంటే ఇక్కడివారు అక్కడికి పోవలసిన అవసరం ఉండదుకదా! అందువల్ల సాధువులకూ, బ్రహ్మచారులకూ, జిజ్ఞాసువులకూ అధ్యాత్మశిక్షణ యిచ్చే ఒక సంస్థను స్థాపించాలని శ్రీవారు నిర్ణయించారు.

సంస్థలు స్థాపించినంత మాత్రాన కర్తవ్యం పూర్తికాదు. అవి సక్రమంగా నిర్వహింపబడాలంటే అందుకెన్నో ఏర్పాట్లు చేయవలసి వుంటుంది. ముఖ్యంగా స్థాపకులకు హృదయశుద్ధి అవసరం. వారిలో ఏ విధమైన స్వార్థానికీ తావుండరాదు. పైగా లోకాన్ని తరింపజేయదలచినవారు తాము ముందు తరించినవారై వుండాలి.

" తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా
నహేతునాఽన్యానపి తారయన్తః । "(వివేకచూడామణి - 37)

అని శంకరాచార్యు లన్నట్లు భయంకరభవసాగరాన్ని తాను తరించినవాడు మాత్రమే ఇతరులను తరింపజేయగలడు. అట్టి యోగ్యతను తనకు సంపాదించుకోవడానికే శ్రీ మలయాళస్వాములవారు గోగర్భంలో పండ్రెండు సంవత్సరాలకు పైగా తీవ్రతపోనిష్ఠ కొనసాగించారు. తాము ముక్తులై ఇతరుల విమోచనానికి ఉద్యమించారు. ఆ ఉద్యమానికి ఫలమే 1926లో స్థాపించబడిన వ్యాసాశ్రమం.

ఆశ్రమానికి గురుదేవులు వ్యాసుని పేరు పెట్టడంలోనే ఎంతో ఔచిత్య

ముంది. వ్యాసమహర్షి శ్రీమన్నారాయణుని అవతారమే. 'మునీనామప్యహం వ్యాసః', (మునులలో నేను వ్యాసుడను) అని భగవానుని మాట.

ఆ మునీంద్రుడు వేదాలను విభజించాడు. అష్టాదశపురాణాలను విరచించాడు. పంచమవేదమైన భారతాన్ని నిర్మించాడు. అందులో వేదసారమైన భగవద్గీతను సమకూర్చాడు. బ్రహ్మసూత్రాలను ప్రసాదించాడు. భాగవతరచనతో ధన్యుడయ్యాడు. వ్యాసుడంటే మూర్తీభవించిన వేదవిజ్ఞానమే.

సర్వసమభావంతో జిజ్ఞాసువులైన వారి కందరికీ ఆవేదవిజ్ఞానాన్ని పంచిపెట్టడానికే శ్రీమలయాళస్వాములవారు దీక్ష బూనారు. అందువల్ల తాము స్థాపించిన ఆశ్రమాన్ని వారు వ్యాసనామాంకితం చేశారు. లోకసేవాతత్పరతతోనే శ్రీ వ్యాసాశ్రమం స్థాపించడం జరిగింది. అందుకు అనుగుణంగానే వారు అక్కడ సంస్కృత విద్యాలయాన్ని నెలకొల్పారు. యథార్థభారతి మాసపత్రికను ప్రారంభించారు. వేదాంతసభలను నిర్వహించి అధ్యాత్మ విజ్ఞాన ప్రచారం చేశారు. జాతి లింగాది భేదాలు పాటించకుండా తమ సంస్థలలో అందరికీ సమానావకాశం కలిగించారు.

సన్న్యాసులకు లోకంతో పని యేమి ? ఆత్మజ్ఞానులకు కర్మ బంధం కదా! అని ఆనాడు శ్రీవారిని విమర్శించినవారు లేకపోలేదు. ఈ విషయంలో స్వామీజీ తమ అభిప్రాయాన్ని ఇలా ప్రకటించారు —

"జ్ఞానులే లోకమునకు ధర్మబోధము, ఆత్మజ్ఞానోపదేశము చేయనిచో ఇక ఆ దివ్యప్రచారము చేయువారు అజ్ఞానులా? కాని సాధకులు, జిజ్ఞాసువులు, ముముక్షువులు తమ బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధము కలిగింపని సేవలు మాత్రమే చేయవలెను. అది దైవసేవ యైనను, మానవసేవ యైనను, జీవకోటిసేవ యైనను ఒక్కటే."

(యథార్థభారతి - మే - 1944)

"ఏకాంతమున ఏకాకినై నేను కాలము గడపినది ఆ స్థితి సర్వోత్కృష్టమని తలంచి కాదు. లోకసేవ చేయుటకు తగిన పరిపక్వత కలుగజేసుకొనుటకై అట్లొనర్చితినని మీరు మరువకుందురుగాక! - - - - - - - తన యొక్క రి ముక్తిమాత్రము చూచుకొనుట ఒక విధమగు స్వార్థమే యగును. మహర్షులవంశములో పుట్టిన మనము వారు చేసిన పవిత్రకార్యములలో మన శక్తికొలది పాటు పడనిచో మన జీవితము జీవితమా ? ఇది యంతయు కని వినినవారు కూడా లోకసేవాతత్పరులగు పుణ్యపురుషులయందు అనాదరము చూపుట కడు



శోచనీయము. కనుక విజ్ఞాన మూర్తులారా! మాయామోహము నుండి లెండు! అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుడు! మీరెల్లరు జ్ఞానస్వరూపులని మీ నిజావస్థను కనుగొనుడు! ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత! ఇప్పుడు మనము చేయవలసినది బ్రహ్మవిద్య నభివృద్ధి పరచుటయే". (య. భా. మే - 1928)

ఇట్టి మహోన్నతాశయములతో స్థాపించిన ఆశ్రమం మూడు పూవులు, ఆరు కాయలుగా అతిత్వరలోనే అభివృద్ధి చెందింది. గురుసన్నిధిలో తన జీవితానికి దివ్యత్వాన్ని ఆపాదింపదలచుకొన్న ఆనందమోహనుడు తల్లిదండ్రుల అనుమతితో విజయవాడనుండి బయలుదేరాడు. సన్నిహితు లందరూ హృదయపూర్వకమైన వీడ్కోలు ఇచ్చారు. గురుదేవులకు తా మిచ్చిన మాట కార్యరూపంలో ఇలా ఫలిస్తున్నందుకు తల్లిదండ్రు లెంతో సంతోషించారు. కుమారుణ్ణి దీవించి పంపారు.

## ఆశ్రమ ప్రవేశం

అది 1936వ సంవత్సరం మే నెల 17వ తేదీ. పవిత్రమైన ఏకాదశీ తిథి గూడా ఆనాడే సంప్రాప్త మయింది. ఆనందమోహనుడు సరాసరి ఆనాడే వ్యాసాశ్రమం చేరుకొన్నాడు.

అప్పటికి మూడు నెలల క్రితమే శాస్త్రవిధిని అనుసరించి గురుదేవులు సన్న్యసించారు. వారు జన్మతః సర్వసంగపరిత్యాగులు. దేహసన్న్యాసరూపమైన కాషాయవస్త్రధారణం ప్రధానమని భావించినవారు కారు. శిష్యులు కాశి మొదలైన ఉత్తర భారతదేశ ప్రాంతాలలోని ఉన్నతవిద్యాసంస్థలలో తమకు స్థానం లభించడానికై శ్రీవారు సంప్రదాయం ప్రకారం సన్న్యసించాలి అని పట్టుపట్టడంవల్ల వారిమీది వాత్సల్యంతో తాము గిరిసంప్రదాయసన్న్యాసం స్వీకరించారు.

కాషాయాంబరధారులై దేదీప్యమానమైన బ్రహ్మతేజంతో విరాజిల్లుతూ వున్న సద్గురుమూర్తికి ఫలపుష్పాదులు సమర్పించి బ్రహ్మచారి ఆనందమోహన్ సాష్టాంగప్రణామం చేశాడు. స్మితముఖులై శ్రీవారు "ప్రయాణం సుఖంగా సాగిందా? తల్లిదండ్రులకు కుశలమా? అందరికీ క్షేమమే కదా!" అని ప్రశ్నించారు. గురుదేవుల అనుగ్రహంతో అందరికీ క్షేమమే అనీ, ప్రయాణం సుఖంగా సాగిందనీ శిష్యుడు సవినయంగా సమాధానం చెప్పాడు. గురుదేవుల ఆశయాలకు అనుగుణంగా తన జీవితాన్ని భగవదర్పితం చేయా లని వచ్చాననీ, తన్ను అనుగ్రహించవలసిందనీ వేడుకొన్నాడు. కరుణామయు లైన శ్రీవారు ఆ శిష్యరత్నాన్ని

వాత్సల్యదృష్టితో వీక్షించి ఆశీర్వదించారు.

విద్యావంతుడైన ఒక బ్రహ్మచారి ఆశ్రమవాసం చేయడానికి వచ్చా డనీ, తల్లిదండ్రులు అతణ్ణి గురుదేవులకు సమర్పించా రనీ గ్రహించిన ఆశ్రమవాసులు అతనిపట్ల తగిన మర్యాద చూపారు.

## గుహాశ్రమవాసం

శ్రీవారి ఆనతి మేరకు వారి నిష్ఠాశ్రమానికి దక్షిణదిశలో కొంతదూరాన ఏకాంతంగా వుండే గుహాశ్రమం అనే కుటీరంలో నూతన బ్రహ్మచారికి వసతి ఏర్పాటుచేశారు.

మహోన్నతమైన నందికొండకు క్రిందిభాగాన శ్రీసద్గురుదేవులు వ్యాసాశ్రమం స్థాపించి దుర్గమారణ్యప్రాంతాన్ని సుందరతపోభూమిగా తీర్చి దిద్దిన సన్నివేశం ఆ బ్రహ్మచారిని ఆనందపరవశుణ్ణి చేసింది. సన్న్యాసులు, వానప్రస్థులు, బ్రహ్మచారులు, సంస్కృతం అభ్యసించే విద్యార్థులు అక్కడ కన్నులపండువుగా అతనికి కనిపించారు. నిత్యమూ గృహస్థభక్తులు, ఇతర శిష్యులు అక్కడికి వస్తూ పోతూ ఉన్నారు. వదాన్యులైన భక్తజనుల సహకారంతో ఆశ్రమవాసులకు తగిన రీతిలో అనేక కుటీరాలు, కట్టడాలు నిర్మించబడివున్నాయి. ప్రాచీన మహర్షుల ఆశ్రమాలను తలపించే పవిత్రాశ్రమంలో బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడూ, సర్వజన సంపూజితుడూ అయిన గురుదేవుని సన్నిధిలో ఉండే మహాభాగ్యం లభించినందుకు బ్రహ్మచారి ప్రమోదభరితు డయ్యాడు.

## గురుశిష్య సంబంధం

గురుశిష్య సంబంధం చాలా పవిత్రమైనది. అజ్ఞానాంధకారాన్ని దూరం చేసేవాడు గురువు. దృఢమైన విశ్వాసంతో గురూపదేశాన్ని ఆచరణలో పెట్టేవాడు శిష్యుడు. మహోన్నతమైన ఆదర్శం కల సద్గురువులు అరుదుగా మాత్రమే లభిస్తారు. అట్టి గురువర్యుల గొప్పతనాన్ని అర్థం చేసుకొని త్రికరణశుద్ధితో వారి ననుసరించే శిష్యులు గూడా అరుదుగానే వుంటారు.

తిరుమల-గోగర్భ గుహలో తపశ్చరణ కావిస్తూ–



అతీత వైరాగ్య మఖండబోధః
కదా ను మే సిద్ధ్యతు హే దయాళో ।
సమాధియోగస్య పరస్య నిష్ఠా
సర్వేషు భూతేషు సమత్వబుద్ధిః ॥

ఓ దయానిధివగు పరమేశ్వరా! అతీతమైన వైరాగ్యమూ, అఖండమైన బోధమూ, నిర్వికల్ప సమాధినిష్ఠా, సర్వభూత సమభావమూ - నాకెప్పుడు సిద్ధించునో? అని ఆర్తితో పరమాత్ముని వేడుకొని ద్వాదశ వర్ష తీవ్రతపోనిష్ఠతో ఆ మహోన్నతలక్ష్యాలను సాధించిన మహామహులు శ్రీ మలయాళసద్గురు దేవులు. ఆత్యంతిక దుఃఖనివృత్తినీ, పరమానందప్రాప్తినీ చవిచూచిన ఆమహనీయుని అనుగ్రహం పూర్వపుణ్యం లేనివారు పొందలేరు. ఉదాత్తచరిత్రుడైన ఆనందమోహనబ్రహ్మచారి తన సుకృతం ఫలించినందుకు 'ధన్యోఽస్మి' అనుకొన్నాడు.

తరువాతి కాలంలో శ్రీవిద్యాప్రకాశానంద స్వామిగా లోకప్రసిద్ధి పొంది తమ గురుదేవుల ఔన్నత్యాన్నీ, మహనీయతనూ వివరిస్తూ ఆయన వ్రాసిన ఈ క్రింది పంక్తులు ఈ సందర్భంలో మననం చేసుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది.

## సద్గురు ప్రశంస

"శిష్యులను సద్వస్తువగు ఆత్మ యొద్దకు చేర్చువాడే సద్గురువు. సచ్ఛీలమును వాక్కునందే కాక, అనుష్ఠానమునందును దిగ్దర్శన మొనర్చువాడే సద్గురువు. శిష్యుల అజ్ఞానాంధకారమును రూపుమాపి జ్ఞానాలోకమును వారికి ప్రసాదించువాడే సద్గురువు. కావున అట్టి యోగ్యతలు గలవారు సహజముగనే జనులలో చాల అరుదుగా నుందురు. భగవానుడు ఎన్నుకొనిన ఏ కొలదిమంది మహనీయులో అట్టి సద్గురుపీఠ మలంకరించి లోకములో విరాజిల్లుచుందురు. అట్టివారిలో నొకరు శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారు.

——— ఆధ్యాత్మిక విషయములయందు పండిన యనుభవము గల మహనీయు లగుటవలనను, పారమార్థిక సూత్రము లన్నియు వారికి కాచి వడబోసినవే అయియుండుట వలనను, భక్తులకు వారి సాన్నిధ్యమందు నిగూఢ దైవతత్త్వావగాహనము సులభతర మనిపించుచుండెడిది ———

పర్వతమును బోలిన స్థైర్యము, సముద్రమును బోలిన గాంభీర్యము, ఆకాశ

మును బోలిన విశాలహృదయము గల్గి తమ యపార తపశ్శక్తిచే ఆంధ్రలోకమున గొప్ప ఆధ్యాత్మిక సంచలనమును గావించి నైతికముగ అఖండ ఉత్తేజమును జను లలో రేకెత్తించిన యతిపుంగవులు బ్రహ్మర్షి శ్రీ మలయాళస్వాములవారు. వారు లోకమునకు ప్రసాదించిన జ్ఞానసంపద అక్షయమై, అవ్యయమై, నిత్యనూతనమై యలరారుచున్నది. వారి దివ్యప్రవచనములు, అమృతహితోక్తులు ఒక దేశమునకు గాని, ఒక కాలమునకు గాని సంబంధించినవి కావు. ఒక జాతికి గాని, ఒక వర్ణము నకు గాని చెందినవి కావు. అవి సార్వకాలీన, సార్వజనీన, సర్వమతసంసేవ్యములైన ఆధ్యాత్మిక దివ్యరహస్యములు ———

సాంఘిక - ఆధ్యాత్మక రంగములందు శ్రీవారి ప్రబోధప్రచారములచే ఎన్నియో విప్లవాత్మకములైన పరిణామములు సంభవించినవి. జనులలో సంకుచితములైన భావములు తొలగి విశాలభావములు ఏర్పడినవి. సాంఘికాధ్యాత్మిక రంగములందు వెనుకబడియున్న స్త్రీలు, ద్విజేతరులు ఆయారంగములలో లెస్సగ పురోగమిం చిరి. శ్రీవారి ప్రబోధములచే జనులలో ప్రగతిశీలమైన దృక్పథము ఏర్పడినది. భౌతికాభివృద్ధితో తృప్తిపడక ఆత్మోన్నతికిగూడా కృషి సలుపవలెననియు, విశ్వశ్రే యస్సునకై శక్తికొలది పాటుపడవలె ననియు శ్రీవారి ప్రబోధములచే జనులు తెలిసికొనదొడగిరి.

శ్రీ వ్యాసాశ్రమస్థాపకు లగు శ్రీమలయాళస్వాములవారు దైవాంశసంభూ తులు. ప్రజల అజ్ఞాన మేఘములను విచ్ఛిన్న మొనర్చి జ్ఞానాలోకమును కలుగజేయుటకై అవతరించిన మహనీయులు. చెప్పినది చేయుట, చేసినది చెప్పట వారియందలి ఒక గొప్పవిశేషము. శ్రీవారి జీవితము ఒక విస్తృత ఆధ్యాత్మిక ప్రయోగశాల అని చెప్పవచ్చును ——'-

నియమనిష్ఠలను పాలించుటలోను, ఇతరులచే పాలింపజేయుటలోను శ్రీ స్వాములవారు అందెవేసిన చేయి. జీవిత మంతయు నియమబద్ధముగా గడ పవలె నను దృఢసంకల్పము కలుగు దశనుండియే మానవత్వము ప్రారంభించునని శ్రీవారు తఱచు సెలవిచ్చుచుందురు. ఆధ్యాత్మిక నియమనిబంధనలకు, క్రమశి క్షణకు శ్రీవా రెంతయో ప్రాధాన్యము నొసంగుచుందురు. శ్రీవారి క్రమశిక్షణా విధానము వజ్రతుల్యముగ నున్నను, దానివెనుక నవనీత హృదయము దాగియుం డును. శ్రీవారిలోని గొప్పవిశేషములలో ఇది యొకటి. బ్రహ్మవిద్యాపారంగతులు, అపరశంకరులు, ఆధునికవ్యాసులు, అవిద్యాతమోభాస్కరులు అగు శ్రీ స్వాము



లవారు తాము తరించి ఇతరులను తరింపజేయుటలో అవిరామముగ కృషిచేసిరి. ———

కార్యదక్షత, బ్రహ్మర్షిత్వము, కోమల హృదయము, తపోమహిమ, నిర్వికల్ప ధ్యానము, విద్యావైదుష్యము, భక్తి జ్ఞాన వైరాగ్యములు - శ్రీ స్వాములవారి యందు నెలవు చేసికొనినవి.

శ్రీ స్వాములవారి జీవితము భగవద్గీతకు భాష్యమని చెప్పవచ్చును. వారి తపోనిష్ఠ, తీవ్రవైరాగ్యము, విజ్ఞానము, దూరదర్శిత్వము, అసంగత్వము, నిర్వి కారత్వము, విశాలహృదయము, పరోపకారకాంక్ష జనులకు మార్గదర్శకములై యున్నవి. వెయ్యేల ? ఆధ్యాత్మికాకాశమున శ్రీస్వాములవారు ధ్రువతారయై విలసిల్లుచున్నారు". (శ్రీ మలయాళమహర్షి - 31, 35, 41, 42, 43, 45 పుటలు)

ఇలాంటి లోకోత్తరుడైన గురువు చెంతవుండి ఆనందమోహన్ బ్రహ్మచారి తపోనిష్ఠతో కూడిన సాధనానుష్ఠానాలు ప్రారంభించాడు. అతడు ఆశ్రమం చేరిన మరునాటి ప్రాతఃకాలం బ్రహ్మముహూర్తంలో శ్రీగురుదేవులు అతణ్ణి తమ సన్నిధికి పిలిపించారు. గాయత్రిని, పంచాక్షరిని క్రమం తప్పక జపించి జపించి పవిత్రుడై వివేకవైరాగ్యాది సాధన సంపన్నుడైన ఆ బ్రహ్మచారి మహావాక్యోపదేశానికి అర్హుడని శ్రీవారు భావించారు.

## మహావాక్యోపదేశం

"ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ" — అనే మహావాక్యాలను గురుదేవులు అతని కుపదేశించారు. అందలి తాత్పర్యాన్ని విపులంగా విశదీకరించారు. నిష్కామకర్మతో చిత్తశుద్ధినీ, ఉపాసనతో ఏకాగ్ర తనూ సాధించిన జిజ్ఞాసువు బ్రహ్మవిజ్ఞానం ద్వారానే మోక్షానికి అర్హు డవుతాడు. మహావాక్య శ్రవణమనననిదిధ్యాసనల వల్ల ఆవరణదోషం తొలగి బ్రహ్మజ్ఞానం దృఢ పడుతుంది. అందువల్ల అర్హతగల శిష్యులకు మాత్రమే శ్రోత్రియబ్రహ్మనిష్ఠులైన సద్గురువులు మహావాక్యాలను ఉపదేశిస్తారు. శ్రీవారి ఉపదేశాన్ని సావధానంగా శ్రవ ణంచేసి ఆనందమోహనుడు తన్మనన నిదిధ్యాసనలకు ఉపక్రమించాడు. ఎడనెడా తనకు గలిగే సంశయాలను గురువుగారి నడిగి తీర్చుకుంటూ ఆధ్యాత్మికపథంలో పురోగమించాడు. క్రమం తప్పక అటు ఆశ్రమనియమాలనూ, ఇటు ఆత్మోన్నతికై

తనకు తాను విధించుకొన్న నియమాలనూ పాలించాడు. నియమం లేని జీవితం పశుప్రాయమని గురుదేవులు తరచు చెప్పే ప్రబోధాన్ని తు.చ. తప్పకుండా అనుసరించాడు.

## శ్రీవ్యాసాశ్రమ నియమావళి

ఆశ్రమంలో ఈక్రింది నియమాలను పాటించవలసిందిగా శ్రీ మలయాళ సద్గురుదేవులు ప్రకటించారు—

(1) ఈ ఆశ్రమంలో ఉండే విద్యార్థులు గాని, సాధువులు గాని ఆశ్రమానికి వచ్చే అతిథుల సేవలోనూ, ఆశ్రమకార్యాలలోనూ నిరభిమానులై పరిచర్య చేసే స్వభావం కల్గి వుండాలి.

(2) సత్యం నుండీ, ధర్మం నుండీ, దైవం నుండీ మనస్సు జారిపోతున్నదా అని నిరంతరం ఆత్మలో పరిశోధన చేస్తూ వుండాలి.

(3) సత్యం నుండి, ధర్మం నుండి, దైవం నుండి మనస్సు జారిపోయే కార్యం ఎంత పుణ్యమైనదైనా దానిలో ప్రవేశించరాదు.

(4) తన బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధం కలిగించే ఏ పుణ్యకార్యములో నైనా ప్రవేశించకూడదు. బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధం లేని పుణ్యకార్యం కాని, లోకసేవ గానీ చేస్తూ వుండాలి.

(5) తన ధర్మంలో తనకు విశ్వాసం కలిగివుండడంకన్నా గొప్ప తపస్సు మరొకటిలేదు. తాను ఏ విత్తనం విత్తుతాడో, అదే చెట్టై ఫలం కలుగజేస్తుందని ఆత్మవిశ్వాసం కలిగివుండాలి. అలాంటివారు లోకంలో దేనికీ భయపడ నక్కర లేదు.

(6) జ్ఞానమే గమ్యమైనా నిష్కామ కర్మ భక్తి యోగాలు పరంపరాసాధన అని మరువకూడదు. ఈ మూడింటిలో ఒక్కదానినైనా చక్కగా ఆచరిస్తే దానివల్ల జ్ఞానం ఉదయిస్తుంది. ముక్తీ లభిస్తుంది.

(7) ఆశ్రమంలో వుండే విద్యార్థులు గాని, సాధువులు గాని ఆశ్రమానికి వచ్చే వారిని ఏమీ యాచించరాదు.

(8) ఈ ఆశ్రమంలో వుండేవారు ఇతరుల ఇండ్లలో భోజనాదులు నిర్వహిం-



చకుంటూ వుండడానికి అవకాశం లేదు.

ఆహారనియమం, నివాసనియమం, అనుష్ఠాననియమం - అనే మూడు నియమాలనూ, యుక్తాహారం, వివిక్తవాసం, బ్రహ్మచింతన - అనే మూడు విధులనూ గురుదేవులు తాము పాటిస్తూ శిష్యులచేత క్రమం తప్పక పాటింపజేసేవారు. వస్త్రశుద్ధి, స్థలశుద్ధి, పాత్రశుద్ధి, కాయశుద్ధి, వాక్శుద్ధి - అనే ఐదు శుద్ధులు సాధకులకు అత్యావశ్యకాలని తటచు బోధించేవారు. వారు విధించిన నియమాలనూ, శుద్ధులనూ పాటిస్తూ ఆనందమోహన్ ఆశ్రమజీవితం కొనసాగించాడు.

## గురుదేవుల సన్నిధిలో అనుభవాలు

గురుదేవుల సన్నిధిలో నాడు తాను గడించిన అనుభవాలను వివరిస్తూ తరువాతి కాలంలో శ్రీవిద్యాప్రకాశానందులు వ్రాసిన ఈ క్రింది సంఘటనలు ఇక్కడ స్మరింపదగివున్నాయి —

"అనుభవజ్ఞులగు మహాత్ములచెంత నివసించుట, వారి వాక్యములను వినగల్గుట, వారికి సేవచేయు అవకాశమును బడయుట ఒక మహాద్భాగ్యమే యగును. శ్రీ మహర్షి సద్గురుమలయాళస్వాములవారి సన్నిధియందు పండ్రెండువత్సరముల కాలము నివసించి వారికి, వారు స్థాపించిన శ్రీవ్యాసాశ్రమమునకు ఉడుతాభక్తిగ సేవచేయు సదవకాశము నాకు కలిగినందుకు చాల సంతోషించుచున్నాను. రాతిని శిల్పి తన చాతుర్యముచే విగ్రహముగ మార్చునట్లు అనేకమంది ముముక్షువులైన సాధకులను తమ హితోక్తుల చేతను, అనుభూతితో మేళవించిన సద్బోధల చేతను, క్రమశిక్షణ చేతను శ్రీవారు విజ్ఞానసంపన్నులుగను, సద్గుణవంతులుగను తయారు చేసిరి.

శ్రీవారి యొక్క అకళంకప్రవర్తనము, అపారదైవభక్తి, నియమనిష్ఠలయందాసక్తి, గొప్ప పట్టుదల, నిరాడంబరత్వము, కార్యదక్షత, ప్రగాఢవైరాగ్యము, శాంతస్వభావము, సర్వభూతదయ, శాస్త్ర కుశలత్వము, పరోపకార పారీణత, క్షమాశీలత్వము మొదలగు ఉదాత్తగుణగణములు సర్వులకును మార్గదర్శకములై యున్నవి.

చిన్న కార్యములైనను వానియందు శ్రద్ధచూపుట, వానిని పెద్ద బుద్ధితో చేయుట శ్రీవారి ఒక ప్రత్యేకత. ఆంగ్లమున ఒక సూక్తి కలదు —

*'The greatness of a man lies not in doing great things in a great way, but in doing small things in a great way.'*

ఒకని యొక్క గొప్పతనము పెద్దపెద్దకార్యములను పెద్దబుద్ధితో చేయుటయందు లేదు. చిన్న కార్యములను పెద్దబుద్ధితో చేయుటయందు కలదు.

శ్రీ వ్యాసాశ్రమమందున్న రోజులలో ఒకనాడు నేను నేలకు అనునట్లు పెద్దపంచ కట్టుకొని పూజామందిరము వైపునుండి పోవుచుండ శ్రీవారు పిలిచి "ఏయ్, కట్టుకొను పంచ నేలకు తగులగూడదు. పాదమునకు కొంతపైగానే ఉండునట్లు ధరించవలెను" అని బోధించిరి.

ఒకనాడు ఆశ్రమకార్యార్థమై ఊరికి ప్రయాణమై పోవుచున్న సందర్భమున పెట్టె మొదలగు సామగ్రిని ఒకరి చేతికిచ్చి నేను వెనుకగా నడచిపోవుచుండ ఆ మహనీయుడు చూచి వెనువెంటనే నన్ను పిలిచి "సామగ్రి మొత్తము ఒకరి చేతికిచ్చి నీవేమియు పట్టుకొని పోకుండ వెడలుట మంచిది కాదు. అది సభ్యత కాదు. ఏదియో ఒక చిన్నవస్తువైనను పట్టుకొని పోవలెను" అని సెలవిచ్చిరి. ఆ వాక్యములు నాకెంతయో ప్రభావమును కలుగజేసినవి. నాజీవితమునం దవి లెస్సగ ఉపకరించినవి. (శ్రీ మలయాళమహర్షి - 49, 50)

## క్రమశిక్షణ

ఇక క్రమశిక్షణ విషయములో గురుదేవు లెట్లుందురో వివరించుచు శ్రీవిద్యాప్రకాశానందస్వామిజీ యిలా అన్నారు ----

"క్రమశిక్షణతో అన్ని కార్యములు జరుగవలెనని శ్రీవారి అభిప్రాయము. అందుచే శ్రీవ్యాసాశ్రమమున ఉదయమునుండి రాత్రివరకు జరుగు అన్ని కార్యములు సక్రమముగా సమయముప్రకారము జరుగుచుండును.

ఉదయము బ్రహ్మముహూర్తమున గీతా పారాయణమునందు గీతాశ్లోకములను చదువుట, సాయంత్రము సమావేశములలో శ్రీవారి సన్నిధియందు ఆధ్యాత్మిక గ్రంథమును పఠించుట, మధ్యాహ్నకాలమున టపాలు శ్రీవారికి చదివి వినిపించుట అను కార్యక్రమములు నాకు అప్పచెప్పబడినవి. ఆయా కార్యములు నిర్వహించుటకు ఆయాసమయములయందు ఖచ్చితముగ రావలసినదే. ఏ మాత్రము ఆలస్యము చేయరాదు. క్రమశిక్షణతో ఆయాపనులు నెరవేర్చవలెనని శ్రీవారి ఆదేశము.



ఒకనాడు రాత్రి కుంభవర్షము కురియుచుండెను. మా కుటీరము (గుహాశ్రమము) ఆశ్రమమూలస్థానమునకు ఒకింత దూరముగ నున్నది. దూరముగ నుండుటచే ఆశ్రమములో కొట్టబడు గంటలు మాకు సరిగా వినిపించవు. తెల్లవారుజామున నాలుగుగంటలకు లేచి స్నానాదులను నెరవేర్చుకొనినగాని గురుమందిరమున జరుగు పారాయణ కార్యక్రమమును అందుకోలేరు. నాయొద్ద గడియారము లేదు. శ్రీవారు తామరకొలను నందు స్నానముచేయుటకు వచ్చునపుడు ఒక చేతి లాంతరు వెంట తీసుకొనివచ్చి కొలను యొద్దనున్న ఒక స్తంభమునకు తగిలించుదురు. ఆ దీపము మాకుటీరమునకు బాగుగ కనిపించును. అది కనిపించినచో ఉదయము నాలుగుగంటలైనదని మాకు గురుతు. అందుచే ఆ వర్షపురోజు రాత్రి అప్పుడప్పుడు నిద్రలేచి ఆ దీపము ఉన్నదా యని చూచుచుండెడివాడను. ఎందుకనగా ఎంత వాన కురిసినను పారాయణాది కార్యక్రమములకు అంతరాయము కలుగకూడదు. ఏ మాత్రము ఆలస్యమైనను విధిని ఉల్లంఘించినట్లే కాగలదు. క్రమశిక్షణకు లోపము కల్గినట్లే కాగలదు. ఈ ప్రకారముగ శ్రీవారి సాన్నిధ్యమందు భయభక్తులతో ఆశ్రమకార్యములను నిర్వహించుచుండెడివారము. సోమరితనమును, తమోగుణమును, బద్ధకమును శ్రీవారు ఏకాలమందును అంగీకరించెడివారు కారు. వారి క్రమశిక్షణపద్ధతులే అంతేవాసులు నిర్దుష్టముగ వారి విధులను నిర్వహించుటకు దోహదమును కలుగజేసినవి. ------

ఈ ప్రకారముగ ఎన్నియో పద్ధతులు, నియమములు, సదాచారములు శ్రీవారి సాన్నిధ్యమున ఉన్న పంద్రెండు సంవత్సరములలో నేర్చుకొంటిని. శ్రీవారి ఆయా బోధలు ప్రతివానికిని జీవితమునం దెంతయో సత్ప్రభావమును కలుగజేయును. కనుకనే పెద్దలు గురుకులవాసమునకు ఎంతయో ప్రాముఖ్యము నిచ్చియుండిరి."

(శ్రీ మలయాళమహర్షి - 49, 50, 53, 56)



# సప్తమ ప్రకరణం

## అపక్వాహారం

గురుకులవాసం ప్రారంభించిన తొలిదినాలలోనే ఆనందమోహనుడు గురుదేవుల అనుమతితో అపక్వాహారమే స్వీకరించాలి అనే నియమం పెట్టుకొన్నాడు. ఈ కఠోరనియమం పండ్రెండు సంవత్సరాల కాలం అవ్యాహతంగా కొనసాగింది. ఉడికిన పదార్థాన్ని దేన్నీ ముట్టక కొబ్బరి, అరటి పండ్లు, నానవేసిన పెసలు, గోధుమలు మొదలైన పదార్థాలు మాత్రమే స్వీకరించేవాడు. సత్త్వశుద్ధి సంపాదించడానికి ఆహారశుద్ధి చాలా ప్రధాన మనీ, సాధకులు సాత్త్వికాహారం మాత్రమే స్వీకరించా లనీ శాస్త్రాలు విధించాయి.

మనం భుజించే ఆహారంలోని సూక్ష్మాంశమే మనస్సుగా మారుతుంది. ఆహారం పవిత్రమైతే మనస్సుకూడా పవిత్రంగా వుంటుంది. అందులోనూ అపక్వాహారం స్వీకరించడంవల్ల సాధకులకు కలిగే ప్రయోజనం అపరిమితమై వుంటుంది. సుదీర్ఘ కాలం అపక్వాహారం స్వీకరించి అందలి ప్రయోజనాలను స్వానుభవంతో గుర్తించిన ఆనందమోహన బ్రహ్మచారి ఆ తరువాతి కాలంలో దాని ప్రాముఖ్యాన్ని ఇలా వివరించి వున్నాడు ——

"సృష్టియందు 84 లక్షల జీవరాసులు ఉన్నప్పటికీ వంటచేసుకొని భుజించువాడు మానవు డొక్కడే. తక్కిన జీవరాసులు అపక్వాహారమునే భుజించుచున్నవి. ప్రకృతి సిద్ధమగు ఆహారమునే గైకొనుచున్నవి. తత్ఫలితముగ ఆరోగ్యముగా నున్నవి. మానవుడో ప్రకృతియందు నైజముగ లభించిన ఆహారపదార్థములను వికృత మొనర్చి జిహ్వాచాపల్యముచే వానికి పెక్కురుచులను కల్పించి భుజించుటవలన ఆరోగ్యము చెడి పెక్కువ్యాధులకు లోనగుచున్నాడు.————

ప్రకృతి యందు స్వతస్సిద్ధముగ లభించిన వస్తువులను ఉడకబెట్టునపుడు వాని యందలి కొన్ని జీవాణువులు నశించిపోవును. దృష్టాంతమునకు ఒక పెసరగింజ యున్న దనుకొనుడు. దానిని భూమిలోపెట్టి ఒకటి రెండు రోజులు నీళ్లు చల్లినచో వెంటనే మొలకెత్తును. దానియందలి జీవశక్తు లత్తరి వికసించును. కాని ఆ గింజనే పెనముపైపెట్టి వేయించి, లేక ఉడుకబెట్టి భూమియందు



నాటినచో కోటి సంవత్సరములకైనను అది మొలకెత్తనేరదు. కారణ మేమి? దానిలోని జీవకణములు కొన్ని నశించిపోయినవి. జీవశక్తులచే పరిపూర్ణమైయున్న పదార్థమును గైకొనుటయే మనుజునకు ఉత్తమము. అనగా అపక్వాహారమును గైకొనుటయే ఆరోగ్యకరము.

అయితే గోధుమలు, పెసలు మొదలగునవి పచ్చివి నమలుటకు కఠినముగా నుండును. వానిని కొంతసేపు నీటిలో నానవేసి భుజింపవచ్చును. తాజాఫలములను స్వీకరించుటవలన ఆరోగ్యము పెంపొందును. అపక్వాహారము గైకొనువారికి కొబ్బరి కాయ అతిముఖ్యమైనది. మన పూర్వులు నారికేళమున కెంతయో పూజ్యత్వము కల్పించిరి. దేవతల కందరికి నారికేళము నివేదనముగా సమర్పింపబడుచున్నది.

———

ఆరోగ్యమునకు ఎంతయో సహాయపడునట్టిదియు, మిక్కిలి విలువైనదియునగు రేడియం అను పదార్థము కొబ్బరికాయ యందు ఎక్కువగ గలదని ఇటీవల శాస్త్రజ్ఞులు పరిశోధనచే కనిపెట్టిరి - - - - కొబ్బరి, అరటిపండ్లు, గోధుమలు, శనగలు - ఈ నాలుగును అపక్వాహారము స్వీకరించువారికి చాల అవసరములై యున్నవి. — వారివారి జీర్ణశక్తి ననుసరించి పూటకు ఒక గుప్పెడుకాని, రెండు గుప్పెళ్లుగాని, లేక మూడు గుప్పెళ్లుగాని నానవేసిన గోధుమలు, శనగలు వాడుకొనవచ్చును. పండ్లు ఏవి భుజించినను మంచిదే. అన్నింటికంటె అరటిపండు శ్రేష్ఠము. అది చవుకగా లభించును. పండ్లు దొరకనిచో పచ్చికాయగూరలు గూడ వాడుకొనవచ్చును.

ఉడికిన పదార్థ మేమియు లేక రెండు పూటలు అపక్వాహారము భుజించుట సర్వశ్రేష్ఠము. దానిచే రోగములు హరించిపోవును. కావున రోగము కలవారు కనీసము రోగము తొలగువరకైనను అపక్వాహారము శీలించుట ఉత్తమము.

ఒకవేళ రెండు పూటలు అపక్వాహారమును సాధింపలేనిచో కనీసము రాత్రి పూటయైన అన్నము మాని ప్రకృతి ఆహారమును స్వీకరించుట మంచిది. బాగుగ అభ్యాసమైన వెనుక పూర్తిగ అన్నమును, విసర్జించవచ్చును. అపక్వాహారమును సాధించుకాలములో పాత మురికి రక్తము పోయి దాని స్థానమునందు క్రొత్త నిర్మల రక్త మేర్పడును. కావున ఆ మార్పుదల సమయమున ఒకవేళ ఏవైన కురుపులు, దగ్గు మొదలగు వికారము లొకింత కనుపించినను దానిచే సాధకుడు జంకరాదు. బెదరిపోరాదు. తన నియమమును అప్రతిహతముగ కొనసాగించుచునే

యుండవలయును. కొంతకాలమునకు వికారము లన్నియు తొలగి చక్కని ఆరోగ్య మేర్పడును.

కొందరు కొబ్బరి అజీర్ణమును గలుగజేయు ననియు, అరటిపండు వాత మనియు, గోధుమలు వేడిచేయు ననియు, శనగలు కడుపుబ్బరము కలిగించు ననియు, --- ఇంకను పరిపరివిధములుగ ఆయావస్తువులను గురించి చెప్పుదురు. కాని ఆయా వికారము లన్నియు ఉడికిన పదార్థములతోబాటు పైపెచ్చు వానిని స్వీకరించినపుడు కలుగవచ్చునేమో కాని ఉడికిన పదార్థములు పూర్తిగ త్యజించి కేవలము వానిని సేవించునప్పుడు, అనగా అపక్వాహారమును గైకొనునప్పుడు ఎంతయో ఆరోగ్యమును గల్గించును. పైగా పెక్కు రోగములను నివారించును. కాబట్టి ఆరోగ్యమును కాంక్షించువారు, రోగబాధను తొలగించుకొన దలంచు వారు ప్రయత్నపూర్వకముగ కొంతకాల మైనను ఈ అపక్వాహారమును సేవించుట ఉత్తమము.

అధ్యాత్మరంగమున ప్రవర్తించు సాధకుల కీ యపక్వాహారము ఎనలేని సహా యమును చేకూర్చును. ఏలయనగా సత్త్వగుణము నయ్యది వృద్ధిపరచి రజోగుణ తమోగుణములను పారదోలును. కాన ముముక్షువుల కియ్యది వరప్రసాదమే యగును." (వేదాంతభేరి - ఆగష్టు 63)

పై వివరణను బట్టి అపక్వాహారం వల్ల సాధకుడైన ఆ బ్రహ్మచారికి ఎంత మేలు కలిగిందో ఊహించుకోవచ్చు.

## దినచర్య

ఆశ్రమవాసు లందరూ బ్రహ్మముహూర్తానికి ముందే నిద్ర లేచేవారు. స్నానాది కాలకృత్యాల అనంతరం సద్గురుమందిరంలో కొంతసేపు సామూహిక ధ్యానం కొన సాగించేవారు. తర్వాత కొన్నిస్తోత్రాలు పఠించి గీతాపారాయణ కుపక్రమించేవారు. శ్రీగురుదేవులు కూడా నిత్యమూ ఈ కార్యక్రమాలకు హాజరయ్యేవారు.

ఆనందమోహన్ గీతాపారాయణలో పాల్గొని ఆ పిమ్మట తన నివాసకు టీరానికి వెళ్లి ధ్యానంలో నిమగ్ను డయ్యేవాడు. ప్రశాంతమైన వాతావరణంలో ఇంచుమించు రెండు గంటలు ధ్యానం నిరంతరాయంగా కొనసాగేది. తర్వాత ఆధ్యాత్మిక గ్రంథాలను పఠించేవాడు.



మధ్యాహ్నం ఆహారం స్వీకరించిన తర్వాత శ్రీవారివద్ద ఆరోజు ఆశ్రమా నికి వచ్చిన లేఖలు చదివి వినిపించేవాడు. ప్రత్యుత్తరాలు వ్రాయవలసిన లేఖలకు గురుదేవుల సూచనల ననుసరించి సమాధానాలు వ్రాసి సిద్ధంచేసి పంపేవాడు.

సాయంకాలం నాలుగు గంటలకు పూజామందిరం వద్ద బోధ ప్రారంభ మయ్యేది. విద్యార్థులు, కొందరు పనివారూ తప్ప తక్కిన సాధకులందరూ బోధకు హాజరయ్యేవారు. అప్పుడు ఏదో ఒక ఆధ్యాత్మికగ్రంథాన్ని పఠించడం, దానిపై శ్రీవారు వివరించడం జరిగేవి. బోధ పూర్తి కాగానే సాధకులు సాయంవిధులు నిర్వర్తించడానికి వెళ్లేవారు. పిదప ధ్యానానంతరం భోజనాలు పూర్తి చేసుకొని అందరూ విశ్రమించేవారు.

## యోగవాసిష్ఠం - అనువాదరచన

బ్రహ్మచారి ఆనందమోహన్ ఆశ్రమంలో చేరిన తర్వాత సాయంకాలబోధ సమ యంలో పఠనీయగ్రంథంగా యోగవాసిష్ఠమనే ఉద్గ్రంథం ఎన్నుకోబడింది. మూలం తోపాటు ఆ గ్రంథానికి గల హిందీ అనువాదం చదువుతూ తెలుగులో భావం వివరించి చెప్పేపని ఆయనకు అప్పగించబడింది. ఇందువల్ల ఆయనకు యోగ వాసిష్ఠంతో ప్రగాఢపరిచయం ఏర్పడింది. ఈ గ్రంథపఠనకార్యక్రమం సుదీర్ఘకాలం కొనసాగింది.

వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునికి బోధించిన తత్త్వమే యోగవాసిష్ఠం. దీన్ని వసిష్ఠ గీత అనీ, వాసిష్ఠరామాయణం అనికూడా వ్యవహరిస్తారు. ఇందులో ముప్పదిరెండువేల శ్లోకా లున్నాయి. వేదాంతతత్త్వాన్ని అంత విపులంగానూ, జనరంజకంగానూ వివరించిన గ్రంథం మరొకటి లేదనడం అతిశయోక్తి కాదు. తెలుగులో ఆ గ్రంథరాజాన్ని సమగ్రంగా అప్పటికి ఎవ్వరూ ప్రకటించలేదు. శ్రీ మలయాళసద్గురుదేవులు ఆంధ్రతాత్పర్యంతో కూడా దాన్ని ప్రకటించా లనుకు న్నారు. శ్రీవారి ప్రోత్సాహంతో శ్రీ నిర్వికల్పానందస్వామి ఆ గ్రంథంలో ఇంచుమించు అర్థభాగం అనువదించారు.

బోధసమయంలో చక్కగా శ్రోతలకు యోగవాసిష్ఠం వివరిస్తున్న ఆనందమోహ నుని ప్రతిభను గుర్తించి గురుదేవులు అవశిష్టగ్రంథ భాగాన్ని అనువదించవలసిందిగా ఆయనకు నిర్దేశించారు. ఆ మహాకార్యాన్ని శిరసావహించి ఆరు సంవత్సరాల కాలం తీవ్రంగా శ్రమించి ఆయన అనువాదం పూర్తిచేశాడు. నాలుగు బృహత్సం

పుటాలుగా శ్రీవారు ఆగ్రంథాన్ని ప్రకటించారు. ఆ గ్రంథ ముద్రణసమయంలో ప్రూఫులు దిద్దేపని కూడా ఆనందమోహనుడే నిర్వహించాడు. ఆ మహోత్తమ వేదాంత గ్రంథములో ఆనా డతడు కావించిన కృషి ఆధ్యాత్మిక వికాసానికి ఎంత గానో తోడ్పడింది. ఆ గ్రంథంలోని విషయాలు టనకెంతో ఉత్తేజం కలుగుజేశాయని ఆయన స్వయంగా ఒకచోట వ్రాసివున్నాడు.

## ధర్మపదం - అనువాదరచన

బుద్ధభగవానుని ఉపదేశమైన ధర్మపదం అనే గ్రంథాన్ని గూడా గురుకులవాస కాలంలోనే ఆనందమోహన బ్రహ్మచారి అనువదించాడు. బుద్ధుడు పాళీభాషలో బోధించిన ఈ గ్రంథాన్ని శ్రీ రాహుల సాంకృత్యాయనులు హిందీలో అను వదించారు. ఆంధ్రానువాదం హిందీ ననుసరించి సాగింది. మూలంతోపాటు, దానికి యథాతథమైన సంస్కృతం, ఆనందమోహనుని ఆంధ్రానువాదం చేర్చి యీ పుస్తకం ప్రకటించ బడింది. పీఠికలో గ్రంథ ప్రాముఖ్యం వివరిస్తూ అనువాదకుడు వ్రాసిన మాటలివి ——

"శ్రీ బుద్ధభగవానుని ఉపదేశసార మిది. బౌద్ధుల ధర్మగ్రంథ సముదాయ మగు త్రిపిటకము నందు గల 15 గ్రంథములలో ఇదియే ప్రధానమైనది. హిందువులు భగవద్గీత నెట్లు ఉదారబుద్ధితోను, పూజ్యభావముతోను చూతురో, అట్లనే బౌద్ధులు దీనిని పూజ్యభావముతో చూచుచు నిత్యము పారాయణము చేయుచుందురు. శ్రీ బుద్ధదేవు డప్పుడప్పుడు ఒక్కొక్క స్థానమున ఒక్కొక్క వ్యక్తికిగాని, లేక భిక్షుసంఘమునకుగాని కావించిన ఉపదేశము లిందు గలవు. సాక్షాద్విష్ణుభగవానుని అవతారమూర్తియగు బుద్ధదేవుని ముఖతః వెలువడిన ఈ దివ్యోపదేశములు భారత దేశముననే కాక ఖండఖండాంతరములందును అనేక కోట్ల బుద్ధానుయాయులచే పఠింపబడుచు కార్యాన్వీత మొనర్చబడుచున్నవి."

## చిన్నస్వామి - ఆనందస్వామి

ఆంధ్రదేశంలో వ్యాసాశ్రమం సుప్రసిద్ధం కావడంవల్లా, ఉత్తరదిశనుండి తిరుప తికి పోయివచ్చే యాత్రికులకు అందుబాటులో ఉండడంవల్లా నిత్యమూ ఎందరో భక్తులు ఆశ్రమానికి వస్తూవుండేవారు. అలా వచ్చినవారు శ్రీమలయాళ సద్గు రుస్వాములవారిని సందర్శించిన పిదప ఆనందమోహనుల సందర్శనానికి గూడా



వచ్చేవారు. శ్రీవారిని పెద్దస్వాములనీ, వీరిని చిన్నస్వాములనీ, లేదా ఆనంద స్వాములనీ వ్యవహరించడం అందరికీ అలవాటయింది. చిన్నస్వామి అపక్వాహారం మాత్రమే స్వీకరిస్తారని తెలిసిన భక్తులు ఆయనకు ఫలాలు సమర్పించేవారు. అందులో తగుమాత్రం తాను స్వీకరించి తక్కిన పండ్లను ఆయన ఆ పరిసర ప్రాంత్రాలలో తిరిగే పశువుల కాపరులకు పంచిపెట్టేవాడు.

తమ వద్దకు వచ్చిన భక్తులను ఆనందస్వామి చిరునగవుతో పలకరించేవాడు. దీర్ఘప్రసంగాలకు దిగకుండా మితంగా ప్రసంగించి వారిని పంపివేసేవాడు. సాధకులకు వ్యర్థప్రలాపాలు, నిరర్థక కాలక్షేపాలు పనికిరావు. మితనిద్ర, మితాహారం, మిత సంభాషణ - ఆధ్యాత్మిక పురోగతికి సోపానాలు. ఈ కీలకం తెలిసిన ఆనందస్వామి చాలా జాగరూకతతో ప్రవర్తించేవాడు.

## తప్పిపోయిన ప్రమాదం

ఆశ్రమం కొండప్రాంతం కావడంవల్లా, అందులోనూ ఆనందస్వామి కుటీరం చెంతనే అడవి వ్యాపించి వుండడంవల్లా అక్కడ పాములు అధికంగా సంచరిస్తూ వుండేవి. ఒక్కొక్కసారి ఆయన నివసించే కుటీరంలో గూడా అవి ప్రవేశించేవి. ఆశ్రమంలో పాములను చంపరా దనేది నియమం. గదుల్లోకి వచ్చిన పాములు తమంత తాముగా వెళ్లిపోతే సరి, పోకపోతే ఒక పొడవైన పట్టుకారుతో వాటిని పట్టుకొని బోనులో వేసి దూరంగా వదలిపెట్టి వచ్చేవారు.

ఒకనాటి రాత్రి ఆనందస్వామి తన కుటీరం ముందున్న పందిరి క్రింద అరుగుపై శయనించి వున్నాడు. తన శిరస్సుకు నేరుగా పందిరిపై ఒక పాము ప్రాకుతున్నట్లు ఆయనకు కల వచ్చింది. వెంటనే మెలకువ రాగా అరుగుమీ దనుండి లేచాడు. బ్యాటరీ తీసుకొని పందిరివైపు చూడాలని ప్రయత్నించేలోపల పాము సరిగా ఆయన శయనించి వున్నప్పుడు శిరస్సు ఉన్నచోటనే దబుక్కుమని పడింది. 'ఏమిటది ?' అని బ్యాటరీ వెలిగించి చూచేసరికి విషసర్పం చరచరా కదిలి పోతున్నది. ఆదృశ్యం ఆయనకు సంభ్రమాన్నీ, ఆశ్చర్యాన్నీ కలిగించింది. స్వప్నం ద్వారా తన్ను విపత్తునుండి కాపాడిన భగవంతుని కృపకు మనస్సులోనే ఆయన కృతజ్ఞతలు ప్రకటించాడు.

వనే రణే శత్రుజలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్తకే వా ।

సుప్తం ప్రమత్తం విషమస్థితం వా
రక్షన్తి పుణ్యాని పురాకృతాని ॥ (భర్తృహరి-1-99)

అడవిలో, యుద్ధంలో, శత్రుమధ్యంలో, జలమధ్యంలో, అగ్ని మధ్యంలో, మహా సముద్రంలో, కొండపైభాగంలో నిద్రించేవాణ్ణీ, ప్రమత్తుడైనవాణ్ణీ, విషమస్థితిలో వున్నవాణ్ణీ పూర్వపుణ్యాలు కాపాడుతాయి అన్న సూక్తికి పై సంఘటన చక్కని నిదర్శనం కదా!

ఇలాంటిదే మరొక సంఘటన కూడా ఇక్కడ స్మరింపదగి వున్నది.

అది ఒకనాటి అర్ధరాత్రి సమయం. ఆనందస్వామి నిద్రనుండి మేల్కొని నిశ్శబ్దమైన ఆ వాతావరణంలో ధ్యాననిమగ్నుడై వున్నాడు. నలువైపులా గాఢాంధకారం ఆవరించివున్నది. అప్పుడు కొండవైపునుండి ఒక ఎలుగుబంటి గుహాశ్రమానికి వచ్చింది. దాని అలికిడికి ధ్యానం భగ్నం కాగా కళ్లు తెరచి చూచిన ఆనందస్వామికి ప్రక్కనే వున్న భల్లూకం కనిపించింది. వెంటనే ఆయన సంభ్రమంతో లేచి రెండడుగులు వెనక్కువేసి "పరమాత్మా! ఈ రూపంలో సాక్షాత్కరించావా ?" అంటూ బిగ్గరగా ఓంకారోచ్చారణ చేశాడు. ఒక్క క్షణం ఆయనవైపు అలాగే చూచి ఎలుగుబంటి మరేమీ హాని తలపెట్టకుండా వెనక్కి మళ్లి వచ్చినదారినే తరలిపోయింది. ప్రమాదం తప్పించిన పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ తెల్లవారేదాక అలాగే ఆనందస్వామి ఉండిపోయాడు. ఈ సంఘటనలు ఆయన జీవితంలో మరపురాని ఘట్టాలుగా మిగిలిపోయాయి.

శ్రీ సద్గురుస్వాములవారు సనాతన వేదాంతసభలను స్థాపించారని ముందే చెప్పుకొన్నాం. ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్కచోట భక్తుల ఆహ్వానంపై ఈ సభలు జరిగేవి. శ్రీగురుదేవులు ఆనందస్వామిని గూడా ఈ సభలకు తీసుకువెళ్లేవారు. అక్కడ గీతాపారాయణాది కార్యక్రమాలను ఆయన నిర్వర్తించేవాడు.

1940లో కృష్ణాజిల్లాలోని ఘంటసాలపాలెంలో పదునాల్గవ సనాతన వేదాంత జ్ఞానసభ జరిగింది. పిమ్మట భక్తుల కోరికమేరకు శ్రీసద్గురుదేవులు దోనేపూడిలో 28-3-40 నుండి 17-4-40 వరకు 21 రోజులు ఒక జ్ఞానయజ్ఞం నిర్వహించారు.

## ఓంకారసత్రయాగం

ఆ యజ్ఞానికి ఓంకారసత్రయాగం అనిపేరు. ఈయాగంలో శ్రీగురుదేవులు



నిత్యమూ ఉదయవేళల భగవద్గీతనూ, పతంజలి యోగసూత్రాలనూ వివరించేవారు. సాయంసమయంలో ఓంకారమహిమను విశదీకరిస్తూ ఆత్మోన్నతి కవసరమైన ఉపాయాలనూ, ధ్యానపద్ధతులనూ రుచిరంగా ప్రబోధించేవారు. స్త్రీలకూ, ద్విజేతరులకూ ఓంకారోపాసన యోగ్యత లేదు అని ఆకాలంలో వ్యాపించి యుండిన మూఢవిశ్వాసాన్ని ఖండిస్తూ శ్రీవారు సాధకులైన వారందరూ ప్రణవోపాసనకు అధికారులే అని ఎలుగెత్తి చాటారు. ఇలాంటి జ్ఞానయజ్ఞాలను నిర్వహించడం ద్వారా వారు తరతరాలనుండీ సమాజంలో పాతుకుపోయివుండిన దురాచారాలనూ, దురభిప్రాయాలనూ నిరసించి నిర్మూలించారు. హిందూ సమాజంలో క్రొంగ్రొత్త చైతన్యం కలిగించారు.

ఆ సత్రయాగంలో గురుదేవులు కావించిన దివ్యప్రబోధాలను గ్రంథరూపంలో కూర్చిన ఘనత ఆనందస్వామికి దక్కింది. 'ఓంకార సత్రయాగం' అన్న పేరుతో ఆగ్రంథం ప్రకటింపబడింది. ఆ గ్రంథపీఠికలో ఆయన ఇలా వ్రాశారు—

"ప్రస్తుతకాలమున అధ్యాత్మలోకమున వేరు పురుగువలె దాపురించుచున్న శుష్కవేదాంతమును సమూలముగ విచ్ఛేద మొనర్చువిధానమును గూర్చియు, తన్మతానుయాయులగు కుతార్కికుల శుష్కప్రవచనములను ఖండించుట గూర్చియు, ఆత్మలోకమున సమున్నతి వడయుటకై వలసిన యుపాయములను గూర్చియు, ధ్యానపద్ధతుల గూర్చియు, మనోజయోపాయములను గూర్చియు, శాస్త్రప్రమాణ స్వానుభవయుక్తులద్వారా శ్రీస్వాములవారప్పుడు సెలవిచ్చిన విషయములు అమోఘములై వెలయుచున్నవి. కాని యెట్టి బోధ యైనను గ్రంథరూపమున స్థిరాకృతి బడసిననే పలువురకు శ్రేయోదాయకమగు నని యెంచి అయ్యోంకారసత్రయాగమున శ్రీవారు గావించిన హితబోధలెల్లను, సదుపదేశ దివ్యప్రసంగముల నన్నింటిని ఒకచో జేర్చి ముద్రించదలచితిమి....

సర్వులకు నుపకరించులాగున ఈ గ్రంథము సులభశైలిలో వ్రాయబడినది. మూలసిద్ధాంతముల పోషించుటకై శ్రీస్వాములవారు తరచు దృష్టాంతదార్ష్టాంతములను, ఉపమానములను, కథలను, యుక్తులను, పెక్కింటిని తెలుపుచుందురు. వాటినన్నింటిని సాధ్యమైనంతవర కిందులో జేర్చితిమి. కాన నియ్యది సహేతుకముగను, యుక్తియుక్తముగను, మనోరంజకముగను గూడ నొప్పగలదు. అధ్యాత్మ జ్ఞానపిపాసులెల్లరు ఈ గ్రంథము నామూలాగ్రము పఠించి యందలి బోధనామృతసారమును హృద్గతమొనర్చుకొని విజ్ఞానప్రాప్తి నొంది ధన్యులయ్యెదరు గాక!"

శ్రీవారి బోధలను విని పిమ్మట అందలి ముఖ్యాంశములను క్రోడీకరించి వ్రాసిన గ్రంథం ఓంకారసత్రయాగం. ఆశ్రమంలో శ్రీవారు నిత్యం గ్రంథరచనకై కొంతసమయం కేటాయించేవారు. తాము ముందుగా మలయాళం లిపిలో వ్రాసుకొని తరువాత తెలుగులో శిష్యులచే వ్రాయించేవారు. ప్రశ్నోత్తరమాణిక్యమాల మొదలైన గ్రంథాలను ఆవిధంగా ఆనందస్వామిచేత వ్రాయించారు.

## మౌనవ్రతం

ఆనందస్వామి ఆశ్రమంలో చేరి ఇంచుమించు ఆరు సంవత్సరాలు గడచాయి. అంతవరకూ అనుష్ఠించిన సాధనలవల్ల అతనిలో బాహ్యదృష్టి క్రమంగా సన్నగిల్లింది. అంతర్ముఖవృత్తి బలపడింది. వైరాగ్యం తీవ్రతర మయింది. లౌకిక కర్మకలాపంలో ఆసక్తి నశించింది. తీవ్రధ్యానాపేక్ష కలిగింది.

ఆ పరిస్థితిలో 30-12-1941వ తేదీనాడు శ్రీ సద్గురు స్వాములవారి చెంతకు వెళ్లి తన మనఃస్థితిని వివరించి కొంతకాలం మౌనవ్రతం పాటిస్తూ ధ్యాననిష్ఠలో ఉండిపోవడానికి అనుమతించమని ఆయన ప్రార్థించాడు. గురుదేవులు ఆయన స్థితిని అవగతం చేసుకొని సంతోషంతో అట్లే చేసుకో అని అనుమతించారు.

తరువాత 1942 జనవరి ఒకటవ తేదీన ఆయన మౌనవ్రతం ప్రారంభించాడు. తీవ్రధ్యానానికి ఉపక్రమించాడు. నాలుగు వారాలు అలా గడచిన పిదప తన తండ్రి గారికి ఆంగ్లంలో వ్రాసిన ఈ లేఖ అప్పటి ఆయన మనఃస్థితిని చక్కగా వివరిస్తున్నది —

*Sri Vyasa Ashram,*
*Yerpedu,*
*28-1-1942.*

*Dear Father,*

*Received your letter. My health is in a sound condition at present. The ideal of man is always to 'look up and aim high'. Progress alone is the sign of humanity, not weakness. Deterioration is the mark of animality. As man progresses day by day, his opinions also change, ideas differ and a complete metamorphosis is soon brought about in his character. He will become a new man altogether. Nay, a gulf will be created between his previous mode of walking and his new state of life.*



*It is nearly six years since I have stepped into this Ashram leaving you all, leaving house, family and friends and from that time by the grace of the Almighty and by the blessings of Gurudev Sri Malayala Swamiji Maharaj, I found myself on the progressive line. Year after year as my mind is having more and more internal bent and getting disinterested in external things, I proceeded to cut short my connections with others, with outsiders, friends, well - wishers and even with Ashramites. For, a time must come when man is to be left entirely for himself, alone, without even a single 'Bahirmukha-Sankalpa', to dive deep into the inner recesses of his heart and drink the nectar of immortality, a divine store ready for use in every individual. A complete change from 'Pravritti' to 'Nivritti' must take place at one time or other in man making progress in the spiritual realm. Otherwise first- grade Sadhana is almost impossible.*

*A whole-timed aspirant can never divide his time between God and the world. The idea of recluse and complete retirement grew stronger and stronger in me day by day and it became strongest a month back. My mind rebelled as it were to do external work and so I could not remain without narrating to Swamiji regarding my disinterest in the performance of work. Owing to a keen desire for higher meditation I approched him on the 30th of December (1941) and clearly explained to him the whole thing in emphatical terms. He accepted most gladly.*

*Thus the way is opened unto me. Although the kind Lord has been helpful to me these six years in presenting before me conducive circumstances, this help of His in giving me full liberty for meditation. I deem it highest in as much as it created a wonderful atmosphere for me to strain every nerve in realising truth. My joy knew no bounds as the word of consent came out from the lips of Swamiji and I could not but remain extolling the illimitable mercy of the Lord towards His devotees.*

*I took the vow of taciturnity (Mowna) on the 1 st of January 1942 but I cannot give out at present how long I will continue it. The wind is most favourable to me now and I must not lose the opportunity presented before me but spend my time in realising the ideal soon. I should not bring in 'Vikshepa' to my mind at present by attending conferences, delivering lectures and touring from one place to another. This is not the time for me for all those external things, I must proceed internally for some time right earnestly*

***now! I must strike the iron only when it is hot!***

***Yours in the Lord***

**(Sd) ANANDA MOHAN,**

పై లేఖకు ఆంధ్రానువాదం ―――

**శ్రీవ్యాసాశ్రమం,**
**యేర్పేడు,**
**28-1-42.**

**ప్రియమైన తండ్రీ!**

మీ ఉత్తరం అందింది. ఇప్పుడు నా ఆరోగ్యం బాగా వున్నది. ఊర్ధ్వదృష్టీ, ఉన్నతలక్ష్యం సదా కల్గి వుండడమే మానవుని ఆదర్శం. అభివృద్ధి మాత్రమే మానవతాలక్షణం కాని బలహీనత కాదు. దిగజారిపోవడం పశుత్వాన్ని సూచిస్తుంది. మానవుడు దినదినాభివృద్ధి పొందే కొద్దీ అతని అభిప్రాయాలు కూడా మారుతాయి. ఉద్దేశాలు భేదిస్తాయి. అతని ప్రవర్తనలో సమగ్రమైన మార్పు సంభవిస్తుంది. పూర్తిగా అతడు క్రొత్తమానవుడుగా తయారవుతాడు. అతని పూర్వస్థితికీ, నూతన జీవితానికీ మధ్య ఒక అగాధం ఏర్పడుతుంది.

ఇంటినీ, కుటుంబాన్నీ, మిత్రులనూ, మిమ్ముల నందరినీ వదలి నేనీ ఆశ్రమంలో కాలుపెట్టి దాదాపు ఆరు సంవత్సరాలు గడచాయి. ఆనాటి నుండీ భగవత్కృపవల్లా, గురుదేవులు శ్రీమలయాళస్వాములవారి ఆశీర్వాదంవల్లా నేను అభివృద్ధి పథంలో వున్నాను. ఒక్కొక్క సంవత్సరం గడిచే కొద్దీ నామనస్సు అంతర్ముఖంగా మరలుతూ వున్నది. బాహ్యవిషయాల్లో ఆసక్తి కోల్పోతున్నది. అందువల్ల నేను ఇతరులతోనూ, మిత్రులతోనూ, శ్రేయోభిలాషులతోనూ, తుదకు ఆశ్రమవాసులతోనూ నా సంబంధాలను తగ్గించుకొంటున్నాను. మానవుడు తనకు తాను ఒంటరిగా మిగిలిపోయే ఒక దశ తప్పక కలగాలి. బహిర్ముఖమైన సంకల్పం ఒక్కటి కూడా ఉండకూడదు. అప్పుడే అతడు హృదయాంతరాళంలోకి చొచ్చుకొనిపోయి అక్కడ వున్న నిత్యత్వమనే దివ్యామృతాన్ని చవి చూడగలడు. ఆధ్యాత్మికక్షేత్రంలో అభివృద్ధి సాధించే మానవునిలో ఎప్పుడో ఒకప్పుడు ప్రవృత్తి నుండి నివృత్తి వైపునకు పరిపూర్ణమైన మార్పు కలిగి తీరాలి. లేకపోతే మహోన్నతమైన సాధన అసాధ్యమవుతుంది.



నిత్యసాధకుడు తన సమయాన్ని అటు భగవంతునికీ, ఇటు ప్రపంచానికీ విభజించి పంచలేడు. నాలో దినదినానికీ సంపూర్ణ నివృత్తి స్థితి బలపడుతూ వచ్చి ఒక నెల క్రిందట అది చాలా సుదృఢంగా రూపొందింది. నా మనస్సు బాహ్యక్రియలపట్ల పూర్తిగా విముఖ మయింది. ఈ కర్మవైముఖ్యాన్ని గురించి స్వామీజీకి వివరించకుండా ఉండలేకపోయాను. ఉన్నతస్థాయి ధ్యానంలో నిమగ్నుణ్ణి కావాలన్న కోరికతో గత డిశంబరు 30వ తేదీ వారివద్దకు పోయి నా పరిస్థితి నంతా సవిస్తరంగా వారికి వివరించాను. నా అభిప్రాయానికి శ్రీవారు సంతోషంతో తమ సమ్మతి తెలిపారు.

ఈ విధంగా నాకు మార్గం సుగమ మయింది. దయామయుడైన భగవంతుడు ఈ ఆరు సంవత్సరాలూ నాకీ పరిస్థితులు కలిగించడంలో సహకరించాడు. ఇప్పుడు ధ్యానానికి కావలసిన పూర్తి స్వాతంత్ర్యాన్ని కల్గించాడు. సత్యాన్వేషణలో తీవ్రకృషి జరపడానికి కావలసిన ఆశ్చర్యకరమైన వాతావరణం ఏర్పడడం వల్ల నేనిది చాలా ఉన్నత స్థితి అని భావిస్తున్నాను. స్వామీజీ తమ సమ్మతి తెలిపినప్పుడు నా ఆనందానికి అవధులు లేవు. భక్తులపట్ల భగవంతుని అనంతమైన అనుగ్రహాన్ని గురించి స్తుతించకుండా ఉండలేకపోయాను.

జనవరి ఒకటవ తేదీన మౌనవ్రతం ప్రారంభించాను. కాని దీన్ని ఎంతకాలం కొనసాగిస్తానో ఇప్పుడు నేను చెప్పలేను. పరిస్థితి నాకిప్పుడు ఎంతో అనుకూలంగా వున్నది. నాకు వచ్చిన ఈ సదవకాశాన్ని నేను జారవిడుచుకోరాదు. ఈ లక్ష్యాన్ని సాధించడానికి నా సమయాన్ని నేను వెచ్చించాలి. సమావేశాలకు హాజరు కావడం ద్వారా, ఒకచోటి నుండి మరొకచోటికి తిరుగుతూ ఉపన్యాసాలు ఇవ్వడం ద్వారా ప్రస్తుతం నా మనస్సుకు నేను విక్షేపం కలిగించుకోగూడదు. ఈ బాహ్యవిషయాలకు ఇది నాకు సమయం కాదు. ఇప్పుడు తదేకదీక్షతో నేను అంతర్ముఖంగా పయనించాలి. బాగా వేడిగా వున్నప్పుడే ఇనుమును నేను సాగగొట్టాలి.

భవదీయుడు,

(సం) ఆనందమోహన్.

ఈ మౌననిష్ఠ ఒక సంవత్సరకాలం అప్రతిహతంగా కొనసాగింది. ఈ కాలంలో ఆయన ఆధ్యాత్మిక సాధనలు తీవ్రస్థాయి నందుకొన్నాయి. గురుదేవులు మౌనంలో

వున్న శిష్యుని పురోగతిని సమీక్షిస్తూనే వున్నారు. ఆ మౌనకాలంలో జరిగిన ఒకనాటి సంఘటనను ఆ శిష్యుడే తరువాతి కాలంలో ఇలా వివరించాడు ——

“1942వ సంవత్సరమున శ్రీవారి అంగీకారమును బడసి ఒక్క సంవత్సరము నేను మౌనవ్రతదీక్ష నవలంబించితిని. ఆ మౌనకాలమున ఒక రోజు పలకపై ఏదియో వ్రాసి మరియొకరికి చూపించుచుండగా ఆ దృశ్యము శ్రీవారి కంటబడెను. వెంటనే శ్రీవారు నాతో యిట్లు చెప్పిరి ——

“మౌనదీక్ష వహించినవారు పలకమీద, కాగితములమీద వ్రాసి చూపించుచుండు పద్ధతి మంచిదికాదు. మౌనము వాక్కునకే కాక మనస్సునకు కూడ ఉండవలెను. వాఙ్మనముతో బాటు మానసికమైన మౌనముగూడ శీలించవలెను. అనగా ఏవిధమైన దృశ్యసంకల్పము మనస్సునందు జొరబడకుండులాగున చూచుచుండవలెను. అట్లు చేయుటయే ఉత్తమ మౌనము” — శ్రీవారి ఆ చక్కని ఉద్బోధము భావికాలమున మాకెంతగనో ఉపకరించినది.”

వ్యాసాశ్రమంలో ప్రతిసంవత్సరం మాఘమాసంలో గురుపూజలు జరిగేవి. ఈ పూజల్లో పాల్గొనడానికి రాష్ట్రం నలుమూలలనుండీ చాలామంది భక్తులు విచ్చేసేవారు. అలావచ్చిన భక్తులను చూచి ఒక రోజు ఆనందస్వామి శ్రీవారితో “ఆశ్రమానికి వచ్చిన సాధువుల, భక్తుల ఆధ్యాత్మికాభివృద్ధిని పరామర్శించడం మంచిది” అని చెప్పాడు. గురుదేవులు అందుకు సమ్మతించారు.

వెంటనే నాటి సాయంకాలం భారతీ మందిరం ముందున్న విశాల ప్రదేశంలో సమావేశం ఏర్పాటయింది. భక్తులు, సాధువులు అందరూ అక్కడ చేరారు. కైలాసాశ్రమాధిపతులు శ్రీ నిత్యానందస్వామీజీ వంటి పెద్దలు కూడా వచ్చారు. సమావేశానికి ఆనందస్వామి అధ్యక్షత వహించారు. అనేకులు సభలో ప్రసంగించారు. అధ్యక్షుల ఉపన్యాసం అందరినీ అలరించింది.

పూజామందిరం ముందు నిలబడి సభ జరుగుతున్న విధానం పరిశీలించి సంతోషంతో శ్రీవారు ఒక చీటీ వ్రాసి సభాస్థలానికి పంపారు. అందులో ఇలా వ్రాసి వున్నది ——

“ఈ ఆశ్రమం మాతర్వాత ఏమవుతుందో అని కొందరికి సందేహం. ఇప్పుడు సభను చూస్తే ఏమవుతుందో ప్రజలే గ్రహించగలరు.”

ఆధ్యాత్మిక పథంలో సాగిపోయే సాధువులకు, బ్రహ్మచారులకు వదాన్యులైన



వారు ఆర్థికసహకారం అందించడం కద్దు. గృహస్థులు తక్కిన మూడు ఆశ్రమాల వారినీ పోషించాలి కదా! సాధువర్తనులైన సాధకుల పోషణకై తమ సంపదలో ఎంతో కొంత వ్యయించే దాతలు అఖండమైన పుణ్యం ఆర్జిస్తారు.

గుంటూరు నగరానికి చెందిన వర్తకప్రముఖులు శ్రీ చక్కా సుబ్బారావుగారు అలాంటి పుణ్యాత్ములలో ఒకరు. ఆయన బ్రహ్మచారి ఆనందమోహన్ ఖర్చులను భరించటానికై అవసరమైన ఆర్థిక సహకారాన్ని చాలాకాలంనుండీ అందిస్తూ వచ్చారు. ‘శ్రీ గురునాథాశ్రమం’ అన్న పేరుతో ఒక ఆశ్రమాన్నికూడా వారు గుంటూరు ప్రాంతంలో నిర్మించారు. తమ ఆశ్రమానికి రావలసిందిగా వారు పదే పదే కోరడంవల్ల ఆనందమోహనబ్రహ్మచారి 1944వ సంవత్సరం అక్కడికి వెళ్లాడు. కొన్నిమాసాలు అక్కడ విశ్రాంతిగా గడిపాడు. తరువాత తిరిగి వ్యాసాశ్రమం చేరుకొన్నాడు.



F-6

# అష్టమ ప్రకరణం

## సన్న్యాస స్వీకారం

ఆనందస్వామి వ్యాసాశ్రమం చేరి పదునొకండు సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పటికి కొంతకాలంనుండీ ఆయనకు సన్న్యాసం స్వీకరించాలన్న సంకల్పం క్రమంగా దృఢపడుతూ వచ్చింది. బాల్యమాదిగా తనలో వున్న ఆధ్యాత్మిక సంస్కారం సమగ్రంగా ఫలప్రదం కావాలంటే తురీయాశ్రమం స్వీకరించక తప్పదని ఆయన భావించాడు. తల్లిదండ్రులు తన్ను గురుదేవులకు సమర్పించడం, గంగానదిలో గీత లభించడం, శ్రీవారి సన్నిధిలో దీర్ఘకాలం తపోనిష్ఠలో కొనసాగడం — ఇలాంటి సంఘటనలు తన భావిజీవితాన్ని సర్వసంగపరిత్యాగంవైపు నడిపిస్తూ వున్నాయని ఆయన గ్రహించాడు.

తీవ్రవిరక్తి కలవారికే సన్న్యాసం విధింపబడింది. అందులోనూ బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం — అనే మూడు విధాలైన ఆశ్రమధర్మాలను చక్కగా అనుష్ఠించి జీవిత చరమదశలో సన్న్యసించడం ఒక పద్ధతి. అలా కాక 'యదహరేవ విరజేత్, తదహరేవ ప్రవ్రజేత్' అన్న శాస్త్రవిధిని అనుసరించి తీవ్రవైరాగ్యం కలిగిననాడు ఏ ఆశ్రమంలో ఉన్నవాడైనా సన్న్యాసం స్వీకరించవచ్చు.

పూర్వం ఆదిశంకరాచార్యులు, ఆధునిక యుగంలో స్వామి వివేకానంద మొదలైనవారు బ్రహ్మచర్యదశనుండే తురీయాశ్రమం స్వీకరించారు. ఆదిశంకరుల కాలంలో సన్న్యాసుల సంప్రదాయం మహోన్నతస్థితిని అందుకొన్నది. వారు తాము స్థాపించిన నాలుగు మఠాలలోనూ సన్న్యాసిశిష్యులనే అధిపతులుగా చేశారు. తద్వారా పరంపరగా వైదికధర్మ వ్యాప్తికై కృషి కొనసాగేటట్లు ఏర్పాటు చేశారు.

ఆధునిక కాలంలో శ్రీ రామకృష్ణ పరమహంసగారి పరివ్రాజక శిష్యులు శ్రీ రామకృష్ణ మఠాధిపతులై ఆర్షధర్మ పరిరక్షణ చేస్తున్నారు. శ్రీ వివేకానందస్వామి, శ్రీ రామతీర్థులు మొదలైన పరివ్రాజకాగ్రణులు విదేశాలలో వేదవిజ్ఞానాన్ని విస్తరింపజేసి సన్న్యాసాశ్రమానికి అఖండ ఖ్యాతి గల్గించారు. దివ్యజీవన సంఘస్థాపకులు శ్రీ శివానందసరస్వతీస్వామి కూడా సన్న్యాసి సంప్రదాయాన్ని పునరుద్ధరించారు.



భారతీయసంప్రదాయంలో సన్న్యాసులకు ఉన్న గౌరవం మరొకరికి లేదు. ఎంత పెద్ద చక్రవర్తులైనా యతీశ్వరుల పాదపద్మాలకడ మోకరిల్లవలసిందే.

శ్రీ మలయాళ సద్గురుస్వాములవారు సహజంగానే ఆత్మసన్న్యాస సామ్రాజ్యానికి అధిపతులుగా రాణించారు. వారి దృష్టిలో దేహసన్న్యాసం అంత ప్రధానం కాదు. అయినా ఉన్నతవిద్య నభిలషించి కాశి మొదలైన దూరప్రాంతాలకు వెళ్లే తమ శిష్యులకు అక్కడి మఠాలలో గుర్తింపు రావటానికై శ్రీగురుదేవులు **1936**లో దేహసన్న్యాసం కూడా స్వీకరించారు.

వారు సన్న్యసించిన కొలదికాలానికే బ్రహ్మచారి ఆనందమోహన్ వ్యాసాశ్రమ ప్రవేశం చేశాడు. సద్గురుదేవులు బ్రహ్మవిద్యావ్యాప్తికీ, లోకోద్ధరణకూ చేస్తున్న అపారమైన కృషిని ఒక దశాబ్దానికి పైగా వారి చెంతనే వుండి పరిశీలించే సదవకాశం ఆయనకు కలిగింది. ఆంధ్రదేశంలో సన్న్యాసులకూ, సాధువులకూ శ్రీవారి వల్ల ఎంతో ప్రతిష్ఠ పెరగడం ఆయనకు అవగత మయింది.

దేహసన్న్యాసం కంటే ఆత్మసన్న్యాసం శ్రేష్ఠమైనదే. అయినా దేహసన్న్యాసం లేకపోతే కొన్ని లౌకికబంధాలు తన్ను వెన్నాడే ప్రమాదం ఉన్నది. కాషాయాంబరధారణం వల్ల కొన్ని చిక్కులు తమకుతాముగా వీడిపోతాయి. నిరాటంకంగా ఆత్మనిష్ఠ కొనసాగించటానికి అవకాశం ఏర్పడుతుంది. తాను ధరించిన వస్త్రమే తనకర్తవ్యాన్ని సన్న్యాసికి హెచ్చరిస్తూ వుంటుంది. సన్న్యాసుల ప్రబోధాలకు లోకం ఎంతో విలువ ఇస్తుంది. గురుసంప్రదాయాన్ని నిలబెట్టడానికీ, ప్రచురమైన ఆత్మవిద్యాప్రచారానికీ, అసంగస్థితిలో వుండి అనంతమైన లోకసేవ చేయడానికీ తురీయాశ్రమం సహకరిస్తుంది. అందువల్లనే బ్రహ్మచారి ఆనందమోహన్ గురుదేవులవద్ద సన్న్యాసదీక్ష చేపట్టాలని దృఢంగా నిశ్చయించుకొన్నాడు.

కనాడు ఆయన తన మనోగతమైన అభిప్రాయాన్ని గురుదేవులకు విన్నవించాడు. శిష్యుని యోగ్యత గుర్తెరింగిన గురుదేవులు ఆయనకు సన్న్యాసదీక్షాప్రదానం చేయడానికి సమ్మతించారు. సన్న్యాసాశ్రమాన్ని గురించి శ్రీసద్గురుస్వాములవారి ఆశయం ఎలా వుండేదో వారి ఈ క్రింది మాటలను బట్టి గ్రహించవచ్చు —

"సన్న్యాసమునకు తగిన విద్య, తపస్సు లేకపోయిన అది పరిహాసపాత్రమగును. విద్యావంతులగు బుద్ధిమంతుల కనేకులకు నేటి సన్న్యాసులపై గౌరవము లేకుండుటకు కారణ మిదియే. అత్యంత పవిత్రమగు వేషము ధరించి అందుకు

తగిన యోగ్యత లేనివారు పురాతన యతీశ్వరులను నిందలపాలు చేసినవారగుదురు. దేహసన్న్యాసముకన్న సంకల్పసన్న్యాసము, దానికంటె ఆత్మసన్న్యాసము ఉత్తరోత్తరము శ్రేష్ఠములు. —— పరివ్రాజకునకు వలయు నియమములు పూర్తిగా లేనిచో దేహసన్న్యాసము పతనహేతు వగునని శాస్త్రములు ప్రతిపాదించుచున్నవి. —— నిత్యనైమిత్తికాది కర్మల నుండియు, దేహసంబంధమగు పాశముల నుండియు విడివడుటకు మాత్రమే దేహసన్న్యాసము సాయ మొనర్చును. కాని ఆత్మసన్న్యాసము లేనివాడు శాశ్వతశాంతి నొందజాలడు".

గురుదేవులు సన్న్యాసం స్వీకరించిన తర్వాత అనేకులు స్వామివద్ద సన్న్యాసం తీసుకోవాలని అభిలషించారు. వారితో శ్రీవారు ఇలా చెప్పేవారు —

"సన్న్యాసము స్వీకరించగోరు స్త్రీలకైనను, పురుషులకైనను భగవద్గీత, కఠోపనిషత్తు, పాతంజల యోగదర్శనము అను మూడు గ్రంథములు తప్పక కంఠస్థములై యుండవలెను. ఇంతమాత్రమైనను విద్యలేనిచో సన్న్యాసము శోభించదు. అంతేకాక ఒక సంవత్సరకాల మైనను అట్టివారు వ్యాసాశ్రమమున నివసింపవలెను. అప్పుడే వారికి వలయు సాధనలు నేర్ప వీలగును. అట్లు చేయనిచో వారికి పూర్వ ఋషివర్యులవలె పావనజీవితము గడపుట సాధ్యము కాదు. మరియు వారు గృహస్థాశ్రమ సంబంధములగు సమస్తకార్యములనుండి విముక్తి నందవలెను. మరల దేహసంబంధములగు ఏ కార్యములు వారికి తగవు. ఈ సన్న్యాసము ఆత్మసాక్షాత్కారము నందుటకు, ప్రపంచములో నిస్సంగులై ధర్మోపదేశ మొనర్చుటకును ఏర్పడినదను సంగతి మరువరాదు. బుద్ధుడు, శంకరుడు, క్రీస్తు, మహమ్మదు వంటి మతప్రవక్తలందరును ఈలాగుననే లోకమున కుపదేశించి యున్నారు." (యథార్థభారతి - జనవరి - 1945)

ఇలాంటి దృఢనియమాలు ఏర్పాటు చేయడంవల్ల శ్రీగురుదేవులనుండి అనేకులు సన్న్యాసాశ్రమస్వీకారం చేయలేకపోయారు. 'న శ్రేయో నియమం వినా' — నియమం లేకపోతే శ్రేయస్సు లేదు అని శ్రీవారు మాటిమాటికీ శిష్యులను హెచ్చరించేవారు. వారి నియమపాలన విధానం చాలా కఠోరమై వుండేది.

సన్న్యాస స్వీకారానికి గురుదేవులు విధించిన నిబంధన లన్నీ ఆనందమోహన బ్రహ్మచారి అంతకు ముందే చక్కగా పాటించి వున్నాడు. గీత, కఠోపనిషత్తు, యోగదర్శనం — వీటిని కంఠస్థం చేసిన తర్వాతనే ఆయన గురుదేవుణ్ణి సన్న్యాసప్రదానానికి అర్థించాడు. విద్యాతపస్సులతో పూతాత్ముడైన అలాంటి శిష్యరత్నానికి



తురీయాశ్రమదీక్ష ఇవ్వటానికి ఆటంక మేమున్నది ? పైగా యోగ్యుడైనవానికి సన్న్యాసం ఇవ్వటంవల్ల ఆర్షసంప్రదాయాన్ని పరిరక్షించినట్లవుతుంది. బ్రహ్మవిద్యాప్రచారానికి అది సహకరిస్తుంది. ఏ మహోన్నతాశయాలను సాధించడానికై తాము ఉద్యమించారో, ఆ ఆశయాలను నెరవేర్చడానికి సన్న్యాససంప్రదాయ పరిరక్షణం అవసరమని నిశ్చయించుకొని శ్రీవారు ఆ బ్రహ్మచారికి అడిగినదే తడవుగా దీక్ష ఇవ్వటానికి అంగీకరించారు.

ఈ దీక్షాకార్యక్రమం ఎంతో విశిష్ట మయింది. అది చూడటానికి అనేక ప్రాంతాల నుండి ఎందరో భక్తులు వస్తారు. వచ్చినవారికి అన్ని ఏర్పాట్లు చేయవలసి వుంటుంది. ఇతర ఖర్చులు గూడా ఎన్నో వుంటాయి. ఆ వ్యయం ఎవరు భరించాలి? అనే సమస్య వచ్చింది.

ఆనందమోహన్‌కు బహుకాలంనుండీ ఆర్థికసహకారం గుంటూరు వాస్తవ్యులు శ్రీ చక్కా సుబ్బారావుగారు అందజేస్తూ వుండినారు కదా! అలాగే మద్రాసు వాస్తవ్యులు శ్రీ పసుమర్తి కన్నయ్యశెట్టిగారు, శ్రీ పొన్నేరి శ్రీరాములుగారు గూడా శ్రీవారికి ముఖ్యభక్తులు. ధర్మకార్యాలకు ధనం వ్యయించాలనే ఆసక్తి కలవారు. అందరూ సంపన్నులే. దీక్షాకార్యక్రమవ్యయాన్ని గురించి శ్రీగురుదేవులు పై ముగ్గురికీ లేఖలు వ్రాయించారు.

ఉత్తరాలు అందిన తక్షణమే ముగ్గురూ శ్రీవారికి జవాబులు వ్రాస్తూ ఆమొత్తం వ్యయం భరించడానికి తాము ఒక్కొక్కరూ సిద్ధంగా వున్నామని తెలియజేశారు. శ్రీగురుదేవులు కార్యక్రమాని కయ్యే వ్యయం భరించుకొనే సదవకాశాన్ని శ్రీచక్కా సుబ్బారావుగారికే అనుగ్రహించారు.

స్వస్తిశ్రీ సర్వజిన్నామ సంవత్సర ఆషాఢ శుద్ధ - ఏకాదశి - ఆదివారానికి సరియయిన 29-6-1947 నుండి 3-7-47 గురువారం వరకూ పంచాహ్నిక విధానంతో ఆనందమోహన బ్రహ్మచారికి వ్యాసాశ్రమంలోనే సన్న్యాసదీక్షాప్రదానం చేసేటట్లు నిర్ణయం జరిగింది.

తల్లిగారి అనుమతి లేనిదే సన్న్యాసం స్వీకరించడానికి వీలుకాదు. అందువల్ల ఆనందమోహనుని తల్లిదండ్రులకు ఈ విషయమై లేఖ వెళ్లింది. ఉత్తరం అందగానే తల్లిదండ్రులే కాక తక్కిన ముఖ్యబంధువులు, మిత్రులుకూడా ఆశ్రమం చేరుకున్నారు.

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీకృష్ణానందగిరి స్వాములవారు గురుదేవుల ఆహ్వానంమేరకు కార్యక్రమంలో ఆచార్యత్వం వహించడానికి తమ సహచరులు శ్రీ గోపాలానంద స్వాములవారితో సహా కాశినుండి విచ్చేశారు. శ్రీ నరసయ్యశాస్త్రి గారు పురోహితులుగా బాధ్యత స్వీకరించారు. సనాతన వైదిక పద్ధతి ననుసరించి దీక్షాప్రదానానికి సంబంధించిన కార్యక్రమాలన్నీ ఏర్పాటయ్యాయి. ఈ విషయం తెలిసిన ఆశ్రమభక్తులు, సాధువులు అనేకులు వివిధప్రాంతాలనుండి ఆశ్రమానికి వచ్చారు.

మొదటి దినం ఆషాఢ శుద్ధ ఏకాదశి. పరివ్రాజకులు చాతుర్మాస్యవ్రతం ఆరంభించే దినమది. హిందువులు ఆరోజును పర్వదినంగా భావిస్తారు. నాటి బ్రహ్మ ముహూర్తంలో ఆనందమోహన బ్రహ్మచారి గురుదేవుల అనుజ్ఞతో పాదచారిగా శ్రీకాళహస్తికి తీర్థయాత్రకై బయలుదేరాడు. పెక్కుమంది భక్తులు, సాధువులు భగవన్నామసంకీర్తనం చేస్తూ ఆయన ననుగమించారు. పవిత్ర సువర్ణముఖీ నదిలో స్నానంచేసి శ్రీజ్ఞానప్రసూనాంబాసమేత శ్రీకాళహస్తీశ్వరస్వామిని అందరూ సందర్శించారు. నాటి సాయంకాలం వరకూ ఆ పుణ్యక్షేత్రంలోనే ఉండిపోయారు. ఆ రాత్రికి తిరిగి అందరూ వ్యాసాశ్రమం చేరుకున్నారు. తీర్థయాత్ర అనే ప్రథమఘట్టం అలా ముగిసింది.

## మాతృదేవి అనుమతి

రెండవనాటి ఉదయం తొమ్మిదిన్నర గంటలకు శ్రీ గురుదేవులు, ఆచార్యులు, సాధువులు, సన్న్యాసులు, పండితులు, భక్తులు, ఆశ్రమవిద్యార్థులు — అందరూ దీక్షా ప్రధాన వేదికవద్ద సమావేశ మయ్యారు. ఆనందమోహన బ్రహ్మచారి సభాసదుల కందరికీ ప్రదక్షిణ నమస్కారం చేశాడు. తరువాత సభమధ్యలో నిలిచివున్న మాతృశ్రీ సుశీలాదేవిగారికి సాష్టాంగవందనం చేశాడు. పిదప ఆమెను ఇలా ప్రార్థించాడు —

" మాతస్సన్న్యాస మిచ్ఛామి
దేహ్యనుజ్ఞాం శుభాంహి మే ।
సన్న్యాసేనైవ నిర్వాణ
మితి వేదాంతనిశ్చయః ॥

తల్లీ! సన్న్యాసం స్వీకరించ గోరుతున్నాను. శుభప్రదమైన మీ అనుమతి



ప్రసాదించండి! సన్న్యాసం వల్లనే నిర్వాణం సిద్ధిస్తుందని వేదాంత నిర్ణయం."

అప్పుడు తల్లి తన అంగీకారాన్ని ఇలా తెలిపింది —

" సాధు వత్స! త్వయా ప్రోక్తం
యథేచ్ఛసి తథా కురు ।
యత స్సన్న్యసనా త్తాత !
సఫలం జన్మ మామకమ్ ॥

పితరం మాం చ లోకాంశ్చ
స్వాత్మానం వంశమేవ చ ।
పితౄన్ దేవాంస్తథా సర్వాన్
ఉద్ధర! త్వం గుణాంబుధే! ॥

వత్సా! మంచిమాట చెప్పావు. నీ యిష్టప్రకారం చేసుకో. నీవు సన్న్యసిస్తే నా జన్మ సఫలమవుతుంది కదా! ఓ గుణసముద్రుడా! తండ్రినీ, నన్నూ, లోకాలనూ, నిన్నూ, మన వంశాన్నీ, పితరులనూ, దేవతలనూ - అందరినీ ఉద్ధరించు".

ఇలా చెప్పి ఆ పుణ్యాత్మురాలు భక్తులను చూస్తూ "పరిశుద్ధాత్మ స్వరూపులారా! నా పుత్రుడు ఆనందమోహన్ సన్న్యాసం స్వీకరింపగోరి నా అనుమతి కోరాడు. నేనిప్పుడు హృదయపూర్వకంగా ఆనందంతో అనుమతిస్తున్నాను. నేను పంద్రెండు సంవత్సరముల క్రిందటనే నాకుమారుణ్ణి లోకహితార్థమై గురుదేవుల సన్నిధికి పంపివేశాను. ఇప్పుడు సన్న్యాస స్వీకారానికై మళ్లీ నా అనుమతి కోరుతున్నారు. కాబట్టి నేను హృదయపూర్వకంగా నా సమ్మతిని ప్రకటిస్తున్నాను. శ్రీ గురుదేవుల ఆశీర్వచన ప్రభావంతో పిల్లవాడు సద్గుణసంపన్నుడై, ధ్యాననిష్ఠుడై, తపస్వియై లోకోపకారము చేయుగాక!" అని తెలిపింది.

మాతృదేవి సమ్మతితో సంతోషించిన ఆనందమోహన్ ప్రాయశ్చిత్తాది విధులను యథావిధిగా నిర్వర్తించాడు. మూడవ దినం దేవతాపూజ, శ్రాద్ధాదికార్యాలు జరిపి ఋణవిముక్తు డయ్యాడు. నాల్గవ దినం ఉపవాసం, మంత్రజపం, మౌనం, హోమం ఇత్యాది విధులు నిర్వర్తింపబడ్డాయి. ఈ విధంగా కర్మకాండ పూర్తి అయింది.

ఐదవనాటి బ్రహ్మముహూర్తంలో తదితర కార్యక్రమాలు ప్రారంభ మయ్యాయి. విరజాహోమం జరిగింది. పిమ్మట ఆశ్రమానికి తూర్పువైపున వుండే తామరకొలనుకు వెళ్లి బొడ్డులోతు నీళ్లలో ప్రాఙ్ముఖుడై నిలబడి ఆనంద మోహన్ ప్రణవమయ పరమాత్మ ధ్యానం చేశాడు. "సన్న్యస్తం మయా" అని మూడుసార్లు మంద మధ్యమోత్తమ స్వరాలతో ఉచ్చరించి పూర్ణజలాంజలి సమర్పించాడు. తరువాత గురుదేవు డిచ్చిన కాషాయవస్త్రాలు ధరించి దండకమండలాలు స్వీకరించాడు.

కమండలం ఇస్తున్నప్పుడు "ఈ కమండలం మాగురుదేవులు మాకు స్వయంగా ఇచ్చినది. ఇది మీకు ఇప్పుడు ఇస్తున్నాము" అని చెప్పి శ్రీవారు ఆ కమండలం ప్రాముఖ్యాన్ని గుర్తింపజేశారు. తర్వాత నూతన సన్న్యాసి గురుదేవులకు సాష్టాంగ ప్రణామం చేశాడు.

## నామకరణం

ఆపై గిరిసంప్రదాయానుసారంగా శ్రీవారు శిష్యునికి 'విద్యాప్రకాశానందగిరి' అని నామకరణం చేసి ఉపదేశ ప్రబోధాలకు అధికార మిచ్చారు.

గురుదేవులు తమకు కావించిన నామకరణాన్ని స్మరించుకొని శ్రీ విద్యా ప్రకాశానంద స్వాములవారు తరువాతి కాలంలో చెప్పిన ఈ క్రింది మాటలు ఇక్కడ గమనింపదగి వున్నాయి.

"అది సర్వజిన్నామ సంవత్సరము. ఆషాఢ శుద్ధ ఏకాదశీ పవిత్రదినము. గురుదేవులగు శ్రీ మహర్షి మలయాళస్వాములవారి ద్వారా ఈ యుపాధి సన్న్యాసాశ్రమము స్వీకరించిన సుముహూర్తము. ఆ క్రిందటి రోజున శ్రీస్వాములవారు ఏకాంతమునకు పిలిపించి "సన్న్యాసక్రతువు సమీపించుచున్నది. పూర్వాశ్రమము నందలి పేరు తొలగించి నూతన నామధేయ మొసంగవలసి యున్నది. మీకు ఏ పేరు ఇష్టమో తెలియజేయుడు" అని ప్రశ్నించిరి. అత్తఱి ఒకటి, రెండు పేర్లు నేను సూచించితిని. కాని శ్రీవారు ఇష్టపడలేదు. "బ్రహ్మవిద్యను లోకములో బాగుగ ప్రచారము చేయవలెను. ఈ నా ఉద్దేశము మీకు సదా జ్ఞాపక ముండుటకొరకై 'విద్యాప్రకాశానంద' అని మీకు పేరు పెట్ట దలచినాను" అని శ్రీవారు సెలవిచ్చిరి. ఆనాడు వాత్సల్యపూరిత హృదయులై కరుణతో శ్రీవారు పలికిన పలుకులు తలచు స్మృతిపథమునకు వచ్చుచు కర్తవ్యమును సూచించుచు అధ్యాత్మవిద్యాప్రచారమును



గూర్చిన భావములను మనంబున ఉద్దీపింపజేయుచుండెను."

(శ్రీ మలయాళమహర్షి - 52, 53)

ఈ దీక్షా ప్రదానదృశ్యం చూచిన భక్తు లందరూ ఆనందబాష్పాలు రాల్చారు. శాస్త్రవిధిని అనుసరించి తల్లి తప్ప గురుదేవులు, తండ్రి శ్రీరామస్వామిగారు, తదితర భక్తులు విద్యాప్రకాశానంద స్వామికి ప్రణమిల్లారు. ఆ నూతనయతి గురుదేవులకు పాదపూజ కావించి సాష్టాంగప్రణామం చేశారు.

భిక్షార్థి అయిన విద్యాప్రకాశానందులకు ఆశ్రమంలో నివసిస్తూ వుండిన మాతృశ్రీ అన్నపూర్ణమ్మగారు ప్రథమ భిక్ష సమర్పించారు. ఈ భిక్షాస్వీకరణ సమయంలో గురుదేవులు కావించిన ఉపదేశాన్ని స్మరిస్తూ తరువాతికాలంలో శ్రీ విద్యాప్రకాశానందులు ఇలా అన్నారు —

"అది 1947వ సంవత్సరము. శ్రీవారు నాకు సన్న్యాసదీక్ష ఇచ్చిన సందర్భమది. దీక్షాకార్యక్రమము ఐదురోజులు శాస్త్రీయముగ జరిగినది. చివరి రోజున సన్న్యాసగ్రహీత భిక్షాటనము చేసి ఆ అన్నమును గురువుగారికి సమర్పించి, ఒకింత తానుగూడా భుజించవలెను. అది నియమము. అట్లే నేను భిక్షాటనముచేసి జోలియందున్న అన్నమును, కూరలను, భక్ష్యములను శ్రీవారికి వడ్డించితిని. తదుపరి ఒకింత నేను కూడ వడ్డించుకొంటిని. భోజనమైన తదుపరి నావిస్తరి యందు భక్ష్యపదార్థ మొకింత విడిచిపెట్టబడి యుండుటను శ్రీవారు గమనించిరి. అనంతరము శ్రీవారు నన్ను పిలిచి "భోజనము చేయునప్పుడు వడ్డించిన ఏ పదార్థమును గూడ ఒకింతైనను పారవేయగూడదు. వడ్డించువారికి ముందుగనే చెప్పి మితముగా పెట్టించుకొనవలెను." అప్పటి నుండి, ఆహారవిషయమై కడు జాగరూకుడనై యుంటిని."

గీతా పారాయణంతోనూ, సంప్రదాయ పరిజ్ఞాన సంకేతమైన యోగపట్ట విధితోనూ సన్న్యాస దీక్షావిధానము పరిసమాప్త మయింది. విజయవాడ, మద్రాసు, బెంగుళూరు, కడప, ప్రొద్దుటూరు, నెల్లూరు మొదలైన వివిధప్రాంతాలనుండి వచ్చిన ముఖ్యభక్తులు ఈ కార్యక్రమాన్ని చూచి శ్రీ గురుదేవుల ప్రబోధామృతాన్ని ఆస్వాదించి సంతుష్టు లయ్యారు.

ఆనందమోహనులు శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములుగా రూపొందారు. వ్యాసాశ్రమంలో గురుకులవాసం చేసే సమయంలోనే వారి కీర్తి ప్రతిష్ఠలు

పలుప్రాంతాలలో వ్యాపించాయి. బ్రహ్మనిష్ఠలోనే కాక బ్రహ్మతత్త్వాన్ని ప్రజలకు బోధించడంలోకూడా వారు నిపుణు లన్న విషయం భక్తులు గ్రహించారు. వారిని తమ ప్రాంతాలకు ఆహ్వానించి అక్కడి ప్రజలకు వారి ప్రబోధం వినే అవకాశం కలిగించాలని అనేకులు సంకల్పించారు.

శ్రీ మలయాళ సద్గురుస్వాములవారి శిష్యులలో ప్రముఖులైన శ్రీ నామా యెరుకలయ్యగారు ప్రొద్దుటూరులో 1947లో శ్రీకృష్ణ గీతాశ్రమం అన్న పేరుతో ఒక ఆశ్రమం ప్రారంభించారు. 1948 జూన్ నెలలో ఆశ్రమ వార్షికోత్సవం తలపెట్టారు. వార్షికోత్సవసభకు అధ్యక్షత వహించడానికై శ్రీవిద్యాప్రకాశానంద స్వాములవారిని ఆహ్వానించారు. వారి ఆహ్వానం మేరకు స్వామీజీ ఆకార్యక్రమానికి హాజరయ్యారు.

అప్పుడు వారికి శ్రీకృష్ణ గీతాశ్రమం తరపున శ్రీనామా యెరుకలయ్యగారు, వారి అనుయాయులూ 9-6-1948వ తేదీన ఈ క్రింది స్వాగత పత్రం సమర్పించారు. ఆ తరువాతి కాలములో శ్రీస్వాములవా రందుకొన్న వందల కొలది స్వాగతపత్రా లున్నాయి. అయినా ఇది మొదటిది కాబట్టి గణనీయమై వున్నది.

## స్వాగత పత్రము

“ఓ త్యాగమూర్తీ!

శ్రీ కృష్ణచైతన్యుని ఉన్మత్తప్రేమ, శ్రీరామతీర్థుని ఉదాత్తజ్ఞానము, శ్రీ వివేకానందుని మహోజ్జ్వల కర్మణ్యత్వము తీర్థరాజమందు త్రివేణి వలె తమయం దొకటై యొప్పెడిని. పతిత మానవ పంకప్రక్షాళన సమర్థమగు మీ పుణ్యవిగ్రహమునకు మా అనంత ధన్యవాదములు.

ఓ పావన శుభచరితా!

పాశ్చాత్యభాషా శిక్షణాలయములందు పట్టభద్రుడ వయ్యు పరమ గురుచరణ సన్నిధి యందు పదిరెండువత్సరములు పరిచర్యాశుశ్రూషల గడిపి శ్రవణ మనన నిదిధ్యాసనములచే ఆర్జించిన విజ్ఞానధనమును భక్తజిజ్ఞాసువులకు పంచియిడ పాటుపడు మీ పుణ్యసమాగమము మాకెల్లగ కహోభాగ్యము.

ఓ వ్యాసాశ్రమ తపోనిష్ఠాగరిష్ఠా!

బాహ్య ప్రకృతికి దూరమై నితాంత ఏకాంతభూమిని నిరంతర తపస్సాధన పూతమగు మీ చరణస్పర్శను, మీ ఉపదేశశ్రవణమును తొలుదొలుతనే పొంది మా పరిసరవాయుమండల మపూర్వధన్యత నొప్పారెడిని.



ఓ శాంతి సుధామయూఖా!

ఆంధ్రావనికి మీరొక విజ్ఞాన జ్యోతిస్తంభమవు. పథభ్రష్టులకు దిక్సూచీ యంత్రమవు. మీ పుణ్యగాథ ఆంధ్రమహాపురుష చరిత్ర యందొక విలక్షణ నూతనాధ్యాయము.

ఓ విజ్ఞానమూర్తీ!

శ్రీ రామకృష్ణ వివేకానంద రామతీర్థ మలయాళ మౌనీంద్రుల ఉపదేశప్రవాహముల ఆంధ్రభూమి అంచుల తొణికిసలాడింప తామత్యంత సమర్థమూర్తులు.

ఓ పరిపూర్ణ విద్యాప్రకాశానంద స్వామీజీ!

అపార తత్త్వజ్ఞానసముద్రుడగు శ్రీ సద్గురు మలయాళస్వాములవారికడ గొన్న విజ్ఞానానుభూతి సుధాధారలచే ఆంధ్రావని నాప్లావితము జేయ అవతరించిన అభినవ పర్జన్యదేవా! ఇవే మా సాదర వినమ్ర సుస్వాగతాంజలులు. ఆదరింపుడు! అనుగ్రహింపుడు!! ఆశీర్వదింపుడు !!!”

పైపత్రంలో భక్తులు స్వామిని ప్రశంసించిన తీరు గమనింపదగి వున్నది. వారి పవిత్రతనూ, తపోనిష్ఠనూ, విజ్ఞానాన్నీ, నిరుపమానమైన వాగ్ధాటినీ భక్తులు గుర్తించినా రనడానికి ఇది నిదర్శనం. మూడు రోజుల పాటు ఆ వార్షికోత్సవంలో స్వామి కావించిన ప్రబోధం భక్తులనందరినీ ఆనందాంబుధిలో ఓలలాడించింది. మేధావులైన వారు భవిష్యత్తులో స్వామి ఒక మహోజ్జ్వల ప్రబోధకులుగా విలసిల్లగలరని ఆనాడే గ్రహించారు.

ఈ సందర్భంలోనే భారతీయ సంస్కృతికి మూలస్తంభమైన సంస్కృత భాషను బోధించే విద్యాలయానికి స్వామీజీ శ్రీకృష్ణ గీతాశ్రమంలో ప్రారంభోత్సవం చేశారు. ఆ విద్యాలయం శాఖోపశాఖలుగా పెరిగి నేడు రాయలసీమలో ఒక ఉన్నత సంస్కృత విద్యాకేంద్రంగా విరాజిల్లుతున్నది.

ప్రొద్దుటూరు ప్రజల హృదయాలలో ఆధ్యాత్మిక ప్రకాశమయమైన ఆనంద ముద్రవేసి స్వామి వ్యాసాశ్రమానికి తిరిగివచ్చారు. అనేక ప్రాంతాలనుండి ఆధ్యాత్మిక ప్రవచనాలు కావించవలసిందిగా వారికి ఆహ్వానాలు అందేవి. అవకాశాన్ని

బట్టి వారు భక్తుల అభీష్టాన్ని సఫలం చేసేవారు.

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు విజయవాడలోని కృష్ణలంకలో 16-7-1948 నుండి నాలుగు నెలల కాలం తమ ప్రథమ చాతుర్మాస్య మహావ్రతం నిర్వహించారు. శ్రీ తూనుగుంట్ల రామస్వామిగారే ఈ కార్యక్రమానికి ముఖ్యకార్యకర్తలుగా వ్యవహరించారు. ఆర్షధర్మప్రచార లక్ష్యంతో అపూర్వమైన పద్ధతిలో సాగిన ఆచాతుర్మాస్యంలో శ్రీవిద్యాప్రకాశానందస్వామి గూడా పాల్గొన్నారు.

తరువాత 1949 మార్చిలో చిత్తూరులో ఒక సప్తాహకార్యక్రమాన్ని నిర్వహించి భక్తులకు దివ్యప్రబోధాలు చేశారు.







# నవమ ప్రకరణం

## శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపన

వ్యాసాశ్రమం సుప్రతిష్ఠితమైన తర్వాత దాని కనుబంధంగా ఆంధ్రదేశంలో అనేకాశ్రమాలు వెలశాయి. భక్తుల ప్రార్థనను మన్నించి శ్రీ మలయాళస్వాములవారు తామే స్వయంగా అలాంటి కొన్ని ఆశ్రమాలను స్థాపించడం జరిగింది. ఆ స్థాపనల ఉద్దేశం ఆర్షధర్మపరిరక్షణమే.

ఆశ్రమాలను స్థాపించవలసిన ఆవశ్యకతను గూర్చి శ్రీసద్గురుస్వాములవారు ప్రకటించిన ఈ క్రింది అభిప్రాయం ఇక్కడ స్మరణీయం ---

"సోదరులారా! సోదరీమణులారా! మనకు ప్రస్తుతం గుడిగోపురాదు లత్యవసరములు గావు. విరక్తులైన స్త్రీపురుషు లెందరో ఇచట జీవనోపాయము లేక వేఱుప్రాంతములకు వెళ్లుచున్నారు. అట్టివారి కిచ్చుటనే బ్రహ్మనిష్ఠ కనుకూలము లగు వసతు లేర్పరచవలసి యున్నది. లోకసేవాతత్పరులైన మహాత్ముల నాహ్వానించి జనులందరికి ఆత్మప్రబోధము గలుగజేయవలెను. బ్రహ్మనిష్ఠాపరులకు, బ్రహ్మచారులకు సముచితములగు ఆశ్రమము లిచ్చుట లేకపోవుటచే ఇక్కడి పుణ్యపురుషులు కాశి, హరిద్వారము, హృషీకేశము మున్నగు దూరప్రాంతములకు బోయి తలదాచుకొనుచున్నారు. అచ్చటి భాష తెలియక, ఆహారము సరిపడక శైత్యబాధచే పీడితులై యెందరో కష్టపడుచున్నారు. మన ప్రాంత మింత అదృష్టహీనమా? ఉత్తరదేశస్థులు తమ ధనమును సాధుసజ్జనులకు వినియోగపఱచి ధన్యు లగుచున్నారు. దక్షిణదేశమున గుడిగోపురములకు చేసెడు ఖర్చు అపారమైనను దేవాలయములచే మనుజులు పొందవలసిన విద్యాజ్ఞానములు లోపించుచున్నవి. దేవాలయవ్యయములో కొంతవఱకైన బ్రహ్మనిష్ఠాపరుల కుపయోగపరచిన లోకమున కెంతో మేలు కలుగును. ఒక్కబ్రహ్మనిష్ఠుడు భవసాగరము దాటినచో ఇట్టి దేవాలయములు వేలకొలది కట్టింపగలడు." (శ్రీ మలయాళస్వామి జీవిత చరిత్ర - P 161 - 162)

మహోత్తమమైన ఈ భావనే వ్యాసాశ్రమ సంప్రదాయానికి చెందిన శిష్యులు, సాధువు లనేకులు వివిధప్రాంతాలలో అనేకాశ్రమాలను నిర్మించడానికి ప్రేరకమయింది.

బ్రహ్మనిష్ఠలో పరిణతి వహించడమేకాక ప్రబోధంలోకూడా ప్రముఖస్థానం పొందిన శ్రీవిద్యాప్రకాశానందస్వాములవారు తమ ప్రచారప్రబోధాలకు కేంద్రంగా స్వయంగా ఒక ఆశ్రమం నిర్మింపదలచుకొన్నారు.

ఈ సంకల్పం కలగడానికి కొంతకాలం ముందు స్వాములవారు శ్రీకాళహస్తిలో కొన్ని దినాలు ఉండడం తటస్థించింది. సువర్ణముఖీతీరంలో నెలకొన్న ఆ క్షేత్రం వారి నెంతగానో ఆకర్షించింది. ఆంధ్రదేశంలో పలుప్రాంతాలనుండి ఆశ్రమాన్ని ఆయాప్రాంతాలలో స్థాపించవలసిందిగా వారికి ఆహ్వానాలు అందాయి. అయినా వారు శ్రీకాళహస్తినే ఆశ్రమస్థాపన కనువైన ప్రదేశంగా ఎన్నుకొన్నారు. స్వర్ణ ముఖీతీరంలో ఉన్న ఒక తోటను తీసుకొని అక్కడ ఆశ్రమం నిర్మించాలని వారు నిశ్చయించుకొన్నారు. శ్రీ మాంబాకం సదాశివయ్యగారు, శ్రీ నూతలపాటి శేషయ్యనాయుడుగారు మొదలైనవారు ఈవిషయంలో స్వాములవారికి తోడ్పడ్డారు.

గోదావరిజిల్లాకు చెందినవారూ, తమమిత్రులూ అయిన రాజులను కలుసుకొని శ్రీశేషయ్యనాయుడుగారు వారి అధీనంలో ఉన్న ఒక తోటను విక్రయానికి సిద్ధం చేశారు. శ్రీ తూనుగుంట్ల రామస్వామిగారు అందు కవసరమైన పైకం పంపారు. స్వాములవారి పేరట తోట కొనడమయింది. తోటలో ధ్యానమందిరనిర్మాణంతో ఆశ్రమనిర్మాణం ప్రారంభమయింది. ఉపన్యాసాలలో తమకు సత్కారంగా వచ్చిన ధనం వెచ్చించి స్వామి ఈ ధ్యానమందిరం నిర్మించారు.

తరువాత బెంగుళూరుకు చెందిన భక్తులు శ్రీ యాదాళం నంజుండయ్యగారు వారి తండ్రిగారైన శ్రీ సుబ్బయ్యశ్రేష్ఠిగారిపేరుతో స్వాములవారి నివాసాని కనుగుణంగా అభయకుటీరమన్న పేరుతో ఒక చక్కని మందిరం నిర్మింపజేశారు.

## ఆశ్రమ ప్రారంభోత్సవం

పై అభయకుటీరప్రవేశమే ఆశ్రమ ప్రారంభోత్సవంగా రూపొందింది. విరోధి నామసంవత్సర మాఘ శుద్ధ విదియ శుక్రవారానికి సరి అయిన 20-1-1950వ తేదీనాడు ఆశ్రమ ప్రారంభోత్సవకార్యక్రమం నిశ్చయమైంది.

ఈ కార్యక్రమానికి శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ తమ గురుదేవులు శ్రీ మలయాళసద్గురుస్వాములవారిని అధ్వర్యవం వహించవలసిందిగా ప్రార్థించి ఆహ్వా నించారు. శ్రీ సద్గురుస్వాములవారు వారి ఆహ్వానం అంగీకరించి శ్రీకాళహస్తికి విచ్చేసి ప్రవేశోత్సవానికి అధ్వర్యవం వహించారు.



శుక్రవారం సూర్యోదయాత్పూర్వం 4 గంటల నుండి 5-30 గంటలలోగా ధనుర్లగ్నంలో ధ్యానమందిర సంప్రోక్షణం జరిగింది. వెంకటగిరి, నంద్యాల, బెంగు ళూరు, చిత్తూరు, పుంగనూరు, ప్రొద్దుటూరు, మద్రాసు మొదలైన నానా ప్రదేశాలనుండి చాలామంది భక్తులు ఈ కార్యక్రమానికి వచ్చారు. పావన సువర్ణముఖీనదిలో స్నానంచేసి భక్తజనులు ధ్యానమందిరంలో భగవద్గీత 18 అధ్యా యాలు పారాయణం చేశారు. పారాయణలో కొందరు మహిళలు కూడా పాల్గొన్నారు. శాస్త్రవిధి ప్రకారం హోమార్చనాదులు జరిగాయి. శ్రీ సద్గురుదే వుల ఛాయాచిత్రం ధ్యానమందిరంలో ప్రతిష్ఠింపబడింది. పిమ్మట అక్కడ జరిగిన సమావేశంలో భక్తులు, పురజనులు అత్యధికసంఖ్యలో పాల్గొన్నారు. ఆశ్రమానికి శ్రీశుకబ్రహ్మాశ్రమం అని నామకరణం జరిగింది.

ఈ సందర్భంలో భక్తులు శ్రీ సద్గురుస్వాములవారికి ఈ క్రింది స్వాగత సన్మానపత్రం సమర్పించారు —

"శ్రీ సద్గురుదేవా!

పురాణప్రసిద్ధిగాంచిన తిరుపతి-శ్రీకాళహస్తి మహాక్షేత్రముల మధ్య శ్రీవేదవ్యా సమునీంద్రుని పేరుతో దివ్యాశ్రమమును స్థాపించి జ్ఞానజ్యోతి కిరణప్రసారముచే జనుల అజ్ఞానతిమిరమును పారద్రోలినట్టి పావనమూర్తీ! స్వాగతము! సుస్వాగ తము!!

మహర్షిసత్తమా!

వేదవేత్తయై సాధుమూర్తియైన పరివ్రాజకుని పాదము గయాక్షేత్రమందలి విష్ణుపాదముతో తుల్యమని పెద్దలు పలుకుచున్నారు. అట్టి మహావిష్ణుస్వరూపులగు తమయొక్క దివ్యపాదారవిందములు నేడు ఈ శుకబ్రహ్మాశ్రమమును పునీత మొనర్చుటయే కాక ఇచ్చట సమావేశమైన సమస్త భక్తకోటికిని గయాతీర్థఫలిత మును ప్రసాదించి పావన మొనర్చిన వనుట తథ్యము!

అజ్ఞానతమోభాస్కరా!

దక్షిణకాశి యని ప్రసిద్ధికెక్కి పంచభూతలింగములలో ఒకటగు వాయులింగము నకు స్థానభూతమైనట్టి ఈ పవిత్ర శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రమున, ఉత్తరవాహినిగ ప్రవహించుచున్న సువర్ణముఖీ పావన నదీతీరమున పురాణప్రసిద్ధమై వెలయుచున్న శ్రీశుకతీర్థమునకు సమీపమున శ్రీకాళహస్తీశ్వరుడు వేంచేయు బాటయందు

నెలకొనియున్న ఈ శుకబ్రహ్మాశ్రమమున, ఉత్తరాయణమున, అందును పవిత్రమాఘ సమయమున, అందును శుక్లపక్షమున, అందును శుభసమయమగు శుక్రవారమున దివ్యమూర్తులైన మీయొక్క దర్శన-సంభాషణ-వందనాచరణ భాగ్యము నొందిన మేము కృతార్థులము, కృతకృత్యులము, ధన్యులము!!

కరుణామయా! పరమపావన పుణ్యమూర్తీ!

ఈ శుకబ్రహ్మాశ్రమ ప్రారంభోత్సవ శుభసమయమున తమ్ము సేవించుటకై యేతెంచిన మాబోటి భక్తబృందమునకును, తదితరులకును, చరాచరప్రాణికోటి కిని భక్తిజ్ఞానవైరాగ్యములు కలుగునట్లు ఆశీర్వదింపుడు! శుభసందేశ మొసంగి అనుగ్రహింపుడు."

పిమ్మట శ్రీసద్గురుదేవులు గీతలోని ధ్యానయోగాన్ని గూర్చి ఉత్తేజకమైన ప్రవ చనం కావించారు. శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ శ్రీగురుదేవులకు యథావిధిగా పాదపూజ నిర్వర్తించారు. యథోచిత సత్కారంతో శ్రీవారిని సమ్మానించారు.

నాటి మధ్యాహ్నం అక్కడ చేరిన సమస్త భక్తప్రజానీకానికీ అన్న సమారాధనం జర్గింది. అన్నదోషనివారణకై అన్నసూక్తపారాయణం, పురుషోత్తమప్రాప్తియోగ పారాయణం నిర్వర్తింపబడ్డాయి.

సాయంసమయంలో బహిరంగ సమావేశం ఏర్పాటయింది. పూజ్య గురుదే వులు శ్రీమలయాళస్వాములవారు తమ ప్రారంభోపన్యాసంలో ఇలా ప్రవచించారు —

"ప్రాచీనకాలంలో మన భారతపుణ్యభూమిపై ఇలాంటి పవిత్రాశ్రమాలు ఎన్నో ఉండేవి. మహర్షులు జనసంచారంలేని ప్రశాంత వాతావరణంలో ఆశ్రమాలు నిర్మించారు. అవి బ్రహ్మవిద్యాప్రచారానికి కేంద్రాలుగా వుండేవి. ఆశ్రమస్థాప కులు లోకోద్ధరణకై నిరంతరకృషి కొనసాగించేవారు. ఆధునికకాలంలో నాస్తికత్వం పెరిగిపోయింది. ప్రజలు విషయసుఖసంపాదనమే పరమలక్ష్యంగా భావిస్తున్నారు. అందుకే ఎన్నో అకృత్యాలు చేస్తున్నారు. అందువల్ల ప్రపంచం కల్లోలిత మవు తున్నది. ఈ స్థితిని చక్కదిద్దడానికీ, ఆస్తికత్వాన్ని తిరిగి నెలకొల్పడానికీ, ప్రపంచానికి శాశ్వతసుఖశాంతులు కలిగించడానికీ బ్రహ్మనిష్ఠులైన యతీశ్వరులు ఇలాంటి దివ్యాశ్రమాలను నెలకొల్పాలి."

ఉపనిషద్విహార వ్యవస్థాపకులు శ్రీ స్వామి రాజేశ్వరానందగారు దృగ్దృశ్యవిచా



రణద్వారా తురీయవస్తువును సాధించే విధానాన్ని గురించి సభలో రమణీయంగా ఉపన్యసించారు.

తర్వాత ఆ సమావేశంలో మాట్లాడుతూ శ్రీవిద్యాప్రకాశానంద స్వామీజీ ఇలా అన్నారు —

## ఆశ్రమ నామౌచిత్యం

"శ్రీ సద్గురుదేవుల ఆశీర్వాదంతో శ్రీవారి అమృతహస్తాలతో ప్రారంభమైన ఈ ఆశ్రమానికి 'శ్రీ శుకబ్రహ్మాశ్రమం' అని నామకరణం చేశాము. శ్రీ శుక బ్రహ్మ చాలా పవిత్రుడు, నిష్కలంక చరిత్రుడు, అస్ఖలిత బ్రహ్మచారి, పుట్టుకతోనే మాయారహితుడు, బ్రహ్మపదవిని పొందినవాడు. పూర్వం ఈ పవిత్ర ప్రదేశంలో శుకుడు తపస్సు చేసినట్లు పురాణాలు చెబుతున్నాయి. అందుకే శ్రీకాళహస్తిని 'శుకబ్రహ్మతపోవన'మని కూడా అంటారు. అలాంటి శుకమహర్షిని ఆదర్శంగా గ్రహించి ఈ సంస్థ పురోగమించాలని ఆయనపేరు ఈ ఆశ్రమానికి పెట్టడం జరిగింది. మన గురుదేవుల ఆశ్రమం వ్యాసమహర్షి పేరుతో వున్నది కాబట్టి ఇది శుకబ్రహ్మ పేరుతో వెలుగొందడం ఎంతైనా వుచితం. ఈ శ్రీకాళహస్తి క్షేత్రం చాలా మహిమ గలది. రోమశుడు, భరద్వాజుడు, మార్కండేయుడు, అగ స్త్యుడు, నారదుడు మొదలైన మహర్షులు ఈక్షేత్రంలో పూర్వం తపస్సు చేశారు. వారి పేర్లతో ఈనాటికీ ఇక్కడ తీర్థాలున్నాయి. ఆ ఋషిసంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇక్కడ ఈ ఉత్తరాయణపుణ్యకాలంలో ఆశ్రమప్రతిష్ఠ జరగడం ముదావహం. మన గురుదేవులు విశాలాంధ్రదేశంలో గడచిన 25 సంవత్సరాల నుండి ప్రజల నైతిక-ఆధ్యాత్మిక-ఔన్నత్యానికై అఖండమైన కృషి కావిస్తున్నారు. ఆ కృషికి తోడ్పడడానికే ఈ ఆశ్రమం ప్రారంభించడం జరిగింది. మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుషసంశ్రయం — ఈ మూడూ కల్గిన జీవులు మాత్రమే కృతార్థులు కాగలరు. ఈ కృతార్థత్వాన్ని సంపాదించడానికి అవసరమైన సహకారాన్ని ప్రజలకు అందించడానికే ఇలాంటి ఆశ్రమాలు అవసరం."

శ్రీ సద్గురుస్వాములవారి అంత్యోపన్యాసంతోనూ, శుభాశీస్సులతోనూ కార్య క్రమం పరిసమాప్త మయింది. అనుకొన్నపని నిరాడంబరంగానూ, నిర్విఘ్నంగానూ జరిగినందుకు శ్రీవారితో సహా అందరూ ఆనందించారు.

ఆశ్రమస్థాపనానంతరం ఆ సంవత్సరమే మార్చినెలలో బంగారుపేటలో జరి

గిన సాప్తాహిక - ఆధ్యాత్మిక కార్యక్రమం శ్రీవిద్యాప్రకాశానందస్వాములవారిద్వారా నిర్వహింపబడింది.

తరువాత కాళంగీనదీతీరంలోని ఆళత్తూరు గ్రామానికి చెందిన శ్రీకృష్ణ భక్తాశ్రమంలో 11-5-1950 నుండి 31-5-1950 వరకూ ఓంకారసత్రయాగం జరిగింది. శ్రీమలయాళ సద్గురు స్వాములవారితోపాటు శ్రీవిద్యాప్రకాశానందులవారు, శ్రీ టి.యం.పి. మహదేవన్‌గారు, శ్రీ రాజేశ్వరానందస్వాములవారు, శ్రీ నారునాగనార్యులవారు, శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు మొదలైనవారు అందులో పాల్గొన్నారు.

శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ వ్యాసాశ్రమంలో వున్నప్పుడే నాటి ఆశ్రమ విద్యార్థులలో ఒకరైన శ్రీబ్రహ్మచారి గోపాల్ గారు వారితో చాలా సన్నిహితంగా మెలగే వారు. స్వామికి కావలసిన సేవ లందించేవారు. స్వామి శ్రీకాళహస్తిలో ఆశ్రమం ప్రారంభించినపుడు అయన కూడా స్వామిని అనుగమించారు. కార్యనిర్వహణ సమర్థుడుగా పేరొందిన శ్రీ బ్రహ్మచారి గోపాల్ ఆశ్రమ మేనేజరుగా ప్రారంభదశలో శ్రీశుకబ్రహ్మాశ్రమాభివృద్ధికి కావించిన కృషి ప్రశంసనీయ మైనది.

శ్రీ శేషయ్య, శ్రీమతి చిన్నమ్మ, శ్రీ రామచంద్రయ్య, శ్రీ పోలు రాఘవయ్య మొదలయినవారు అప్పుడు ఆశ్రమంలోనే నివసిస్తూ ఆశ్రమం అన్నివిధాలా అభివృద్ధి చెందడానికి సహాయపడ్డారు. ఆశ్రమపోషణకై స్వాములవారికి పరిచితులైన గృహస్థుల యిండ్లలో భిక్షాపాత్రలు ఏర్పాటయ్యాయి. మీంజూరు, సుబ్బారెడ్డిపాళెం, అత్తిపట్టు, కొమరందోపు, రావిగుంటపాళెం, కొత్తగుంట, కొత్తపాళెం, నిడుమర్తి, అరవపాళెం, పాటిమిట్ట, కొలిగేపల్లి, కలవగుంట, చిల్లకూరు, వెల్లుపల్లి, నెలబల్లి, సూరమాల, కమ్మపల్లి వగైరా గ్రామాలలో భిక్షాపాత్రల ఏర్పాటు జరిగింది. అక్కడి గృహస్థభక్తులు నిత్యమూ తాము వంటచేసుకోబోయే ముందు పిడికెడు బియ్యం ఆ పాత్రలలో భగవదర్పితంగా సమర్పించేవారు. నెల కొకసారి ఆశ్రమస్థులు ఆ బియ్యం సేకరించుకొని ఆశ్రమానికి తీసుకుపోయేవారు. భక్తురాలు చిన్నమ్మగారు ఈ ఏర్పాట్లలో ప్రముఖ పాత్ర వహించారు. భవననిర్మాణకార్యక్రమాలను శ్రీ శేషయ్యగారు చూచుకొనేవారు. శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు బాధ్యతాయుతమైన పనులన్నీ నిర్వర్తించేవారు.



## శివలింగ ప్రతిష్ఠ

ఆశ్రమంలో గీతాపారాయణ ప్రవచనాదులకు ఒక ప్రార్థనామందిరం అవసరమయింది. నంద్యాలనుండి వచ్చిన శ్రీ సేగు వెంకటనారాయణ అనే భక్తుడు తమ తల్లి శ్రీమతి లక్ష్మమ్మగారి పేరుతో ఆమందిర నిర్మాణానికి అయ్యే కర్చంతా భరించి చక్కని మందిరం నిర్మింపజేశారు.

వికృతినామసంవత్సర మాఘశుద్ధ విదియ - గురువారానికి సరి అయిన 8-2-1951వ తేదీ తెల్లవారు జామున 3-4 గంటల మధ్య ధనుర్లగ్నంలో శివలింగ ప్రతిష్ఠ పై మందిరంలో శ్రీ మలయాళ సద్గురు స్వాములవారి అమృతహస్తాలతో జరిగింది. కాశీక్షేత్రంనుండి తెప్పించిన నర్మదేశ్వరలింగాన్ని ఈ సందర్భంలో ప్రతిష్ఠించారు. అనేక ప్రాంతాలనుండి భక్తులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

నాటి ఉదయం భగవద్గీతను పూర్తిగా పారాయణం చేశారు. తదనంతరం శ్రీ సద్గురు స్వాములవారు గీతాప్రవచనం కావించారు. నాటి సాయంకాలం ఆశ్రమప్రాంగణంలో బహిరంగ సమావేశం జరిగింది. శ్రీ సేగు వెంకటనారాయణశ్రేష్ఠిగారు శ్రీ సద్గురు స్వాములవారికి సన్మానపత్రం సమర్పించారు.

శ్రీ గురుదేవులు శ్రోతలకు చైతన్యం కలిగించే ధోరణిలో ఈ క్రిందివిధంగా అపూర్వ ప్రబోధం కావించారు —

"భక్తులారా! జిజ్ఞాసువులారా! సంసారబాధానివృత్తి విషయమై మీరెంత మాత్రమూ నిరాశ చెందవలసిన అవసరము లేదు. ఎంతో శ్రమకోర్చి ఇచ్చటికి విచ్చేయడ మెల్ల మీరందరూ ముముక్షువులూ, జిజ్ఞాసువులై వున్నారు. చిత్తశుద్ధిగల మీవంటివారు ఎట్టి పరిస్థితులలోనూ నిస్పృహ చెంద నక్కరలేదు.

(1) జిజ్ఞాసురపి యోగస్య
శబ్ద బ్రహ్మాతివర్తతే |

మోక్షోపాయం తెలుసుకోగోరినంత మాత్రాన కర్మలోకాన్ని దాటి పోగలరు.

(2) న హి కల్యాణకృత్ కశ్చిత్
దుర్గతిం తాత! గచ్ఛతి |

నాయనా! శుభమొనర్చినవాని కెన్నటికిని చేటు లేదు.

(3) కౌంతేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి ।

అర్జునా! నాభక్తున కెన్నటికినీ నాశములేదని బాహాటముగా ప్రతిజ్ఞచేసి చెప్పుము.

(4) స్వల్పమప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్ । 2-40

ఏ స్వల్పపుణ్యంచేసినా భయంకర సంసారం తరించగలరు.

ఈ ప్రకారంగా శ్రీకృష్ణభగవానుడు భక్తులకు అభయహస్తం చాచి వున్నాడు. ఇందులో నిరాశకు తావులేదు.

ఆకాశం మేఘావృతం కావడం రాబోయే వర్షపాతానికి చిహ్నం. తూర్పు దిశలో అరుణకాంతి దర్శనం కానున్న సూర్యోదయానికి నిదర్శనం. మీరందరూ జన్మమృత్యు దుఃఖవిమోచనాకాంక్షులై ఈ ఆశ్రమంలో జరిగే ఆత్మజ్ఞానప్రబోధం వినడానికి శ్రద్ధాసక్తులతో వచ్చారు. ఇది త్వరలో రానున్న మీ మోక్షానికి గుర్తు. మీ ఆత్మజిజ్ఞాస జ్ఞానోదయానికి దారి తీస్తుంది. జిజ్ఞాస లేనివారికి జ్ఞానం ఎలా సాధ్యం? సంకల్పం లేనివారికి ఎప్పుడైనా కార్యసిద్ధి జరిగిందా? మీ ఆత్మజిజ్ఞాస ప్రబలమూ, పటిష్ఠమూ, తీవ్రమూ అయ్యేకొలదీ మోక్షం మీకు దగ్గఱదగ్గఱగా వస్తుంది. తుదకు అది మీకు కరతలామలక మవుతుంది."

శ్రీ గురుదేవుల ప్రబోధం విన్న భక్తుల హృదయాలు ఆనందంతో పరవశించాయి.

## గుర్వష్టకం

ఈ సందర్భంలో గీర్వాణభాషలో తాము రచించిన గుర్వష్టకం అనే ఈ క్రింది అసంగానందాష్టకాన్ని శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు గురుదేవులకు సమర్పించారు.

" అఖండ ధామమండితం
సుభక్త కోటిసేవితమ్ ।
సదా ప్రసన్న మానసం
అసంగదేశికం భజే ॥



అఖండమైన ఆత్మతేజముచే అలంకరింపబడినవాడును, ఉత్తమ భక్తసముదాయముచే సేవింపబడువాడును, ఎల్లప్పుడు ప్రసన్నమైన మనస్సుగలవాడును, అగు శ్రీమదసంగానంద సద్గురువును భజించుచున్నాను. (శ్రీసద్గురుదేవుల సన్న్యాసదీక్షానామం శ్రీమదసంగానందగిరిస్వాములవారు)

అనంత సౌఖ్యదాయకం
విలీన దృశ్యమండలమ్ ।
సులబ్ధ దృక్స్వరూపకం
అసంగసద్గురుం భజే ॥ 2

ఆత్మానందము గలుగజేయువాడును, విలీనమైన దృశ్యమండలముగలవాడును, దృక్స్వరూపమగు పరబ్రహ్మమును లెస్సగ సాక్షాత్కరించుకొన్నవాడును అగు శ్రీమదసంగానంద సద్గురువును భజించుచున్నాను.

అఖర్వశక్తి దీపకం
అకుంఠిత ప్రభానిధిమ్ ।
జగత్తమః ప్రభంజకం
అసంగసద్గురుం భజే ॥ 3

అఖండమగు ఆధ్యాత్మిక శక్తి నుద్దీపింప జేయువాడును, అకుంఠితమగు జ్ఞానతేజమునకు నిలయమైనవాడును, జనుల అజ్ఞానమును పూర్ణముగ భేదించివైచువాడును, అగు శ్రీమదసంగానంద సద్గురువును భజించుచున్నాను.

సమస్తలోక పావనం
సుశిక్షణ ప్రదాయినమ్ ।
అనల్పదుఃఖ దూరకం
అసంగ దేశికం భజే ॥ 4

సర్వలోకమును పవిత్రమొనర్చువాడును, సాధకులకు ఉత్తమ శిక్షణ గరపువాడును, మహత్తరమగు సంసారదుఃఖమును తొలగించువాడును అగు శ్రీ మదసంగానందసద్గురువును భజించుచున్నాను.

అశేష ఛాత్రవందితం
సుసాధు సేవ్య మానసమ్ ।

విరక్తలోక పాలకం
అసంగసద్గురుం భజే ॥ **5**

సమస్త శిష్యకోటిచే నమస్కరింపబడినవాడును, ఉత్తమసాధువులచే సేవింపదగిన మానసము గలవాడును, వైరాగ్యశీలురగు జనులకు మోక్షమార్గము జూపి రక్షించువాడును నగు శ్రీమదసంగానంద సద్గురువును భజించుచున్నాను.

అధీత వేదసంతతిం
ముముక్షు కల్ప పాదపమ్ ।
అజన్మ మార్గ దీపకం
అసంగదైవతం భజే ॥ **6**

వేదముల నన్నింటిని బాగుగా అధ్యయనము చేసినవాడును, ముముక్షువులకు కల్పవృక్షమైనవాడును, జననమరణరహితమైన ముక్తిమార్గమును బోధించువాడును అగు శ్రీమదసంగానందదేవుని భజించుచున్నాను.

పునీత మార్గదర్శకం
సునీతివృద్ధి కారకమ్ ।
అసంగ దేశికోత్తమం
సదా హృది స్మరామ్యహమ్ ॥ **7**

పవిత్రమగు ఆత్మమార్గము జూపువాడును, ఉత్తమనీతిని జనులయందు వృద్ధి పఱచువాడును అగు శ్రీమదసంగానంద సద్గురుని ఎల్లవేళల హృదయమున స్మరించుచున్నాను.

విశుద్ధతత్త్వ కోవిదం
దురన్తబంధ మోచకమ్ ।
అసంగదేశికం విభుం
పునః పునర్నమామ్యహమ్ ॥ **8**

విశుద్ధమగు బ్రహ్మతత్త్వమును బాగుగ నెఱింగిన వాడును, భయంకరమగు సంసారబంధమునుండి జనులను విడిపించువాడును, ప్రభువు నగు శ్రీమదసంగానంద సద్గురువునకు మాటిమాటికి ప్రణమిల్లుచున్నాను.



గుర్వష్టకమిదం పుణ్యం
యః పఠే ద్భక్తిసంయుతః ।
తస్య శోకభయం నాస్తి
సర్వత్ర విజయీ భవేత్ ॥ **9**

పవిత్రమగు ఈ గుర్వష్టకమును ఎవడు భక్తితో పఠించునో, అట్టి వానికి దుఃఖభయ ముండదు. అతడు సమస్త కార్యములందును విజయమునే పొందును."

శివలింగ ప్రతిష్ఠాకార్యక్రమం పూర్తికాగానే శ్రీసద్గురుదేవులు భక్తుల వీడ్కోలందుకొని సపరివారంగా తిరిగి వ్యాసాశ్రమానికి పయన మయ్యారు.

## ఆశ్రమాభివృద్ధి

శ్రీశుకబ్రహ్మాశ్రమం క్రమంగా అభివృద్ధి చెందుతూ ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఆనందదాయక మయింది. అక్కడ సాధకుల నివాసానికీ, వంటకూ, భోజనాదులకూ కుటీరాలు కావలసివచ్చాయి. మొదట వాటిని పర్ణశాలల రూపంలో నిర్మించారు. తరువాత శ్రీ చింతలూరు సుబ్బరామయ్యగారు, శ్రీమతి పుణ్యమూర్తి కొండమ్మగారు, శ్రీమతి సుంకు సీతమ్మగారు, శ్రీ తాడికొండ నారాయణశెట్టి గారు మొదలగు దాతలు తమతమ విరాళాలతో వంటగదులను నిర్మించి యిచ్చారు. శ్రీమతి పూటుకూరు కమలాంబగారు భోజనశాలను కూడా నిర్మింపజేశారు. మరికొంతమంది భక్తులు విద్యామందిరానికి చెందిన గదుల నిర్మాణానికి సహకరించారు. స్వామీజీ సోదరులైన డాక్టరు టి. బి. జి. తిలక్‌గారు, శ్రీ టి. కె. ఆనందభారతిగారు, శ్రీ టి. రాధాకృష్ణగారు, తదితరులు ఆశ్రమం బావిని పెద్దదిగా త్రవ్వించి అక్కడ మిషన్ ఏర్పాటు కవసరమైన ధనసహాయం చేశారు. ఈ విధంగా ఆశ్రమంలో క్రమక్రమంగా అభివృద్ధి కనిపించింది.

ఆశ్రమప్రశస్తి స్వరాష్ట్రంలోనే కాక ఇరుగుపొరుగు రాష్ట్రాలలో కూడా వ్యాప్తికి వచ్చింది. శ్రీస్వాములవారికి పలుప్రాంతాలనుండి వచ్చే ఆహ్వానాల సంఖ్య అధికమయింది. 1951లో గుంటూరు, వేటపాలెం మొదలైన ఆంధ్ర ప్రాంతాలలోనే కాక బెంగుళూరు, మైసూరు మున్నగు కర్ణాటక ప్రాంతాలకు గూడా వెళ్ళి స్వామీజీ సప్తాహాది కార్యక్రమాలు నిర్వహించారు. వివిధ ప్రదేశాలలో స్వాములవారికి పరిచయం పెరిగేకొద్దీ శ్రీశుకబ్రహ్మాశ్రమానికి రాకపోకలు సాగించే భక్తుల రద్దీ కూడా గణనీయంగా పెరిగింది.



# దశమ ప్రకరణం

## సనాతన వేదాంత జ్ఞానసభ

ఆశ్రమస్థాపన జరిగిన తర్వాత నాలుగు సంవత్సరాలకు, అంటే 1954లో ఆశ్రమంలో జరిగిన ఒక ముఖ్యకార్యక్రమాన్ని ఇక్కడ మనం తప్పక చెప్పకోవాలి.

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు వ్యాసాశ్రమం స్థాపించిన 1926 లోనే 'సనాతన ధర్మపరిపాలన సేవాసమాజం' అన్న పేరుతో ఒక అధ్యాత్మిక సమాజాన్ని గూడా స్థాపించారు. సత్యాన్వేషణం, సత్యానుష్ఠానం, సత్యప్రబోధం, ధర్మాన్వేషణం, ధర్మానుష్ఠానం, ధర్మప్రబోధం, దుఃఖకారణాన్వేషణం, దుఃఖ తరణం, దుఃఖతరణోపాయ ప్రబోధం — అన్న లక్ష్యాలతో ఈ సమాజాన్ని స్థాపించడం జరిగింది. స్థాపనానంతరం పది సంవత్సరాలకు పై సమాజమే 'సనాతన వేదాంత జ్ఞానసభ'గా వ్యవహరింపబడింది.

"ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపడకుడు, సాధ్యమైనచో వారికి సాయము చేయుడు. మీ ఆత్మోన్నతికి అడ్డు కలిగిన తొలగించుకొనుడు. ఇదే సనాతన ధర్మం. సనాతన వేదాంత జ్ఞానసభల ఆశయం కూడా ఇదే" అని ఈ సభలలో శ్రీసద్గురుదేవులు ఎలుగెత్తి చాటారు.

ఈ సభలు వివిధప్రదేశాలలో సంవత్సరాని కొకసారి ఫాల్గుణ పూర్ణిమ నుండి మూడు దినాలు జరిగేవి. 1926 నుండి 1953 వరకూ ఇలాంటి సభలు ఇరువదియేడు సార్లు జరిగాయి. 28వ సభను శ్రీకాళహస్తి - శుకబ్రహ్మాశ్రమంలో జరపా లని భక్తులు నిర్ణయించుకొన్నారు. శ్రీ సద్గురు స్వాములవారు వారి నిర్ణయాన్ని ధ్రువీకరించారు. సభకు కావలసిన ఏర్పాట్లన్నీ చురుకుగా సాగాయి.

ఈ సభానిర్వహణలో శ్రీవిద్యాప్రకాశానందస్వాములవారికి శ్రీనిత్యానంద స్వాములవారు, శ్రీ అద్దూరి బలరామిరెడ్డిగారు, శ్రీ పి. రామచంద్రరావుగారు మొదలైన పురప్రముఖులు చేదోడు వాదోడుగా నిలిచారు. ఎక్కువ వ్యయ ప్రయాసలతో జరుపవలసిన ఈ కార్యక్రమానికి భక్తప్రజలనుండి తగిన విధంగా సహకారం లభించింది.



1954 మార్చి 19, 20, 21 తేదీలలో ఈ సభ శుకబ్రహ్మాశ్రమంలో నిర్వహింపబడింది. శ్రీ మలయాళస్వాములవారు సపరివారంగా వ్యాసాశ్రమమునుండి ఒకరోజు ముందే అక్కడికి విచ్చేశారు. రాష్ట్రం నలుమూలలనుండీ వేలకొలది భక్తులు హాజరయ్యారు. శ్రీకాళహస్తికి అరమైలు దూరంలో వున్న ఆశ్రమం నగరంతో కలిసిపోయిందా అన్న విధంగా నేల ఈనినట్లు ఈసభలకు ప్రజలు వచ్చారని సభలను స్వయంగా సమీక్షించిన శ్రీ షేక్ టి.యస్. మీర్జాసాహెబ్‌గారు తెలిపివున్నారు.

ప్రణవపతాకావిష్కరణతో ప్రారంభమైన సభాకార్యక్రమం మూడురోజులపాటు అవిచ్ఛిన్నంగానూ, ఉదాత్తంగానూ కొనసాగింది. వేలకొలది స్త్రీపురుషులు గీతా పారాయణాది కార్యక్రమాలలో పాల్గొన్నారు.

ఉపనిషద్విహార వ్యవస్థాపకులు శ్రీరాజేశ్వరానందస్వామివారి అధ్యక్షతలో జరిగిన ఈ సభలో శ్రీ శంకరానంద స్వాములవారు, శ్రీ నోముల అప్పారావుగారు, శ్రీ టి.యం.పి. మహదేవన్‌గారు మొదలైన ప్రముఖులు అధ్యాత్మతత్త్వం ప్రబోధించారు. శ్రీ మలయాళసద్గురుదేవులు కావించిన గీతాప్రబోధం అందరినీ చైతన్యవంతులను చేసింది. శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు సాధనచతుష్టయ సంపత్తిని గూర్చి చేసిన ప్రసంగం శ్రోతల నందరినీ ఆకట్టుకొన్నది.

భక్తులకు భోజనాది సౌకర్యాలలో ఏ మాత్రం లోటు లేకుండా కార్య కర్తలు చక్కని ఏర్పాట్లు చేశారు. వారిని ప్రజలు వేనోళ్ల ప్రశంసించారు. ఈ సభానిర్వహణంతో శ్రీశుకబ్రహ్మాశ్రమప్రశస్తి ఇతోధికంగా వృద్ధి పొందింది.

సనాతన వేదాంతసభ జయప్రదంగా ముగిసిన తర్వాత శ్రీవిద్యాప్రకాశానంద స్వాములవారు ఆ సంవత్సరం ఏప్రిల్లో బెంగుళూరు, మేనెలలో పెనుమూరు, బళ్లారి, ఆగష్టులో హిందూపురం, సెప్టెంబర్‌లో విజయవాడ, గుంటూరు మొదలైన ప్రాంతాలకు వెళ్లి ఆధ్యాత్మికోపన్యాసాలతో అక్కడి ప్రజలను అలరించారు.

## ఆశ్రమ వార్షికోత్సవాలు

ఆశ్రమస్థాపన జరిగిన తర్వాత 1951నుండి ప్రతిసంవత్సరం ఆశ్రమ వార్షికోత్సవాలు ఘనంగా జరపడం అలవాటయింది. ఈ ఉత్సవాలకు విశేషంగా భక్తులు విచ్చేసేవారు. ఆ సందర్భంలో ఆత్మోత్తేజకమైన ప్రవచనాలు చేయడానికి చాలామంది మహనీయులను కార్యకర్తలు ఆహ్వానించేవారు. శ్రీస్వాములవారు

భక్తుల నుద్దేశించి లోకోత్తరమైన ప్రసంగాలు కావించేవారు. ప్రతివార్షికోత్సవంలోనూ ప్రబోధాత్మకమైన కొన్ని కరపత్రాలు ప్రచురించి భక్తులకు పంచిపెట్టడం జరిగేది. వార్షికోత్సవాలను పురస్కరించుకొని కొందరు మహనీయులు తమ సందేశాలను పంపేవారు. ఆసందేశాలను భక్తులకు వినిపించడం పరిపాటి.

1955లో జరిగిన ఆశ్రమ పంచమ వార్షికోత్సవానికి దివ్యజీవనసంఘ వ్యవస్థాపకులు శ్రీ శివానంద సరస్వతీ మహారాజ్‌వారు ఆంగ్లంలో ఈ క్రింది సందేశం పంపారు ——




*OM OM OM*

*Salutations and adorations unto the Lord who is omnipresent, omnipotent and omniscient and who sports Himself through His creation ever remaining a witness.*

*Sweet beloved children of the Lord !*

*I am immensely happy to commune with you all on this auspicious occasion through this short message becoming of the spiritually hungry souls that you are.*

*Every Jiva from worm to man right from the moment of birth struggles and hankers after happiness. Though man supercedes the rest of the creation by dint of his rationalistic genius which he hardly utilises for his self- betterment and though he stands on the highest and top-most-rung of the ladder of the creative species, he drags himself down into deeper depths owing to ignorance of his real swaroop which is identical with Brahman, The Lord. He heeds not Dharma and cares not the instructions of the Mahatmas. He does not exert himself to avoid being ruled over by the Trigunas - Sattwa, Rajas and Tamas of Prakriti. He leads a reckless life of dissipation, of pleasure, of Sensuality without minding the degradation and downfall that result therefrom. His cult in life is "Eat, Sleep & Enjoy". He remains unconcerned and indifferent towards the sufferings of others and never extends his hand nor displays his heart even a bit to alleviate them to the best of his ability.*

*He attends to his own comforts and conveniences, looks to his own needs and necessaries till he is forcibly drawn towards the Lord by sudden*



*Calamities, defeats, frustrations or disappointments in life. He never enquires for himself with God-given brain; Is there any man with an externalised vision happy and peaceful in the world? What is the aim and purpose of creation, human in particular? What is the root-cause of pleasure and pain, birth and death, disease and penury, happiness and misery? Is there any way out of all these relative experiences? Is there any permanently Live substance and Eternally existent entity called God? Is the theory of reincarnation propounded in the scriptures true? If so, how to avoid rebirths? Whence had I come? Where shall I go? Is it possible to attain God-realisation in this very birth? and so on. The moment the enquiry proceeds thus with a penetrative and anguishing desire to solve the riddles, real quest begins. This is the true starting point for inner transformation to continue to effect thereafter.*

*There is no knowledge without psychic transformation. There is no transformation without bitter experiences. There is no joy without sorrow. Whatever that befalls is for the best to move towards the goal.*

*Attain the goal of God-realisation through Karma, Bhakti, Yoga and Jnana. Practise one or more or all of these and attain the State of Self-Purification and ultimate self-absorption.*

*Karma is as much a necessity for onward progress as any other. Karma of whatever nature it be if in conformity with Dharma, is not binding when done with Sakshi Bhava in a self-less spirit without any idea of doership or enjoyership. It is as much purifying as the rest in enabling to attain the goal ultimate.*

*Again real Bhakti starts from true and complete Atma-Nivedana (Self-surrender) which alone bestows on the devotee Lord's Grace..*

*Similarly yoga stresses the complete annihilation of the mind through the extermination of worldly desires.*

*Lastly Jnana, which is the culmination of the preceding three goads man to realise the one self in the entire animate and inanimate creation and to see the unity behind the seeming diversity.*

*All these four have got an inextricable interrelation between one another and none of these stands apart from the others. They have got an intertwining relationship amidst themselves. Progress towards the goal will be quicker if the synthetic yoga comprising these four is taken up in right earnest.*

*Resort to an ideal guru. Practise his instructions Do selfless service. Read the Gita and other scriptures. See the one self in all and all in the one self. Behave in consonance with Dharma, which is the basis of life. Break the fortress of distinctions like the cast, creed, clime, sex and so on. See the divinity in all. Rely on god. Surender to the Lord. Soar above the relative world. Merge in the Absolute here and now in this very birth.*

*Sri Swami Vidya Prakasananda deserves my high regards and immense love for the Adhyatmic seva he has been carrying on during these five years and I wish him every success in his efforts at the regeneration of mankind.*

*(Sd) - Sivananda.*

పై సందేశానికి ఆంధ్రానువాద మిది ——

సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సృష్టికి సాక్షిభూతుడు, తద్వారా ఆనంద క్రీడాతత్పరుడూ అయిన సర్వేశ్వరునకు నాభక్తిపూర్వక నమోవాకాలు. సర్వేశ్వరుని మధురప్రేమకు పాత్రులైన పుత్రీపుత్రరత్నములారా!

అధ్యాత్మతత్త్వ జిజ్ఞాసువులైన మీకు ఉపయోగపడే ఈ లఘుసందేశం ద్వారా ఈ శుభసమయములో మీతో ఆత్మసంబంధం కల్గించుకొంటున్న నాకు చాలా సంతోషంగా వున్నది.

పిపీలికాది మనుష్యపర్యంతమైన ప్రతిజీవీ పుట్టింది మొదలు సుఖం కొరకే పెనగులాడుతున్నది. మానవుడు ధీశాలి, వివేచనాసమర్థుడు కావడంవల్ల సృష్టిలో ప్రథమగణ్యు డవుతున్నాడు. అయినా అతడు తన సామర్థ్యాన్ని తన అభ్యుదయానికి వినియోగించుకోవడం లేదు. తన స్వరూపం పరబ్రహ్మకంటె భిన్నం కాదని తెలియకపోవడంవల్ల అతడు అగాధమైన లోతులలోనికి తన్ను తాను ఈడ్చుకొనిపోతున్నాడు. అతడు ధర్మాన్నీ, మహాత్ముల బోధలనూ లక్ష్యపెట్టడం లేదు. ప్రాకృతగుణాలైన సత్త్వరజస్తమస్సులనే పాశబంధాలను విచ్ఛేద మొనర్చుకోవటానికి ప్రయత్నించడం లేదు. చిత్తచాంచల్యం, విషయభోగం - ఇవి తెచ్చిపెట్టే అధోగతినీ, అనర్థాన్నీ పరిగణించకుండా వాటికి లొంగి ప్రమాదభరిత జీవితం గడపుతున్నాడు. తినడం, తిరగడం, పడుకోవడమే అతనికి మతం. ఇతరులు బాధపడుతుంటే అతడు పట్టించుకోడు. తన శక్తికొలది ఇతరులకు సాయపడటంగాని; వారికష్టాలు చూచి కించిత్తైనా జాలిపడడం గాని లేదు. అకస్మాత్తుగా జీవితంలో సంభవించే ఆపదలూ, అపజయాలూ, పతనాలూ, పరాభవాలూ ముమ్మరమై పరమేశ్వరునివైపు అతణ్ణి మళ్లించే వరకూ, అతడు తన స్వార్థాన్నే పోషించుకొంటూ, విషయభోగాలనే అంటిపెట్టుకొని వుంటాడు. భగవంతుడు ప్రసాదించిన బుద్ధితో అత డెంతమాత్రమూ తనకు తాను ఈ విషయాలు యోచన చేయడు :- "లోకంలో



బహిర్ముఖచిత్తుడెవడైనా శాంతిసుఖాలు అనుభవిస్తున్నాడా? సృష్టియొక్క, ముఖ్యంగా మానవజన్మయొక్క లక్ష్యమేమి? ప్రయోజనమేమి? సుఖదుఃఖాలకూ, జననమరణాలకూ, రోగదారిద్ర్యాలకూ, దుర్దశలకూ మూలకారణం ఏమి? వీటి సంపర్కం తొలగించుకొని బయటపడే మార్గం కలదా? నిత్యసత్య చేతన స్వరూపుడైన భగవంతు డనేవాడు ఉన్నాడా? శాస్త్రం చెప్పే పునర్జన్మ సిద్ధాంతం నిజమా? నిజమైతే జన్మరాహిత్యాన్ని ఎలా సాధించాలి? నేను ఎక్కడ నుండి వచ్చాను? ఎక్కడికి పోతాను? ఈ జన్మలోనే నాకు భగవత్సాక్షాత్కారం కలుగుతుందా?" ఏ క్షణంలో ఇలాంటి సమస్యల పరిష్కారానికై తీవ్రజిజ్ఞాస ఉదయిస్తుందో, ఆక్షణమే నిజమైన ఆత్మవిచారం ప్రారంభ మవుతుంది. అంతరంగ పరిణామపూర్వకమైన పురోగతికి ఇదే తొలిమెట్టు.

మనస్సులో మార్పు రాకుంటే జ్ఞానప్రాప్తి మృగ్యం. దుఃఖాలు అనుభవించకుంటే మనస్సు మారేది కల్ల. దుఃఖం లేనిదే ఆనందప్రాప్తి హుళక్కి. ఏ విపత్తు సంభవించినా, అది లక్ష్యసాధనకు సహకరిస్తుంది.

కర్మ-భక్తి-ధ్యాన-జ్ఞానాల ద్వారా భగవత్సాక్షాత్కార మనే లక్ష్యం సాధించండి! ఈ మార్గాలలో ఒకటిగానీ, కొన్నింటిని గానీ, అన్నింటిని గానీ అభ్యసించి చిత్తశుద్ధి పొంది తుదకు ఆత్మసాయుజ్యం పొందండి!

పురోగమనం సాధించాలంటే ఇతరయోగాలవలె కర్మయోగం కూడా అవసరమే. కర్మ ఎలాంటిదైనా, అది ధర్మబద్ధంగా, కర్తృత్వభోక్తృత్వరహితంగా, నిరహంకారంగా, ఆత్మసమర్పణపూర్వకంగా, సాక్షిభావంతో నిర్వహింపబడితే బంధంగా పరిణమించదు. పరమలక్ష్యప్రాప్తిసాధనకు తక్కిన యోగాలలాగా కర్మయోగం కూడా పావనత్వాన్ని చేకూరుస్తుంది.

అంతేకాక భక్తునిపై భగవదనుగ్రహం వర్షింపజేసే నిజమైన అఖండాత్మార్పణంనుండే సద్భక్తి ప్రారంభ మవుతుంది.

అలాగే ప్రాపంచిక విషయవాంఛానిర్మూలనం ద్వారా కలిగే ఆత్యంతిక మనోలయం మీదనే ధ్యానయోగం ఆధారపడివున్నది.

చివరగా పైమూడు యోగాలకూ పరాకాష్ఠ అయిన జ్ఞానయోగం నిఖిల చేతనాచేతన సృష్టిలోని సర్వజీవరాసులలో నిగూఢంగా వున్న అద్వితీయాత్మను సాక్షాత్కరించుకోవడానికీ, పైకి కనిపించే అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించడానికీ మానవుణ్ణి ప్రేరేపిస్తున్నది.

ఈ నాలుగు మార్గాలూ అవినాభావరూపమైన అన్యోన్యాంతర సంబంధం కలిగి వున్నాయి. ఇందులో ఏదీ తక్కిన మూడింటినీ వదలి వుండలేదు. అవి ఒకదాని నొకటి పెనవేసికొన్న సంబంధంతో వున్నాయి. ఈ నాల్గింటినీ కలిపిన యోగసమ్మేళనాన్ని శ్రద్ధతో సాధిస్తే పురోగమనం త్వరితంగా ప్రాప్త మవుతుంది.

ఆదర్శ గురువును ఆశ్రయించండి! ఆయన బోధలను అనుష్ఠించండి! స్వార్థ రహిత సేవలు చేయండి! గీతాదిశాస్త్రాలను పఠించండి! సమస్తభూతాలలో ఒకే ఆత్మనూ, ఒకే ఆత్మలో సమస్తభూతాలనూ సందర్శించండి! ధర్మానుసారంగా ప్రవర్తించండి! జీవితానికి ఆధారం ధర్మమే. జాతి-మత-వర్ణ- లింగ దేశాది భేదాలనే దుర్గకవాటాన్ని భేదించండి! అంతటా దివ్యత్వాన్ని చూడండి! దైవంపై నమ్మక ముంచండి! సర్వేశ్వరుని శరణు పొందండి! మాయా ప్రపంచాన్ని అతిక్రమించండి! ఇప్పుడే, ఇక్కడే, ఈ జన్మలోనే బ్రహ్మైక్యం సాధించండి!

శ్రీ స్వామి విద్యాప్రకాశానందజీ ఐదు సంవత్సరాలుగా చేస్తున్న ఆధ్యాత్మిక సేవకుగానూ, వారు నా పరమప్రేమకూ, గౌరవమన్ననలకూ పాత్రు లవుతున్నారు. మానవజాతి సముద్ధరణకై వారు సాగిస్తున్న ఉద్యమం విజయవంతం అగుగాక! అని ఆశిస్తున్నాను.

(సం) - శివానంద

ఇలా ఎంతో ఉత్తేజం కలిగించే సందేశాలతో, ప్రవచనాలతో వార్షికోత్సవాలు ఆత్మజిజ్ఞాసాపరులకు హర్షదాయకంగా జరిగేవి. ఇప్పటికీ అవి అలాగే కొనసాగుతు న్నాయి.

## సనాతన వేదాంత సభ - అధ్యక్షత

1955 మార్చిలో కోలారు జిల్లాలోని అగరం గ్రామంలో శ్రీ సేగు కృష్ణ దాసుగారు 29వ సనాతన వేదాంత జ్ఞానసభను నిర్వహించారు. ఆ సభకు శ్రీ మలయాళ సద్గురుదేవులు శ్రీవిద్యాప్రకాశానందస్వామీజీని అధ్యక్షులుగా నియ మించారు. అంతకు ముందు ఆసభలకు సరస్వతీసంఘ వ్యవస్థాపకులు శ్రీ సాధుస్వాములవారు, ఉపనిషద్విహారస్థాపకులు శ్రీ రాజేశ్వరానందస్వాములవారు, కవిసార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు మొదలైన మహామహులు అధ్యక్షులుగా వుండేవారు.

శ్రీ గురుదేవులు తమను సభాధ్యక్షులుగా నియమించిన సందర్భాన్ని స్మరిస్తూ శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు ఇలా తెల్పివున్నారు —

"1955వ సంవత్సరమందు కోలారుజిల్లాలోని అగరం గ్రామములో శ్రీ సనాతన జ్ఞానమహాసభ యొక్క 29వ సమావేశము జరుగుచుండెను. ఆ సందర్భమున శ్రీవారు నన్ను పిలిచి 'ఇకమీదట మీరే ఈ సనాతన సభలకు అధ్యక్షులుగా ఉండవలసినది'అని ఆదేశించిరి. అంతటి బాధ్యతాయుతమైన కార్యమును నిర్వహిం చగలనా యని నాలో నేను ఆలోచించుకొనుచుండగా శ్రీవారు నాకు ధైర్యమును పురికొల్పి అక్కార్యనిర్వహణమునకు ప్రోత్సహించిరి. శ్రీవారి దివ్యానుగ్రహప్రభావ



ముచే శ్రీసనాతనవేదాంత జ్ఞానసభ నిరాటంకముగా కొనసాగిపోవుచున్నది." (శ్రీ మలయాళమహర్షి - 51, 52)

సభలో ఉపన్యసించే విధానములో కూడా శ్రీవారు తమకు కావించిన సూచనను వివరిస్తూ శ్రీ స్వాములవా రిలా చెప్పారు—

"ఒకానొక సనాతన వేదాంతజ్ఞాన మహాసభలో కార్యక్రమము ప్రారంభమగు టకు కొంచెము ముందుగా శ్రీవారు నన్ను పిలిచి 'సభలో ఉపన్యసించునప్పుడు మొత్తము తెలుగుభాషలోనే కాకుండ మధ్యమధ్య ఇంగ్లీషు వాక్యములను గూడ ప్రయోగించుచుండుము. సాధువులకు విద్యలేదని కొందరు తలంచవచ్చును.' శ్రీవారి వాక్యములను శిరసావహించి అట్లే చేయుచుంటిని. సాధువులు విద్యావం తులు కావలెననియు, బ్రహ్మవిద్యను చక్కగ లోకములో వ్యాపింపజేయవలెననియు శ్రీవారి అభీష్టము." (శ్రీ మలయాళ మహర్షి - 52)

అగరం సభల కాలంనుండీ నేటివరకూ గురుదేవులు నిర్దేశించినట్లు శ్రీవిద్యా ప్రకాశానందస్వాములవారే సనాతన వేదాంతజ్ఞానసభలకు అధ్యక్షత వహిస్తున్నారు. ఈసభలకు వేలకొలది జనులు హాజరవుతూ వుంటారు. అధ్యక్షపీఠంపైనుండి శ్రీస్వాములవారు కావించే గంభీరోపన్యాసాలు సభల కెంతో ప్రశస్తి నాపాదిం చాయి.

అగరం సభ పూర్తి అయిన పిదప కోలారు, కొల్లేగాలం, బందరు మున్నగు ప్రదే శాలలో శ్రీస్వాములవారు సప్తాహాది కార్యక్రమాలు నిర్వహించారు. 10-8-1955 నుండి 17-8-1955 వరకూ బందరులోని శ్రీలక్ష్మీనృసింహసోమయాజి సమా జభవనంలో సప్తాహం జరిగింది. అక్కడ పుట్టి అక్కడే కళాశాలావిద్యార్థిగా చదువుకొన్న ఆనందమోహన్ యతివర్యులుగా తిరిగివచ్చి భక్తి జ్ఞాన యోగ వైరా గ్యాది సాధనలను గూర్చి అపూర్వమైన ఫక్కిలో ప్రసంగించడం విని పురప్రజలు ఎంతో సంతోషించారు.

ఆ సంవత్సరమే అక్టోబరులో 16వ తేదీ నుండి పది రోజులపాటు చిత్తూరుజిల్లా లోని పలమనేరులో ప్రేమసంఘమండలి ఆధ్వర్యాన స్వాములవారు గీతోపన్యాసాలు చేశారు.

1956లో వారు నిర్వహించిన కార్యక్రమాలలో అగరంలో జరిగిన సప్తాహం, విజయనగరంలో పదునైదు రోజులు జరిగిన గీతాప్రవచనాలు చెప్పుకోదగ్గవి.

"పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా" అన్నాడు వేమన్న. ఉత్తమమైన మాన వజన్మ పొందికూడా ఎవడు ఆత్మోన్నతి సాధించకుండా గతిస్తాడో వాని పుట్టుక చెదపురుగు పుట్టుకలాగా వ్యర్థమే. అందుకే "ఏదియునులేని దేమి జన్మము, వేదాంత విద్యావివేకి కావలెను" అని అన్నమాచార్యు లన్నారు.

తన జీవితాన్ని భగవదర్పితం చేసి తపస్సిద్ధి పొందిన శ్రీవిద్యాప్రకాశానందుల జీవితం ధన్య మయింది. శ్రీశుకబ్రహ్మాశ్రమస్థాపనతో వారు కృతకృత్యులయ్యారు. తాము పొందిన ఆత్మానుభూతిని ఇతరులకు కూడా పంచిపెట్టడమన్నదే వారికి తరువాతి ముఖ్యకర్తవ్య మయింది. వివిధప్రదేశాలలో పర్యటించి వారు ఆత్మధర్మం బోధించారు. వారి ప్రవచనపటుత్వం శ్రోతల నాకర్షించడంలో సఫలం కావటం వల్ల వారి కృషి సత్ఫలితాలను ప్రసాదించింది.





భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారితో శ్రీవారు
(పుట్టపర్తి 2-1-87)





శ్రీస్వాములవారితో గ్రంథకర్త శ్రీసముద్రాల లక్ష్మయ్యగారు

40వ గీతామహోత్సవ వేదికపై శ్రీస్వాములవారు కంచికామకోటి పీఠాధిపతులు జగద్గురు
శ్రీ జయేంద్ర సరస్వతి స్వాములవారు మరియు సిరీస్ రాజుగారు విజయవాడ (29-6-89)





(1) శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వాములవారు
(2) శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

23వ గీతామహోత్సవ సందర్భములో శ్రీ స్వాములవారు, దత్తపీఠాధిపతులు
శ్రీ గణపతి సచ్చిదానంద స్వాములవారు (బందరు-మార్చి-89)



శ్రీ స్వాములవారితో యోగచికిత్స ప్రవీణులు
డా|| సాయికుమార్ (సికింద్రాబాద్) గారు





కంచి శ్రీ నారాయణ సేవాశ్రమాధిపతి, స్వాములవారు, శ్రీ కమిత బాబాగారు మరియు
చిన్మయ మిషన్ వ్యవస్థాపకులు శ్రీ చిన్మయానంద స్వామీజీగార్లతో శ్రీ స్వాములవారు

మాతృదేవి
శ్రీ సుశీలాదేవి
గారితో
శ్రీ స్వాములవారు





శ్రీ స్వాములవారు
బండ్లమాంబగారు
చంద్రరావుగారు
కావలి

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ కృష్ణకాంత్‌గారికి గీతామకరందం
బహూకరిస్తున్న దృశ్యం (హైదరాబాదు-24-3-1990)






మహాభక్తురాలు శ్రీ శబరిమాతాజీ మరియు శ్రీ స్వాములవారు
(తాజవాయి - కరీంనగర్ జిల్లా)









3. శ్రీస్వాములవారు పట్టభద్రులైన నోబుల్ కళాశాల-బందరు (1931)







1. 50వ గీతామహోత్సవములో శ్రీస్వాములవారికి కార్యకర్తలు స్వాగతమువలుకుట (సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ 9-3-91)
2. శ్రీ స్వాములవారి సేవలో విజయానంద
3. కంప్యూటరైజ్‌డు టైప్ సెట్టింగు అఫ్‌సెట్ కలర్ కొత్తప్రింటింగు మిషన్‌లో ప్రింటుచేసిన "వేదాంతభేరి" పత్రికను శ్రీ స్వాములవారికి అందజేస్తున్న బలరామ్‌గారు (స్వాతి పత్రిక సంపాదకులు).



1. శ్రీశుకబ్రహ్మ ఆశ్రమ ప్రారంభం నుండి ఆశ్రమ సేవచేసిన కీ|| శే|| బ్రహ్మచారి శ్రీరామచంద్రయ్యగారు (శ్రీవారికి ఎడమవైపు) బ్రహ్మచారి గోపాల్‌గార్లు శ్రీస్వాములవారితో
2. శ్రీస్వాముల వారి సేవలో ఈశ్వర్








1. తిరుమల తిరుపతి దేవస్థానమువారు రికార్డు కార్డు చేసిన శ్రీస్వాములవారి ఉపన్యాసాల వీడియో క్యాసెట్లు కూడా ఆవిష్కరణ జరిగెను (50వ గీతామహోత్సవం)
2. "తత్వసారము" ఆడియో కాసెట్ ఆవిష్కరణ సందర్భము శ్రీమతి శోభారాజు "తత్వసారము" కీర్తనలను ఆలపించుట.

## సూత్రే మణిగణా ఇవ



మత్తః పరతరం నాన్య
త్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం
సూత్రే మణిగణా ఇవ.




ఓ అర్జునా! నాకంటె వేఱుగ మరియొకటి ఏదియు లేనేలేదు. దారమందుమణులవలె నాయందే సమస్త ప్రపంచము కూర్చబడినది.

1. త్రినేత్ర ఉచిత వైద్యాలయము






2. ఆశ్రమంలో భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి
భూమిపూజ - శంకుస్థాపన





గీతాయజ్ఞంలో శ్రీస్వాములవారి ఉపన్యాసాన్ని
శ్రద్ధతో ఆలకిస్తున్న జనసమూహం



మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాముల వారితో
శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు



पीछे वहस्त्री भी मर गई उसने तोताका जन्म पाया,तब वह
एक तोते की स्त्री हुई वह तोता एक वनमें रहता था,एक दिन
उस तोती ने तोते से पूछा,हे तोती! तैं तोते का जन्म क्यों
पाया,तब उस तोते ने कहा हे तोता! मैं अपने पिछले जन्म
की वारता कह सुनाता हूं मैं पिछले जन्म में ब्राह्मण था अपने
गुरु की आज्ञा नहीं मानता था मेरा गुरु विद्यवान था उन
के पास और विद्यार्थी रहिते थे सो गुरुजी किसी ओर
विद्यार्थी को पढ़ावें में उनकी बात में बोल पड़ा कई बार
हटका भी पर मैं नहीं माना मुझको गुरु ने श्राप दे दिया
कहा जा तू तोते का जन्म पावेगा इस कारण से मैं तोते

का जन्म पाया है अब तू कहो किस कारण से तोती हुई
उसने कहा मैं पिछले जन्म ब्राह्मणी थी जब ब्याही स
भर्त्ता का आज्ञा नहीं मानती थी भर्त्ता ने मुझे एक दि
मारा मैं भर्त्ता को विष दिया वह मर गया जब मेरी
छूटी तब बड़े घोर नरक में मुझे गिराया कई नरक भुग
कर जब मुझे तोती का जन्म हुआ तोते ने सुन कर
तू बुरी है जिन अपने भर्त्ता को विष दीना तोती ने
नरकों में दुःख भी तो मैंनही सहे हैं अबतो मैं तुझे
जानता हूं एक दिन वह तोती वनमें बैठी थी वहाँ
आया तोता को उस गीधने पहिचाना जोवोही मेरी

శ్రీ స్వాములవారికి గంగానదిలో దొరికిన భగవద్గీత



# ఏకాదశ ప్రకరణం

## గీతాజ్ఞానయజ్ఞాల ప్రారంభం

ప్రాచీనకాలంనుండీ భారతదేశంలో బ్రహ్మవిద్య గురుపరంపర ద్వారా ప్రాప్తమయింది. బ్రహ్మాదులు, వంశఋషులూ బ్రహ్మవిద్యాసంప్రదాయానికి కర్తలు. వారిని నేటికీ మనం నిత్యం స్మరించుకుంటూ వుంటాం.

ఉపనిషత్తులను పరిశీలిస్తే జిజ్ఞాస గల శిష్యులు గురుకులాలకు వెళ్లి గురువులను సేవించి వారినుండి విద్యను ఉపార్జించినట్లు తెలుస్తున్నది. ఇప్పుడు గూడా ఆ సంప్రదాయం మరొకవిధంగా కొనసాగుతూనే వున్నది. ఆధునికకాలంలో గురుకులాలు నాటివలె లేకపోవచ్చు. అయినా బ్రహ్మవిద్యానిష్ణాతులైన గురువులు ఆశ్రమాలు స్థాపించి తమను ఆశ్రయించిన శిష్యులకు తత్త్వబోధ చేస్తూనే వున్నారు. వారు వివిధ ప్రాంతాల్లో పర్యటించి ఆధ్యాత్మికసభలు నిర్వహిస్తున్నారు. వేలకొలది ప్రజానీకం అలాంటి సభలద్వారా ఆర్షసంస్కృతి విలువలను గ్రహిస్తున్నారు. భారతదేశగౌరవ మంతా ముఖ్యంగా ఈ వేదాంతవిద్యాప్రచార వ్యవస్థమీదనే ఆధారపడివున్నది.

అన్ని విద్యలలోనూ మిన్న అధ్యాత్మవిద్య. అది భగవత్స్వరూప మని గీత ప్రకటించింది. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత అనే గ్రంథసముచ్చయం ద్వారా బ్రహ్మవిద్యను అభ్యసించవలసి వున్నది. ఆ గ్రంథత్రితయాన్నే ప్రస్థానత్రయ మంటారు. అందులోనూ ఆధునికకాలంలో ప్రజలకు మిక్కిలిగా అందుబాటులో వున్న గ్రంథం భగవద్గీత.

గీత సమస్తవేదార్థసారసంగ్రహ మని ప్రశంస కెక్కింది. అందులో కర్మ భక్తి ధ్యాన జ్ఞాన యోగాలకు చక్కని సమన్వయం కనిపిస్తుంది.

గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పినవి మామూలు మాటలు కావనీ, అవి జ్ఞానకళిక లనీ, ఉపనిషత్తులనే తోటనుండి ఆధ్యాత్మికసత్యాలనే పుష్పాలను ఏర్చి కూర్చిన మాలయే భగవద్గీత అనీ శ్రీ వివేకానందస్వాములవారు చెప్పివున్నారు. దుఃఖపూరిత మైన వాతావరణంలో తనకు దుఃఖం అంటకుండా చేసినది భగవద్గీతే

అని గాంధీమహాత్ముని మాట. విశాలార్థమూ, అగాధభావమూ, సమత్వమూ కల గీతకు దీటైన గ్రంథం మరొకటి లేదని శ్రీమలయాళ సద్గురుస్వాములవారు ప్రకటించారు. ఇలా ఎందరో మహనీయులు ఎన్నో విధాల గీతాప్రశస్తిని చాటి వున్నారు.

గీతను బోధించిన భగవంతుడే గీతాప్రచారావశ్యకతను గూర్చి ఇలా అన్నాడు—

య ఇదం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః ॥

న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా
దన్యః ప్రియతరో భువి ॥

(గీత - 18-68,69)

"పరమరహస్యమైన గీతాశాస్త్రాన్ని నామీద భక్తి నిలిపి నాభక్తుల కెవడు వివరిస్తాడో అతడు నన్నే పొందగలడు. ఆరీతిగా గీతాప్రబోధం చేసేవానికంటే ఎక్కువ ప్రియమైనవాడు, ప్రీతికలిగించేవాడు నాకు మరొకడు లేడు"అని భగవంతుని అభిప్రాయం.

భగవత్ప్రీతికి మనం పాత్రం కావాలంటే గీతను పఠించాలి. అందులో చెప్పినట్లు ఆచరించాలి. గీతాతత్త్వాన్ని ఇతరులకు బోధించాలి. అధీతిబోధాచరణ ప్రచారణాలతో గీతకు వ్యాప్తి కల్గించాలి.

## నరసారావుపేట యజ్ఞం

శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు శుకబ్రహ్మాశ్రమస్థాపనకు ముందే గీతాప్రచారానికి పూనుకొన్నారు. ఆశ్రమస్థాపనానంతరం భగవత్ప్రీతికరమైన ఆకార్యక్రమాన్ని మరింత ఉద్ధృతం చేశారు. 1957లో ఈ ఉద్యమం మరొకమెట్టు పైకి వెళ్లింది. శ్రీ సద్గురుదేవుల అనుజ్ఞతో, ఆశీస్సులతో శ్రీస్వాములవారు గీతాజ్ఞాన



యజ్ఞాలను ప్రారంభించిన సంవత్సరం అదే. ఈ యజ్ఞకార్యక్రమం మొదటిసారిగా 1957 డిశంబరులో గుంటూరుజిల్లా నరసారావుపేటలో జరిగింది.

అక్కడి పురప్రముఖులు ఒక ఆహ్వానసంఘంగా ఏర్పడ్డారు. శ్రీస్వాములవారి నుండి గీతాతత్త్వాన్ని విపులంగా శ్రవణం చేసే అవకాశం పురప్రజలకు కలిగించాలనుకొన్నారు. అందు కవసరమైన ఏర్పాట్లు చేసుకొన్నారు. దాని కయ్యే కర్చు భరించడానికి దాతలు విరాళా లిచ్చారు. శ్రీస్వామీజీని గీతోపన్యాసా లివ్వవలసినదిగా ప్రార్థించారు.

ఈ కార్యక్రమం ఎన్నాళ్లు జరగాలనే ప్రశ్న వచ్చింది. గీత విశాలమైన అర్థం గల గ్రంథం కాబట్టి అందలి ఒక అధ్యాయంలోని విశేషాలనే ఎన్నాళ్లైనా బోధించవచ్చు. అయినా కాలనియమం పాటించకపోతే ఇలాంటి కార్యాలు నెరవేరవు గదా! అందుచేత ఒక్కొక్క అధ్యాయాన్ని గూర్చి ఒక్కొక్కరోజు ఉపన్యసించాలనీ, కార్యక్రమం మొత్తం పదునెనిమిది రోజులలో పూర్తికావా లనీ నిర్ణయం జరిగింది.

ఈ ఉపన్యాసకార్యక్రమాన్ని యజ్ఞమని ఎందు కన్నారు? యజ్ఞశాలలో హోమద్రవ్యాలు చేకూర్చుకొని యజమానులు, ఋత్విక్కులు చేరి చేసేవి కదా యజ్ఞాలు? అని కొందరు సందేహించవచ్చు.

గీత నాల్గవ అధ్యాయంలో ఈసందేహాన్ని నివారించే వివరణ లభిస్తున్నది. దైవయజ్ఞం, బ్రహ్మయజ్ఞం, ఇంద్రియనిగ్రహరూప యజ్ఞం, విషయత్యాగరూప యజ్ఞం, ద్రవ్యయజ్ఞం, తపోయజ్ఞం, యోగయజ్ఞం, స్వాధ్యాయజ్ఞానయజ్ఞం - ఇలా అనేకవిధాల యజ్ఞాలను గీతలో భగవంతుడు ప్రతిపాదించాడు. ఇందువల్ల వేదాధ్యయనమూ, వేదసారమైన గీతయొక్క పఠన పాఠన ప్రచారాదులు కూడా యజ్ఞం క్రిందకే వస్తాయి.

ద్రవ్యయజ్ఞ-జ్ఞానయజ్ఞాలలో ఏది మేలైనది? "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" **(4-33)** ద్రవ్యయజ్ఞంకంటే జ్ఞానయజ్ఞమే శ్రేయోదాయక మైనదని భగవానుడే సెల విచ్చాడు. తత్త్వవిచారణనే జ్ఞానయజ్ఞ మంటారు. జీవితానికి చరమలక్ష్యం ఆత్మజ్ఞానమే. అందువల్ల ఇతర యజ్ఞాలకంటే జ్ఞానయజ్ఞం శ్రేష్ఠం. పైగా

" అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః |
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టః స్యామితి మే మతిః || "

అని చెప్పి భగవానుడు గీతాధ్యయనం జ్ఞానయజ్ఞమే అని ముక్తకంఠంతో చెప్పి వున్నాడు. గీతోపన్యాసాలద్వారా శ్రీస్వామీజీ ఆత్మతత్త్వవిచారణనే శ్రోతలకు ప్రబోధిస్తారు. అందుచేత గీతాధ్యయనమూ, గీతోపన్యాసకార్యక్రమాలూ గీతాజ్ఞానయజ్ఞా లయ్యాయి.

కార్యకర్తలు కరపత్రాలు, కుడ్యపత్రాలు (వాల్ పోస్టర్లు), మైకులద్వారా ప్రకటనలు చేసి కార్యక్రమానికి విస్తృత ప్రచారం కల్గించారు. 3-12-1957వ తేదీన ప్రథమ గీతాయజ్ఞం ప్రారంభ మయింది. సామూహిక గీతాపారాయణం జరిగిన తర్వాత ఆహ్వానకర్తలు స్వాములవారిని శ్రోతలకు పరిచయం చేశారు. మొదటిరోజు శ్రోతలు పరిమితంగానే వున్నారు. స్వాములవారు ప్రథమ దినాన అర్జునవిషాదయోగాన్ని గూర్చి ప్రవచించారు. గీతాబోధ పార్థుని కొక్కనికే పరిమితం కాదనీ, అది మొత్తం మానవజాతి నుద్దేశించి కావించిన దివ్యప్రబోధ మనీ ఉద్ఘాటించారు. మోహశోకగ్రస్తుడైన అర్జునుని దీనస్థితిని వివరిస్తూ అలాంటి స్థితి ప్రతిమానవుడికీ సంభవించేదే ననీ, గీతాజ్ఞాన మొక్కటే ఆస్థితిని తొలగించగలదనీ, గీత ఒక జాతికీ, ఒక మతానికీ సంబంధించింది కాదనీ, అది సార్వజనీన సార్వకాలిక సత్యశివసుందర భగవద్వాణి అని వుద్ఘోషించారు.

శ్రీస్వాములవారి హృదయంలో ఉత్తుంగ సాగరతరంగాలలాగా వెల్లుబికిన ఉదాత్తభావాలు సముచిత శబ్దజాలంతో సమ్మేళనం పొంది ఎడతెగని వాగ్ఝరులై ప్రవహిస్తాయి. చెప్పదలచిన ప్రతివిషయాన్నీ చక్కని ఉపమానాలతో, ఇంపైన కథలతో నిరూపించడంవల్ల అందరి పరమార్థాన్ని ప్రజలు గ్రహించగలుగుతారు. వ్యక్తిగత దూషణలకూ, ఇతరమతాల నిందలకూ వారి ఉపన్యాసాలలో ఏ మాత్రం అవకాశం ఉండదు. అన్ని మతాలకూ, అన్ని యోగాలకూ స్వామీజీ చక్కని సమన్వయం ప్రతిపాదిస్తారు. అందువల్ల హిందువులతోపాటు, క్రైస్తవులు, మహమ్మదీయులుకూడా వారి ప్రసంగాలకు హాజరవుతారు. సంస్కృత శ్లోకాలతోపాటు, ఆంగ్లసూక్తులనుగూడా వినిపించి అందరి విశేషాలను జనసామాన్యానికి వివరిస్తారు. అందువల్ల పండితులు, ఆధునిక విద్యావంతులు, ఉద్యోగులు, వివిధవర్గాలవారూ సామాన్యజనంతో సహా వారి ఉపన్యాసాలకు తండోపతండాలుగా వస్తూ వుంటారు.

'లోకో భిన్నరుచిః' అన్నట్లు ప్రజల అభిరుచులు భిన్నభిన్నంగా వుంటాయి.



కొందరు తత్త్వబోధ కావా లనుకుంటారు. మరికొందరు పిట్టకథ లంటే ఇష్టపడతారు. ఇంకకొందరు నవ్వించే మాటలపై ప్రీతి చూపుతారు. కొందరు ధారాప్రవాహంగా వచ్చే ఉపన్యాసవైఖరిని మెచ్చుకొంటారు. ఇలా రకరకాల మనస్తత్త్వాలుగల ప్రజలనందరినీ మెప్పించే వాక్చమత్కారం శ్రీవిద్యాప్రకాశానందస్వాములవారికి వెన్నతో బెట్టిన విద్య. అది భగవంతుడిచ్చిన వరం. మహోత్తమ వక్తకు కావలసిన ఉదాత్తలక్షణా లన్నీ వారిలో మూర్తీభవించాయి. అందుకే వారి ఉపన్యాసాలు అటు పామరులనూ, ఇటు పండితులనూ, అన్నిరకాలవారినీ ఆకర్షిస్తాయి.

నరసారావుపేట ప్రజలకు పైకార్యక్రమం ఒక అపూర్వానుభవ మయింది. దినదినానికీ శ్రోతలసంఖ్య రెట్టింపు కాసాగింది. స్త్రీలు తమ గృహకృత్యాలు ముందే పూర్తిచేసుకొని భగవద్గీత చేతపట్టుకొని ఉపన్యాస సమయానికి ముందే సభాస్థలం చేరుకొనేవారు. పురుషులుకూడా తమ వృత్తులు, వ్యాపారాలు గీతోపన్యాసశ్రవణానికి అడ్డురాకుండా చూచుకొనేవారు. క్రమంగా గీతాజ్ఞానయజ్ఞవార్త చుట్టుప్రక్కల పల్లెలకు ప్రాకింది. గ్రామసీమలనుండి ప్రజలు సంతకు వచ్చినట్లే సభకు వచ్చారు.

ఈ గీతోపన్యాస కార్యక్రమాన్ని సమీక్షించిన 'నవ్యభారతి' అనే వారపత్రిక 14-12-57వ తేదీనాటి సంచికలో ఇలా ప్రకటించింది —

"నరసారావుపేటలో శ్రీసీతారామస్వామివారి దేవాలయమున మార్గశిర శుద్ధ ఏకాదశి గీతాజయంతి పుణ్యదినం మొదలుకొని ప్రతిరోజు సాయంకాలం 6 గంటలనుండి 8 గంటల వరకు శ్రీకాళహస్తి - శ్రీశుకబ్రహ్మాశ్రమ సంస్థాపకులు, శ్రీశ్రీశ్రీ జగద్గురు మలయాళస్వాములవారి శిష్యులు, యోగవాసిష్ఠ రామాయణాద్యనేక మహావేదాంత గ్రంథానువాదకులును, ద్వాదశాధికవర్ష తపోనిరతులును, ధ్యానసాధన తత్పరులును అగు శ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు శ్రీమద్భగవద్గీతను గురించి మహోపన్యాసములు గావించుచున్నారు.

దేవాలయపోషకులైన శ్రీ మండవ ఆదినారాయణ శ్రేష్ఠిగారు శ్రీ స్వాములవారికి తగు వసతులను దేవాలయమునందే కావించి ఉపన్యాసములు జరుగుచుండునపుడు సభలో ప్రశాంత పరిస్థితులు కల్పించుటకు తగు ఏర్పాట్లన్నియు చేయుచున్నారు. ఆధ్యాత్మికవిద్యాసంస్కారములు లేని ఈరోజులలో శ్రీస్వాములవారివంటి బ్రహ్మచర్యదీక్షాతత్పరులు, తత్త్వశాస్త్రమును స్వానుభవముతో మేళవించి అపూర్వ

రగా నిగమాగమ పురాణ శాస్త్రములనుండి శ్లోకరాసులను వెదజల్లుచు తేలికైన, ఇంపైన బోధనాపద్ధతులతో పరమత విశిష్టగుణములను సమన్వయించుకొనుచు, శ్రీ శంకర-రామానుజ-రామకృష్ణపరమహంసాది ముక్త సంగుల ఉపదేశరత్నములను క్రోడీకరించుచు, వివేకానంద- రామతీర్థాది అధునాతన విశ్వవిఖ్యాత వేదాంతశాస్త్ర ధురంధరుల ఆంగ్లవాక్యములను అర్థసహితముగా బోధించుచున్న పద్ధతిని చూచినప్పుడు పండితులు, పామరులు, స్త్రీలు, పురుషులు, వృద్ధులు, బాలకులు తన్మయులైపోయి రెండు గంటల సమయమును రెండు నిముషములవలె గడపుచున్నారని చెప్పుట వింత గాదు.

బాల్యమున పురాణాదులను చదువుచున్నప్పుడు "నైమిశారణ్యమున శౌనకాది మహామునులకు నిఖిలపురాణవ్యాఖ్యాన పారంగతుండైన సూతుం డిట్లనియె" నన్న దృశ్యము నరసారావుపేటలో గల ప్రేక్షకులకు కన్నులకు గట్టినట్లుగా నున్నది.

పూజ్యశ్రీ స్వాములవారు సరిగా ఆరు గంటలకు తమ ఉపన్యాసమును ఓంకారోచ్చారణతో బ్రహ్మాది మునులకు వినయపూర్వక వందనములతో ప్రారంభింతురు. తరువాత అనేక రకములైన ప్రాపంచిక వ్యవహారములలో పాల్గొని వచ్చిన శ్రోతలయొక్క హృదయపవిత్రతకు, ఏకాగ్రతకు, ఈశ్వరానుగ్రహము కలుగుటకు నామస్మరణ ఐదు నిముషములు చేయించుదురు. తరువాత కృష్ణరామాది నామ మాహాత్మ్యములను భాగవతాది ఉద్గ్రంథములనుండి సోదాహరణముగా ప్రవచించి మరల ఐదు నిముషములు భగవన్నామస్మరణ చేయించి ప్రేక్షకుల హృదయక్షేత్రములను పవిత్రము చేసిన మీదట తమ ఉపదేశబీజములను గీతోపన్యాసములద్వారా నాటుటకు ప్రయత్నించుచుందురు. "ఓం శంభో శివశివా శివశివా శివశివా! నారాయణ నారాయణ నారాయణ ఓమ్" అని అంతమున భగవన్నామస్మరణ చేయుచున్న వందలాది శ్రోతలను చూచునప్పుడు హిందూమతమునకు నిలయములైన పవిత్రాశ్రమ దృశ్యములు కన్నులకు గన్పట్టుచున్నవి.

నరసారావుపేట పట్టణమున కిది శుభసమయము, స్వర్ణావసరము. ఆధ్యాత్మిక విద్యా సంప్రదాయములను తెలుసుకొనుటకు, వేదాంతసందేహములను తొలగించుకొనుటకు, గీతారహస్యములను చక్కగా అవగాహన మొనరించుకొనుటకు ఇది ఎంతైన మంచి అదను. ఈ ఉపన్యాసములవలన మనకు గల అజ్ఞానము, హృదయమాలిన్యము, సంకుచితభావములు, పాండిత్యాభిమానాహంకారములు, శుష్క వేదాంత ప్రలాపములు దూరమై నిశ్చలమైన భక్తి, సరియైన వేదాంతబోధ ప్రజలకు లభించ



గల వని ఆశించుచున్నాము."

(నవ్యభారతి - 14-12-1957)

ఈ 'నవ్యభారతి'లో నాటి స్వాములవారి ప్రవచనాలు గూడా సంగ్రహంగా ప్రకటింపబడ్డాయి.

యజ్ఞం ప్రారంభమైన మరునాటినుండీ ప్రతిదినమూ ఉదయం గీతాపారాయణానంతరం స్వాములవారు యోగవాసిష్ఠంపై ప్రసంగాలు చేసేవారు. గీతాయజ్ఞాలు కొనసాగినంతకాలం ఈ పద్ధతి పాటింపబడింది. వేనకువేల ప్రజలకు గీతతోనూ, యోగవాసిష్ఠంతోనూ పరిచయం ఏర్పడింది.

యజ్ఞసమయంలో చివరి దినాలలో పెద్దలకూ, పిన్నలకూ గీతలో పోటీపరీక్షలు నిర్వహించేవారు. గెలుపొందినవారికి తగిన బహుమతు లిచ్చేవారు. యజ్ఞం పూర్తి అయిన మరునాడు జనానీకానికి అన్నదానం చేసే విధానం కూడా ఏర్పాటయింది.

నరసారావుపేట యజ్ఞం ఆప్రాంతంలో గొప్ప ఆధ్యాత్మికసంచలనానికి కారణమయింది. ఈ విషయం తెలుసుకొన్న ఇతరప్రాంతాల జిజ్ఞాసువులకు తమ ప్రాంతంలో కూడా ఇలాంటి యజ్ఞాలు నిర్వహించే ఏర్పాటు చేసుకోవా లన్న ఉత్సాహం కలిగింది. అందుకే తర్వాత అనేకప్రదేశాలలో గీతాజ్ఞానయజ్ఞాలు విరివిగా జరిగాయి.

**20-12-1957** నాటితో ప్రథమ గీతాజ్ఞానయజ్ఞం ముగిసింది. ఆ దినం పౌరులు స్వాములవారిని అనేకవిధాల ప్రశంసిస్తూ, కృతజ్ఞతలు ప్రకటిస్తూ సత్కరించారు.

స్థానిక కళాశాల - ఆంధ్రభాషాధ్యాపకులు ప్రసిద్ధ విద్వత్కవులు శ్రీ వారణాసి వేంకటేశ్వర్లుగారు స్వామీజీ ఉపన్యాసవిధానాన్నీ, ప్రజలపై దాని ప్రభావాన్నీ వినుతిస్తూ పౌరుల తరపున ఈ క్రింది పద్యకుసుమమాలికను స్వాములవారికి సమర్పించారు.

### పద్యకుసుమమాలిక

" ఓ శ్రీశుకబ్రహ్మాశ్రమ
విశ్రుత విద్యాప్రకాశ! విమలానందా!
మీ శ్రీచరణాబ్జములకు
మా శ్రద్ధాంజలు లివె గొనుమా గిరిస్వామీ! 1

సద్యతీంద్రులు మలయాళస్వామివారి
ప్రముఖ శిష్యత్వమున గురుప్రార్థనమ్ము
సత్క్రమమ్మైన నిత్యకార్యక్రమమ్ము
చెలగి గీతాసుధ నొసంగ గలిగినారు. 2

అకలంకమ్మగు జ్ఞానసాధన విధానైకాగ్ర చిత్తమ్ముతో
సకలార్థప్రద బ్రహ్మచర్యవ్రత దీక్షాదక్ష తేజమ్ముతో
ప్రకటాధ్యాత్మిక చింతనాకలిత దివ్యన్మూర్తితో వెల్గు శ్రీ
శుకబ్రహ్మాశ్రమయోగిపుంగవ! మమున్ శుద్ధాత్ములం జేసితా! 3

కాషాయ వస్త్రమాదిగ
వేషము ధరియించినంత విశ్రుతయతియా!
భాషణము మోక్షమార్గము
ఘోషించునదై వెలుంగ గురుయతి యతడే! 4

జపతపమ్ముల యాగాది సాధనముల
దానధర్మాదికముల సత్ఫలము లెల్ల
గొల్లగా గల్గి మోక్షము కూర్చు గాదె
సర్వసంగపరిత్యాగ సాధువునకు. 5

ఓంకారోచ్చారణతో
శంకర శ్రీరామకృష్ణ సంస్మరణముతో
సంకల్పశుద్ధితో మో
క్షంకర గీతాప్రబోధ గావింతు రహో! 6

వేదశాస్త్ర పురాణాది వివిధగ్రంథ
సింధువును మథించి మివుల శ్రేష్ఠమైన
శ్లోకరత్నరాసుల నేర్చి శోభ మీఱ
మామనముల వెల్గించితి వోమహాత్మ! 7



అట్టి మధురాతి మధురశ్లోకాళి వలన
అశుధారాప్రవాహమా యన్నరీల
వెన్నెల విరిసినట్టుల వివిధ ప్రజకు
తన్మయానంద మొసగితి ధన్యయోగి! 8

ఏ యుపమానము నుడివిన
నాయది యధ్యాత్మతత్త్వ మలరించు చెదో
తీయగ హాయిగ స్థాయిగ
మా యెడదల జేరి ముక్తిమార్గం బయ్యెన్. 9

సంయమీంద్రులు శంకరాచార్యవరులు
రామకృష్ణ పరమహంస రామతీర్థ
స్వామియును వివేకానంద ప్రభృతుల యువ
దేశమణు లొసంగితి మాకు దేశికేంద్ర! 10

రెండుగంటలకాలమ్ము రెండుక్షణము
లట్లు గడచిపోవునుగా మహాత్మ! మీదు
సరళగీతాప్రబోధామృతరసపాన
వాంఛ సభ్యుల హృదయాల బ్రబలియుండ. 11

బహుజన్మరోగసంబాధితుండును మీదు
బోధనౌషధమున ముక్తి గాంచు
అజ్ఞానతిమిరాన నల్లాడువాడు మీ
విజ్ఞాన దీప్తిచే వెలుగు గనును
కామాది మేఘాలు గ్రమ్మ నాతడు మీయు
పన్యాసపవనాన ధన్యు డగును
పాపాంధకూపాన బడినవాడును మీదు
వాగ్ద్యుతిప్రతతిచే భవ్యు డగును
బహుళ సంతాపసంతప్త భావునేని
సంతతానందయుతునిగా సలుపు మీదు

భవ్యగీతా సుధారసా స్వాదనమ్ము
వితత విజ్ఞాన గుణగణ్య! యతివరేణ్య! **12**

సకలజన మౌఢ్య తిమిరమ్ము సమయజేయ
అబ్జబంధునిరాక మీయాగమమ్ము
అతులితానంద మోక్షము నందజేయ
మీదు గీతాప్రబోధమ్ము మేలుకొలుపు. **13**

"దేవుడే లేదు కొలుగావు దేవళాలు
విగ్రహో లెల్ల రాళ్లవి వృథ" యటంచు
నింద చేసెడు పెక్కురు మందమతుల
సత్పథమునకు ద్రిప్పు మీసత్యబోధ. **14**

గీతామహాగ్రంథ పూతనామము నైన
వినని యాతడు దాని గొనగనుండె
తద్రహస్య మెపుడు తలపోయని యతండు
శ్లోక మొక్కటి నేని చూడనుండె
ధర్మకర్మము నింత దనరజేయనివాడు
నిత్యదాననిరతి నెరపనుండె
ఎంగిలిచెయి కాకికే విదల్చనివాడు
పిడికె డన్నము నైన నిడగ నుండె
అంతుదెలియని శుష్కవేదాంతి యిపుడు
వేషభాషల మోసమ్ము వీడనుండె
పూతగీతా మహాయోగబోధవలన
బ్రహ్మవిజ్ఞాన ధుర్య! కర్మందివర్య! **15**

భావము నైర్మల్యముగా
పావన మగు నిష్ఠనిల్పి భగవద్గీతన్
దేవాలయమున నుడువగ
దైవాంశము మీదుమూర్తి దనరును స్వామీ! **16**



అమృతధారగా గీతారహస్యములను
ఉపనిషత్తుల తాత్త్వికయోగములను
పదియునెనిమిది దినము లుపన్యసించి
తౌర! నర్సరాట్పౌర భాగ్యం బదేమొ! **17**

భక్తితోడ నష్టాదశ పద్యకుసుమ
మాల రచియించి మీకు సమర్పణమ్ము
సేతు ప్రవిమలానందముం జెంది హృదిని
ముక్తిమార్గప్రసంగ! యో ముక్తసంగ!" **18**

గీతాయజ్ఞాలలోనూ, ఇతర కార్యాల సందర్భాలలోనూ భక్తులు, ఆధ్యాత్మిక సమాజాలూ ఇలా శ్రీస్వాములవారికి సమర్పించిన స్వాగత పత్రాలూ, సన్మాన పత్రాలూ, ప్రశంసాపద్యాలూ కొల్లలుగా వున్నాయి.

## రెండవ గీతాయజ్ఞం

కాకినాడ పురప్రముఖులు శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్యగారు, శ్రీ బాదం రమణయ్యమూర్తిగార్ల ప్రోత్సాహంతో అక్కడి పౌరులు ద్వితీయ గీతాజ్ఞానయజ్ఞం నిర్వహించవలసిందిగా శ్రీ స్వాములవారిని ప్రార్థించారు. 10-12-1959 నుండి 27-12-1959వరకూ కాకినాడపట్టణమందలి దివ్యజ్ఞానసమాజములో రెండవ యజ్ఞం నిర్వహింపబడింది.

అప్పటి ఉపన్యాసాలను సమీక్షిస్తూ 'జనశక్తి' పత్రిక యిలా వ్రాసింది —

"నిత్యసత్యస్వరూపం ఆత్మ. అది నీలోనే వుంది. అహంకార మమకారాలనే మాయచే ఆత్మ కప్పబడివున్నది. మాయ తెర తొలగించు. ఆనందమయ స్వరూపమగు పరమాత్మను తెలుసుకో. బ్రహ్మానందం పొందు. ఇదేమంత కష్టసాధ్యం కాదు. క్షేత్రమును తయారుచేయుటను భగవద్గీత నీకు తెలుపుతుంది" అని విద్యాప్రకాశానందులు తమ తొలి ఉపన్యాసంలో ప్రబోధించారు.

శ్రీస్వామి రోజుకు 1అధ్యాయం వంతున 18రోజుల్లో భగవద్గీతను ప్రబోధింతురు. పండితపామరరంజకంగా వున్న ఈ ఉపన్యాసములు సుబోధకంగానూ, వ్యక్తుల జీవితములను ఉత్తేజపరచి వెలుగు చూపేవిగానూ ఉన్నాయి."(-జనశక్తి 13-12-59)

శ్రీస్వాములవారి ఉపన్యాససారాంశాన్ని పొందుపరుస్తూ పై పత్రిక 15-12-59 తేదీన ఇలా వ్రాసింది —

"శరీరం, మనస్సు, ఆత్మ కలిస్తే వ్యక్తి అవుతాడు. శరీరంలో ఆత్మ ఉన్నట్లు సమస్త చరాచరములూ, భూమ్యాకాశాలూ అన్నీ చేరి పరమాత్మలో వున్నాయి. అంటే పరమాత్మ సర్వాంతర్యామి. నీలో దైవ మున్నాడనే నమ్మిక నీకు కావాలి. కర్మ-ఉపాసన-జ్ఞానం అని మూడు భాగాలుగా గీత విభజింపబడింది. ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు ఆచరించు. నీ పని నీవు చెయ్. ఫలితము దైవానికి విడిచిపెట్టు, అంటే నిష్కామంగా కర్మను ఆచరించు. పవిత్రమైన మనస్సుతో నీ కర్మ నీవు చేస్తే జ్ఞానం సిద్ధిస్తుంది.

మంచి చెడ్డలు తెలుసుకొనే విచక్షణ మానవుడికి వుంది. రత్నము కొఱకు గాలిస్తారే గాని నత్తగుల్లలకై వెదుకుతారా? ధనార్జనకై శక్తిని వెచ్చించడం వల్ల కడకు శరీరం చితిని చేరిననాడు అది నీతో వచ్చేది లేదు.

సత్కర్మను ఆచరించు. రేపు అనే మాట విడిచిపెట్టు. పొరుగువాడికి సహకరించు. మిక్కిలిగా సంపాదించి తీసుకుపోయేది లేదు. జ్ఞానం వికసింపజెయ్. ఇందుకు భక్తి మూలం. మహాత్ముల మాటలు నమ్మి త్యాగబుద్ధితో సత్కర్మలు చెయ్. చీకట్లు చెదిరి నీకు జ్ఞానం సిద్ధిస్తుంది.

చిత్తమును శుద్ధం చెయ్. ప్రకృతి శక్తులకు వశం కాకు. కామక్రోధాదులు విడిచి పెట్టు, తుచ్ఛభోగములను కాక నిత్యసత్యవస్తువును తెలుసుకో. జీవితములో నిన్ను నీవు తెలుసుకో. చావులేని ఆత్మస్వరూపం తెలుసుకొనుటకు జ్ఞానోపార్జన చెయ్.

బంగారు పంజరంలో వుంచినా చిలుక తన స్వస్థానంలోనే సుఖమును కాంక్షించి ఎట్లు విలవిల తన్నుకొంటుందో, అట్లే ఆత్మస్థానం కొరకు తహతహలాడు. భక్తిభావం పెంచు.

మహాత్మాగాంధీ చెప్పినట్లు స్వరాజ్యం వచ్చిందేకాని స్వారాజ్యం రాలేదు. నిన్ను నీవు తెలుసుకొని స్వారాజ్యం సాధించు. త్యాగం అలవరచుకో! రాగద్వేషాలు విడిచిపెట్టు, జ్ఞానోదయ మవుతుంది. అహం బ్రహ్మాస్మి — అంటే శరీరమే నీవు కాదు, నీలోని నిత్యసత్యస్వరూపమే నీవు. పరమేశ్వర ప్రీతికై కర్మల నాచరించు. నిష్కామకర్మ నీకు జ్ఞానం కల్గజేస్తుంది. ఎంతటి ధనబల మున్నా, ఎంత అధికారబల మున్నా దైవబలం చాలనప్పుడు నాశనం తప్పదు. ధ్యానం చెయ్. పరమేశ్వరార్పణబుద్ధితో చేసే సత్కర్మ ఆత్మజ్ఞానము నిస్తుంది.



బుద్ధుడు సంపదలు త్యజించి నిత్యసత్యమగు పరమేశ్వరసేవలో మునిగిన ఘట్టం జ్ఞప్తికి తెచ్చుకోండి! విరోధం విడిచిపెట్టు! సర్వమూ ఆత్మస్వరూపమే అని తెలుసుకో! గీతలో విశ్వాసముంచు. పాపకర్మకు ప్రతిఫలం దుఃఖం. సత్కర్మకు ఫలం శాశ్వతసుఖం. నీకర్మయే నీమేలుకు తోడ్పడుతుంది. జీవితం విలువను గుర్తించు. పాపభీతి పొందు. కాలం వృథా చేయకు. అవిద్య అనే అజ్ఞానం వల్ల ఎక్కువకాలం వృథాగా పాడవుతున్నది. నీలో పైశాచికశక్తులూ, దైవశక్తిగూడా వున్నాయి. వీటిమధ్య పోరాటం సాగుతున్నది. శాశ్వతమైన దైవశక్తిని సాధించు.

రామకృష్ణ పరమహంస వద్ద జ్ఞానోదయం పొందిన స్వామి వివేకానందుని వలె జ్ఞానార్జనకు కర్మను ఆచరించు. నీ మంచిచెడ్డలు మాత్రమే నిన్ను వెన్నంటి వస్తాయి. నీ మేలుకీళ్లకు నీ వాచరించే కర్మే మూలం". (-జనశక్తి)

ఈ రీతిగా స్వాములవారి ఉపన్యాసాల సారాంశం ఎప్పటికప్పుడు పత్రికల మూలంగా దూరప్రాంతాలలోని ప్రజలకు కూడా చేరుతూ వుండేది.

1960లో మూడవ గీతాయజ్ఞం తెనాలిలోనూ, 1961లో నాల్గవ యజ్ఞం ప్రొద్దుటూరులోనూ జరిగాయి. ఆతరువాత ఒకేసంవత్సరంలో అనేక యజ్ఞాలు జరుపవలసి వచ్చింది. భక్తుల ఆహ్వానాలు అధికసంఖ్యలో వుండడమే అందుకు కారణం. ఈ యజ్ఞాలలో శ్రీ నందిపాటి వెంకటనారాయణగారు స్వామీజీకి తోడ్పాటుగా వుండి పరిచయ ప్రసంగాలు చేసేవారు.

1963లో ఐదవ యజ్ఞం బెంగుళూరులోనూ, ఆరవ యజ్ఞం మద్రాసులోనూ నిర్వహింపబడ్డాయి. ఇలా ఇవి ఇతర రాష్ట్రాలకు గూడా విస్తరించాయి. ఆ సంవత్సరమే నంద్యాల, అనకాపల్లి, మదనపల్లి — అనే చోట్ల గూడా యజ్ఞాలు ఏర్పాటయ్యాయి. కాలక్రమంలో వీటి నిర్వహణ ఇంకా ముమ్మరమవుతూ వచ్చింది. ఒక్క 1967వ సంవత్సరంలోనే ఎనిమిది గీతాయజ్ఞాలు జరిగాయి. 1957లో ప్రారంభమైన ఈ కార్యక్రమం 1982 వరకూ అవ్యాహతంగా కొనసాగింది. 108వ యజ్ఞం 1982లో సికింద్రాబాదులో నిర్వహింపబడింది.

ఈ చివరి యజ్ఞాలను గురించి ప్రస్తావించవలసిన విషయాలను తరువాతి ప్రకరణాలలో ప్రస్తావించుకొందాం.

## పితృపాదుల అస్తమయం

చిన్నతనం నుండీ కుమారుణ్ణి ఆధ్యాత్మిక పథంలోనే నడిపించి తుద కతడు లోకపూజ్యుడైన యతీశ్వరుడు కాగా చూచి సంతసించిన ధన్యాత్ములు శ్రీ తూనుగుంట్ల రామస్వామిగారు 23-3-1960వ తేదీన పరమపదించారు. వారి భౌతికకాయాన్ని ఆశ్రమానికి తూర్పువైపున ఉన్న తోటలోని ఆత్మారామాశ్రమంలో శాస్త్రవిధి ప్రకారం సమాధి చేశారు. శుకబ్రహ్మాశ్రమ స్థాపనానంతరం ఆ తోటలోనే వారు వానప్రస్థాశ్రమస్థులై సాధన చేసుకుంటూ వుండేవారు. వారి మండలారాధన 1-5-60వ తేదీన జరిగింది. ఆనా డక్కడ చేరిన పెద్దలు వారి గుణగణాలను ప్రశంసించి శ్రద్ధాంజలి ఘటించారు.



# ద్వాదశ ప్రకరణం

## ఆశ్రమ పురోగతి

శ్రీ శుకబ్రహ్మాశ్రమం క్రమక్రమంగా అభివృద్ధి పొందుతూ భక్తులనూ, సాధకులనూ విశేషంగా ఆకర్షించింది. ఆశ్రమప్రదేశం నలభై ఎకరాలకు వ్యాపించిన విశాలమైన క్షేత్రం. మామిడి, ముంతమామిడి, సపోటా, జామ మొదలైన ఫలవృక్షాలు ఆశ్రమశోభను ఇనుమడింపజేశాయి. తోటపనులు వ్యవసాయం చూడటానికి కొందరు పనివారు నియమింపబడ్డారు. ఆధ్యాత్మిక సాధనలు కొనసాగించే సాధువులు కూడా కొందరు ఆశ్రమంలో స్థిరపడ్డారు. పై కారణాలవల్ల ఆశ్రమవ్యయం పెరుగుతూ వచ్చింది. గృహస్థభక్తులనుండి భిక్షాపాత్రలద్వారా వచ్చే బియ్యం వస్తున్నా పై ఖర్చులు బాగా పెరిగిపోయాయి.

అందువల్ల శ్రీ కె. వెంకటాచలం నాయుడుగారు, శ్రీ సేగు వెంకటనారాయణగారు, శ్రీ దేవతి తిమ్మరాయప్పగారు, శ్రీ నామా యెరుకలయ్యగారు, శ్రీ ముల్లంగి నరసయ్యగారు, శ్రీ సూరిపెద్ది అచ్చయ్యగారు మొదలైన ముఖ్య భక్తులు సమాలోచన జరిపి నిత్యభోజనవ్యయానికై శాశ్వతభిక్షాపథకం ఏర్పాటు చేశారు. ఆ పథకం ప్రకారం దాతలు రెండువందల రూపాయల చొప్పున చందా చెల్లించేటట్లు నిర్ణయ మయింది. తగినంత సంఖ్యలో చందాలు వచ్చాయి. సభలకు ఆహ్వానించేవారు స్వాములవారికి సమర్పించే సత్కారధనం కూడా ఆశ్రమనిర్వహణకు ఉపకరించింది.

ఆశ్రమ దర్శనానికై వచ్చే భక్తుల వసతికై ఒక అతిథిమందిరం అవసర మయింది. ప్రొద్దుటూరు వాస్తవ్యులు శ్రీ కశెట్టి చినవెంకటసుబ్బయ్యగారు అతిథిమందిర నిర్మాణార్థం అవసరమైన పైకం సమర్పించారు. శ్రీ లింగాల రామయ్యశ్రేష్ఠిగారు మున్నగువారు తక్కిన గదుల నిర్మాణానికై విరాళా లిచ్చారు. ఇతర భక్తుల సహకారంతో గోశాల నిర్మాణమూ, విద్యుదలంకరణం మొదలైన పనులు గూడా నెరవేరాయి.

## ఆనంద వైద్యాలయం

ఆశ్రమం చుట్టుప్రక్కల ప్రాంతాల్లో నిరుపేదలైన యానాదులు విశేషంగా వున్నారు. కూటికీ, గుడ్డకూ వారు నిత్యమూ శ్రమపడవలసిందే. శ్రీ స్వాముల వారు వాళ్ల పరిస్థితి గమనించారు. ఆశ్రమంలో విశేషకార్యక్రమాలు జరిగే దినాలలో వాళ్లకు అన్నవస్త్రదానాలు ఏర్పాటు చేశారు. రోగగ్రస్తులైనప్పుడు ఆయానాదుల పరిస్థితి మరీ శోచనీయంగా వుండేది. ఆశ్రమంలో ఒక వైద్యాలయం నిర్మిస్తే ఆ గిరిజనులు బాగుపడతారని స్వామీజీ సంకల్పించారు. భట్టిప్రోలు వాస్తవ్యురాలు శ్రీమతి తమ్మన మహాలక్ష్మమ్మగారు మొదలైన భక్తులు వైద్యాలయనిర్మాణానికై భూరివిరాళాలు అందజేశారు.

27-1-1961వ తేదీనాడు వైద్యాలయానికి శ్రీ స్వాములవారు శంకుస్థాపన చేశారు. నిర్మాణం త్వరలో సమాప్త మయింది. చక్కని భవనం ఏర్పడింది. మందులకు అవసరమైన నిధికి గూడా భక్తులు చందా లిచ్చారు. శ్రీకాళహస్తి వాస్తవ్యులు డాక్టరు మొగిలప్పగారు వైద్యాలయంలో ఉచితసేవ జేయడాని కంగీక రించారు. 14-2-1962వ తేదీన ఆనంద వైద్యాలయాన్ని శ్రీ స్వాములవారు ప్రారంభించారు.

## గ్రంథప్రచురణ - వసిష్ఠగీత

శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు వ్యాసాశ్రమంలో గురుకులవాసం చేసే సమయంలోనే యోగవాసిష్ఠాన్ని సమగ్రంగా అధ్యయనం చేశారనీ, ఉత్తరార్థానికి అనువాదం కూడా వ్రాశారనీ ముందే చెప్పుకొన్నాం. 32వేల శ్లోకాలుగల మహాగ్రంథం కావడం వల్ల సామాన్యపాఠకుల కది అందుబాటులోనిది కాదు. అందుచేత సంగ్రహంగా ఆ గ్రంథ సారాంశాన్ని వేదాంత జిజ్ఞాసువులకు అందించాలని శ్రీ స్వాములవారు సంకల్పించారు. ముఖ్యమైన తత్త్వభాగాన్నీ, ప్రధానమైన కథాం శాలనూ మాత్రమే గ్రహిస్తూ ఎనిమిదివేల శ్లోకాలను ఎన్నుకొన్నారు. వాటిని అధ్యాయాలుగా విభజించారు. పిమ్మట తెలుగు తాత్పర్యం కూడా చేర్చి వసిష్ఠగీత' అన్న పేరుతో ప్రథమ భాగాన్ని 1957లో ప్రకటించారు.

సుప్రసిద్ధమైన భారతి పత్రిక ఈ గ్రంథాన్ని సమీక్షిస్తూ ఇలా వ్రాసింది —

". . . . . . . ముముక్షుజనప్రయోజనార్థం ఈ గ్రంథాన్ని ఇలా



సంఘటించారు. తేట తెనుగులో తాత్పర్యం వ్రాయబడింది. యోగవాసిష్ఠంలోని 32వేల శ్లోకాలు చదివి అర్థంచేసుకొని దానిలోనుండి సిద్ధాంతరూప పరమార్థాన్ని గ్రహించడం సంస్కృతం రాని వారి మాట అటుంచి సంస్కృతవిద్వాంసులకు గూడా తలకు మించిన పనే. అందుచేత సర్వాంధ్ర ప్రజానీకానికి అందుబాటుగా ఈ గ్రంథాన్ని సంక్షేపించి తాత్పర్యంతో అందజేస్తున్న శ్రీ స్వామివారి కృషి ప్రశంసనీయ మైనది".

(భారతి - మే - 57)

శ్రీరామకృష్ణప్రభ తన సమీక్షలో ఇలా అన్నది—

". . . . . . శ్రీ స్వాములవారు మూలగ్రంథమునందలి ప్రధాన తత్త్వభాగాలు విడువక బాహుళ్యమును సంగ్రహించి విశేషాంశములను కుండలీకరణములలో వివరించి నాతిసంగ్రహముగా, నాతివిస్తరముగా సరళశైలిలో నిర్దుష్టమగు భాషతో వచనరచన సాగించిరి.

శాస్త్రజ్ఞానమునకుతోడు అనుభూతియు గలవా రగుటచే శ్రీస్వామివారు గూఢార్థ క్లిష్టార్థములను వివరించి పరిత్యజనమునకు కరతలామలక మొనర్చిరి. అచ్చటచ్చట వ్యాఖ్యానవిశేషములను గూడ పొందుపరచిరి. - - - - - - అత్యంతోపయుక్తమగు ఇట్టి గ్రంథమును రచించి సాధకలోకమున కందజేసిన శ్రీ స్వామివారు మన కెల్లరకును కరము వంద్యులు".

( శ్రీ రామకృష్ణప్రభ - మే - 1957)

మరికొన్ని పత్రికలు ఈ క్రిందిరీతిగా తమ అభిప్రాయాలు ఈ గ్రంథంపై ప్రకటించాయి—

"అనేక పుష్పములనుండి తేనెటీగలు మధువును సమకూర్చునట్లు యోగ వాసిష్ఠములోగల జ్ఞానామృతమును దీనియందు సమకూర్చడమైనది".

( యథార్థభారతి - ఏప్రిల్ - 1957)

"గ్రంథము, అనువాదకుల కృషి వెలయిడరానిది. - - - - ఆధ్యాత్మికవిద్య జనబాహుళ్యానికి కలగడానికి ఇట్టి గ్రంథము లత్యావశ్యకములు".

( గోల్కొండ పత్రిక - 4-8-57)

". . . . . . *The work is well Planned . . . . . . It quenches the Philosophical thirst of the non-sanskrit Telugu knowing people of India".*

*( Indian Express - 5-5-57)*

". . . . . . . గ్రంథరచన చక్కగా నున్నది. . . . . . . ఈ గ్రంథం భారతదేశంలోని సంస్కృతం రాని ఆంధ్రుల యొక్క ఆధ్యాత్మికపిపాసనను తీరుస్తున్నది".

(ఇండియన్ ఎక్స్ప్రెస్)

శ్రీ శుకబ్రహ్మాశ్రమ ప్రచురణలలో వసిష్ఠగీత చాలా ముఖ్యమైనది. స్వాముల వారు గీతాజ్ఞానయజ్ఞాలలో ఉదయవేళల యోగవాసిష్ఠంపై ప్రసంగాలు కొనసాగించి గ్రంథవ్యాప్తికి అపూర్వమైన కృషి చేశారు.

## గీతోపన్యాసములు

వసిష్ఠగీత తర్వాత ఆశ్రమం తరపున ప్రకటింపబడ్డ గ్రంథాలలో చెప్పుకోదగింది 'గీతోపన్యాసములు'. 1959 డిశంబరులో కాకినాడలో ద్వితీయ గీతాజ్ఞాన యజ్ఞం జరిగిందని పాఠకులకు తెలుసు. శ్రీస్వాములవారికి ముఖ్యశిష్యులూ, ఆశ్రమ కార్యనిర్వహణలో అత్యంతప్రముఖులూ అయిన శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు నాటి ఉపన్యాసాలను సంక్షిప్తంగా తమ ఆశ్రమవాసుల ఉపయోగానికై వ్రాసు కొన్నారు. భక్తులకోరికపై తరువాత 'గీతోపన్యాసములు' అన్న పేరుతో వాటిని గ్రంథంగా ప్రకటించారు. గ్రంథం మొదట విజ్ఞప్తిలో శ్రీ గోపాల్‌గారు ఇలా వ్రాసివున్నారు---

"శ్రీవారి ప్రబోధము అనర్గళముగ, మృదుమధురముగ కొనసాగిన విషయం అచ్చటి శ్రోతలకు అనుభవైక విషయమే. మా ఆశ్రమవాసుల కోర్కెపై ఏరోజు ఉపన్యాసములను ఆరోజు అచ్చోటనే నా శక్తికొలది సంక్షేపముగ వ్రాసికొని ఆశ్ర మవాసులకు పంపుచుంటిని. శ్రీవారి ఉపన్యాసములను పూర్తిగ వ్రాసుకొనుటకు ఆ తొందరలో సాధ్యపడకపోయినను పర్యాప్తమగు విషయమును యథాశక్తి సంగ్రహింప గలిగితిని. అదియే ఈ గ్రంథరూపమున ఆవిర్భవించినది".

ఈ గ్రంథం 1961లో వెలువడింది. దీనిపై అనేక పత్రికలు తమ సమీక్షలు ప్రకటించాయి. కొన్ని సమీక్షాంశాలను ఈక్రింద గమనిద్దాం.

"గీతోపన్యాసములకంటె గీతానుష్ఠానమే ప్రధానమైనది అన్న అంశాన్ని బలంగా శ్రోతల మనసులపై ముద్రిస్తూ నడిచిన గీతోపన్యాసాలు. ఇందులో సులభగ్రాహ్యంగా అనేక కథలతో, గాథలతో, సూక్తులతో గీతాహృదయం వివృతమైంది. ప్రధానంగా శీలసంపత్తిని సముపార్జించుకొనుటకే తప్ప శుష్కతర్కాలకు, చర్చలకు మాత్రం



ఇది ఉద్దిష్టం కాలేదన్న ప్రధాన భావం అంతటా అనుస్యూతమై వుండడం విశేషం".

(ఆంధ్రజ్యోతి - 29-3-1961)

"ఆచరణానుష్ఠానముల కొఱత గలిగిన ఈ రోజులలో ఈ గ్రంథమెంతయో అనుకూలపడును. ఇట్టి గ్రంథాలు తెలుగులో, ఆధ్యాత్మికవాఙ్మయములో మిక్కిలి అపూర్వమైనవి. గీతాప్రమాణమును చూపుటే కాక ఉపనిషత్తులు, ఇతర శాస్త్ర సారములు గూడ అచ్చటచ్చట నిరూపింపబడినవి. శ్రీ వివేకానందస్వాములవారి గంభీరములైన ఆధ్యాత్మికవాక్యప్రబోధములు దీనిని మరింత ప్రకాశింపజేయుచు న్నవి".

(యథార్థభారతి - ఆగష్టు-1961)

*"The author in every chapter honestly tries to bring out the gist in simple language. In every chapter; there is a synthetic gist aided by good story examples and quotations from Vivekananda, Mahatma Gandhi etc., to suit the modern taste . . . . . The author beautifully blends the essence of Vasisthagita and that of Bhagavadgita on more than one occasion".*

*(Indian Express 11-9-61)*

"రచయిత ప్రతి అధ్యాయంలోనూ సులభభాషలో దాని సారాంశం వ్యక్తం చేయటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించారు. ప్రతి అధ్యాయంలోనూ ఆధునిక అభిరుచుల కనుగుణంగా చక్కని కథలతోనూ, వివేకానంద- మహాత్మా గాంధీ వంటి వారి ఉపదేశాలతోనూ సమన్వయాత్మకంగా తాత్పర్యం ప్రతిపాదింపబడింది. అనేక సందర్భాలలో వసిష్ఠగీతా - భగవద్గీతల సమన్వయాన్ని గ్రంథకర్త చక్కగా సాధించారు."

(ఇండియన్ ఎక్స్ప్రెస్)

ఈ గ్రంథం ఇటీవల 'గీతాహృదయం' అన్న పేరుతో మలయాళభాషలోకి అనువదింపబడింది. ఆశ్రమగ్రంథాలు ఆంధ్రావనిలో విరివిగా వ్యాప్తిపొందాయి. గీతోపన్యాసకార్యక్రమాలు గ్రంథవ్యాప్తికి ఎక్కువగా దోహదం చేశాయి.

1961లో కృష్ణాజిల్లాలోని పాహికాపురంలో 35వ సనాతన వేదాంతజ్ఞాన సభ జరిగింది. శ్రీ సద్గురు మలయాళస్వాములవారు అనారోగ్యంతో వుండి కూడా సభకు హాజరయ్యారు. అధ్యక్షత వహించిన శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ ఆసభలో అనర్గళమైన మహోపన్యాసం కావించారు. వారి ఉపన్యాసకౌశలాన్ని

అభినందిస్తూ శ్రీ సద్గురుదేవులు "మోతీలాల్ నెహ్రూ కుమారులు జవహర్ లాల్ తండ్రిని మించిన తనయుడు అనే కీర్తి సంపాదించారు. ఇప్పుడు మీరు సభలో శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి ప్రవచనం విన్నారు కదా! మేము పెట్టిన పేరును వారు సార్థకం చేశారు. మన కిప్పుడు పూర్ణ తృప్తి కలిగింది" అని అందరి సమక్షంలో ప్రశంసించారు.

శ్రీ నామా యెరుకలయ్యగారు మొదలైన పురప్రజల ఆహ్వానంపై ప్రొద్దుటూరికి వెళ్లి అక్కడ 24-7-1961 నుండి శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు అర్థచాతుర్మాస్యవ్రతం నిర్వహించారు. 25-9-1961 నాడు శ్రీ గాదంశెట్టి సుబ్బయ్యస్మారక సంస్కృతభవనానికి ప్రారంభోత్సవం చేశారు. సుప్రసిద్ధ కవి పండితులు శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు మొదలైనవారు ఆ సభలో సంస్కృత భాషా ప్రాశస్త్యాన్ని గూర్చి ఉపన్యసించారు. ఆసందర్భంలో మాట్లాడుతూ శ్రీ స్వాములవారు ఇలా అన్నారు —

"విద్యాభివృద్ధికై పుణ్యాత్ములు ముందుకు వచ్చి కృషిచేయడం ముదావహం. భారతదేశంలో చాలాకాలంగా విదేశీభాషల ప్రాతినిధ్యంవల్ల సంస్కృతం మరుగున పడిపోయింది. పరభాషాప్రియులైన భారతీయులు సంస్కృతం మృతభాష అనడం శోచనీయం. సంస్కృతభాషాభివృద్ధికి ప్రభుత్వం కొంత దోహదం కల్గించడం ప్రశంసనీయం.

పరమాత్ముని కనుగొని శాంతి అనుభవించడం ప్రధానం. విశ్వవ్యాప్తుడైన భగవంతుని విస్మరించిన మానవుడు దిగజారిపోతాడు. పరావిద్య నాశ్రయించి పరాత్పరుని సాక్షాత్కారం పొందాలి. సత్యాహింసాధర్మాలకు బద్ధుడైన ప్రతిమానవునికీ ఉపకారం చేయడం, తాను బ్రతికి ఇతరులను బ్రతికింప జేయడం పరమలక్ష్యం. అదే మానవత్వానికి లక్షణం".

చాతుర్మాస్యవ్రతానంతరం మడకశిరలో పది రోజులపాటు గీతోపన్యాసాలు జరిగాయి. అక్టోబర్ 16 నాటికి ఆ కార్యక్రమం పూర్తిచేసుకొని అక్కడనుండి స్వామీజీ నెల్లూరు వెళ్లారు. అక్కడ స్టోన్‌హౌస్‌పేటలో ప్రేమసంఘం ఆధ్వర్యాన గీతాప్రబోధకార్యక్రమం జరిగింది. ఆసమయంలోనే భగవద్గీతాభవన ప్రవేశానికి ప్రారంభోత్సవం చేసి అందులో శ్రీకృష్ణవిగ్రహాన్ని కూడా 20-10-1961నాడు శ్రీ స్వాములవారు ప్రతిష్ఠించారు.

మహబూబ్ నగర్ జిల్లా షాద్ నగర్‌లో 1962 మార్చి మాసంలో 36వ సనా



తన వేదాంతజ్ఞానసభ నిర్వహింపబడింది. శ్రీ మలయాళ సద్గురుదేవులు హాజరైన చివరి సభ అదే. శ్రీ సద్గురు స్వామీజీ ఆరోగ్యం చక్కగా లేని రోజు లవి. శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి అధ్యక్షతన సభ చక్కగా జరిగింది.

ఆతరువాత కోలారు జిల్లాలోని అగరం-శ్రీనివాసాశ్రమంలో భాగవతసప్తాహ కార్యక్రమానికి శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ అధ్యక్షత వహించారు. అక్కడ శ్రీకన్యకాపరమేశ్వరీ - శ్రీమురళీకృష్ణుల విగ్రహప్రతిష్ఠలను ఆసందర్భంలోనే వారు నిర్వహించారు. పిదప నెల్లూరు జిల్లాలోని అల్లూరు గ్రామంలో 7-6-62 నుండి 17-6-62 వరకు ఏకాదశాహ్నిక గీతాయజ్ఞాన్ని నడిపారు.

## నిర్భయత్వ ప్రబోధం

గీతలో భగవంతుడు క్షుద్రమైన హృదయదౌర్బల్యం త్యజించి కర్తవ్య పరాయణుడవు కమ్మని పార్థునికి బోధిస్తాడు. దైవీసంపదకు చెందిన గుణాలలో 'అభయ'మనే గుణాన్నే మొదట పేర్కొంటాడు. ద్వైత భావన కలవారికే భయం కాని అద్వైతభావన కలవారికి భయ ముండదని శ్రుతి ఉద్ఘోషిస్తున్నది.

శ్రీ స్వాములవారు తమ ప్రబోధాలలో ముఖ్యంగా "నిర్భయముగా నుండుడు!" *(Be Fearless)* అని మాటిమాటికీ శ్రోతలను హెచ్చరిస్తూ వుంటారు. భయ రహితంగా వుండడాని కవసరమైన సాధనలను భక్తులకు వివరిస్తూ వుంటారు.

1962లో శుకబ్రహ్మాశ్రమానికి జరిగిన వార్షికోత్సవంలో ఆశ్రమానికి వచ్చిన భక్తులకు 'నిర్భయత్వం'అనే శీర్షికతో ఈ క్రింది జ్ఞానపుష్పం (కరపత్రం) అందజేయబడింది.

"మానవుని మాధవునిగ మార్చునది సచ్ఛీలము. మానవుని దానవునిగా రూపొందించునది దుశ్శీలము. దుశ్శీలమును వీడి సచ్ఛీలము నాశ్రయించుటయే మానవతాచిహ్నము. *Character is $\frac{3}{4}$ religion* - సద్గుణసమాశ్రయత్వమే ముప్పాతిక మతమని చెప్పబడినది. అది లేనిచో మతమునకు గాని, మానవునకు గాని విలువే యుండదు. కాబట్టి శీల సంపాదన, సద్గుణావలంబనము జీవితమునందలి అతిముఖ్యమైన అంశమని విజ్ఞులు పేర్కొనిరి.

అట్టి సద్గుణము లన్నిటిలోను నిర్భయత్వము శిరోమణియై యలరారుచున్నది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ నిర్భయత్వ, ధైర్యోత్పాదక వచనములతో గీతను

ప్రారంభించెను. ఇంతియే కాదు. దైవగుణములలో దానిని ప్రప్రథమముగ పేర్కొనెను. భయస్థుడు, దుర్బలుడు ఏ కార్యమును సాధింపజాలడు. లౌకికరంగమునందు గాని, పారలౌకికక్షేత్రమునందు గాని భయశీలుడు, పిరికిపంద ఒక్క అడుగైనను ముందునకు వేయజాలడు. ప్రపంచమున మహాకార్యము లన్నిటిని నిర్భయచేతస్కులే సాధింపగల్గిరి. మోక్షమను చరమలక్ష్యమును గూడ అట్టి అభయచిత్తులే కైవస మొనర్చుకొని యుండిరి.

అయితే, భయమును త్యజించుట ఎట్లు? అనునదియే ప్రశ్న. అందులకై భయముయొక్క మూలకారణమును విచారింపవలయును. దేహాభిమానమే భయమునకు మూలము. దృశ్యవస్తువులపై మమతయే భయమునకు ప్రధాన కారణము. అవి యున్నంతవఱకు భయము మానవుని విడనాడజాలదు. మఱియు శాశ్వతవస్తువగు పరమాత్మ నాశ్రయించనంత వఱకు జనులను భీతి వెన్నంటుచునే యుండును. హిరణ్యకశిపుడు ఎన్నియో యిడుమలపాలు చేసినప్పటికిని ప్రహ్లాదుడేల భీతి జెందలేదు? దేహాభిమానమును వదలివేసి విష్ణుభగవానుని ఆశ్రయించెను గనుక.

రామనామ జపతాం కుతో భయమ్ - రామనామము జపించువానికి (భగవంతుని ఆశ్రయించువానికి) ఇక భయమెచట? అని ప్రహ్లాదుడు తండ్రిని నిలదీసి ప్రశ్నించెను. కాబట్టి నిర్భయత్వ మను దైవీసంపదను వాంఛించువాడు దేహాది ప్రాపంచికవస్తువుల యెడల మమత్వమును పారదోలి, భగవంతునియందు భక్తిని అలవరచుకొనవలెను. చంచలములగు పదార్థములను పట్టుకొనువాడు, క్షణికమగు దేహముపై విశ్వాసము కలవాడు భయ మను పెనుభూతమునకు వశుడైపోవును. అచంచలమై, శాశ్వతమైనట్టి పరమాత్మ నాశ్రయించువాడు సర్వకాలములందును నిర్భయుడై వెలయుచుండును. తల్లి యొడియందున్న పసికందు ఎన్నడైనా భీతి జెందునా? గట్టి స్తంభమును పట్టుకొని తిరుగువా డెన్నడైన క్రింద పడునా? పడడు.

మఱియు పూర్ణ భయరాహిత్యము కేవల అద్వైతస్థితియందే జీవునకు సిద్ధించుచున్నది. దైవము (ఆత్మ) మినహా మఱియొక వస్తువున్న దని భావించిన వెంటనే భయము వచ్చి జీవుని బాధించుచున్నది. కాబట్టి దృశ్యవస్తువులయెడల వాంఛలను తగ్గించుకొనుచు అట్టి అద్వయపరమాత్మ సాక్షాత్కారమునకై మనుజుడు లెస్సగ అభ్యాసము సలుపవలయును. దుఃఖరాహిత్యమునకు, ఆనందప్రాప్తికి



అభయస్థానమగు అట్టి ఆత్మయే శరణ్యము. ఇవ్విషయమున శ్రీ వివేకానందుల గంభీర వచనములు పేర్కొనదగియున్నవి.

*“The only religion that ought to be taught is the religion of fearlessness. It is fear that brings misery, fear that brings death, fear that breeds evil and what causes fear? Ignorance of our own nature”.*

“నిర్భయత్వ”మతమే యిపుడు చాటదగిన ఏకైకమతము. ఏలయనిన భయమే దుఃఖమును గలుగజేయును; భయమే చావును తెచ్చును; భయమే దోషమును సృజించును; ఇట్టి భయము దేనివలన కలుగుచున్నది? మన వాస్తవస్వరూపమును మనము మఱచినందువలననే”.

కావున వివేకవంతుడు ప్రయత్నపూర్వకముగ ఈ భయమను దుర్గుణమును తన హృదయసీమనుండి ఏరి పారవేసి నిర్భయత్వ మను సుగుణరాజమును తనయందలంకరించుకొనవలెను. మోక్షమునకు రాచబాట యిదియే యని ముముక్షువులు సర్వదా జ్ఞప్తియందుంచుకొందురు గాక! భయమును పారద్రోలుడు. ‘విగతభీః’ అను గీతాశంఖారావము దశదిశల వ్యాపించి సర్వుల శ్రుతిపుటములందు ప్రతిధ్వనించు గాక! ‘అభయం’ *(Be fearless)* అను మంత్రరాజమును ఎల్లరును నిరంతరము పఠించి, జపించి, స్మరించి, అనుభూతమొనర్చుకొని తరింతురు గాక!!”

ఇలాంటి ప్రబోధాల నెన్నింటినో ఆశ్రమంవారు కరపత్రాలుగా ప్రచురించి భక్తలోకానికి అందజేసి వున్నారు.

## శ్రీ సద్గురుదేవులకు శ్రద్ధాంజలి

శుభకృ దాషాఢ శయనైకాదశీ పుణ్యదినాన 12-7-1962నాడు శ్రీమలయాళ సద్గురుస్వాములవారు వ్యాసాశ్రమంలో భౌతికకాయ పరిత్యాగం చేశారు. ఆంధ్రదేశాన్ని ఆధ్యాత్మికంగా చైతన్యవంతం చేసిన మహనీయుడు, శుష్కవేదాంత తమోభాస్కరుడు అస్తమించినందుకు ఆంధ్రదేశ మంతా కంట తడి బెట్టింది.

గురుదేవులు కనుమరుగైన వార్తవిని శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు ఇంచుకసేపు దిగ్భ్రాంతికి లోనయ్యారు. వెంటనే వ్యాసాశ్రమానికి వెళ్లి శ్రీవారికి నివాళు లర్పించారు.

తరువాత శ్రీ సద్గురుస్వాములవారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ ‘యుగపురుషుడు’

అన్న పేరుతో ఒక వ్యాసం వ్రాసి యథార్థభారతి మాసపత్రికకు పంపారు. ఆ వ్యాసంలోని కొన్ని భాగాలు ఇవి—

"ఇరువదియవ శతాబ్దమున భారతదేశమున, అందును ముఖ్యముగ దక్షిణాపథమున ఆధ్యాత్మిక గగనవీధియందు తమ దివ్యతేజఃపుంజములు దశదిశల విరజిమ్ముచు ప్రకాశించిన గొప్పనక్షత్రములు మూడు కలవు. అవియే శ్రీ రమణ మహర్షి, శ్రీ అరవిందయోగి, శ్రీ మలయాళయతీంద్రులు అను సంజ్ఞలతో నొప్పుచు జగద్విఖ్యాతిగాంచిన మహనీయుల పుణ్యస్వరూపములు. జనుల హృదయాంతరాళములయందు వ్యాపించిన నిబిడ అజ్ఞానతమమును విచ్ఛిన్న మొనర్చుటకు కంకణబద్ధులై యవతరించిన యుగపురుషులు వీరు. కోటానుకోట్ల జనులలో నిటువంటి ఏ ఒకరిద్దరినో భగవానుడు తన పవిత్రసందేశమును లోకమున ప్రకటించుటకు ఎన్నుకొనును. వారు ఆ జీవితము ఒక్క కళంకమైనను లేక, నిర్దుష్ట జీవనమును గడపుచు, తాము తరించి యితరులను గూడ తరింపజేయుదురు. శ్రీ వ్యాసభగవానుడు, శ్రీ శుకమహర్షి, శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానంద మున్నగు లోకోత్తరపురుషుల కోవకు జెందినవారే వీరు ముప్వురును. వారి సమకాలికులుగ నుండగల్గు భాగ్యము ఇప్పటి జనులకు గలుగుట మహాపుణ్యవిశేషమే యగును. వారు ముప్వురును తమకు నిర్దేశింపబడిన లోకోద్ధరణకార్యమును మిగుల దక్షతతో పూర్తిచేసుకొని భగవంతుని పిలుపు నాలకించి ఒకరి తరువాత నొకరుగ ఇహలోకమును వీడి పరంధామమును జేరుకొనిరి.

అట్టి పూజ్యత్రయమునం దొకరైన శ్రీ మలయాళయతివర్యులు కొలది దినముల క్రిందటనే తమ భౌతికకాయమును పరిత్యజించిరి. అది ఆషాఢశుద్ధ ఏకాదశీ పవిత్రదినము. శ్రీవారి వియోగమును గూర్చిన పిడుగువంటి వార్త భక్తుల చెవులకు సోకగనే వారు దిక్కుతోచక నలుదెసలనుండియు పరుగిడివచ్చి శ్రీ వ్యాసాశ్రమమున వ్రాలి శ్రీవారి భౌతికకాయమునకు తమ అంతిమశ్రద్ధాంజలి ఘటించి వెడలిరి. కాని, తదుపరి కర్తవ్యమేమి? ఇట్టి సమయములందు భక్తులందరును ముఖ్యముగ ఆలోచింపదగిన విషయ మిదియే అయియున్నది. మనోనిబ్బరము కలిగి, గుండెను దిట్టము చేసుకొని, ఆక్రందనములను చాలించి, శ్రీవారి దివ్యస్మృతులకు తమ హృదయమున చోటివ్వవలెను. శ్రీవారి ఆదర్శజీవితమును పదేపదే స్మృతిపథమునకు తెచ్చుకొనుచుండవలెను. శ్రీవారి మహోన్నతాశయములను బాగుగ



మననము చేయుచుండవలెను.

శ్రీ మహర్షి మలయాళస్వాములవారి జీవితమునంతను ఒక్క పర్యాయము సింహావలోకనము చేసినచో అన్నింటికంటె మిన్నగ ఒకానొక తత్త్వము గోచరించుచుండును. అది యేదనగా 'చెప్పినది ఆచరించుట, ఆచరించినదే చెప్పుట'. వాచావేదాంతులు సర్వత్ర ప్రబలియున్న ఈరోజులలో అది యొక ఆశ్చర్యమే యగును. శ్రీవారు తమ జీవితమునంతను ఒక 'పరమార్థ ప్రయోగశాల' ***(Spiritual Laboratory)***గ మార్చుకొనిరి. సత్యమును సాధించుటకు ఎన్నియో త్యాగముల నొనర్చిరి. ఆత్మతత్త్వానుభూతికై శాస్త్రోక్తములగు సాధనల నెన్నిటినో చేసిరి. నియమబద్ధమగు జీవితమును గడపిరి. తిరుపతి కొండలపైగల గోగర్భ తుంబురు తీర్థాది పుణ్యప్రదేశములందు ఏకాకియై వారు సల్పిన ఘోరతపస్సు, తీవ్రతరసాధనలు తలంచుకొనినచో గుండె నీరైపోగలదు. ధ్యాననిమగ్నులై రోజుల తరబడి ఆహారమును మఱచుట, నిర్మలభక్తితో లక్షలకొలది మంత్రజపము చేయుట, దేహభావమును విస్మరించి ధ్యేయాకారముతో బహుకాలము తన్మయులగుట --- ఇట్టి యనుభవము లెన్నియో సాధనకాలమున వారి దైనందిన జీవితమున ప్రకటితములగుచుండెను. గొప్ప పట్టుదలతో, నిర్భయత్వముతో వారు తమ సాధనను కొనసాగించి తుదకు విజయమును చేపట్టిరి. పవిత్రత *(Purity)*, సహనము *(Patience)*, పట్టుదల *(Perseverence)* --- $P^3$ అను ఈ సుగుణత్రయము వారి జీవితమున ప్రతియంశమందును ప్రస్ఫుట మగుచుండెను. ఒక్క నిమిషమైనను వారు వ్యర్థముగ గడుపలేదు. సోమరిదేవతను నూటికి నూరుపాళ్లు బహిష్కరించినవారే అధ్యాత్మపథమున ఔన్నత్యము నొందగల్గుదురని తమజీవితము ద్వారా ప్రత్యక్షముగ వారు లోకమునకు చాటినవారైరి.

. . . . . . . శ్రీ మహర్షి మలయాళయతీంద్రుల దివ్యజీవితము కర్మ భక్తి ధ్యాన జ్ఞానయోగము లన్నింటియొక్క సంపుటక్షేత్రమై యలరుచు లోకమున ఆదర్శవంతముగ విరాజిల్లెను. ఒక వ్యక్తి తన జీవితములో నిన్నికార్యముల నెట్లు చేయగల్గెను? చేసియు తా నేమియు చేయనట్లు అసంగముగ నెట్లుండ గల్గెను? ఇదియే శ్రీవారి జీవితమునందు మనము తెలిసికొనదగిన ముఖ్య విషయము.

దానికి హేతు వెద్దియో శ్రీవారే యిట్లు సెలవిచ్చిరి — "నాయనలారా! మీలో కొందరు తలంచునట్లు ఇది యంతయు మలయాళ మంత్రమహిమ కాదు. యంత్రతంత్రముల ప్రభావము కాదు. పంచకోశములను వివేకముచే వేఱుపఱచి

వానికి సాక్షియై విలసిల్లు దృక్-స్వరూప పరమాత్మ యందు మనస్సును నెల కొల్పి, దృశ్యమును మిథ్యగా దలంచుచు దాని యం దభిమానము లేకయుందును. ఇదియే నేను చేయు పని. ఇంతకుమించి యేమియున్ను లేదు. దాని ప్రభావమే ఇది యంతయును. మీరున్ను ఆప్రకారముగ విషయవిరక్తి గలిగి ఆత్మచింతనము చేయుడు. తప్పక శ్రేయము నొందగలరు. కృతార్థులు కాదలంచుచో కృతకృత్యులు కండు!"

శ్రీవా రిపుడు తమ కర్తవ్యమును నెరవేర్చుకొని వెడలిపోయిరి. ఇక వారి సందేశమును కార్యాన్విత మొనర్చుపని మన భుజస్కంధములపై నున్నది. వారి వాక్యములను చక్కగ పాలించుటయే వారి ఋణమును తీర్చుకొనుటకు మార్గము. శ్రీవారు తమ భౌతికదేహమును వీడినప్పటికిని, సూక్ష్మరూపమున సర్వత్ర వర్తిం చుచు భక్తుల నుత్తేజపరచుచుండగల రనుటలో సందియము లేదు. శ్రీవారి కరుణాకటాక్ష వీక్షణములు మన జీవితములపై ప్రసరించి మనకు సర్వవిధముల అండగానుండి అధ్యాత్మక్షేత్రమున అగ్రేసరు లగుటలో తోడ్పడుగాక!"

( యథార్థభారతి - ఆగష్టు, 1962)

## వేదాంతభేరి

శ్రీ గురుదేవుల నిర్యాణానంతరం వారి కత్యంత ప్రియమైన బ్రహ్మవిద్యను ప్రచారం చేయడంలో శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి దీక్ష ద్విగుణీకృ తమయింది. వేదాంతతత్త్వప్రచారాని కనువైన సాధనంగా ఒక మాసపత్రికను ప్రారంభించాలన్న సంకల్పం వారిలో కొంతకాలంనుండీ ఉంటూ వచ్చింది. ఆశ్రమం స్థాపించి ఇంచుమించు పదమూడేండ్లు పూర్తి కావస్తున్న తరుణంలో పై సంక ల్పానికి రూపకల్పన జరిగింది.

1963 జనవరిలో 'వేదాంతభేరి' అన్న పేరుతో ఒక మాసపత్రికను ప్రారం భించడం జరిగింది. అనుష్ఠానవేదాంతం బోధించే ఆధ్యాత్మిక మాసపత్రికగా శ్రీ స్వాములవారు ఆ పత్రికను తీర్చి దిద్దారు.

వేదాంతభేరీ ఝుంకారః
ప్రతివాది భయంకరః ।
శ్రూయతాం బ్రాహ్మణైః శ్రీమ
ద్దక్షిణామూర్త్యనుగ్రహాత్ ॥ (వేదాంతడిండిమం-93)



అని శ్రీశంకరభగవత్పాదుల ఉద్బోధం. "ప్రతివాదులకు భయం కలిగించే వేదాంతభేరీ నినాదం బ్రహ్మనిష్ఠులైనవారు వినాలి" అని శ్రీ శంకరాచార్యుల అభిప్రాయం. అయితే 'వేదాంతభేరి' అన్న నామకరణం పత్రికకు చేయడంలో ఉద్దేశ్యం వేదాంతతత్త్వాన్ని జిజ్ఞాసువులైన వారికి వినిపించడమేకాని ప్రతివాదు లను భయపెట్టడం కాదు. అందరికీ నిర్భయత్వం బోధించే స్వాములవారికి కొందరిని భయపెట్టవలసిన పనిలేదు గదా! పైగా వాదప్రతివాదాలు జోరుగా సాగే శంకరాచార్యులవారి కాలములో ప్రతివాది భయంకరత్వం అవసరమై వుండవచ్చు. కాని విజ్ఞానం వికసించిన ఆధునికయుగంలో అందరినీ మెప్పించి ఒప్పించే విధంగా బోధించాలే తప్ప భయపెట్టడంలో ఏమాత్రం ఔచిత్యం లేదు.

ఈ పత్రికను స్థాపించడంలో తమ ఉద్దేశ్యాన్ని వివరిస్తూ శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు మొదటి సంచికలో ఇలా వ్రాశారు —

(1) "అది సర్వజిత్ నామ సంవత్సరము. ఆషాఢశుద్ధ ఏకాదశీ పవిత్రదివసము (29-6-1947). గురుదేవులగు శ్రీ మహర్షి మలయాళస్వాములవారి ద్వారా ఈ యుపాధి సన్న్యాసాశ్రమమును స్వీకరించిన సుముహూర్తము. ఆక్రిందటి రోజున శ్రీ స్వాములవారు ఏకాంతమునకు పిలిపించి . . . . . . "బ్రహ్మవిద్యను, అధ్యాత్మవిద్యను లోకములో బాగుగ ప్రచారము చేయవలెను. పరమార్థవిద్యను జనులలో లెస్సగ ప్రకాశింపజేయవలెను. ఈ నా ఉద్దేశ్యము మీకు సదా జ్ఞాప కముండుట కొఱకై "విద్యాప్రకాశానంద" అని మీకు పేరు పెట్టదలంచినాను" అని సెలవిచ్చిరి. శ్రీవారు ఆనాడు వాత్సల్యపూరిత హృదయులై కరుణతో పలికిన ఆ పలుకులు అప్పటినుండియు తఱచు స్మృతిపథమునకు వచ్చుచు కర్తవ్యమును సూచించుచు అధ్యాత్మవిద్యాప్రచారమును గూర్చిన భావములను మనంబున ఉద్దీపింపజేయుచుండెను. ఆ ఉత్తేజముయొక్క కార్యరూపమే ఈ 'వేదాంతభేరి'. కాబట్టి గురుదేవులయొక్క సత్సంకల్పమే, పవిత్రప్రేరణయే ఈ పత్రికావతరణమునకు ప్రధానహేతువై యున్నది. మఱియు గుర్వాజ్ఞానిర్వహణమే ఈ పత్రికయొక్క ముఖ్యోద్దేశ్యమై యున్నది.

(2) మఱియొక కారణము నేడు ప్రపంచమున 'వేదాంతము' అను మాట చెవిని పడగనే భీతిల్లువా రనేకులు గలరు. వేదాంతము అందని మ్రానుయొక్క పండని వారి భావన. సర్వసంగపరిత్యాగులగు ఏ సన్న్యాసులో, సాధువులో వాడుకొను ఒకానొక వస్తువే వేదాంత మని వారి తలపు. జన సామాన్యమున

కది పనికిరాదని వారి యుద్దేశ్యము. వారి యీ విపరీతాభిప్రాయమును భగవద్గీతాది సద్గ్రంథములు తొలగించివైచినవి. పైననున్న వేదాంతమును క్రిందనున్న వ్యవహారక్షేత్రమునకు దించవచ్చు ననియు, క్రిందనున్న వ్యవహారమును పైననున్న వేదాంతస్థాయికి లేపవచ్చు ననియు గీత జనులకు బోధించినది. యథార్థముగ జూచినచో వేదాంతము సరిగా జీర్ణమైనది, లేనిది వ్యవహారరంగముననే పరీక్షించుకొనవలసియుండును. వేదాంతసారసంగ్రహమగు స్వస్వరూప సాక్షాత్కారము బడసిన వెనుక, లేక తానెవరో బాగుగ తెలుసుకొనిన పిదప ఇక ఇంద్రియాదులతో లోకవ్యవహారము ఎంతయో సవ్యముగ, నిర్దుష్టముగ జరిగిపోవుచుండగలదు. కాబట్టి వేదాంతమునకు, వ్యవహారమునకు ఎట్టి స్పర్ధలు లేవు. పైగా వేదాంతమును చక్కగ ఎఱింగినచో వ్యవహారము ఏ ఒడుదుడుకులు లేక ప్రశాంతముగ, ఆనందముగ గడచిపోవును జనకు డాప్రకారముగనే లోకవ్యవహారమును గావించెను. శ్రీకృష్ణుడా ప్రకారముగనే కర్మక్షేత్రమున ప్రవేశించెను. అర్జునునిచే గూడ నిష్కామకర్మ చేయించెను. కర్మరంగము శుద్ధపడవలె ననిన జ్ఞానముయొక్క సహాయ మెంతేని కలదు. కాబట్టి సంసారక్షేత్రములో, జనులయొక్క జీవయాత్రలు ఏ రచ్చలు రగడలు లేక ప్రశాంతముగా కొనసాగుటకుగాను అందు వేదాంతముయొక్క ప్రవేశము పరమావశ్యకమై యున్నది. ఈ సత్యమును లోకమునకు తెలుపుటకే 'భేరి' అవతరించినది.

(3) ఈ పత్రిక యొక్క ముఖపృష్ఠమున 'వేదాంతభేరి' అను శీర్షిక క్రింద 'అనుష్ఠాన వేదాంతమును బోధించు మాసపత్రిక' అను వాక్యము కలదు. అది గమనింపదగినది. లోకములో వాచావేదాంతము ఎక్కువగ ప్రబలునపుడు జనసామాన్యమునకు సహజముగనే పరమార్థవిషయములపై విశ్వాసము నెమ్మదిగ సడలిపోవుచుండును. అట్టి సమయమున అనుష్ఠానమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చునట్టి పుణ్యాత్ము లుద్భవించుటయు, ఆచరణను ప్రోత్సహించుచు నిర్మాణాత్మకతత్త్వ ప్రచారమునకు దోహదము గలుగజేయునట్టి పత్రిక లావిర్భవించుటయు చాల అవసరము. అధ్యాత్మక్షేత్రమున ఏ చిన్న విషయమును గూడ బాగుగ కార్యాన్వితమొనర్చినప్పుడే దాని శక్తి తెలియగలదు. దాని సత్యము బోధపడగలదు. . . . . . . . ఇదియే అనుష్ఠాన వేదాంతము. ఇద్దాని నాశ్రయించినపుడే జీవితము దినదినము ప్రకాశవంతమై, తేజోవంతమై, దైవగంధయుతమై, ఆనందమయమై వెలయగలదు. అత్తఱి దేవుడు ఏస్వర్గమందో, వైకుంఠమందో కానవచ్చుటయే కాక మన నిత్యజీవితమందును అడుగడుగున సాక్షాత్కరించగలడు. ఆయన సన్నిధిని నిరంతరము అనుభవించగల సౌభాగ్యస్థితిని జీవుడు నోచుకొనగలడు. దీనికంతటికిని కారణము పట్టుదలతో గూడిన ఆచరణయే. విశ్వాసముతో గూడిన యనుష్ఠానమే. అట్టి యనుష్ఠానమును ప్రోత్సహించుటయే మాయీ 'భేరి'యొక్క ఉద్దేశ్యము. కావున పరమార్థరంగమున సాధకుడు ఎదుర్కొను చిక్కులు, ఆ చిక్కులను పరిష్కరించు మార్గములు, మహనీయుల పవిత్ర జీవితములనుండి నేర్చుకొనదగిన ఉత్తమానుష్ఠాన పద్ధతులు మున్నగునవి ఈ పత్రికద్వారా తఱచు తెలియజేయబడుచుండగలవు.



(4) మానవుడు పుట్టినది దేని కొఱకు? భోగము కొఱకా? కాదు; యోగము కొఱకు; తన నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వరూపము తెలుసుకొనుట కొఱకు. అట్లు తెలిసికొని సమస్తచరాచర ప్రాణికోట్లయందును (తనయందలి) ఆ యాత్మనే దర్శించుచు సర్వభూతహిత ప్రవర్తకుడై, జీవకారుణ్యము గలిగి పరులకు మేలొనర్చుచుండవలెను. మానవుడు పుట్టినది ఇందుకొఱకే. తాను తరించుమార్గమును వెదకుకొని యితరులకు కూడ అట్టి మార్గమును బోధించి వారున్ను తరించుటకు అవకాశము కల్పించుట జీవుని ముఖ్యకర్తవ్యమై యున్నది. . . . . . . అన్నింటికంటెను జ్ఞానదానము పరమశ్రేష్ఠమై యున్నది. జీవుడు జీవునకు చేయగల మహోపకార మిదియే. 'సర్వేషా మేవ దానానాం జ్ఞానదానం విశిష్యతే' అని శాస్త్రము లీవిషయమునే నొక్కి వక్కాణించుచున్నవి. ఏలయనిన ఒక ప్రాపంచిక వస్తువు నిచ్చినచో దానివలన క్షణికమైన ఉపకారమే పరప్రాణికి కలుగుచున్నది. అట్లు చేయుట మంచిదే. అయినను అది చాలదు. మానవుడు ఈ ఒక్క జన్మతోనే పరిమితుడై యుండలేదు. కర్మసంచయ మున్నంతవరకు ఎన్ని జన్మలో ఎత్తవలసి యుండును. కావున జన్మజన్మాంతరమును అతనికి మహోపకృతి నొనర్పగల పరమసహాయమునే అతనికి విజ్ఞుడగువాడు చేయవలసి యుండును. అదియే పరమార్థ విజ్ఞానప్రదానము, అధ్యాత్మవిద్యా ప్రబోధము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ యిట్టి జ్ఞానదానము చేయువానిని గూర్చి, అనగా పరమాత్మవిద్యను ఇతరులకు ప్రసాదించువానిని గూర్చి 'ఇట్టి మహాప్రీతి పాత్రుడు నాకు వేఱొక డుండబోడు' అని సెలవిచ్చెను. అనగా జ్ఞానదానము చేయువాడు సాక్షాద్భగవానునకు అతిప్రియుడై యుండునని భావము. దీనికి మించి ఇక లోకమున మనుజునకు కావలసినదేమున్నది? భగవత్ప్రీతిపాత్రుడైనవాడు ఇక ధన్యుడైనట్లే, కృతార్థుడైనట్లే. కృతకృత్యత్వమును బడసినట్లే. జీవులకు మిత్రు డగుట మంచిదే కాని దేవునకు మిత్రు డగుట ఇంకను మంచిది. కాబట్టి భగవద్గీతయందు

చిట్టచివర శ్రీకృష్ణపరమాత్మ 'య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి' అను పరమోపదేశముద్వారా జీవుల కే కర్తవ్యమును బోధించెనో అద్దానిని కార్యాన్విత మొనర్చవలెనను ఉత్కటాభిలాషయే ఈ 'వేదాంతభేరి' యొక్క అవతరణకు హేతువైయున్నది. . . . . . . . . .

జీవితము క్షణిక మైనది. భౌతికదేహమునకు అంత్యకాల మనునది యెప్పుడు వచ్చునో ఎవరును చెప్పలేరు. కాబట్టి బ్రతికిన నాలుగు రోజులును జనులు నిర్మల చరిత్రులై, భగవద్భక్తియుతులై, ఆత్మజ్ఞానులై యుండుట శ్రేయస్కరము. ఏ నాటికైనను మనుజుడు ఇట్టి దైవలక్ష్యమును బొందియే కడతేరవలసియుండును. అట్టి లక్ష్యప్రాప్తియందు జనులకు ఉడుతాభక్తిగ సేవయొనర్చుటకును, భగవదాజ్ఞా రూపమగు విశ్వజ్ఞానసంసేవనమునందు భాగస్వాము లగుటకును నిర్ణయించుకొని ఈ 'వేదాంతభేరి' పత్రికను స్థాపించితిమి. ఈ పత్రికా స్థాపనమున గాని, ఇద్దాని భావికాల నిర్వహణమునగాని మేము నిమిత్తమాత్రులమే. 'భర్తా భోక్తా మహేశ్వరః' - అనునట్లు సర్వమును భరించువాడు, అనుభవించువాడు వేఱొకడు గలడు. ఇదియే మా విశ్వాసము.

కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపాకటాక్షము చేతను, దయాస్వరూపులగు పరమ ఋషుల యొక్క అనుగ్రహవిశేషముచేతను, మహనీయులగు సద్గురువుల ఆశీర్వాదబలము చేతను, ఈ పత్రిక తనయొక్క ప్రజోపకార లక్ష్యనిర్వహణము నందు సమర్థమై పెక్కు వసంతములు జనులకు యథాశక్తి సేవ యొనర్చుచుండగలదని విశ్వసించుచున్నాము. అట్లొనర్చుటకు తగిన శక్తిసామర్థ్యములను ఆదేవదేవుడగు పరాత్పరు డనుగ్రహించుగాక!"

(వేదాంతభేరి - జనవరి - 1963)

ఈ పత్రికా ప్రారంభాన్ని ప్రశంసిస్తూ చాలామంది మహనీయులు తమ సందేశాలు పంపారు. అందులో కొందరి సందేశాల నిక్కడ స్మరించుకొందాం.

'గీతావాణి' సంపాదకులు, గండి-భూమానందాశ్రమాధిపతులు శ్రీ రామకృష్ణానంద స్వాములవారు తమ సందేశంలో ఇలా అన్నారు —

"బ్రహ్మలీన సద్గురు శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వాములవారి గణ్యమాన్య శిష్య సత్తములు, ఆంధ్రభూమిలో ఆధ్యాత్మిక ప్రచారక ప్రవరులు, శ్రీశుకబ్రహ్మాశ్రమ సంస్థాపకులు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు, ఆత్మీయ పూజ్యసుహృత్తులు శ్రీ శ్రీ శ్రీ



విద్యాప్రకాశానంద స్వాములవారు జ్ఞానప్రసూనాంబికాసహిత శ్రీకాళహస్తీశ్వరుని పదసన్నిధిలో స్వర్ణముఖీ తరంగిణీ సైకత భూములనుండి నిద్రాణమై వుండే ఆధ్యాత్మిక సాధకలోకాన్ని ఉన్నిద్రం చేసేకోసం, క్షుద్రశక్తులను ఉచ్చాటనం చేసి భద్రశక్తులకు ఉత్తేజనం కలిగించే కోసం 'వేదాంతభేరి'ని మ్రోగింపబోవుచున్నారు. ఆంధ్రభూమి కిది అదృష్టఫలం. ఆంధ్రప్రజ కిది అహోభాగ్యం. . . . . . . . .

"వేదాంతశాస్త్రం సింహము వంటిది. తక్కిన శాస్త్రాలు నక్కలలాంటివి. వేదాంతసింహంగర్జించే వరకే నక్కల కూతల ఆర్భాటాలు. ఆ సింహం గర్జించిందా — అన్ని ఆర్భాటాలూ మాటుమణుగుతాయి" అంటూ ఒక మహనీయు డన్నాడు —

తావద్గర్జంతి శాస్త్రాణి
జంబుకా విపినే యథా |
న గర్జతి మహాశక్తిః
యావ ద్వేదాంత కేసరీ ||

అట్లే తక్కిన వినాదాలను స్వాత్మలీనం చేసుకుంటూ వేదాంతభేరి నినదింప మొదలిడింది. విశాలాంధ్రావని కిది జాగృతి సందేశం. తెలుగుజాతి కిది కర్ణపర్వం. 'శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః' — శుభమస్తు!.'

శ్రీ రామకృష్ణమఠం నుండి శ్రీ చిరంతనానంద స్వాములవారు ఈ క్రింది సందేశం పంపారు —

"'వేదాంతభేరి' భారతీయాధ్యాత్మిక విషయ ప్రచారమునకు చక్కని నామకరణము. ప్రాచీనాధునిక వేదాంతసమన్వయమునకు పట్టుగొమ్మయై, ప్రత్యేక మత సంప్రదాయ దురభిమాన తిమిరమునకు సూర్యప్రభయై, భారతీయ నవచైతన్యమునకు వసంతోదయమై, శారీర మానసికాధ్యాత్మికోత్తేజమునకు సంజీవనియై, సర్వజన దివ్యప్రబోధకమై, నేటి లౌకికవాతావరణమున మతధర్మతత్త్వప్రచారమునకు విజయభేరియై వేదాంతభేరి విరాజిల్లగలదని విశ్వసించుచున్నాను".

హోసపేట గీతాసేవాశ్రమాధిపతులు శ్రీశంకరానందగిరిస్వాములవారు పంపిన సందేశం ఇలా వున్నది —

"వేదాంతభేరి పత్రిక ప్రారంభింపబడుట ఆంధ్రులయొక్క మహాభాగ్యమై

యున్నది. జననమరణ సంతాపములను సమూలముగ పెకలించివేయు శక్తి గల వేదాంతము వేదాంతభేరి రూపమున ఇప్పుడు అందరికడకు వచ్చుచున్నది.

మరియొక మాట. వేదాంతము పుస్తకమునకు జెందిన వస్తువుగాదు. అది మస్తకమునకు జెందినది. అది ఒక పుస్తకమునుండి మస్తకమునకు ఎక్కదు. మస్తకమునుండి అది ప్రవహించవలెను. ఇప్పుడు వెలువడుచున్న ఈ వేదాంతభేరి మహాత్ముల మస్తకమునుండి బయలుదేరుచున్నదని యెఱుగవలెను.

ఈ పత్రిక జనులకు జ్ఞానప్రకాశము నొసంగుచు చిరంజీవియై వెలయుగాక! !"

శ్రీ వ్యాసాశ్రమాధిపతులు శ్రీ విమలానంద స్వాములవారు ఈ క్రిందివిధంగా తమ శుభాశంసనలు పంపారు----

"ఆధునిక యుగమున ప్రబోధప్రచారములకు పత్రికలే ప్రముఖ సాధనములు. లౌకిక విషయప్రచారము చేయు పత్రికలు ఎన్నియో కలవు. కాని అధ్యాత్మతత్త్వ ప్రబోధకములగు పత్రికలు చాలా తక్కువ. అందులోను మన తెలుగులో అట్టి ఆధ్యాత్మికపత్రికల సంఖ్య మరింత తక్కువ అనియే చెప్పనగును. . . . . .

అస్మదాత్మసోదరులును, శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపకులునగు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు ఆత్మతత్త్వప్రబోధమునకై 'వేదాంతభేరి'యను నూతనాధ్యాత్మిక పత్రికను ప్రారంభింపబోవుట మిక్కిలి ముదావహము. ఈ నవీన పత్రికావిర్భావము తదితరాధ్యాత్మిక పత్రికా నిర్వాహకులు అందరి కార్యసరణికి దోహదకారి కాగలదని తలంపు.

శ్రీగురుదేవుని దివ్యానుగ్రహముచే నూతనావిర్భూతమగు 'వేదాంతభేరి' ఆంధ్ర దేశమంతటను వ్యాపించి అచిరకాలముననే భక్తుల మన్ననలకు పాత్రమై నిర్భీక హృదయముతో ఆత్మవిజ్ఞానము నుద్ఘోషించుగాక!"

సరిగా ఈ పత్రిక ప్రారంభమైన నెలలోనే ఆధునిక యతిలోకచక్రవర్తి శ్రీవివేకానందస్వామి శతజయంతి మహోత్సవాలు జరిగాయి.



## శ్రీ వివేకానంద ప్రశంస

శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారికి ఆధ్యాత్మిక ప్రేరణ కల్గించిన మూర్తిత్రయం --- శ్రీ శంకరాచార్యులు, శ్రీ వివేకానందులు, శ్రీ మలయాళసద్గురుదేవులు. అందుకే వేదాంతభేరి మొదటి మూడు సంచికలూ పైముగ్గురు మహనీయుల ముచ్చటైన ముఖచిత్రాలతో వెలువడ్డాయి.

శ్రీ వివేకానందస్వామి ప్రబోధాలను సమగ్రంగా ఆకళించుకొని తద్ద్వారా ఎంతో ఆధ్యాత్మిక చైతన్యం పొందిన శ్రీస్వాములవారు వేదాంతభేరి రెండవ సంచికను వివేకానంద శతజయంతి సంచికగా వెలువడజేశారు. అందులో 'వివేకానందవిజయము' అన్న శీర్షికతో వ్రాసిన వ్యాసములో ఇలా ఆ మహనీయమూర్తిని ప్రశంసించారు----

"అతడు వంగదేశమున జనించినను వంగదేశీయుడు కాడు, భారతీయుడు. భారతమాతకు పుత్రుడైనను భారతీయుడు కాడు, విశ్వమానవుడు. విశ్వమునంతను ప్రేమించినను, విశ్వమానవుడు కాడు, విశ్వాతీతుడు. ఇదియే వివేకానందుని వ్యక్తిత్వమును గూర్చిన సముచిత చిత్రణము.

అతడు కాషాయవస్త్రములను ధరించి భిక్షుకుడుగా నున్నప్పటికిని వాస్తవముగ సమ్రాట్టే యగును. అతని గంభీరభావములు సహజస్ఫురద్రూపమునకు పూర్తిగ వన్నె తెచ్చినవి. అతడు నిండు కుండ. భీతి యెఱుగని వ్యక్తి. కొండవిరిగి మీద పడినను ఈగను దులిపినట్లు దులిపివేయుగల అఖండ ధైర్యశాలి. అద్భుతవాక్చాతుర్యము గలవాడు. ప్రతిపక్షులను నిరుత్తరులుగ చేయగల్గిన వాదపటిమచే శోభిల్లువాడు. అనర్గళ వక్తృత్వముచే సమ్మిశ్రితమైన ఆధ్యాత్మిక భావగాంభీర్యముచే సభికులను మంత్రముగ్ధులుగ చేసివేయగల ప్రజ్ఞాధురీణుడు. వేదాంతదుందుభిని ఖండఖండాంతరములందును మ్రోగించి మానవునియందు అపూర్వ-ఆధ్యాత్మిక దివ్యశక్తులు వెలయుచున్నవని ప్రపంచమునకు చాటిన ఋషిసత్తముడు. ప్రాచ్యపాశ్చాత్యతత్త్వముల రెండింటిని తన వ్యక్తిత్వమున ఏకీభవింపజేసికొని విలసిల్లిన మహనీయుడు స్వామి వివేకానంద. . . . . .

వివేకానందునిది దీర్ఘజీవితముకాదు, దివ్యజీవితము, చేవగల జీవితము. అల్పకాలములో లోకమునంతను ఉర్రూతలూగించి ఆనందాబ్ధిలో నోలలాడించిన జీవితమతని జీవితము. అతని ధైర్యస్థైర్యములు, అతని ఉత్తేజపూరితములగు

వాక్యములు, రచనలు ఎందరికో ఆశ్వాసమును గలుగజేసినవి. శాంతిని ప్రసాదించినవి. పరమార్థరంగములో ఉత్సాహమును రేకెత్తించినవి. మున్ముందును ఆతని భవ్యజీవితము ముముక్షువులకు సంసారక్షేత్రమున ధ్రువతారయై యొప్పుచు, నిద్రించువారిని మేల్కొలుపుచు, నిరాశానిఃస్పృహలచే పరివేష్టితు లగువారికి ఆశాజ్యోతులను వెదజల్లుచు, 'ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!' అని పదేపదే హెచ్చరించుచు, ఉత్తేజము గలిగించుచు నుండగలదనుటలో ఏ సందేహమును లేదు. వివేకానందునివలె సచ్ఛీలము, అధ్యవసాయము, ఆత్మవిజ్ఞానము గలిగియుండు వారందరికిని భగవత్కృపచే అట్టి విజయము, ఆనందము, శాంతి, సౌభాగ్యము తప్పక చేకూరగలవు".

(వేదాంతభేరి - ఫిబ్రవరి - 1963)

ఇలాంటి లోకోత్తరమైన వ్యాసాలతో, మహాత్ముల ప్రవచనాలతో, ఉపదేశాలతో, పరమార్థ ప్రబోధక కథలతో, సూక్తులతో, శ్రీస్వాములవారి గీతోపన్యాస కార్యక్రమాల వివరాలతో, శుకబ్రహ్మాశ్రమ వార్తలతో శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారి సంపాదకత్వం క్రింద - వేదాంతభేరి ఆంధ్రావని నలుమూలలకూ శరవేగంతో విస్తరించింది.

శ్రీ స్వాములవారి లోకోపకారదృష్టితో నాడు ప్రారంభమైన ఈ పత్రికారాజం వేదాంత సందేశాన్ని జిజ్ఞాసులోకానికి అందజేస్తున్నది. 'స్వాతి' పత్రికాసంపాదకులు శ్రీవేమూరి బలరామ్‌గారి సహకారముతో నేటికీ బహుళవ్యాప్తితో కొనసాగుతున్నది.



# త్రయోదశ ప్రకరణం

## ఆశ్రమ మౌక్తికోత్సవం

ఆశ్రమ స్థాపనానంతరం పండ్రెండు సంవత్సరాల కాలం గడచింది. శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారి సదాశయాలు సఫల మయ్యాయి. లోకక్షేమానికై తలపెట్టిన కార్యక్రమాలలో ఎంతో పురోగతి కనిపించడం వల్ల స్వామీజీ సంతోషించారు.

ద్వాదశవత్సరాల పురోగతిని పురస్కరించుకొని ఆశ్రమానికి మౌక్తికోత్సవం నిర్వహించాలని భక్తులు సంకల్పించారు. అందుకు స్వామీజీ అంగీకరించారు.

శుభకృన్నామసంవత్సర ఫాల్గుణ శుద్ధ దశమికి సరియైన 5-3-1963 నుండి 7-3-1963వ తేది వరకు మూడు రోజులు మౌక్తికోత్సవం జరపాలని కార్యకర్తలు నిర్ణయించారు. ఆ నిర్ణయాని కనుగుణంగా పత్రికాప్రకటనలు వెలువడ్డాయి. భక్తులకు ఆహ్వాన పత్రికలు పంపడం జరిగింది.

ఆంధ్ర, మద్రాస్, కర్ణాటక రాష్ట్రాలనుండి మూడువేలమందికి పైగా ప్రతినిధులు ఉత్సవానికి వచ్చారు. వారికి వసతి గదులు, సభలకు పందిళ్లు, భోజనశాలలు, వైద్యసౌకర్యం, తపాలాకార్యాలయం, స్వయంసేవకుల కుటీరాలు, పోలీసు కాపలా మొదలైన ఏర్పాట్లన్నీ చురుకుగా సాగిపోయాయి. సభాస్థలం ఒక చిన్న నగరంగా రూపొందింది. దూర ప్రాంతాలనుండి వచ్చిన ప్రతినిధులేకాక స్థానికంగా రెండు వేలమంది ఈ కార్యక్రమాలకు పరిసర ప్రదేశాలనుండి హాజరయ్యారు. ఎందరో మహాత్ములు, సాధుపుంగవులు కూడా విచ్చేశారు.

శ్రీ శివగిరి ఆశ్రమాధిపతులు శ్రీ విద్యానంద స్వామీజీ ప్రణవపతాకను ఉదయం ఐదు గంటలకు ఆవిష్కరించి ఇలా అన్నారు --

"సాధువులకూ, సత్పురుషులకూ ప్రాణప్రదమైనది ప్రణవం. 'ఓంకారమే వేదం సర్వం' అని శ్రుతి చెబుతున్నది. ప్రణవం అన్ని మంత్రాలకూ ప్రాణం. అది లేని మంత్రాలకు శక్తి లేదు. ఇట్టి ప్రణవాన్ని మనం పతాకగా ఆవిష్కరించుకొని ముందుంచుకొన్నాం. అందువల్ల మన కార్యాదులన్నీ జయప్రదంగా జరుగుతాయి."

ఐదున్నర గంటలకు శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు ఓంకారవిగ్రహాన్నీ, శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి పాదుకలనూ ప్రతిష్ఠించారు.

పిమ్మట శ్రీ వ్యాసాశ్రమాధిపతులు శ్రీ విమలానందస్వాములవారు శ్రీ మహర్షి సద్గురు మలయాళస్వాములవారి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. గీతా పారాయణాది కార్యక్రమాలు యథావిధిగా జరిగాయి.

గండి శ్రీ భూమానందాశ్రమాధిపతులు శ్రీరామకృష్ణానంద స్వాములవారు పారాయణానంతరం గీతాప్రవచనం కొవిస్తూ 'అజ్ఞాన నిద్రనుండి మానవుని మేల్కొలిపే ప్రబోధమే గీత' అన్న విషయంపై మనోజ్ఞంగా ఉపన్యసించారు.

శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ గీతా శ్రవణపద్ధతిని వివరిస్తూ ఇలా ప్రసంగించారు —

"భావన లేనిచో మంత్రము వృథా. అది యంత్రముతో సమానము. గ్రామఫోను మంత్రాన్ని చదివితే దానికెంత ఉపయోగమో భావన లేనిచో మనస్సుకూ అంతే ఉపయోగం. ఇతర ఊహలు రానీక గీత చదువునప్పుడు దాని అర్థమును భావన చేయవలెను. హనుమంతుని భక్తి, అర్జునుని భక్తి, ఏకాగ్రతలు కలిగి గీత చదువవలెను. లేకపోతే గీతాధ్యయనం వృథా. శ్రీకృష్ణుడు గీతాంతమున "కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా?" — "ఏకాగ్రచిత్తంతో విన్నావా? అర్జునా!" అని పార్థుణ్ణి ప్రశ్నించాడు. దానికి సమాధానంగా అర్జునుడు "నష్టో మోహః స్మృతిర్లబ్ధా" – "మోహం పోయింది, స్మృతి కలిగింది" అని చెప్పాడు. కాన అట్టి ఏకాగ్రతతో మీరును గీతాశ్రవణము చేయుడు. అప్పుడు మీకు దాని ప్రయోజనం వుంటుంది."

(వేదాంతభేరి - ఏప్రిల్ - 1963)

నాటి సాయంకాలం జరిగిన మౌక్తికోత్సవ ప్రథమ సమావేశానికి శ్రీ రామకృష్ణమఠానికి చెందిన శ్రీ చిరంతనానంద స్వామీజీ అధ్యక్షత వహించారు.

వారు మొదట సభాసదు లందరినీ శ్రీ సద్గురు మలయాళస్వాములవారికి తమ శ్రద్ధాంజలి సమర్పించ మని చెబుతూ "శ్రీ సద్గురుస్వాములవారి అమృతహస్తాలతో ప్రారంభమైన ఈ ఆశ్రమానికి మౌక్తికోత్సవం గూడా వారి ఆధ్వర్యంలోనే జరపాలని ముందు భావించడ మయింది. కాని విధివశాన వారి భౌతికశరీరం మనకు దూర మయింది. అయినా వారి చైతన్యం మన వెంటనే



వుండి ఈ కార్యాన్ని నడుపుతున్నది. ఇప్పుడు శ్రీవారిపట్ల భక్తిసూచకంగా రెండు నిముషాలు నిలబడి అందరం మౌనప్రార్థన చేద్దాం" అని అన్నారు. అందరూ మౌనప్రార్థనతో గురుదేవులపట్ల తమ శ్రద్ధాంజలి ఘటించారు.

పిమ్మట శ్రీ విమలానందస్వాములవారు మాట్లాడుతూ "ఆంధ్రదేశంలోని అనేకాశ్రమాలకు మూలం శ్రీ మలయాళస్వాములవారే. ఈ ఆశ్రమానికి కూడా మూలం వారే. శ్రీవారి శిష్యులలో జ్యేష్ఠులూ, శ్రేష్ఠులూ శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వాములవారు. శ్రీ మలయాళస్వాములవారికి 'విద్యాతపోభ్యాం పూతాత్మా' అన్న వాక్యం మకుటం. జ్ఞానంతోనూ, తపస్సుతోనూ ప్రతివాడూ పవిత్రుడు కావాలని శ్రీవారి ఆశయం. శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు శ్రీవారి ఆశయాన్ని సఫలం చేశారు" అని చెప్పారు.

ఆశ్రమ మేనేజర్ శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు తమ నివేదికలో ఆశ్రమం చరిత్రను వినిపించారు. ఆపై సభాధ్యక్షులు ప్రసంగిస్తూ —

"ఇప్పుడు మీరు ఆశ్రమ చరిత్ర విన్నారు. అల్పారంభం క్షేమకర మన్నారు పెద్దలు. శ్రీ వివేకానందస్వామి మొదట కాశీలోని మానవసేవాశ్రమాన్ని ఒక పావలా చందాతో ప్రారంభించారు. అది యిప్పుడు దినదినాభివృద్ధి పొంది కొన్ని కోట్ల రూపాయల నిధితో నడుస్తున్నది. దీనికి సత్పురుషుల సంకల్పం కారణం. ఆధ్యాత్మికజ్ఞానదానమే ఆశ్రమ కర్తవ్య మన్నారు వివేకానందులు. ఈ ఆశ్రమం ఆపని చేస్తున్నది" అని ఉగ్గడించారు.

## గీతామకరందం - ఆవిష్కరణ

రెండవ రోజు గీతాపారాయణానంతరం శ్రీ చిరంతనానందస్వాములవారు శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు రచించిన 'గీతామకరందం' అనే బృహద్గ్రంథాన్ని ఆవిష్కరించారు.

అప్పుడు సభకు అధ్యక్షత వహించిన శ్రీ రామకృష్ణానంద స్వాములవారు ప్రసంగిస్తూ "అన్ని పుష్పాలసారం మకరందం. అన్ని మందులకూ అనుపానం తేనె. అలాగే ఈ గీతామకరందం అన్ని గీతావ్యాఖ్యల సారం. ఇది వుంటే అన్ని రకాల గీతలూ మన వద్ద వున్నట్టే. ఇట్టి ఉత్కృష్ట గీతామకరందాన్ని శ్రీ చిరంతనానంద స్వాములవారు ఆవిష్కరించారు" అని గ్రంథాన్ని సభాసదులకు పరిచయం చేశారు.

గ్రంథాన్ని ఆవిష్కరించి శ్రీ చిరంతనానందస్వాములవారు తమ ప్రసంగంలో చెప్పిన మాట లివి —

"అరుణోదయకాలంలో ఈ గ్రంథావిష్కరణ జరగడం ముదావహం. శ్రీ విద్యాప్రకాశానందస్వామీజీ రచించిన ఈ వ్యాఖ్యానం గీతకు మహాభాష్యం. ఇది చాలా గొప్ప గ్రంథం. దీని ఆవిష్కరణ భాగ్యం నాకు కలిగించినందుకు కృతజ్ఞుణ్ణి. ఈ గ్రంథాన్ని నేను బాగా పరిశీలించాను. ఇంత సమగ్రమైన గీతా గ్రంథం ఇంకొకటి లేదు. దీనిని రచించిన స్వామీజీకి ఆంధ్రలోకం ఎంతో ఋణపడి వున్నది. గ్రంథాదిలో వున్న బృహత్తర ఉపోద్ఘాతం చదివితే గీతపై శ్రీ స్వాములవారికి గల పరిజ్ఞానం ఎంత సమగ్రమో తెలుస్తుంది."

ఆపై వేదాంతభేరి మాస పత్రికకు ప్రారంభోత్సవం చేస్తూ సద్గురు ప్రణవానందాశ్రమాధిపతులు శ్రీ శంకరానంగిరి స్వాములవారు ఇలా అన్నారు —

"అద్వైత్వవేదాంతానికి ఆదిగురువులైన శ్రీ శంకరాచార్యుల ముఖచిత్రంతో ప్రథమ సంచిక వెలువడటం సమంజసం. రెండవ సంచిక వివేకానందుల ముఖచిత్రంతో వున్నది. పత్రికా స్థాపకులకు వివేకానందులంటే చాలా ఇష్టం. మూడవ సంచికపైని ముఖచిత్రం శ్రీ మలయాళస్వాములవారిది. వారు వీరికి గురువులు. ఈ ముమ్మూర్తుల వల్లనే ఈ పత్రిక ఉత్కృష్టత ప్రకటిత మవుతున్నది. ఈ భేరికి శంకరాద్వైతమే మూలమని దీని ద్వారా తెలుస్తున్నది. శ్రీ స్వాములవారి ఆధిపత్యంలో ఈ పత్రిక దేశములో తన విజయభేరిని మ్రోగించగలదనడంలో ఏ మాత్రం సందేహం లేదు."

రెండవనాటి మధ్యాహ్నం సభకు శ్రీ శంకరానందస్వాములవారు అధ్యక్షత వహించారు. మూడవనాటి ఉదయం పారాయణానంతరం మహనీయుల గీతా ప్రవచనాలు కొనసాగాయి. పిమ్మట హోమం జరిగింది. మధ్యాహ్నం విరివిగా అన్నదానం నిర్వహింపబడింది. నాటి సాయంసభకు శ్రీ రామకృష్ణానంద స్వామీజీ అధ్యక్షత వహించారు.

## మౌక్తికోత్సవ సందేశం

శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు సభాసదులకూ, భక్తులకూ మౌక్తికోత్సవ సందేశం ఇస్తూ ఇలా ప్రబోధించారు —



"నీటి బిందువు కాలిన ఇనుపముద్దపై పడితే స్వరూపం లేకుండా నశిస్తుంది. అదే తామరాకుపై పడితే ముత్యమువలె కనిపిస్తుంది. అదే ముత్యపు చిప్పలో పడితే ముత్యమే అవుతుంది. అంటే క్షేత్రభేదాన్ని, అధికారి భేదాన్ని బట్టి ఫలితం వుంటుంది. బీజఫలితం క్షేత్రాన్ని బట్టి వుంటుంది. బీజం రాతిపై పడితే ఫలితం శూన్యం. మంచి దున్నిన నేలపై పడితే అంకురించి సఫల మవుతుంది.

కాన మీరు విన్న బోధ మీ హృదయక్షేత్రాన్ని బట్టి ఫలితాలను ప్రసాదిస్తుంది. కావున మీరందరూ మంచి జిజ్ఞాసతో, శ్రద్ధతో, నిర్మలచిత్తులై బోధలను శ్రవణం చేసి మనన నిదిధ్యాసనములను చేస్తే దాని పూర్ణ ఫలితాన్ని మీరిప్పుడే పొంది ఆనందించగలరు. ఈ మూడు రోజులు మీరు విన్న బోధలను ఆచరణలో పెట్టడానికి తీవ్రప్రయత్నం చేయండి. వాటిని ఆచరణలో పెట్టినప్పుడే శాంతి కల్గుతుంది. బోధలను మస్తిష్కంలోనే వుంచక హృదయంలోకి ప్రవేశపెట్టండి. అప్పుడే సత్పరిణామం కలుగుతుంది. విన్నదానిని మననం చేయండి. శమదమాదులు అలవరచుకొనండి. సచ్చిదానందాత్మను ధ్యానం చేయండి. దాని వల్ల శుభపరిణామాలను అనుభవించగలరు. తుచ్ఛనశ్వరప్రపంచసుఖాలు కోరవద్దు. వైరాగ్యం, అభ్యాసం కలిగి సాత్త్వికాహారులై నిమయపూర్వకంగా సాధన చేయండి. నీరు ముత్యమైనట్లే సాధన చేసేవాడు సచ్చిదానందస్వరూపు డవుతాడు. సర్వత్రా దైవాన్నే దర్శించేవాడు పరుల కపకారం చేయలేడు. అతడు చేసే కర్మ పవిత్రయజ్ఞ మవుతుంది. విశ్వశాంతికర మవుతుంది."

ఈ సందర్భంలో తమ సందేశాన్ని ఇంకా విస్తృతంగా సాధకలోకానికి అందజేయాలన్న సత్సంకల్పంతో శ్రీ స్వాములవారు వేదాంతభేరిలో ఇలా వ్రాశారు —

"జీవుని లక్ష్యము ఆత్మసాక్షాత్కారము. అది చాలా గొప్పది. కాని సమయము చాల స్వల్పము. విఘ్నములు మెండు. కావున ఆతడిక నేమి చేయవలెను? తన కీశ్వరుడిచ్చిన స్వల్ప ఆయుర్దాయమునందే మహోన్నతయత్న మాచరింప వలెను. చక్కని నియమము లేర్పరచుకొని ఇంద్రియములను మెల్ల మెల్లగ వశీభూత మొనర్చుకొనుచు చిత్తమునందుగల ఆసురిక సంస్కారములను క్రమక్రమముగ పారద్రోలుచుండవలయును. తన స్వరూపము పాంచభౌతికము కాదనియు, అది సచ్చిదానంద ఘనమనియు మరల మరల చింతన చేయవలెను. ఈ ప్రకారముగ నియమము తప్పక ప్రతిదినము సాధన చేయుచుండినచో అచిరకాలములో అతనికి

గొప్ప మనశ్శాంతి, పరమానందానుభూతి తప్పక కలుగగలవు. ఇట్టి పరమస త్యములను జ్ఞాపకము చేసికొనుచు, స్వస్వరూపానుభవ మను పరమలక్ష్యమును సాధించుటకై సాధనను, తీవ్రతర ప్రతిజ్ఞలను గావించుకొనవలసిన శుభసమయమే ఈ మౌక్తికోత్సవ సందర్భము.

పరమ పవిత్రమగు ఈ మౌక్తికోత్సవ శుభసమయమున జను లీ క్రింది వాక్యములను బాగుగ జ్ఞాపకము చేసికొనవలసియున్నది.

1. తాను ఆత్మయేకాని దేహము కాదు. తనకు ఏకాలమందును వినా శములేదు. నశించునది, వికారము నొందునది, మరణించునది దేహమే కాని దేహియగు తాను కాదు -- ఓం ఓం ఓమ్ – ఈ ప్రకారముగ తనయొక్క 'సత్' అంశమును మాటిమాటికి మననము చేయుచుండవలెను.

2. తాను జడమగు ఒకానొక మట్టిబొమ్మ కాదు, మృణ్మయుడుకాదు, చిన్మయుడు. ప్రజ్ఞానఘనస్వరూపుడు. సుషుప్తియందును మేలుకొనియుండు చిద్రూపాత్మయే తాను - ఓం ఓం ఓమ్ – ఈ ప్రకారముగ 'చిత్' అంశమును మఱల మఱల చింతన చేయుచుండవలెను.

3. తాను సంసార దుఃఖములందుపడి మ్రగ్గిపోవు కీటకము కాదు. ఆనందసాగరమున నోలలాడు బ్రహ్మాండాధిపతి. నిప్పును చెదలు అంటజాలనట్లు దుఃఖశోకము లెవ్వియు తన్ను స్పృశింపజాలవు. ఓం ఓం ఓమ్ – ఈ ప్రకారముగా తనయొక్క 'ఆనందాంశమును' మాటిమాటికి మననము చేయుచుండవలెను.

ఈ రీతిగా తాను 'సత్-చిత్-ఆనందరూపుడగు పరమాత్మయే, యను పరమసత్యమును ప్రతిదినము పెక్కుసార్లు జ్ఞాపకము చేసుకొనవలయును.

"తద్బ్రహ్మ నిష్కళమహం న చ భూతసంఘః" 'నిష్కళమగు ఆ పరబ్రహ్మమే తానుగాని పంచభూతసముదాయమగు దేహము గాదు' అని శ్రీ శంకరభగవత్పాదు లానతిచ్చినట్లు ప్రతిజీవియు తన నిజరూపమును దినమునకు ఎన్నియో పర్యాయములు స్మృతిపథమునకు దెచ్చుకొనుచుండవలెను. తాను దరిద్రుడు కాదనియు, సమ్రాట్టనియు, మహాచక్రవర్తి యనియు, విశ్వసామ్రాజ్యాధిపతి యనియు భావించవలెను.

'యద్భావం తద్భవతి' – తానెట్లు భావించునో అట్లే యగును. కావున ప్రాతఃకాలము నిద్రలేచినది మొదలు మరల పరుండువరకును వ్యవహారమధ్యమున



గూడ ఇట్టి మహోన్నత గంభీర భావములనే పలుసార్లు జ్ఞప్తికి తెచ్చుకొనుచుండవలెను. అట్లు జ్ఞాపకము చేసుకొనునప్పుడు 'ఓం ఓం ఓమ్' అని ప్రణవమును గూడ స్మరించుట ప్రారంభమున చాల సహాయకారిగా నుండగలదు.

మరియు వారివారి సంస్కారము ననుసరించి కర్మమార్గమును గాని, భక్తిమార్గమును గాని, ధ్యానమార్గమునుగాని, జ్ఞానమార్గమునుగాని చేపట్టి వైరాగ్యమును, సర్వభూతదయను అన్ని మార్గములకు తోడుగ దీసుకొని అధ్యాత్మపథమున అగ్రసరుడై జీవు డచిరకాలములో ఆత్మసాక్షాత్కారరూప చరమలక్ష్యమును ఈ జీవితమునందే సాధించివైచి కృతార్థుడు కావలెను.

కరుణామయుడగు సర్వేశ్వరుని పరిపూర్ణానుగ్రహముచే జనులలో ఆధ్యాత్మిక ప్రవృత్తి పెంపొంది లక్ష్యప్రాప్తికై ద్విగుణీ కృతప్రయత్నము సంభవించుగాక!!!"

(వేదాంతభేరి - మార్చి - 1963)

దివ్యజీవన సంఘ స్థాపకులు శ్రీ స్వామి శివానంద సరస్వతీమహరాజ్‌గారు, చిన్మయ మిషన్ వ్యవస్థాపకులు శ్రీ చిన్మయానందస్వాములవారు మొదలైన మహనీయులు పంపిన సందేశాలు మౌక్తికోత్సవసభలో సముపస్థితులైన భక్తవర్గానికీ, సాధకలోకానికీ ఎనలేని ఉత్సాహం కలిగించాయి. శాంతిమంత్ర పఠనంతో మౌక్తికోత్సవకార్యక్రమం శుభప్రదంగా సమాప్త మయింది.

## గీతామకరంద ప్రశస్తి

గీతామకరందం ఆవిష్కరణ మౌక్తికోత్సవ సందర్భంలోనే జరిగిందని చెప్పుకొన్నాం. శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారి యశోగరిమను నలుదిక్కులా వ్యాపింపజేయడంలో ఈ గ్రంథరాజం నిర్వహించిన పాత్ర చాలా విశిష్టమైనది. వెయ్యిన్నీ నూరు పుటలకు పైగా విస్తరించిన ఈ పుస్తకం సాటిలేని ప్రచారం పొందింది. మూలశ్లోకాలకు ప్రతిపదార్థమూ, తాత్పర్యమూ, విపుల వ్యాఖ్యానమూ ఇందులో సమకూర్చబడ్డాయి. ఎడనెడా సామాన్యపాఠకులను దృష్టిలో పెట్టుకొని ప్రశ్నోత్తర రూపంలో అనేక ఆధ్యాత్మిక విషయాలు గ్రంథానికి అనుబంధంగా చర్చించబడ్డాయి. స్కాందపురాణం, వైష్ణవీయతంత్రసారం, మహాభారతం, వరాహపురాణం మొదలైన గ్రంథాలలో గీతాప్రభావాన్ని ప్రతిపాదించే విషయాలుకూడా క్రోడీకరింపబడ్డాయి. మంత్రరూపమైన గీతను ఎలా జపించాలి?

ఏ విధంగా పారాయణం చేయాలి? అందువల్ల కలిగే లౌకిక - పారమార్థిక ఫలితాలు ఎట్టివి? ఇత్యాది విషయాలను కూడా కూలంకషంగా ఇందులో శ్రీ స్వాములవారు నిరూపించారు. అధ్యాయక్రమంగా గీతాపారాయణఫలాన్ని వివరించే పద్మపురాణాంతర్గతకథలు కూడా ఇందులో ఉల్లేఖింపబడ్డాయి.

అంతేకాదు. శ్రీ స్వాములవారు ఈ గ్రంథానికి చాలా విపులమైన ఉపోద్ఘాతం వ్రాశారు. అందులో గీతాస్వరూపాన్నీ, గీతాతత్త్వాన్నీ వివిధ దృక్కోణాలతో సుదీర్ఘంగా చర్చించారు.

గీతకు తెలుగులో ఈ గ్రంథం ఆవిర్భవించకముందే ఎన్నో వ్యాఖ్యలు వెలువడ్డాయి. అయినా ఈ గ్రంథం పై వ్యాఖ్యాగ్రంథాల కన్నింటికీ తలమానికంగా రూపొందింది. ఇంత బృహద్గ్రంథమైకూడా ఇప్పటి కిది లక్షాయాభై వేల ప్రతులకు పైగా ప్రచారం కావడంలోనే దీని ప్రశస్తి ఎట్టిదో తెల్ల మవుతున్నది.

కొందరు భక్తులు స్వాములవారిని 'గీతామకరంద స్వాములవారు' అని కూడా వ్యవహరించడం కద్దు. దీనిని బట్టి ఈ గ్రంథానికీ, స్వాములవారికీ ఎంత అవినాభావ సంబంధం ఏర్పడిందో ఊహించుకోవచ్చు.

1963లో అనేక ప్రసిద్ధ పత్రికలు ఈ గ్రంథంపై సమీక్షలు ప్రకటించాయి. అందులో కొన్ని సమీక్షాంశాలను ఇక్కడ పొందుపరచడం ఎంతైనా సముచితం.

## గీతామకరందంపై సమీక్షలు

"........ నిత్య స్మరణీయములగు కొన్ని గీతావాక్యములు, గీత యందలి ఉపమానములు, ఉపనిషత్తులలోని గీతావాక్యములు – ఒక్కటన నేల? వివిధ దృక్కోణములలో గీతను పరిశీలించి మృదుమధుర వచన రచనతో పాఠకులకు శ్రీ స్వాములవా రందించిన ఈ మకరందమును గ్రోల ఏ మానవబంభరము సంరంభింపదు? పదబంధముల బాధ లేదు. ప్రసన్నమైన రచన. నిరాడంబరమైన శైలి. గ్రంథము చూడ ముచ్చట గొల్పుచున్నది. అప్రకృత విషయ చర్చాడంబరముగాని, పారిభాషిక పదగుంభనముగాని లేక సర్వజన సంవేద్య మగునట్లు విషయము చిత్రించినారు శ్రీ స్వామి ........"

(ఆంధ్రపత్రిక - 23-6-1963)

"........ వ్యాఖ్యలైతే ఎన్నో వున్నాయిగాని ఏవీ అంత అందమైన ఆకా



రంలో లేవు. ఆ లోటును గీతామకరందం తీర్చింది. ఇది గీతయందు ఆసక్తిని గలుగజేస్తోంది. మిక్కిలి ఆకర్షణీయమైన వ్యాఖ్య, విపులమైన తాత్పర్యం, ఎంతో జ్ఞానదాయకమైన ఉపోద్ఘాతమూ ఈ పుస్తకానికి అమూల్యతను కల్గిస్తున్నవి. గీతా మకరందమును చదువుతూ వుంటే ఇంకా ఇంకా చదువుకుంటూ పోవాలనే ఉంటుందికాని ఉంచివేయాలని ఉండదు. వివరణ బాగుంటుంది, భాషా బాగుంటుంది. .... . పాఠకునితో ఎంతో సన్నిహితత్వాన్ని ఇట్టే అలవరచుకుంటారు స్వాములవారు. మతవిషయకమైన వేయి పేజీల గ్రంథంలో ఈ గుణం మరీ మరీ కనిపించడం ఎంతో మెచ్చదగినది."

(ఆంధ్రజ్యోతి - 14-4-1963)

"వ్యాఖ్యాన నైపుణీవిశేషము శ్రీ స్వాములవారికి పూర్ణముగా గలదు. గీతా ప్రతిభ పాఠకుని హృదయమందిరమున శాశ్వతముగ నిలువునట్టి చతురధోరణిలో గ్రంథరచన సాగినది. తాత్పర్య రచనయు ఉదాత్త శైలిలో గీతామాతృహృదయ గాంభీర్యమును ద్యోతక మొనరించుచున్నది. శ్రీ స్వామివారికి గీతపట్ల గల అపూర్వ భక్తిప్రపత్తులకు, వారికి గల లోతైన వేదాంత విజ్ఞానమునకు, తత్త్వసుధామథన నిర్వర్తనకు గీతామకరందం సాక్ష్యం."

(ఆంధ్రప్రభ - 11-8-1963)

"మతాచార్యులందరు కలిసి ఉమ్మడిగా ఒకే దివ్యపాత్రలో ఆ మకరందమును మరల ఆధునికాంధ్రప్రజానీకమునకు అందించిరో అన పూజ్య శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు ఒక బృహత్కాంచన పాత్రలో గీతామకరందమును అందించినారు. గీతామకరందమునకు తగిన పరిశుద్ధపాత్ర, పాత్ర నందించుటకు తగిన పరిశుద్ధ పురుషులు – ఈ సంఘటన మెంత అదృష్ట విశేషము! పాత్ర అశుద్ధముగా నున్నను, ఇచ్చువారు అపరిశుభ్రముగా నున్నను పదార్థము స్వీకరించుట కంతగా రుచింపదు. గీత, గీతను వ్యాఖ్యానించుటకు తగిన యోగ్యత, ఆ యోగ్యత ననుసరించిన రచనా వైదుష్యము – ఈ మూడు ఇచ్చట ముడివైచుకొన్నవి. ఈ ఉద్గ్రంథము సరస్వతీదేవి జపమాలలో వినూత్నముగా గూర్చబడిన ఒక మణిపూస".

(రామదర్శనం)

"శ్రీ స్వాములవారియొక్క దీర్ఘకాల పరిశ్రమ ఫలితమే ఈ గ్రంథ రాజము.

గీతకు సంబంధించిన వివిధ విషయములు ఇందు పొందుపరుపబడినవి. గీతానురాగులకు, గీతాతత్త్వాన్వేషకులకు ఇయ్యది విశ్వకోశము వంటిది. . . . గీతావాఙ్మయమున తియ్యటి నూతన శోభను చేకూర్చుచున్నదనుటలో అతిశయోక్తి లేదు. . . . . . గీతాతత్త్వజిజ్ఞాసులకు ఇయ్యది అవశ్యోపాదేయము."

(యథార్థభారతి - 15-3-1963)

"*Many Commentaries on Gita have been published so far in Telugu, but this work is significant in several ways. In an elaborate preface running into about 100 pages, the author has very beautifully explained the greatness of Gita and the value of the study in the Worldly life . . . . . After this the commentary of the author follows. It is here the author has exhibited his original thinking and experience.*

*The Swamiji is not a mere Scholar with much of book-knowledge. His writings reveal that he has realised and experienced what he writes. Thus personal touch makes the work all the more valuable and immpressive. The Swamiji really deserves the gratitude of Telugu speaking Asthikas for his pious and learned labour of love. It is indeed difficult to spot light the manifold excellences of this book in a short review. The printing and get up leave nothing to be desired.*"

*(Bhavan's Journal 24-11-63)*

"తెలుగులో గీతకు ఇంతకుముందు ఎన్నో వ్యాఖ్యలు వెలువడ్డాయి. కాని అనేక విధాల ఈ వ్యాఖ్య విశిష్టమైనది. ఇంచుమించు నూరు పుటలకు విస్తరించిన ఉపోద్ఘాతంలో రచయిత గీత గొప్పతనాన్నీ, దాని అధ్యయనంవల్ల లౌకిక జీవితంలో కలిగే ప్రయోజనాన్నీ చాలా చక్కగా వివరించారు. .. . . దీని తర్వాత గ్రంథకర్త రచించిన వ్యాఖ్య వున్నది. వారు ఈ వ్యాఖ్యలో తమ మౌళిక ఆలోచననూ, అనుభవాన్నీ ప్రదర్శించారు.

స్వామీజీ బహు గ్రంథ పరిచయం కల పండితులు మాత్రమే కాదు. వారు వ్రాసే విషయాలు వారు అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవే అని వారి రచన వ్యక్తం చేస్తున్నది. వ్యక్తిగతానుభవం ఈ గ్రంథాన్ని ఎక్కువ విలువగలదిగాను,



ఆకర్షకంగానూ చేస్తున్నది. స్వాములవారి ఉదాత్తమైన ఈ ధార్మిక కృషికి ఆస్తికులైన తెలుగువారంతా వారిపట్ల కృతజ్ఞులై వుండాలి. ఈ చిన్న సమీక్షలో ఈ వ్యాఖ్యలోని వివిధ విశిష్టతలను నిరూపించడం చాలా కష్టం. గ్రంథం ముద్రణ, పొందిక సమగ్రసుందరంగా వున్నాయి".

(భవన్స్ జర్నల్)

గీతామకరందం తెలుగుదేశంలో అనన్యసామాన్యమైన ప్రచారం పొందింది. ఈ మహత్తర గ్రంథాన్ని ఆంగ్లభాషలోకి అనువదిస్తే తెలుగు తెలియని జిజ్ఞాసువులకు ఎంతో వుపయోగకరంగా ఉంటుందని భావించిన పెద్దలు కొందరు ఆంగ్లంలోకి ఆ గ్రంథాన్ని అనువదించి ప్రకటించవలసిందిగా శ్రీ స్వాములవారిని ప్రార్థించారు. స్వామీజీ అందుకు సమ్మతించారు. ఆశ్రమనిర్వాహకుల అభ్యర్థన ననుసరించి నెల్లూరుకు చెందిన ప్రొఫెసర్ శ్రీ దుర్భా రామమూర్తిగారు గ్రంథాన్ని చక్కగా ఆంగ్లంలోకి అనువదించారు. 1980లో ఆంగ్లానువాదం వెలువడింది. తద్వారా ఆంధ్రేతరులకు కూడా గీతామకరందం ఆస్వాదించే సౌభాగ్యం కలిగింది.

శ్రీ స్వాములవారి గీతావ్యాఖ్యానం లోకప్రియం కావడంవల్ల ధార్మికగ్రంథ ప్రచురణలో శ్రద్ధ చూపుతున్న తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఇటీవల దాన్ని ఇతర భాషల్లో కూడా అనువదింపజేసి ప్రకటించడం మంచిదని భావించారు. స్వాములవారు కూడా అందుకు సంతోషంతో సమ్మతించారు. ఆ కారణంవల్ల తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రస్తుతం గీతామకరందాన్ని హిందీ మొదలైన ఇతర భారతీయభాషల్లోకి అనువదింపజేస్తున్నారు.

## ఆశ్రమ కార్యనిర్వహణ

శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపన కాలం నుండీ మేనేజరుగా ఆశ్రమకార్యక్రమాలను నిర్వహిస్తూవచ్చిన శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు 1964లో ఉన్నత విద్యాభ్యాసానికై ఉత్తరదేశం వెళ్లారు. నెల్లూరు జిల్లాకు చెందిన శ్రీ ఆదిశేషారెడ్డిగారు తర్వాత కొంతకాలంపాటు ఆశ్రమ కార్యనిర్వహణలో స్వామీజీకి తోడ్పడ్డారు.

1961 లో ప్రొద్దుటూరులో చాతుర్మాస్యవ్రతం జరిగినప్పుడు అక్కడ విద్యార్థిగా వుండిన శ్రీ బి. ఈశ్వర్‌గారు ఆ కార్యక్రమంలో స్వచ్ఛంద సేవకులుగా వుంటూ శ్రీస్వాములవారికి గణనీయమైన సేవ చేశారు. తరువాత శ్రీ స్వాములవారితో కూడా శ్రీకాళహస్తికి వచ్చి ఆశ్రమంలోనే వుండి విద్య నభ్యసిస్తూ శ్రీవారికి

మిక్కిలి సన్నిహితంగా వుండేవారు. వయోవికాసం కలిగే కొలదీ ఆయనలో కార్యనిర్వహణ దక్షత కూడా పెరుగుతూ వచ్చింది. అది గుర్తించిన శ్రీ స్వాములవారు ఆశ్రమ మేనేజరుగా ఆయననే నియమించారు.

ఆ నియామకం జరిగిన నాటినుండి నేటి వరకూ స్వామీజీని నీడలా వెన్నంటుతూ ఆశ్రమకార్యక్రమాలు నిర్వహిస్తూ శ్రీ బి. ఈశ్వర్ గారు తమ జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నారు.

## లేఖల ద్వారా శాంతి సందేశం

ఈ లోకమంతా శోకహతమే. 'నేను సర్వకాల సర్వావస్థలలో సుఖమే అనుభవిస్తున్నాను' అని ధీరతతో చెప్పగలవా డొక్కడూ లేడు. తాపత్రయం మానవుణ్ణి పట్టి పీడించడం సహజం.

సుఖమల్పం బహుక్లేశో
విషయగ్రాహిణాం నృణామ్ ।
అనన్తం బ్రహ్మనిష్ఠానా
మితి వేదాంత డిండిమః ॥ (వే-డిం-76)

శబ్దస్పర్శాది విషయాలను కాంక్షించేవారికి కలిగె సుఖం స్వల్పం. దుఃఖాన్నే వారు ఎక్కువగా అనుభవిస్తారు. ఇక నిజంగా సుఖం అనుభవించే వారెవరు? అంటే బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు మాత్రమే అని సమాధానం చెప్పక తప్పదు. వారు అనుభవించేది నిత్య సుఖం. అది అనంత సుఖం. అందువల్ల దుఃఖోపహతులైనవారు శాశ్వతసుఖశాంతులు కావాలనుకుంటే బ్రహ్మనిష్ఠులైన మహనీయులనే ఆశ్రయించాలి. వారి ఉపదేశాలే వీరికి శాంతిని ప్రసాదిస్తాయి.

చాలామంది ఐహిక బాధలకు గురి అయినవారు శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారికి తఱచు తమ గోడు వినిపించి తరణోపాయం బోధించమని ప్రార్థించేవారు. అలాంటివారికి అవసరమైన ఆధ్యాత్మికసందేశాన్ని అందించి శ్రీవారు వారి తాపం చల్లార్చేవారు. మరికొందరు గీతోపన్యాసాలలో శ్రీవారి ప్రవచనాలు విని శాంతి పొందేవారు. ఇంకకొందరు లేఖలద్వారా తమ బాధలనూ, సంశయాలనూ స్వామీజీకి తెలియపరచేవారు. అలాంటివారికి శ్రీవారు తగినరీతిగా సమాధానాలు వ్రాసి పంపుతూ వుండేవారు.



మనోనిగ్రహములేక అశాంతితో బాధపడే ఒక వ్యక్తికి ఒకసారి శ్రీ స్వాములవారు వ్రాసిన లేఖ ఇది —

"ప్రియాత్మస్వరూపా !

మనస్సుపై నిగ్రహము కలిగియుండుటను నేర్చుకొనుము. మనస్సును అదుపులో నుంచుకొనుము. ఏ వస్తువైనను పెడదారి పట్టినప్పుడు దానిని నిగ్రహింపకపోయినచో తుదకు అది ప్రమాదములకు దారి తీయగలదు. ఇంజను వేగము ఎక్కువైనపుడు డ్రైవరు దానిని తగ్గించి స్పీడును 'కంట్రోలు' చేసి మితముగా నడుపును. సైకిలు పల్లములకు పోవునపుడు దాని అధిష్ఠాత మెల్లగా బ్రేకువేసి దానిని అదుపులో పెట్టుకొనును. ధరలు పెరిగిపోయినపుడు ప్రభుత్వమువారు వానికి కంట్రోలు విధించి కట్టుదిట్టము చేయుదురు. వాగుడు అలవాటైనవారు నాలుకకు కంట్రోలు పెట్టి కొంత సేపు మౌనము శీలించుదురు. అతిగా భోజనము చేయువారు మితాహారనియమము అభ్యసించునపుడు తమ భోజనమును నెమ్మదిగా కంట్రోలు చేసికొందురు. వెయ్యేల? ప్రపంచములో ప్రతివస్తువు ఒక్కొక్క సమయమున నిగ్రహమునకు లోనయినప్పుడే బాగుగ పనిచేయుచుండును. ఇట్లుండ జగత్తులో అన్నింటికంటె మేటియై, సమస్త ప్రపంచమునకు కారణ భూతమై, సుఖదుఃఖము లన్నింటికి మూలకారణమైనట్టి మనస్సు ఏది కలదో, దానిని మాత్రము నిగ్రహింపక, దానిపై కంట్రోలు విధింపక వదలివేసినచో తుదకు ఆ జీవుని గతి 'దుష్టాశ్వా ఇవ సారథేః' అనునట్లు అధఃపతనమే అగును. ఎవడు తన మనస్సును జయించునో అతడు సమస్త ప్రపంచమును జయించినట్లే! ఎవడు తన ఇంద్రియములను నిగ్రహించునో అతడు సంసారసముద్రమును దాటినట్లే. కావుననే గీతాచార్యులు —

తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం
జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ (గీత - 3- 41)

అని నుడువుచు ఇంద్రియమనస్సులను మొట్టమొదట నిగ్రహించవలసినదిగా ప్రబోధించెను. ఈ భావమునే సమయము దొరికినపుడెల్ల పలుచోట్ల భగవంతుడు గీతయందు వ్యక్తీకరించెను.

పై శ్లోకములో 'ఆదౌ' అని ప్రయోగించుటవలన సాధకులగు ముముక్షువులు, తమ తమ గమ్యస్థానము పొందుటకై అవలంబింపదగిన ప్రప్రథమసాధనము ఈ ఇంద్రియ, మనోనిగ్రహమే అని తేటతెల్ల మగుచున్నది.

కాబట్టి ప్రతివారు భక్తి వైరాగ్య నిష్కామ కర్మాదులను సహాయముగా తీసికొని తమ ఇంద్రియములపై, మనస్సుపై నిగ్రహము కలిగి, అవి కామక్రోధాదులకు వశము గాకుండ నిరోధించి, వానిని దృశ్యవిషయములనుండి మరలించి, ఆత్మోన్ముఖముగా చేసికొనవలెను. ఇదియే సమస్తశాస్త్రములయొక్క సారాంశము. ఇదియే శ్రీకృష్ణపరమాత్మయొక్క దివ్యాశయము. ఇదియే శాంతికి మార్గము. ముముక్షువులు దీనిని ఆచరణలోనుంచి మోక్షశ్రేయస్సును పొందుదురుగాక !!!"

ఒక భక్తుణ్ణి ఆధ్యాత్మికసాధనకై పురికొల్పుతూ శ్రీవారు వ్రాసిన మరొక లేఖ యిది ---

"ఆత్మస్వరూపా !

జీవిత మొక రణరంగము. ముముక్షువులు మాయ యను గొప్ప శత్రువును ఎదుర్కొని పోరాడుచున్నారు. అనేక జన్మార్జిత ప్రాపంచిక వాసనలు సాధకుని ఆధ్యాత్మికభావములను మరుగుపరచుటకు ప్రయత్నించుచున్నవి. ఇట్టి సమయమున భక్తులు, సాధకులు, ముముక్షువులు, తమ జన్మహక్కైన ఆత్మ సామ్రాజ్యమునకై ఆ యాసురశక్తులతో తీవ్రముగా పోరాడి విజయమును చేపట్టవలెను. ధైర్యమును వీడరాదు. నిర్భయత్వమును త్యజింపరాదు. సర్వేశ్వరునిపై అచంచల విశ్వాసము కలిగి శ్రీ సద్గురువులయెడ మిక్కుటమగు భక్తి కలిగి అకుంఠిత ధైర్యసాహసములతో సాధన చేయవలెను. ప్రాపంచిక కార్యములను ఎంత శ్రద్ధతో ఆచరించెదరో, అంతకు పదిరెట్లు శ్రద్ధతో ఆధ్యాత్మిక కార్యముల నాచరించు చుండవలెను. జీవితకాలము అతి స్వల్పముగా నున్నది. ప్రతిబంధములు మెండుగా నున్నవి. మృత్యుదేవత జీవులను కబళించివేయుటకై సిద్ధముగా నున్నది. కాబట్టి ఆలసింపక తరించు మార్గమును వెదకవలయును. దీపమున్నప్పుడే యిల్లు చక్క బెట్టుకొవలెను. త్వరలో సద్గురువు నాశ్రయించి, సంసారదుఃఖ నివారణోపాయమును అతని ద్వారా తెలిసికొని, ప్రయత్నపూర్వకముగా కడతేరుటకై యత్నింపవలయును. అమోఘమైన మనుష్యజన్మ లభించియు తాను తరించుటకై మార్గమును వెదకనివాడు మృగజీవితమును గడుపువాడే యగును. కాబట్టి త్వరపడుడు! అజ్ఞానపిశాచమును పారద్రోలుటకై కటిబద్ధులు కండు! ఈ





జీవితమునందే చరమలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారము బడయు లాగున భీష్మ ప్రతిజ్ఞను సల్పుడు! నిర్మల భక్తి, తీవ్రమగు ముముక్షుత్వము, అకుంఠిత దీక్ష, పవిత్రమగు అనుష్ఠానము కల్గియున్నచో విజయము కరతలామలకము. దైవమతము అచిరకాలములో లోకమున సర్వత్ర ప్రతిష్ఠింపబడును గాక!"

శ్రీ స్వాములవారు సాధకు లైన శిష్యులమీది వాత్సల్యంతో వ్రాసిన ఇలాంటి లేఖలు ఎందరికో ఆత్మోన్నతి కలిగించాయి.



# చతుర్దశ ప్రకరణం

## చాతుర్మాస్య వ్రతం

బ్రహ్మనిష్ఠులైన మహనీయులు తాము పొందిన ఆత్మానందాన్ని యితరులకు అందజేయడానికై పాటుపడతారు. పరివ్రాజకులు దేశమంతటా సంచరిస్తూ ఆత్మధర్మాన్ని జిజ్ఞాసువులకు బోధిస్తారు. కాని వర్షాకాలంలో మాత్రం ఒక్క చోటనే వుండి నియమాలు పాటిస్తూ వారు చెంతకు వచ్చినవారికి ఆత్మప్రబోధం చేయాలని శాస్త్రాలు విధిస్తున్నాయి. ఆషాఢమాసం నుండి నాలుగు నెలలు వర్షాకాలం కాబట్టి ఈకాలంలో సన్న్యాసులు ఒకేచోటనే వుండి పాటించే వ్రతాన్ని చాతుర్మాస్యవ్రతం అంటారు. ఈ వ్రతకార్యక్రమాలలో గృహస్థులు మొదలైన ఇతరాశ్రమస్థులు గూడా పాల్గొనవచ్చు.

గురుదేవులు శ్రీమహర్షి మలయాళస్వాములవారు ఆంధ్రదేశంలో చాతుర్మాస్య వ్రతవిధానాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చారు. వ్రతకాలంలో ప్రజల ఆత్మోన్నతి కవసరమైన అనేక కార్యక్రమాలు వారు నిర్వహించారు.

1948లో విజయవాడలో శ్రీ సద్గురుస్వాములవారు నిర్వహించిన చాతుర్మాస్యం చాలా ప్రశస్తి పొందింది. అప్పుడు శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు కూడా అందులో పాల్గొన్నారని ఇంతకుముందే చెప్పుకొన్నాం.

శుకబ్రహ్మాశ్రమ స్థాపనానంతరం శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు ప్రొద్దుటూరులో 24-7-61 నుండి అర్ధచాతుర్మాస్యవ్రతం నిర్వహించారు. అప్పుడు అక్కడి ప్రజలలో ఆశ్చర్యకరమైన ఆధ్యాత్మిక వాతావరణం ఏర్పడింది.

ఆ తరువాత సాధారణంగా వర్షాకాలంలో స్వాములవారు ఆశ్రమంలోనే చాతుర్మాస్యవిధానాన్ని పాటిస్తూ వచ్చారు.

1964లో ఆషాఢశుద్ధ ఏకాదశినాడు (20-7-1964) శుకబ్రహ్మాశ్రమంలో చాతుర్మాస్యం ప్రారంభమయింది. ప్రారంభదినాన శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి పాదుకలకు పూజ చేశారు. ఆపైన కలశస్థాపన హోమాదివిధులు నిర్వర్తింపబడ్డాయి. ఆధ్యాత్మిక ప్రబోధాలు, పరమార్థవిచారణలూ నిత్యమూ



ఒక క్రమపద్ధతిలో ఏర్పాటు చేయబడ్డాయి. దూరప్రాంతాలనుండీ, ఆశ్రమ పరిసర ప్రదేశాలనుండీ కూడా జిజ్ఞాసువులు వచ్చి అక్కడి ప్రబోధాలు విన్నారు.

ఉదయం 5 గంటల నుండి 6-30 గంటల వరకూ గీతాపారాయణం జరిగేది. అప్పుడు శ్రీ స్వాములవారు గీతాప్రవచనం చేసేవారు. 9 గంటల నుండి 10-30 గం|| వరకూ పూజామందిరంలో అభిషేకమూ, పూజా జరిగేవి. మధ్యాహ్నం 2-30 నుండి 3-30 వరకూ ఉపనిషద్విచారణ, 4-30 నుండి 5-30 వరకూ ఆధ్యాత్మిక ఉపన్యాసాలూ, రాత్రి 8 నుండి 9 గంటల వరకూ నామసంకీర్తన క్రమం తప్పక నిర్వహింపబడేవి.

ఈ చాతుర్మాస్య వ్రతసమయంలో భూమానందాశ్రమాధిపతులు శ్రీ రామకృష్ణానంద స్వాములవారు, కైలాసాశ్రమాధిపతులు శ్రీ నిత్యానంద స్వాములవారు, గోపాలకృష్ణాశ్రమాధిపతులు శ్రీ అశేషానంద స్వాములవారు, హరేరామజపయజ్ఞాశ్రమాధిపతులు శ్రీ వాసుదేవానంద స్వాములవారు మొదలైన ప్రముఖులు ఆధ్యాత్మిక ప్రవచనాలు కావించారు.

ఈ సందర్భంలో చాతుర్మాస్యవ్రత ప్రాశస్త్యాన్ని వివరిస్తూ శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు వేదాంతభేరిలో ఇలా వ్రాశారు —

"నరుడు నరుడుగనే ఎల్లప్పుడు ఉండుట వాంఛనీయము గాదు. నరుడు నారాయణుడు కావలెను. పురుషుడు పురుషోత్తముడై పరగవలెను. అంతటితో జీవుని ప్రయత్నము పరిసమాప్త మగును. ఎప్పుడు మానవుడు మాధవు డగునో ఇక అతనికి చేయవలసిన కార్య మేమున్నది? సమస్తసాధనలు అచ్చోట అంతమై పోవును. దైవత్వమును బడయుటతో జీవుని క్రమవికాసము పరాకాష్ఠ నందుకొనును. అదియే చరమ స్థితి. అదియే కైవల్యము. అదియే సంసారబంధవిచ్ఛిత్తి. పరమానందదాయక మగు అట్టి అనుపమదైవస్థితిని, మోక్షస్థానమును బడయుటయే జీవుని పరమావధి — ఏకైక లక్ష్యము.

అట్టి లక్ష్యమును చేరుటకై ముముక్షువు గొప్ప తపస్సు నాచరింపవలయును. ఇంద్రియములను చక్కగా నిగ్రహించవలయును. మనస్సును అదుపులోనికి తీసుకొని రావలెను. సర్వేశ్వరుని యెడల, సద్గురుని యెడల భక్తిని పెంపొందించు కొనవలెను. ప్రాపంచిక విషయముల యెడల, దృశ్యభోగముల యెడల, క్షణిక విలాసముల యెడల పరిపూర్ణ విరక్తిని సంపాదింపవలెను. మనస్సును బహిర్ముఖముగా పదార్థములవెంట పరుగిడనీయక అరికట్టి, ప్రత్యాహార మొనర్చి, అంతర్ముఖము

చేసి ఆత్మయందు స్థాపించవలెను.

అయితే బహుజన్మార్జిత దృశ్యవాసనా బలముచే మనస్సు శీఘ్రముగ లొంగదు. అందులకు శిక్షణ చాల అవసరము. కొన్ని నియమములు, కొన్ని వ్రతములు, కొన్ని సాధనపద్ధతులు అవలంబించి అకుంఠిత దీక్షతో వానిని కార్యాన్విత మొనర్చుటకై యత్నించవలెను. మన పూర్వీకు లందువలననే ఏకాదశీవ్రతము, మౌనవ్రతము, కార్తిక వ్రతము, మాఘవ్రతము, చాతుర్మాస్యవ్రతము మున్నగు వ్రతములను సృష్టించి వానిని దీక్షతో కొనసాగించినచో మనస్సుపై గొప్ప విజయమును సంపాదింపవచ్చు నని బోధించిరి. అట్టి వ్రతములలో చాతుర్మాస్య మొకటి. దానిని గూర్చి ప్రస్తుత మొకింత విచారింతము —

ఈ వ్రతము ఆషాఢశుద్ధ ఏకాదశినాడు ప్రారంభ మగును. దానినే తొలి ఏకాదశి యనియు, శయనైకాదశి యనియు అందురు. శ్రీవిష్ణుభగవానుడు ఆ దినమున యోగనిద్రయందు ప్రవేశించును. కావున దానికి శయనైకాదశి యని పేరు వచ్చినది. ఆ ప్రకారము విష్ణువు యోగనిద్రయందు నాలుగు మాసములుండి మరల కార్తికశుద్ధ ఏకాదశినాడు లేచును. కావున ఆ దినమునకు ఉత్థానైకాదశి యని పేరువచ్చినది. కావున ఈ నాల్గు మాసములు (చాతుర్మాస్యకాలము) అతి పవిత్రమైన సమయము. వాతావరణము అప్పుడు చాల చల్లగా నుండును. కాన ధ్యానమునకు చాలా అనుగుణముగా నుండును. అందుచే ముముక్షువు లాసమయమున తీవ్రసాధనలు గావింపవచ్చును.

పూర్వకాలమున సాధువులు, సన్న్యాసులు కొంతకాలము ఏకాంతమున చక్కగా తపస్సు నాచరించి నియమనిష్ఠలు గలవారై పరమార్థానుభూతిని బడసి తదుపరి దేశమున సంచార మొనర్చుచు గృహస్థులు మున్నగువారికి ఆధ్యాత్మిక బోధ నలు గావించుచుండిరి. ఈ నాలుగు నెలలు వర్షాకాలము, చలికాల మగుటచే సంచారమునకు ప్రతిబంధముగా నుండుట వలన వారు తమ ప్రయాణాలు విర మించి ఎక్కడో ఒకచోట నిలుకడగ నున్నవారై అచ్చటి జనులకు దైవతత్త్వమును ప్రబోధించుచుండెడివారు. అదియే చాతుర్మాస్యకాలము. చాతుర్మాస్యవ్రతమును సాధువులు, సన్న్యాసులేకాక గృహస్థులు, బ్రహ్మచారులును అవలంబింపవచ్చును. కాని ఎవరైనను ఈ నాల్గు నెలలు బయట సంచారములు విరమించి ఒకేచోట చక్కగా భగవద్ధ్యానాదులను గావింపవలయును.

ఈ చాతుర్మాస్యమునందు ఏమి చేయుదురు? ఏమి చేయవలయును అనునది ఒక ప్రశ్న. చాతుర్మాస్య మొక వ్రతము. ఒక రోజు, రెండు రోజులతో గూడిన వ్రతముగాదు. దీర్ఘకాలిక వ్రతము. ఈ వ్రతమాచరించువారు ఎక్కడికిని వెళ్ళక దీక్షతో ఆధ్యాత్మికసాధనలను అమలుపరచుచుందురు. భగవత్తత్త్వవిచారణయందే కాలము గడపుదురు. కాలమును వృథా చేయరు. ఏదియో ఒక పరమార్థకార్య మును చేయుచుందురు. బోధనాశక్తి కలవారు ఇతరులకు ప్రబోధించుచుందురు. కొందరు ఈ నాల్గు నెలలు కొన్ని నియమములు పెట్టుకొందురు. కొందరు ఆహారసంయమము కావించుచుందురు. కొందరు పప్పులో ఉప్పు మానివేయుదురు. మరికొందరు పాలలో చక్కెర మానివేయుదురు. ఇంకకొందరు కొన్నిరకముల కూరలను విసర్జించుచుందురు. ఇది యంతయు జిహ్వేంద్రియ సంయమము కొరకై ఏర్పడినది.

అయితే ఇది చాలదు. ఆహారాది నియమములతో బాటు ఈ క్రింది విషయముల యందు గూడ జాగ్రత్త వహించవలెను. కోపము రానీయకూడదు. బ్రహ్మచర్యము శీలించవలెను. తన హృదయ మను బిలమును బాగుగా పరిశోధించు కొని అసూయ, ద్వేషము మున్నగు విషసర్పము లేవైనా అందు కాపురమున్నవేమో చూచి ప్రయత్నపూర్వకముగా వాటిని బయటకు గెంటివేయవలయును. భగవద్భ క్తిని, గురుభక్తిని బాగుగా పెంపొందించుకొనవలెను. ప్రతిదినము ఒక అష్టోత్తరము అంటే 108కి తక్కువలేకుండ ఏదైన దివ్యమంత్రమును జపించుటయు చాలా శ్రేష్ఠము. తీరికగా నున్నప్పుడు రామనామమును గాని, కృష్ణనామమునుగాని, శివనామమునుగాని, విఠల్ నామమునుగాని లిఖించవచ్చును. వెయ్యేల? ఏదియో ఒక దైవకార్యముచే మనస్సునకు బహిర్ముఖప్రవృత్తి తగ్గించి విషయచింతనకు అవ కాశము లేకుండ చేయవలయును. పలువురు చేరుటకు వీలున్నచో సమష్టిగానైనా లేక వ్యక్తిగతముగానైన సంకీర్తనాదులను గావించుకొనవచ్చును. ఈ ప్రకారముగా చాతుర్మాస్యకాలము వ్రతనిష్ఠనకు దైవవాతావరణమునందే గడచిపోవును. దాని ఫలిత మిక చెప్పతరమా?

వ్రతము పూర్తి యగుసరికి సాధకుడు బోలెడు పుణ్యమును సముపార్జిం చును. ఇదియంతయు జీవుని లక్ష్యసాధనకు, అనగా బ్రహ్మసాక్షాత్కారమునకు మిక్కుటముగా ఉపకరించును.

ఈ సందర్భమున ఒక విషయమును సర్వులును జ్ఞాపకమునం దుంచుకొన వలెను. అది యేమనగా, ఈ వ్రతములు, జపములు, తపములు వాస్తవముగా

ఏదియో ఒక కాలమునకు పరిమితములైయుండలేదు. సామాన్యునకు మోక్ష మార్గమున ఆసక్తి జనింపజేయుటకే ఈ పరిమితకాలవ్రతాదు లేర్పడినవి. కాని యథార్థముగా దైవధ్యానమందు, తత్త్వవిచారమందు కాలనిర్ణయమేమియు లేదు. జనులు ఒక చాతుర్మాస్యమునందేకాదు, ఎల్లకాలములందును పరమార్థసాధనము కావింపవచ్చును. 'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర' అని గీతయందు భగవానుడు చెప్పనే చెప్పెను. తీవ్రతర ముముక్షువు లెల్లప్పుడు ద్వాదశమాస్య వ్రతములనే ప్రతిసంవత్సరము నాచరించుచుందు రనుటలో సందేహము లేదు. అనగా వారు నిరంతరము అధ్యాత్మక్షేత్రమందే కాలము గడపుచుందురు. అట్టి స్థితి కెగబ్రాకుటకై ప్రతివారును యత్నించవలెను.

అయితే ప్రారంభమున చిన్నచిన్న వ్రతముల నారంభించి క్రమక్రమముగా ఊర్ధ్వస్థితిని బడయవచ్చును. ఇట్టి చాతుర్మాస్యాది వ్రతములు జనుల హృదయాంతరాళములను పరిశుద్ధపరచి ఆత్మసాక్షాత్కార మను మహోన్నత శిఖరము నధిరోహించుటకై చాలా సహాయపడును. కావున ముముక్షువులు వాని నవలంబించి చిత్తశుద్ధిని బడసి భగవత్కృపకు పాత్రులై తమ తమ జీవితములను ధన్య మొనర్చుకొందురు గాక!!!"

(వే.భేరి. - సెప్టెంబర్ - 1964)

## సాధనవారాలు

చాతుర్మాస్యాది వ్రతాలే కాక సాధకుల ఉపయోగార్థమై శ్రీస్వాములవారు ఆశ్రమంలో సాధనవారాలను గూడా నిర్వహించారు. కొన్ని సందర్భాలలో ఆశ్రమ వార్షికోత్సవాలతోపాటే ఈ సాధనవారాలు కూడా జరిగేవి. చాతుర్మాస్య వ్రత కాలంలో లాగానే సాధనవారాలలో కూడా ప్రబోధాలు నిర్వహించబడేవి. విశేషించి ఈకాలంలో గీతాపారాయణం, జపం, ప్రాణాయామం, యోగాసనాలు, లిఖితజపము, ఆరోగ్యసాధన, కుండలినీశక్తిని మేల్కొలుపుట — మొదలైన వాటిలో చక్కని శిక్షణ ఏర్పాటు చేయుబడింది. గీతాపోటీలలో గెలుపొందినవారికి బహుమతులు గూడా ఏర్పాటయ్యాయి. శ్రీస్వాములవారు సాధనవారాల సమయంలో ఒక్కొక్కరోజు గీతలోని ఒక్కొక్క అధ్యాయంపై ఉపన్యసించి సాధకులకు కలిగే సంశయాలను నివారించేవారు. ఈ సమయంలో వివిధప్రాంతాలనుండి ఆహూతులై వచ్చిన ప్రముఖవక్తలు కూడా ప్రబోధాలు చేయడం పరిపాటి.



ముక్తిసాధకులైన భక్తులు సాధనదశలో ఎలా వుండాలో బోధిస్తూ శ్రీస్వాములవారు ఈ క్రిందివిధంగా వారిని ప్రోత్సహించేవారు—

"ఏ వస్తువైనను ఉన్నప్పుడు దాని విలువ తెలియదు. కంటి యొక్క విలువ కండ్లున్నప్పుడు అంతగా తెలియదు. గ్రుడ్డివాడు నేత్రములయొక్క విలువను చక్కగా అంచనా వేయగలడు. చేతుల వలనను, కాళ్ల వలనను మనము ఎంత లాభమును పొందుచున్నామో ఇపుడు తెలియదు. వానికి వైకల్యము సిద్ధించినప్పుడు తెలియును. ఆరోగ్యముయొక్క విలువ అనారోగ్యము కలిగినపుడు బాగుగ తెలియగలదు. సూర్యునియొక్క విలువ పగలు గుర్తెరుగువారు చాల అరుదు. రాత్రి చీకటిలో అవస్థ పడునపుడు ఆ సూర్యుడు లోకమున కెంత ఉపకారము చేయుచున్నాడో చక్కగ అనుభూత మగుచుండును. అట్లే శరీరమున్నపుడు దాని విలువ యెంతటిదో మనుజుడు గ్రహించుట లేదు. అది పోయిన పిదప బాధ నొందుచున్నాడు. ఎన్నియో జన్మలు దాటిదాటి సుకృతవశమున మానవుడై పుట్టుచున్నాడు జీవుడు.

'కదా చిల్లభతే జన్తుర్మానుష్యం పుణ్యసంచయాత్' అని గరుడపురాణమున విష్ణుభగవాను డీ విషయమునే గరుత్మంతునకు తెల్పియుండెను. కావున మానవ జన్మ దుర్లభమే కాదు, సుదుర్లభ మనియే చెప్పవలసియున్నది. మోక్షమునకు సోపానము వంటి దిది. పూర్వము సృష్ట్యాదియందు చతురాననుడు, వృక్షములను, సరీసృపములను, పశువులను, పక్షులను, మత్స్యాదులను సృజించియు వానిచే ఏమాత్రము సంతుష్టిని బొందక యుండెను. కాని తదుపరి మనుజుని సృష్టించి పరమానందభరితు డయ్యెనట! ఏల? బ్రహ్మావలోకమునకు వలసిన బుద్ధిబల మాతనికి మాత్రమే కలదు. తక్కిన జీవరాసుల కది లేదు.* ఆ బుద్ధిబలమును సదుపయోగ మొనర్చుకొని పరమార్థలక్ష్యప్రాప్తియం దద్దానిని వినియోగించినపుడు మాత్రమే అది సఫల మగును. లేనిచో, అది యున్నను లేనిదానితో సమానమే యగును.

---

* సృష్ట్వా పురాణి వివిధా న్యజయాత్మశక్త్యా
వృక్షాన్ సరీసృపమృగాన్ ఖగదంశమత్స్యాన్ |
తైస్తై రతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముద మాప దేవః ||

(భాగవతం 11-9-28)

కాని మనుజు డట్లు చేయుచున్నాడా? మోక్షసౌధారోహణమునకు భగవాను డొసంగిన ఈ చక్కని సోపానమును మనుజుడు సదుపయోగ మొనర్చుకొనుచున్నాడా? 'హరి'ద్వారమును జేరుటకు యత్నించుచున్నాడా? లేదు. 'అరి'ద్వారమునే తట్టుచున్నాడు. దేవుని కొఱకు దేహమును వినియోగించుచున్నాడా? లేదు. దేహముకొఱకే దేవుని ఉపయోగించుకొనుచున్నాడు. ఈ ప్రకారముగ అమూల్యమగు సదవకాశమును భ్రష్టమొనర్చుకొని విషయవ్యామోహయుక్తుడై ఉన్నత శిఖరములనుండి క్రమక్రమముగ దిగజారి పోవుచున్నాడు. చిన్మయుడుగా వెలుగొంద వలసియున్న యాతడు మృణ్మయుడుగ తయా రగుచున్నాడు. ఇది చాలా శోచనీయము.

భగవానుడు కరుణించి మానవదేహమను చక్కని ఉపకరణమును మన కొసంగియున్నాడు. అది శిథిలము కాకపూర్వమే దానివలన ఎంత పారమార్థిక లాభమును పొందగలుగుదుమో అంత పొందియే తీరవలెను. ఇట్టి మహదవకాశములు మఱి ఏ యితర లోకముననను, ఏ యితర జన్మయందును గూడ లభింపవు. గాలి ఉన్నప్పుడే తూర్పారబట్టవలెను. దీప మున్నప్పుడే ఇల్లు చక్కపెట్టుకొనవలయును.

'*Strike the iron when it is hot*' — 'ఇనుము వేడిగా నున్నప్పుడే సాగదీయవలెను'. చల్లబడినచో వీలుపడదు. కావున దేహము యొక్క విలువను దేహమున్నప్పుడే బాగుగ తెలిసికొని దానిచే చక్కటి సాధనలు గావించి చెఱకునుండి రసమువలెను, పాలనుండి వెన్నవలెను పంచకోశాంతర్గతమగు పరమాత్మను అందుండి వెలికి తీయవలెను (సాక్షాత్కరించుకొనవలెను). ఏలయనగా జీవితము క్షణభంగురమైనది. ఎత్తైన చెట్టుకొమ్మయొక్క చివరిభాగమున గల ఆకుకొనయందు వ్రేలాడు మంచుబొట్టువలె శరీరము ఏక్షణమున కాక్షణము రాలుటకు సిద్ధముగి నున్నది. ఆయువును కొందరు ఏనుగు చెవితో పోల్చిరి. మరికొందరు కప్పయొక్క కంఠచర్మముతో దాని నుపమించిరి. కొందరు మెఱపువలె అతిచంచలమని సాదృశ్యము చెప్పిరి. కావున దీనిపై విశ్వాసము తగదు. చేయదగిన పారమార్థిక కార్యము లన్నింటిని బాల్యయౌవనములందే పరిసమాప్తము గావించివేయవలెను. ఆరోగ్యము, ఇంద్రియసౌష్ఠవము మున్నగు సదవకాశములలోనే తీవ్రముగా సాధన ఆచరింపవలెను. వార్ధక్యములో జ్ఞాపకశక్తి తగ్గిపోవును. ఇంద్రియములు సడలిపోవును. శక్తి క్షీణముఖము పట్టును. అట్టితరి తీవ్రసాధన లొనర్చుటకు ఆనుకూల్యము ఏర్పడదు. కాబట్టి—



'గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్' అని పెద్దలు చెప్పినట్లు మృత్యువు జుట్టుపట్టుకొని యున్నట్లు భావించి ధర్మము నాచరింపవలెను. పచ్చికుండలోని నీటివలె ఆయువు నశించిపోవుచున్నది. నూతన యౌవనశోభ మెఱపు వలె చంచలముగా నున్నది. వార్ధక్యము సింహమువలె పరుగిడి వచ్చుచున్నది. కావున భగవానుడే మనకు శరణ్యము! ప్రతిజీవియు మృత్యుసంసారమున తగుల్కొని యున్నాడు. కావున దానినుండి తప్పించుకొను తెరువు యోచించుకొనియే తీరవలెను. తానీ ప్రపంచమున ఎన్ని భోగభాగ్యముల ననుభవించినను, మహావైభవమును కండ్ల జూచినను అవి యన్నియు బంధన మధ్యమున తానను భవించినవే యగును. కాబట్టి విషయవిరక్తి గలిగి భక్తి జ్ఞానవైరాగ్యాది ముక్తిసాధనలను త్వరితముగా నాచరించి తరించవలెను".

మాటిమాటికీ సాధకులను లక్ష్యం వైపు పురోగమించడానికి పురికొల్పుతూ స్వాములవారు చేసే యిలాంటి ప్రబోధాలు వారిలో ఆత్మవిశ్వాసం రేకెత్తించేవి. సత్వర లక్ష్యసిద్ధికై వారికి తోడ్పడేవి.

## సప్తాహాలు

గీతాజ్ఞాన యజ్ఞాలు మొదట పదునెనిమిది రోజుల కార్యక్రమాలుగా ప్రారంభమై క్రమంగా ఇరువదిరోజులకు విస్తరించాయి. అందులో మొదటినాడు ఉపోద్ఘాత రూపమైన ప్రవచనమూ, తరువాత పదునెనిమిదిరోజులూ గీతలోని అష్టాదశాధ్యాయాల మీద ఉపన్యాసాలూ, చివరిరోజు గీతామాహాత్మ్యంపై ప్రవచనమూ కొనసాగేవి.

పై యజ్ఞాలే కాక ఏడు దినాలపాటు నిర్వహించే సప్తాహకార్యక్రమాలలో గూడా శ్రీస్వాములవారు అనేక పర్యాయాలు పాల్గొన్నారు. పరీక్షిన్మహారాజు శృంగిశాపానికి లోనైనప్పుడు ఏడు దినాల వ్యవధిలోనే శ్రీ శుకబ్రహ్మ నుండి భాగవతం విని తరించాడు. అందువల్ల సప్తాహరూపంగా నిర్వర్తించే కార్యక్రమాలు ఆధ్యాత్మిక సమావేశాలలో విశిష్టతను సంతరించుకొన్నాయి. సాధారణంగా ఆస్తికులు భాగవతసప్తాహాలు జరుపుకొంటూ వుంటారు. భగవద్గీతకూ, భాగవతానికీ అవినాభావసంబంధం ప్రసిద్ధమే. మొదటిది లక్షణగ్రంథం కాగా, రెండవది లక్ష్యగ్రంథంగా ప్రతీతి వహించింది. అందువల్ల సప్తాహకార్యక్రమాలలో భాగవతం లాగానే భక్తులు భగవద్గీతను గూడా శ్రవణం చేసి తరిస్తారు.

చాలామంది భక్తులు శ్రీ స్వాములవారిని సప్తాహకార్యక్రమాలకు పిలిపించి భగవద్గీతోపన్యాసాలు చేయవలసిందిగా ప్రార్థించేవారు. వారి ప్రార్థనను మన్నించి శ్రీవారు ఆ కార్యక్రమాలను శుభప్రదంగా నిర్వర్తించారు.

సన్న్యాసాశ్రమ స్వీకరణానంతరం శ్రీ స్వాములవారు వ్యాసాశ్రమంలో వున్నప్పడే 1949లో చిత్తూరులోనూ, బెంగుళూరులోనూ సప్తాహకార్యక్రమాలు జరిపారు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపనానంతరం బంగారుపేట, బెంగుళూరు, కోలారు, కొళ్లేగాలం, బందరు, అగరం, గుంటూరు, శ్రీశైలం, కురుగొండ, ప్రొద్దుటూరు, కృష్ణగిరి, మండపేట మున్నగు అనేక ప్రాంతాలలో శ్రీవారు సప్తాహ కార్యక్రమాలు నిర్వర్తించి ఆత్మప్రబోధం కలిగించే ప్రవచనాలు కావించారు.

ఇక పల్లెల్లోనూ, పట్టణాలలోనూ జరిగే అనేక దైవకార్యక్రమాలనూ, సాధుసమ్మేళనాలనూ, మహనీయుల జయంత్యుత్సవాలనూ, ఇతర విశిష్టసంఘటనలనూ పురస్కరించుకొని స్వాములవారికి కోకొల్లలుగా ఆహ్వానాలు అందేవి. అందులో కొన్ని కార్యక్రమాలు ఒక్కరోజులో ముగిసిపోగా మరికొన్ని పది దినాలను గూడా మించి కొనసాగేవి. వీలైనప్పుడల్లా శ్రీవారు ఆకార్యక్రమాలలో గూడా పాల్గొంటూ వచ్చారు.

## ఆలయప్రతిష్ఠాది కార్యక్రమాలు

శ్రీవారి గీతాప్రచారోద్యమం ఆంధ్రదేశంలో నలువైపులా ప్రాకిపోవడంతో ఆయాప్రాంతాలలోని ప్రజలలో ఆస్తికభావం వ్యాప్తి పొందింది. ఆస్తికుల సాధనలకు దేవాలయాలూ, ఆశ్రమాలూ, మఠాలూ మొదలైన ధార్మికకేంద్రాలు ఎంతగానో సహకరిస్తాయి. కొందరు భక్తులు నిత్యం తమ యింటిలోనే గీతాపారాయణ చేసుకోగా మరికొంతమంది సామూహికంగా నిత్యపారాయణకు ఏర్పాట్లు చేసుకొనేవారు. అలాంటివారికి దేవాలయాలూ, భజనమందిరాలూ ఉపకరించేవి.

సాధారణంగా మన గ్రామాలలో వివిధ దేవతలకు చెందిన మందిరాలు ఉండనే వుంటాయి. ఆ మందిరాలలో అవకాశం లేనప్పుడు ఆర్థికంగా వసతి కల భక్తులు సమాజాలుగా ఏర్పడి ప్రత్యేకంగా గీతామందిరాలు మొదలైన నిర్మాణాలను ఏర్పాటు చేసుకొనేవారు. అట్టి నిర్మాణాలు వివిధప్రాంతాలలో ఏర్పడ్డాయి. ఆ మందిరాలలో శ్రీకృష్ణుని విగ్రహాన్నో, లేక చిత్రపటాన్నో ప్రతిష్ఠించుకొని పారాయణంతోపాటు భక్తులు నిత్యపూజాదులు గూడా నిర్వర్తించుకుంటూ వుంటారు.



1961లో నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని గీతామందిరం అలా ఏర్పడిందే. తమలో కలిగిన ఈ భక్తిభావానికి ప్రేరణ శ్రీ విద్యాప్రకాశానంద స్వామీజీ నుండి వచ్చింది కాబట్టి భక్తులు తాము తలపెట్టిన నిర్మాణాలకు శంకుస్థాపన, ప్రారంభోత్సవం, అందులో విగ్రహప్రతిష్ఠ మొదలైన కార్యక్రమాలకు శ్రీవారినే ఆహ్వానించేవారు. వారి ఆహ్వానాలమేరకు శ్రీవారు అక్కడికి వెళ్లి అవసగమైనన్ని దినాలు అక్కడ వుండి ప్రతిష్ఠాదులతోపాటు ఆధ్యాత్మికబోధలు కూడా చేసేవారు. గీతాయజ్ఞాలు జరిగే ప్రదేశంలోగానీ, అక్కడికి సమీపప్రాంతంలోగానీ పై కార్యక్రమాలు ఏర్పాటయితే అక్కడి కక్కడే ఆ పనులు పూర్తిచేసి భక్తులను ఆనందపరచేవారు.

1961నుండి నేటివరకూ ఈ ప్రతిష్ఠాదికాలు అనేక ప్రదేశాలలో జరిగాయి. కావలి, సికింద్రాబాద్, జడ్‌చర్ల, కేశవరం, కపిలేశ్వరపురం, జువ్వలపాళం, దువ్వ, బెంగుళూరు, నాగార్జునసాగర్, అమలాపురం, నల్గొండ మొదలైనచోట్ల అనేక ప్రతిష్ఠాది కార్యక్రమాలు పైవిధంగా శ్రీస్వాములవారి అమృతహస్తాలతో జరిగినవే.

1982లో షాద్‌నగర్ పట్టణంలో స్వామీజీ తమ గురుదేవులు శ్రీ మహర్షి మలయాళస్వాములవారి విగ్రహాన్ని గూడా ప్రతిష్ఠించారు. వారు ప్రారంభోత్సవం కావించిన ఆలయాలలో నేటికీ నిర్విఘ్నంగా పలు దైవకార్యక్రమాలు జరుగుతున్నాయి.

## శ్రీకాళహస్తిలో కళాశాలాస్థాపన

ఆంధ్రదేశంలో రాయలసీమ నేటికీ వెనుకబడిన ప్రాంతమే. అక్కడ నీటివనరులు సమృద్ధిగా లేకపోవడంవల్ల వ్యవసాయమే ప్రధాన వృత్తిగాగల జనానీకంలో ఎక్కువమంది ఆర్థికంగా వెనుకబడివుండడం సహజమే. శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రమైనా ఆర్థికంగా పురోగతి పొందిన ప్రదేశం కాదు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయాలనే దృఢసంకల్పం నాటినాయకులకు కలిగింది. ఆ సంకల్పానికనుగుణంగా కొంత కృషి గూడా అప్పట్లో జరిగింది. అయినా ఆ కృషిఫలం మొదట కొన్ని ప్రముఖ పట్టణాలకు మాత్రమే పరిమిత మయింది. అందువల్ల శ్రీకాళహస్తి విద్యారంగంలో వెనుకబడివుండక తప్పలేదు. అక్కడి విద్యార్థులు ఉన్నతవిద్యాభ్యాసానికై మద్రాసుకో, లేక తిరుపతికో వెళ్లేవారు.

తాలూకా కేంద్రమైన శ్రీకాళహస్తిలో ఒక కళాశాల ఏర్పడితే పట్టణవాసులకే కాక పరిసరగ్రామస్థులకు కూడా ఉపయోగకరంగా వుంటుందని కొందరు పుర ప్రముఖులు భావించారు. వారు కళాశాలాస్థాపనకు ఒక కమిటీగా రూపొంది తగిన కృషి ప్రారంభించారు. నాటి పురపాలకసంఘ అధ్యక్షులు శ్రీ పి. ఆర్. మాధవరావుగారూ, వారి అనుయాయులూ ఇందుకై తీవ్రప్రయత్నాలు చేశారు. అదృష్టవశాత్తూ శ్రీకాళహస్తికే చెందిన శ్రీ అద్దూరి బలరామిరెడ్డిగారు అప్పుడు రాష్ట్రవిద్యాశాఖామాత్యులుగా వుండడంవల్ల వారి ప్రయత్నం ఫలోన్ముఖ మయింది. కళాశాలా స్థాపనకు కొంత నిధి సేకరించవలసి వచ్చింది.

కమిటీ సభ్యులు శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారి చెంతకు వెళ్లి తాము చేస్తున్న ప్రయత్నాన్ని వివరించారు. ఆశ్రమం తరపున కళాశాలా స్థాపనకు ఆర్థికసహకారం అందించవలసిందిగా అర్థించారు.

భక్తులు తమకు సమర్పించిన ద్రవ్యం విద్యావ్యాప్తి ద్వారా లోకహితార్థమై వినియోగపడడం మంచిదే అని భావించిన శ్రీ స్వాములవారు సంతోషంతో కళాశాలకు ఏబదివేలరూపాయల భూరివిరాళం సమర్పించారు. శ్రీవారి త్యాగానికి అందరూ హర్షించారు. శ్రీకాళహస్తి దేవస్థానంవారు గూడా ఇరవైయైదువేల రూపాయల విరాళం అందించారు. కళాశాలకు "స్వామి విద్యాప్రకాశానంద గవర్నమెంట్ ఆర్ట్సు అండ్ సైన్స్ కాలేజి" అని నామకరణం జరిగింది.

22-8-1966వ తేదీన కళాశాలకు ప్రారంభోత్సవం నిర్వహింపబడింది. నాటి సమావేశానికి విద్యామంత్రి శ్రీ అద్దూరి బలరామిరెడ్డిగారు అధ్యక్షత వహించారు. న్యాయశాఖామంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారు (నేటి భారతదేశ ప్రధానమంత్రి) కళాశాలకు ప్రారంభం చేశారు. కళాశాల కమిటీ ఉపాధ్యక్షులు శ్రీ పి.ఆర్. మాధవరావుగారు స్వాగతవచనాలు పలికి కళాశాలా నివేదిక సమర్పిస్తూ సంఘం తరపున జరిగిన కృషిని వివరించారు. శ్రీ స్వాములవా రిచ్చిన సహకారాన్ని అందరూ ప్రశంసించారు.

ఈ సందర్భంలో శ్రీ స్వాములవారు మాట్లాడుతూ ఇలా అన్నారు—

"మానవ ప్రయత్నం, దైవబలం లేనిదే ఏ కార్యమూ సఫలం కాదు. కేవలం విద్యవల్లనే ప్రయోజనం లేదు. భగవద్భక్తి, నైతికసంపత్తి, హృదయవైశాల్యం — ఇలాంటి సద్గుణాలను పెంపొందింప జేసినప్పుడే విద్య శోభిస్తుంది".



నాటి ఉపన్యాసంలో విద్యవల్ల కలిగే అనేక ప్రయోజనాలను శ్రీవారు అతి విపులంగా నిరూపించారు. వారి పేర స్థాపించిన కళాశాల ఎంతోమంది విద్యార్థులను పట్టభద్రులుగా, ప్రముఖ వ్యక్తులుగా తీర్చిదిద్దింది.

తరువాతి కాలంలో శ్రీకాళహస్తి పట్టణం త్వరితగతిని అభివృద్ధి చెందింది. కళాశాలలో విద్యార్థులసంఖ్య మితికిమించి పెరిగింది. అందుచేత బాలికలకు ప్రత్యేకంగా ఒక కళాశాల వుండడం మంచిదని భావించి పురప్రముఖులు అందుకై కృషిచేశారు. వారు శ్రీ స్వాములవారి వద్దకు పోయి మహిళాకళాశాల స్థాపనకు తోడ్పడవలసిందిగా అభ్యర్థించారు. వారి కోరికమేరకు శ్రీ స్వాములవారు మళ్లీ ఏబదివేల రూపాయల భూరివిరాళం అందజేశారు. 1982లో స్వామి విద్యాప్రకాశానంద గవర్నమెంటు వుమెన్స్ కాలేజి అను పేర ఒక జూనియర్ కళాశాల ఏర్పాటయింది.

ఇటీవల తిరుపతిలో శ్రీ మలయాళ సద్గురు సేవాసమాజమువారు నిర్వహించే సంస్కృతపాఠశాలకు, గ్రంథాలయానికి గూడా శ్రీ స్వాములవారు ముప్పైయైదు వేల రూపాయల భూరివిరాళం సమర్పించారు. ఇంకా అనేక సందర్భాలలో శ్రీ స్వాములవారు ఆధ్యాత్మిక సంస్థలకు తగిన రీతిలో ఆర్థికసహాయం చేసివున్నారు.



# పంచదశ ప్రకరణం

## గీతాజ్ఞానయజ్ఞ వైభవం

ఆధ్యాత్మిక సంఘాలు, దేవాలయనిర్వాహక వర్గాలు, వర్తకసంఘాలు, అందుకై తాత్కాలికంగా ఏర్పడిన ఆహ్వానసంఘాలు — ఇలా పలురకాల సంస్థలకు చెందిన వారు శ్రీ స్వాములవారిని తమతమ ప్రాంతాలకు ఆహ్వానించి గీతాజ్ఞానయజ్ఞాలను నిర్వహింపజేసేవారు. శ్రీవారి ఉపన్యాసపాటవం తెలియనివారు 'వేదాంతం ఎంతమంది వింటారు?' అని మొదట శంకించేవారు. క్రమంగా ఉపన్యాసస్థలం వేలకొలది శ్రోతలతో కిటకిట లాడినప్పుడు వారు ఆశ్చర్యచకితు లయ్యేవారు.

మొదట పరిమితస్థలంలో ఏర్పాటైన కొన్ని సభలలో అశేషంగా వచ్చే జన వాహినికి ఆచోటు చాలకపోయేది. రెండు మూడు రోజుల పిదప ఇంకా కొంత విశాలమైన మరొకచోటికి మార్చేవారు. రోజులు గడిచేకొద్దీ ఆచోటుకూడా సరి పడేదికాదు. అందుచేత అతివిశాలమైన స్థలానికి మళ్లీ సభను మార్చేవారు. ఇలా అనేక సభలలో స్థలం మార్పులు జరిగాయి. మామూలుగా సినిమాలకు హాజరయ్యే జనం శ్రీవారి ఉపన్యాసాలు విని గీతాయజ్ఞం జరిగినన్ని రోజులూ సినిమాలు మానుకొనేవారు.

జ్ఞానయజ్ఞాలు ప్రారంభమయ్యే సమయంలోనూ, సమాప్తి సందర్భాలలోనూ ప్రజలు స్వాములవారికి స్వాగతపత్రాలు, సమ్మానపత్రాలు, వీడ్కోలు పత్రాలు, పద్యసుమాంజలులు వగైరా ప్రశంసాపత్రాలు కొల్లలుగా సమర్పించేవారు. ఆ ప్రాంతంలోని వార్తా పత్రికలు గూడా స్వామీజీని ప్రశంసిస్తూ గీతాయజ్ఞాల వైభవాన్నీ, అవి ప్రజలపై చూపిన ప్రభావాన్నీ విపులంగా వర్ణించేవి. కొన్ని సమ్మానపత్రాలనూ, పత్రికల ప్రశంసలనూ ఈ సందర్భంలో పాఠకుల దృష్టికి తేవడం సముచితంగా వుంటుంది.

హృద్యమైన పద్యరచనలతో ప్రసిద్ధకవు లనేకులు శ్రీస్వాములవారిని ప్రశంసించిన సందర్భా లెన్నో వున్నాయి. కవిశేఖర శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు 1964 జనవరిలో విజయనగరంలో జరిగిన 10 వ గీతాయజ్ఞం సమాప్తమైన సందర్భంలో ఈ క్రింది పద్యప్రసూన మాలికను శ్రీవారికి సమర్పించారు-----



## పద్యప్రసూనమాలిక

" సత్తామాత్రమిదం చరాచర జగన్మాయాకళాకల్పితం
పశ్యన్ శుద్ధ చిదేకమూర్తి రభవో యో భాసతేజసా విభుః |
సర్వేశోఽవతు సద్యతీశ్వరవరం విద్యాప్రకాశాన్వితం
స్వానందాఖ్యగిరిం ప్రజాహితకరం శ్రీకాళహస్త్యాశ్రమమ్ || 1

స్వాతంత్ర్యమ్మున నద్భుతమ్మగు శుకబ్రహ్మాశ్రమమ్మున్ జగ
త్ఖ్యాతిన్ నిల్పి, పవిత్రధర్మమగు గీతందెల్పి శ్రీవాసవీ
గీతామండలి నీపురమ్మున కృపావిస్ఫూర్తి స్థాపించి, గీ
తాతాత్పర్యము సంఘటించు గురు విద్యానందు భావించెదన్. 2

ఆనందాద్వయ యోగశాస్త్రమగు గీతార్థమ్ము భాషించి, అ
జ్ఞానంబున్ దెగటార్చి, భక్తులకు విజ్ఞానంబు సంధించి, బ్ర
హ్మానందమ్ము నొసంగు నిర్మల కృపావ్యాపారు, విద్యాప్రకా
శానందాఖ్యగిరిన్ సుధామధురవిద్యావాగ్ఝరిన్ గొల్చెదన్. 3

శ్రీమధుర ప్రబోధము విశిష్టముగా ఘటియించి, తొల్లిగీ
తామకరంద ముఖ్యములు ద్వాదశమంజరియున్ రచించి, జ్ఞా
నామృతసింధువున్ గరతలామలకంబుగ గూర్చి, మానవ
స్తోమ సుఖమ్ము గోరిన విశుద్ధచరిత్రు యతీంద్రు గొల్చెదన్. 4

కర్మతత్త్వమునందు ధర్మతత్త్వమునందు
గల మర్మముల నెల్ల దెలియజేసి
భక్తియోగమునందు రక్తిభాగమునందు
గల భిన్నతత్త్వంబు దెలియజేసి
ప్రాణయోగమునందు జ్ఞానయోగమునందు
గల రహస్యము లెల్ల దెలియజేసి
నిత్యసాధనమందు సత్యశోధనమందు
గల మార్గముల నెల్ల దెలియజేసి
ఘోరసంసారజలధి దొల్కొన్న మమ్ము

కృపను గీతయన్ నౌక నెక్కించినావు
తీరమును జేర నాశీర్వదింపుమయ్య!
మా నమస్కృతుల్ గొని మమ్ము మనుపుమయ్య! ” 5

1969 డిశంబరులో నరసాపురములో జరిగిన 42వ గీతాయజ్ఞములో కథాగానకళాప్రపూర్ణ శ్రీ దీక్షితదాసుగారు సమర్పించిన నమస్సుమాంజలి యిది—

“ శ్రీనారాయణపాదపద్మములకున్ జేమోడ్చి, యేతద్గురు
స్థానం బందగ నర్హతం గనిన గీతాబోధ విద్యాప్రకా
శానందాచలతత్త్వమూర్తుల పవిత్రాంఘ్రిద్వయిన్ మద్హృదు
ద్యానోత్ఫుల్ల మనోజ్ఞభక్తి కుసుమాద్యర్చావిధిన్ గొల్చెదన్. 1

ప్రత్యాసన్నత మీదు వాగ్గళితమౌ ప్రత్యక్షరం బక్షర
ప్రత్యక్షస్థిత నిత్యతావిభవ సంపన్నత్వముం గూర్చి మ
మ్మత్యంత మ్మపవర్గగాములను జేయంజాలె, మిథ్యైహికా
పత్యంబైన యసద్విదారణకలాపం బేడ్తెఱన్ స్వామిజీ! 2

ఒక శబ్దంబున గర్భితంబయిన యర్థోత్పత్తి వైవిధ్యమున్
ప్రకటోపజ్ఞ వెలార్చి వ్యాసకవితా ప్రాగల్భ్యముంజాటి, సా
ధక కోటిం దనియించు మీప్రథితగీతాబోధనల్ విన్న నా
స్తికుడైనన్ పరివర్తనం గనుట వైచిత్ర్యంబె విద్వన్మణీ! 3

నరకద్వారము మూయుగాబడును మానర్పాపురీవాసులం
దరకున్ స్వర్గము ద్వారముందెరచు గీతాయజ్ఞసాఫల్య స
త్వరసంసిద్ధి భవత్కటాక్షమున లబ్ధంబౌట; నోవాగ్విదాం
వర! యోబ్రహ్మవిదగ్రణీ! మిము నుతింపన్ నేర్తురే మాదృశుల్. 4

అతిశయదానధర్మముల కాకరమై నరసాపురం బయా
చితగతి లేమిచే గుములు జీవులయార్తిని బోనడంచు స
త్కృతి దన మానవత్వము నుదీర్ణమనస్కృత భారతీయసం
స్కృతికి నభిజ్ఞగా వెలువరించు భవత్కృప నోయతీశ్వరా! 5



చేతందాల్చెడి యూతకోల యయి మస్తిష్కాన విజ్ఞానఖ
ద్యోతంబై సువిశాలహృద్రచనమందున్ నైతికామ్నాయమై
భూతప్రీతిని యాత్మవస్తువయి మాపున్నెంపు గాణాచియై
గీతాగ్రంథము మమ్ము నిత్య మనురక్తిం బ్రోచుతన్ ధీనిధీ! 6

తెలుగున్ సంస్కృతమాంగ్లమున్ మఱియు హిందీముఖ్యమౌ పెక్కుభా
షలలో బాండితిగల్గి హృద్యమగు వాక్సారళ్యమేపార మీ
ర లుపన్యాసము జేయుచో నది ‘నయగ్రా’వారిపాతంబునన్
గల ధాటిన్ వెలయించి ముగ్ధులనొనర్చెన్ మమ్ము; వాగీశ్వరా! 7

అతికెడి రీతి జిన్నియితిహాసములన్ జతగూర్చి హాస్యవా
క్చతురత బామరప్రజలు సైత మహోయని మెచ్చ గ్రాహ్యమౌ
గతి భగవత్ప్రబోధము సుగమ్యముగా విశదీకరించు న
ప్రతిహత శేముషీనిధులు స్వాములు మీకు నమస్సుమాంజలుల్. 8

ఆనందకందమై అమృతనిస్యందమై
వికచారవిందమై వెలయుకతన
ప్రేమానుభూతియై కామితారాతియై
తామసఘాతియై తనరుకతన
విశ్వసంత్రాణమై విబుధప్రమాణమై
ఆస్తికప్రాణమై యలరు కతన
పరతత్త్వకోశమై ప్రణవసంకాశమై
భవపాశనాశమై వరలుకతన
ఐహికాముష్మికముల నిత్యార్థసిద్ధి
గలుగ గూర్చెడి స్వర్గావకాశ మగుచు
స్వామి! తావక దివ్యదర్శన విశేష
మమరులంజేసె మమ్ము యథార్థముగను.” 9

ఆ జ్ఞానయజ్ఞములోనే కవిభూషణ శ్రీ శిష్టా వెంకటసుబ్బయ్యగారు స్వామీజీకి స్వాగతం పలుకుతూ ఇలా అన్నారు —

" వేదాంతదర్శన స్వాదూద మొక్క గ్రు
క్కను గ్రోలినట్టి యగస్త్యమౌని
యోగవాసిష్ఠ మహాగభీరార్ణవ
మీద గల్గిన గజయాత్రకాదు
గీతామకరంద సంస్కృతచంద్రమండల
లీల లెజిగిన 'యపోలో'నౌక
వేదాంతభేరీ నినాదౌఘ మఖిల ది
క్పటలి మ్రోగించిన కంచుఢక్క
తతశుక పితామహాశ్రమ స్థాపకుండు
అల పరమహంస యైన విద్యాప్రకాశ
పూర్వ ఆనందగిరికి నపూర్వభక్తి
పూర్వక స్వాగతము నర్సపురము ప్రజలు.—"

## సమ్మాన పత్రం

1968 జూన్‌లో 36వ గీతాయజ్ఞం నిర్వహించినపుడు హిందూపురం పురపాలక సంఘం తరపున పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ యం.వి.వి. చలంగారూ, ఇతర సభ్యులూ ఈక్రింది సమ్మానపత్రం సమర్పించారు—

"పూజనీయా!

భరతమాతృ గర్భశుక్తి ముక్తాఫలము, విశ్వవిఖ్యాత భారతీయ సనాతన ధర్మస్వరూపులు, ఆంగ్లాంధ్ర గీర్వాణ భాషావైదుష్య సంశోభితులు, మధుర మందహాస సుందర వదనారవిందులు, అగాధ ప్రాచ్య విజ్ఞాన సంపుల్ల మేధావిలాసులు, భగవద్గీతామృతపాన మత్తచిత్తులు, మధుర హృదయులు అగు మీకు ఇవే మా హృదయపూర్వక ప్రణామాంజలులు.

మహనీయా!

యోగనిష్ఠా గరిష్ఠులు, తపశ్శక్తి సంపన్నులు, బ్రహ్మవిద్యాప్రకాశన వ్రతులు, వివిధ ధర్మకర్మ నిష్ఠాపరతంత్రులు, విద్యాధికులు, జ్ఞానవృద్ధులు అయిన మీరాకచే మా హిందూపుర పట్టణం చరితార్థమైంది. చిరంతన భారతీయ హైందవ



తత్త్వప్రచారకులయిన మీచే నిర్విఘ్నంగా కొనసాగింపబడుతున్న భగవద్గీతా యజ్ఞం మా పట్టణచరిత్రలో సాటిలేని మేటి ఘట్టం. అధర్మపథాల్లో చిక్కుకొని దారి కానరాక కొట్టుమిట్టాడుతున్న ప్రజల ఆత్మల్లోని కటిక చీకటి తెరలు తొలగించి జ్ఞానజ్యోతులు వెలిగింపవచ్చిన నవవైతాళికులు మీరు.

తపోనిధీ!

పుణ్యదంపతులైన సుశీలాదేవీ రామస్వాముల నోములపంటలై, ఉగ్గుపాలతోపాటు భక్తియోగ ధర్మతత్త్వ మకరందాలు అరిగించుకొన్న బాలయోగులై, వ్యాసాశ్రమ మహర్షి శ్రీ మలయాళ స్వాములవారి శిష్యరత్నమై, లౌకిక విద్యలో పట్టభద్రులై, కాశీవాస గంగాస్నాన పవిత్రీకృతాత్ములై, ద్వాదశ వర్షాలు అఖండ్వోహార నిష్ఠాతపస్వులై, సర్వాధ్యాత్మిక శాస్త్రపారంగతులై, చివరికి అసామాన్య తురీయాశ్రమస్థితి నొందిన మీ జీవిత చరితము అడుగడుగున అద్భుతమైంది. పిన్నవయసునందే "దక్షిణ భారతంలో ఆధ్యాత్మిక క్రాంతిని కల్గిస్తావు" అని ముక్తకంఠంతో మిమ్మాశీర్వదించిన గంగాతీర గ్రామవాసియైన మహనీయుని వాక్కు మీయెడ అన్వర్థమైంది.

యోగిపుంగవా!

మీ అసాధారణ పాండిత్యం, అద్భుత విమర్శనాపాటవం, అమోఘ శబ్దవిన్యాససశక్తి, అతి గంభీర భావుకత, అనేక విషయపరిజ్ఞానం, మీరు విరచించిన అనేక ధర్మశాస్త్ర గ్రంథాల కెనలేని కీర్తి తెచ్చినవి. మీ గీతామకరందం, గీతోపన్యాసాలు, శ్రీ వసిష్ఠగీత నేటి వైదిక ధర్మగ్రంథాల్లో మేలిమి రత్నాలు. "వేదాంతభేరి" మాసపత్రికద్వారా నెలనెలా మీరు సాగిస్తున్న ధర్మప్రచారం వెల కట్టరానిది. కాళహస్తి క్షేత్రంలో మీరు స్థాపించి నిర్వహిస్తున్న శ్రీశుకబ్రహ్మాశ్రమం దినదిన ప్రవర్ధమానమై భారతీయ ఆధ్యాత్మిక విద్యాకేంద్రమై రాణిస్తోంది. శ్రీవిద్యాప్రకాశానందగిరి నామధేయం సార్థకమగునట్లు బ్రహ్మవిద్యా ప్రచారానికి మీరు చేస్తున్న సేవయేకాక లౌకిక ఆంగ్లవిద్యాభివృద్ధికి మీరు కావిస్తున్న కృషి పొగడ్తకందనిది. మీ మనసు మంచిదనం, మీచేతి చల్లదనం శ్రీకాళహస్తికి కళాశాలలేని కొరత తీర్చినవి. మీ కీర్తినామంతో ఆ కళాశాల ఆచంద్రతారార్కం వెలయగలదు.

మహోపన్యాసకా!

హిమవత్ గిరిదరీ వినిర్గత గంగాఝురీ సమానమైనది మీ వాగ్ఝరి. సామా

న్యుల కందని అగమ్య ఆధ్యాత్మిక పథాల్లో అత్యున్నత స్థానం ఆక్రమించిన
గీతామకరందాన్ని అందరికి అందుబాటులోనికి తెస్తున్న మీ మహోపన్యాసాలు
మరపురానివి. గోపాలదేవుని రసనాంచలాల పుట్టి, అర్జున హృదయాంతరంలో
పొంగి, వ్యాస భారత మహారణ్యమధ్యంలో దాగిన భగవద్గీతామృత వాహినులను
సుగమమార్గంలోకి మళ్ళించి తెచ్చి తియ్యతియ్యగా తేటతెల్లంగా అందించి అజ్ఞాని
ప్రజాహృదయాలనే ఊషరక్షేత్రాలను పదునుచేసి అపార భక్తిజ్ఞానధర్మఫలాలు పండి
స్తున్న అపర భగీరథులు మీరు.. కాలుష్యమేఘాలను చెల్లాచెదరుచేసి ధర్మవృష్టి
కురిపిస్తున్న దేవదూతలు. ఆధ్యాత్మికతత్త్వ మకరందం సంగ్రహించి తేనెలుగా
మాపై కురిపిస్తున్న మీ కృషి మహోదాత్తం.

సరస రసైకరంజకము, మృదుమధురము, అలతి అలతి పదసరళము, అన
ర్గళము, హాస్యరసభరితము అయి అనుదినము పొంగువారుచున్న మీ అద్భుత
ఉపన్యాస క్షీరసాగరంలో మా పురజనులు మునిగి పునీతులై సంతుష్ట హృదయులై
తమ అంతరంగాల్లో మీ చిద్రూపాన్ని భద్రంగా నిలుపుకొంటున్నారు. కఠినమైన
ఆధ్యాత్మికతత్త్వ విషయాలు మీ వాగ్విన్యాస నైపుణిచేత కరిగి వెన్నముద్దలై
సామాన్యులకు సైతం ఆరగింపు కాగలుగుతున్నవి.

మహాశయా!

ఆధ్యాత్మిక చైతన్య జ్వాలాతోరణాలు కట్టూ, భగవద్గీతా శంఖారావం విని
పిస్తూ, సోదరమానవోద్ధరణకై బద్ధకంకణులై కాంతిపథ దర్శకులై సాగిపోతున్న
మిమ్ము సమ్మానింప బూనడం సూర్యునికి దీపం పట్టడమే. అయినా చంద్రునికో
నూలుపోగన్నట్టు మా అపార భక్తిశ్రద్ధాసక్తులకు చిన్న తార్కాణంగా ఈ సమ్మానం
చేయగల్గడం మా పట్టణ ప్రజల భాగ్యంగా, మా అదృష్టంగా భావిస్తున్నాం.

ఆ గీతాప్రవక్త, ఆ శ్రీకాళహస్తీశ్వరుడు మీకు ఇతోధిక ఆధ్యాత్మిక అభ్యున్నతిని
సమకూర్పగల రని మనసార ప్రార్థిస్తున్నాం."

## వీడ్కోలు పత్రం

1971 ఫిబ్రవరిలో 50వ గీతాయజ్ఞం చివరిదినాన నూజివీడు గీతాయజ్ఞమండలి
వారు సమర్పించిన వీడ్కోలుపత్ర మిది—

"పరివ్రాజకాచార్యా!



పదునెనిమిది దినములనుండి ఆకాశగంగా ప్రవాహమువలె చల్లనిది తెల్లనిదగు
మీ బోధామృతమున మునింగి సర్వేంద్రియములతో సంతృప్తినిపొందిన పౌరజానపదు
లగు నెల్లరు వినయవినమితములగు శిరములతో మీకు వీడ్కోలు నిచ్చుచున్నారు.
పాలనురుగు వలె మిలమిలలాడు చూపులతో వీరల నాశీర్వదింపుడు.

పుణ్యహృదయా!

మీరు పదునారు వీసములు గీతాహృదయము నెఱింగిన తత్త్వవిదులు. కావుననే
నిగూఢము, పరమరహస్యము నగు వేదాంతసారమును ఎల్లరకు నందించి వారలను
తరింపజేయుచుంటిరి. విశ్వకళ్యాణమును గోరు మీరు భగవంతుడగు రెండవ కృష్ణు
డుగా నెల్లజనుల నర్జునులనుగా చేసితిరి. నిష్కామకర్ములగు నిట్టి మీకు వెలలేని
ప్రవచనముచే తృప్తిపొందిన మేము నమస్కారము తప్ప యేమి యీయగలము!

దీనజనపావనమూర్తీ!

తత్త్వజ్ఞాన మనునది పండితు లగు నేకొందఱికో అందుబాటులో నుండును.
బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత యను ప్రస్థానత్రయము నాకళించిన
విద్వాంసులగువారు జ్ఞానయోగమున ముక్తు లగుదురు. ఇట్టి మిక్కిలి గహనమగు
బ్రహ్మతత్త్వమును తేటమాటలతో జాను తెనుగున నెల్లర కవగతమగునట్లు బోధిం
చితిరి. మీరు నిజముగా కృతబుద్ధులగు పరివ్రాజకాచార్యులు. మేము కృతార్థులము.
శ్రీ వేమనయోగీంద్రుని ఆటవెలదుల వలె, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రుని
గోవిందవాక్యములవలె ఎల్లర నాకట్టిన మీ తేటతెలుగు మాటలయందు ఎంతటి
నిగూఢ వేదాంతభావ మిమిడియున్నదో నేడు తెలిసినది. కావుననే పండిత పామర
బేధమును మఱచి ఎల్లజనులు మీకడ మోకరిల్లుచున్నారు.

స్వామీ!

మీ ప్రవచన ప్రభావమును ఏమని చెప్పగలము? నేల యీనినట్లు, చీమల
బారులవలె వాహనములతో కాలినడకలతో పల్లెలు, పల్లెలు కదలివచ్చు నీ ప్రజావా
హిని మా కన్నులను చెమ్మగిల్లచేయుచున్నది. మీరెంతటి ధన్యజీవనులు. అన్ని
విధముల పావనులగు మీరు పట్టినది బంగారము, మెట్టినది పుణ్యభూమి.
మీ ప్రవచనసమయ మెంత స్మరింపదగినది! చీమ చిటుకుమనినను వినిపించు
నంతటి నిశ్శబ్దము. సదస్యు లెల్లరు చిత్తరువులయందలి బొమ్మలు. ఇంతగా
ఎల్లరి నాకట్టుట నాల్గువందల వత్సరములనాడు వీరబ్రహ్మేంద్రునియందును నేడు

మీయందును చూచితిమి. కాళిదాసుని పద్యములయందలి ఉపమానములవలె, వేమనయోగి ఆటవెలదులయందలి నిదర్శనములవలె మీ యుదాహరణములు ఎల్లరి హృదయములకు హత్తుకొనిపోవును. మఱల వీడిరావు.

మహాత్మా!

ఈ పదునెనిమిది దినములు మావీట వీథివీథియందును, ఇంటింటియందును పరమోత్సాహము తాండవించినది. ఈ పదునెనిమిది రాత్రులును పూర్ణిమా రాత్రులవలె చల్లనివై మాపయి నమృతమును గురిసినవి. ఇక మీరు ఇటనుండి వెడలినది తడవుగా కేవలము అమవసచీకటులు మా నూజివీడునేమి చుట్టుప్రక్కల పల్లెలనేమి ఆవరించును. మిమ్ము మేము ఎట్లు మఱచిపోగలము? ఒక విధమున మఱతుము. మా నిండుహృదయములను మీతోపాటు తీసికొనిపోవుచున్నారు గనుక నిశ్చేతనుల మగు మేము మీతోపాటు అన్నింటిని మఱతుము.

తపశ్శాలీ!

భక్తిజ్ఞానకర్మయోగములను అనుభవపూర్వకముగా నవగతము చేసికొనిన తపఃస్వాధ్యాయపరులగు మీకు కృతార్థమైన చిత్తముతో పుణ్యవంతులము కాగోరి ఔదల చేతులు మోడ్చి నమస్కరింతుము. మమ్ముల మఱువకుండవలెననియు, మఱియొక్కపరి ఇచ్చటకు విజయంచేసి మమ్ముల కృతార్థులజేయవలె ననియు సిద్ధిమంతులగు మీయందు శ్రీకాళహస్తీశ్వరుడు బాలచంద్రుని కిరణామృతమును ప్రసరింపజేయ గలడనియు విన్నవించుచు విరమింతుము."

## వార్తాపత్రికల అభిప్రాయాలు

1966 మే నెలలో సికింద్రాబాద్‌లో నిర్వహింపబడిన 21వ గీతాజ్ఞానయజ్ఞాన్ని ప్రశంసిస్తూ దక్కన్ క్రానికల్ పత్రిక ఇలా వ్రాసింది----

*"Sri Vidyaprakasanandagiri Swami, the founder of Suka Brahma Ashram, is giving discourses on Bhagavadgita for the last 18 days at Mahaboob college grounds. A great exponent of Bhagavadgita, the Swami is giving lectures in a lucid and simple style with anecdotes and quotations from various scriptures and is attracting thousands of people from the twin Cities.*

*Graduating at the early age of 17 years, Swamiji studied Hindi and Sanskrit, and became a disciple of Maharshi Sri Malayala Swamiji. He spent 12 years in meditation and for the last four years has been giving a series of lectures on Bhagavadgita. He has already covered important places in Andhra, Madras and Mysore States and has to his credit 20 Geeta yagnas. The present 21st Geeta yagna organised by important persons of Secunderabad and Hyderabad, is a success to Swamiji."*

*(Deccan Chronicle - 29th May 1966)*



"శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపకులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామీజీ గత 18 రోజులుగా మహబూబ్ కళాశాల ఆవరణలో భగవద్గీతపై ఉపన్యసిస్తున్నారు. భగవద్గీతకు మహాప్రచారకులైన స్వామీజీ కథలనూ, వివిధ శాస్త్రవాక్యాలనూ ఉదాహరిస్తూ సరళసులభశైలిలో ఉపన్యసించి జంటనగరాలనుండి వేలకొలది ప్రజల నాకర్షిస్తున్నారు.

17 ఏండ్ల పిన్నవయసులోనే పట్టభద్రులై స్వామీజీ హిందీ సంస్కృతభాష లభ్యసించి మహర్షి శ్రీ మలయాళ స్వామీజీకి శిష్యులయ్యారు. 12 ఏండ్లు ధ్యాననిష్ఠలో గడిపారు. గత నాలుగు సంవత్సరాలనుండీ భగవద్గీతపై అనేక ప్రవచనాలు కావిస్తున్నారు. ఆంధ్ర-మద్రాసు-మైసూరు రాష్ట్రాలలో ముఖ్యప్రాంతాలన్నిటా సంచరించి ఇప్పటికే 20 గీతాయజ్ఞాలు నిర్వహించారు. సికింద్రాబాద్, హైద్రాబాద్‌ల ముఖ్యవ్యక్తులు ఏర్పాటుచేసిన ఈ 21వ యజ్ఞం స్వామీజీ కొక విజయమే."

(దక్కన్ క్రానికల్ - 29-5-66)

రాజమండ్రి పట్టణంలో 1968 జూన్‌నెలలో జరిగిన 35వ గీతాయజ్ఞంపై స్థానిక సమాచార్ పత్రిక సంపాదకీయంలో ఇలా వ్రాసింది----

"35వ గీతాయజ్ఞము జయప్రదముగా ముగిసింది. శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి ప్రసంగాలు ఆధ్యాత్మిక రంగంలో విప్లవం తెచ్చినవా యన్నట్లు మున్నెన్నడు కని విని యెరుగని విధంగా భక్తజనులను వేలాదిగా ఆకర్షించినవి.

వేద, ఉపనిషత్తులసారమైన భగవద్గీతలోని వేదాంతమును అరటిపండును ఒలిచినట్లు విడమర్చి అతి సామాన్యునకు అర్థమగునట్లు అతిసహజముగా పిట్టకథలతో ఉద్గ్రంథములనుండి ఉదాహరణములతో శ్రీ స్వాములవారు అందించారు. ఆధ్యాత్మిక ప్రసంగాలంటే విముఖతచూపే వ్యక్తులెందరో క్రమంతప్పక గీతాయజ్ఞంలో పాల్గొన్నారంటే శ్రీ స్వాములవారు వీటిలో ప్రవేశపెట్టిన విప్లవకర పంథాయే కారణం.

పూజ్య బాపూజీ రాజకీయాలలో ప్రవేశించుటతో మేధావులనుండి స్వాతంత్ర్యోద్యమం సామాన్యులకు ప్రాకినట్లే శ్రీ స్వాములవారి రాకతో యీ నగరంలో అతి జటిలమైన ఆధ్యాత్మికోపన్యాసాలు సామాన్యుని గూడా ఆకర్షించగల్గినవి. అందుకు శ్రీ శుకబ్రహ్మాశ్రమస్థాపకులైన శ్రీ స్వాములవారు అభినందనీయులు. ఈ గీతా యజ్ఞం ముగిసినా దీనిద్వారా పొందిన ఆత్మానుభూతిని నెమరువేసికొంటూ శ్రీ స్వాములవారు సెలవిచ్చినట్లు దైవాన్ని, మరణాన్ని మర్చిపోకుండా భగవంతుని విశ్వరూపమైన యీ సృష్టిలోని జీవజాలమునకు, నిష్కామసేవచేయు కృషికి దీనిని నాందిగా జేసికోవడం ముక్తికి ముఖ్యావసరము".

(సమాచార్ - 6-6-1968)

ఈ యజ్ఞములోనే పౌరులు శ్రీస్వాములవారిని 'అపరసిద్ధార్థ' అన్న బిరుదుతో సన్మానించారు. 36వ గీతాయజ్ఞంలో హిందూపురం పౌరులు శ్రీ స్వామీజీకి 'జగద్గురు'బిరుదప్రదానం చేశారు.

1979 ఏప్రిల్ నెలలో నెల్లూరులో జరిగిన 90వ గీతాయజ్ఞాన్ని గురించి సుప్రసిద్ధ స్థానిక వారపత్రిక 'జమీన్‌రైతు' ఇలా వ్రాసింది----

"రాత్రి 8-30 గం||కు జనం తండోపతండాలుగా వస్తున్నారు. వి.ఆర్.కాలేజి సమీపాన చర్చి మైదానం జనాన్ని ఈనిందా అన్నట్లుం దా ప్రవాహం. ఒక రోజు, రెండు రోజులు కాదు. దాదాపు నెల రోజులు; ప్రతిరోజూ, జనప్రవాహమే, ఎంతలేదన్నా ఏడెనిమిది వేలమందితో చర్చి మైదానం నిండిపోయేది.

ఇంతకూ ఎవరా సినిమాతార? ఏమిటా ఆకర్షణ? తార కాదు; స్వామీజి. నెల్లూరులో జనాకర్షణకు ఐతే తారన్నా కావాలి, లేదా స్వామి అయినా కావాలి. ఆ జనం వేరు, ఈ జనం వేరు అనుకోండి; అయినా వాళ్ళకున్న ఆకర్షణ మరొకరికి లేదుగదా?

శ్రీకాళహస్తి శుకబ్రహ్మాశ్రమాధిపతి శ్రీ విద్యాప్రకాశానందగిరి "గీతాజ్ఞాన యజ్ఞం" ఏప్రిల్ 10వ తేదీన ప్రారంభమైంది. 30వ తేదీన ముగిసినది, నిజంగా అది యజ్ఞమే ననిపించింది. ఎవరో ముసలీ ముతక అయితే సహజమే. కానీ ఈ వేదాంతసభలకు అన్నిరకాలవారు, అన్ని వయస్సులవారు ప్రతిరోజూ విడవకుండా హాజరయ్యారంటే, అది ఆయన ఉపన్యాసమహిమే ననాలి! స్వామీజీల ఉపన్యాసాలు సాధారణంగా అద్భుతంగా ఉంటాయని అంటుంటారు. కానీ ఈ స్వామీజీవంటి ఉపన్యాసకులు, అంత జనరంజకంగా, విషయసుబోధకంగా ఉపన్యసించేవారు చాలా



అరుదుగా ఉంటారని జనాభిప్రాయం.

స్వామీజీ గొప్పతత్త్వవేత్త. ఎంత జటిలవిషయా న్నయినా పిట్టకథలతో, చతురోక్తులతో చక్కగా సుగ్రాహ్యంచేసే వాక్చాతుర్యం ఆయన సొత్తు. ఒకరోజు ఆయన ఉపన్యాసం విన్నవారు ఇక విడవలేరని, ప్రతిరోజూ సాయంత్రం 6కే ఠంచనుగా హాజరుకాక తప్పరని అందరూ అనుకొన్నారు. ఆ జనాన్ని వారి ముగ్ధతను చూస్తుంటే నిజమే ననిపించింది.

ఈ యజ్ఞంలో స్వామీజీ భగవద్గీతను కరతలామలకంగా బోధించారు. ఆయన ఇరవైరోజుల ప్రసంగాన్ని ఒక్క వారంలో ముచ్చటించడం అసాధ్యం; కొన్ని విషయాలను మాత్రం ఇక్కడ స్పృశిస్తాము.

పక్షి పక్షిలాగా, పశువు పశువులాగా బ్రతుకుతుంది. అయితే నరుడు నరుడు మాదిరిగా కాకుండా నారాయణుడుగా వ్యవహరించాలి.

అప్పుడే మానవుడికి పశుపక్ష్యాదులకు తేడా ఉంటుంది. తప్పుచేసి పశ్చాత్తాపడడం గొప్పకాదు, "పూర్వతాపంతో తప్పుచేయకుండా నివారించడమే మానవత్వం" అన్నారాయన.

వైరాగ్యం అంటే ఏదో అని భ్రమపడుతుంటారు. బియ్యంనుంచి రాళ్లు ఏరినట్లు ఆత్మనుంచి చెడును విసర్జించి, మంచిని పెంచుకోవడమే నిజమైన వైరాగ్యం. ఇప్పుడు భగవంతుని పూజలు పునస్కారాలతో అర్చించి అదే దైవభక్తి అని మురిసిపోతున్నారు. కానీ అసలుసిసలైన భక్తి ఇదికాదు; ధర్మమార్గంలో పయనించడమే నిజమైన భక్తి; భగవంతుడిపేరు ఏదైనా కావచ్చు, కాని అతడొక్కడే. సాహసం, సద్బుద్ధి, శక్తి, ఉత్సాహం, పరాక్రమం ఎక్కడ ఉంటే అక్కడంతా భగవంతుడుంటాడని భగవద్గీత ప్రబోధిస్తున్నది. పాలనుంచి వెన్న తీసినట్టు, నిర్మలమయిన మనస్సును చిలకరిస్తే భగవంతుడు వెలికివస్తాడు -- అన్నారాయన.

నిత్యజీవితంలో క్రమశిక్షణాయుతంగా వుండాలని, నిరంతర జాగరూకతతో మెలగాలని పాపం పాము వంటిదని, దానిని ఎప్పుడూ దూరంగా వుంచాలని స్వాములవారు హితోపదేశం చేశారు. మితాహారం, మితభాషణం జ్ఞానార్జనకవసరం; పరోపకారాన్ని మించిన సద్గుణం ఇంకొకటి లేదు. - ఈ విధంగా

సాగాయి ఆయన ఉపన్యాసాలు."

(జమీన్ రైతు - నెల్లూరు)

ఈ రీతిగా పలువురి ప్రశంసలు అందుకుంటూ శ్రీ స్వాములవారి గీతాజ్ఞాన యజ్ఞ కార్యక్రమాలు అవిచ్ఛిన్నంగా అనేక ప్రదేశాలలో సాగిపోయాయి.

## సర్వమత సమన్వయం

శ్రీ స్వాములవారు గీతను ప్రధానంగా స్వీకరించి ఆధ్యాత్మిక ప్రచారం చేశారు. వారి దృక్పథం ఒక్కమతానికి మాత్రం పరిమితమయిందని భావించరాదు. గీతను వారు సర్వయోగ సర్వమత సమన్వయ సాధకమైన గ్రంథంగానే భావించి ప్రచారం చేశారు. గీతామకరందం ఉపోద్ఘాతంలో వారు వ్రాసిన ఈ క్రిందిమాటలు ఇక్కడ గమనించదగివున్నాయి—

"స్వమత సంస్తుతి, పరమత విద్వేషము, స్వమార్గపోషణము, అన్యమార్గ విమర్శనము ప్రపంచమున అమలులో నుండుట చూచి అద్దానిని దూరీకరించుటకై శ్రీకృష్ణభగవానుడు గీతావతరణము గావించి సర్వమత సమన్వయతత్త్వమును దాని ద్వారా జనులలో వ్యాపింప జేసెను."

(గీతామకరందం ఉపోద్ఘాతం - 141, 142 పేజీలు)

గీత పుట్టకముందే ఎన్నో మతభేదా లుండేవి. వాటికన్నింటికీ గీత సమన్వయం సాధించింది. గీతకు తర్వాత ప్రపంచములో అవతరించిన క్రైస్తవ మహమ్మదీయాది మతాలను గూడా సమన్వయించుకొనే శక్తి గీతలో వున్నది. అందరి సిద్ధాంతాలు సార్వకాలిక సత్యాలు గదా!

శ్రీ స్వాములవారు తమ ఉపన్యాసాలలో బుద్ధుడు, క్రీస్తు మొదలైన మత ప్రవక్తల ఉపదేశాలను ఉటంకిస్తూ గీతాసిద్ధాంతాలతో వాటికి సమన్వయం ప్రబోధించారు.

అధికారిభేదాన్ని బట్టి కర్మ భక్తి ధ్యాన జ్ఞాన యోగాలు మనుజులకు అన్వయిస్తాయి. అలాగే దేశ కాల పాత్ర భేదాల ననుసరించి ఆయా మతాలను మానవులు పాటిస్తారు. అయినా మతాల గమ్యం ఒక్కటే అన్న తత్త్వాన్ని స్వాములవారు మాటమాటికీ ప్రబోధిస్తూ వుంటారు.



"యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్ |
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః ||

(గీత -4-11)

అని చెప్పి శ్రీకృష్ణభగవానుడు కూడా మానవు లనుసరించే మార్గాలన్నింటికీ తానే లక్ష్యమని ఉద్బోధించాడు.

సహనానికి మారుపేరైన భారతదేశంలో కూడా మతపరమైన కలహాలు, హింసలు చెలరేగడాన్ని చూస్తున్నాము. ఇది ఎంతో శోచనీయమైన దుస్థితి. ఈ స్థితిని నివారించడమే మతాచార్యుల ముఖ్య కర్తవ్యం.

శ్రీ స్వాములవారు 1969 జనవరి వేదాంతభేరి సంచికను 'సర్వమత సమన్వయ సంచిక'గా ప్రకటించారు. అందులో వివిధ మతాలపట్ల సమన్వయ దృక్పథాన్ని అలవరచుకోవలసిన ఆవశ్యకతను వివరిస్తూ పెద్ద లనేకులు వ్రాసిన వ్యాసాలను ప్రచురించారు. 'విశాలదృక్పథము' అన్న శీర్షికతో తాము వ్రాసిన వ్యాసంలో శ్రీవారు మతసమన్వయంపట్ల తమ అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు—

"హ్రస్వదృష్టి ఏ రంగమందును పనికిరాదు. ఇక పరమార్థరంగమున దానికి అసలు తావే లేదు. సంకుచితభావము కలవారికి, హృదయవైశాల్యము లేనివారికి ఆధ్యాత్మిక లక్ష్యము ఎన్నడును చేకూరదు. భగవంతుడు ఒకరి ప్రత్యేకసొత్తు కాదు. అతడు అందఱివాడు. అతనిని పొందుటకు, అనుభవించుటకును ప్రతిప్రాణికిని పరిపూర్ణమైన స్వేచ్ఛ కలదు. ఆ స్వేచ్ఛను త్రోసివేయుటకు విశ్వమం దెవనికిని హక్కులేదు.

అట్టి పరమాత్మను పొందుటకై ఒకానొకడు విశ్వాసముతో ఒకానొక మార్గమును చేపట్టి పయనమై పోవుచుండ, మఱియొకడు అందుల కేల అభ్యంతరము తెలుపవలయునో బోధపడుటలేదు. పరమతసహనము ముముక్షువునకు అత్యంతావశ్యకమై యున్నది. తన మతమును అభివృద్ధి పఱచుకొనుచు, ఇతర మతములలో తనకు మంచి దని తోచినదానిని స్వీకరించుచు మనుజుడు తన అభ్యున్నతిని సాధించు కొనుచు పోవలెను. దూషణచేతను, నిందచేతను ఏ కార్యమున్ను సాధింపబడదు. పైపెచ్చు తన లక్ష్యమునకు గూడ దానిచే అవరోధము కలుగగలదు.

'జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్' అని గీతాచార్యులు తెలిపిన చందమున విజ్ఞుడగువాడు తాను చక్కగ ఆచరించుచుండినచో అతని శుద్ధమగు ఆచరణను చూచి ఇతరులును ఆ మార్గమున ప్రవేశించుటకు ఉత్సహింతురు. ఈ ప్రకారముగ మతోద్ధరణకై ప్రశాంతమార్గమును, నిర్మాణాత్మక పద్ధతులను అనుసరింపవలెనే కాని వినాశకర శక్తులను ప్రోత్సహింపరాదు.

శాంతిని జనులహృదయసీమలలో నాటునది మతము. అట్టి మతము పేరిట అశాంతి ఏనాడును చెలరేగకూడదు. జీవుని దేవునియొద్దకు చేర్చునది మతము. అట్టి మతము దైవప్రాప్తికి అవరోధముగ ఏనాడును పరిణమింపరాదు. మతము పేర, దైవముపేర అల్లకల్లోలములు రేగుట అత్యంత గర్హణీయమై యున్నది. ఆయామతములవారు వారివారి ఇష్టదైవములను ఆరాధించుకొనుచు, వారివారి ఆచారములను అవలంబించుకొనుచు, వారివారి పరమార్థసిద్ధాంతములను పరిపోషించు కొనుచు అన్యులను బాధింపక, బలాత్కరింపక అధ్యాత్మపథమున ముందుకు సాగిపోవుచుండవలెను. తమయొక్క నిర్మలమగు ఆచరణచే తుదకు అందరును గమ్యస్థానమగు సచ్చిదానంద పరబ్రహ్మమును చేరియే తీరుదురు. మతములు చక్కగ వర్ధిల్లుటకు ఇది యొకటియే సవ్యమైన మార్గము.

కాబట్టి మతోద్ధరణకై వినాశకర పద్ధతులను అవలంబింపక, సమన్వయధోరణిని చేపట్టి, సమరసభావము హృదయమున పొంగిపొరలుచుండ వివిధ స్థానములనుండి వివిధ మార్గములద్వారా వివిధ సమయములలో పుష్కరస్నానమునకై కృష్ణానదికి బయలుదేరిన యాత్రికులచందమున మతానుయాయులందరును మోక్షమార్గమున పయనించుచు తుట్టతుదకు అందరును ఏదియో యొక సమయమున ఆత్మరూపపావన భాగీరథీతోయములందు గ్రుంకి బ్రహ్మానందపరవశులై జీవితమును సఫలమొనర్చుకొందురు గాక!"

(వేదాంతభేరి - జనవరి - 1969)

ఇట్టి సర్వమత సమన్వయ భావమే ఇప్పుడు చాలా అవసరమై వున్నది. శాంతి సుఖాలను ప్రసాదించడానికి ఆవిర్భవించిన మతాలు అశాంతికి కారణాలు కావడం శోచనీయం కదా! శ్రీ సద్గురు మలయాళస్వాములవారు కూడా సర్వమత సమన్వయ భావాన్నే బోధించారు. శ్రీ విద్యాప్రకాశానంద స్వామీజీ వారి మార్గాన్నే అనుసరించారు. ప్రపంచశాంతిని కాంక్షించేవారెవరైనా అనుసరించవలసిన మార్గం అదే.



## ఆశ్రమ రజతోత్సవం

శాంతిసుఖాలు కరవై అలమటించే జనానీకానికి మహాత్ములు స్థాపించిన ఆశ్రమాలే శరణ్యాలు. అవి వారికి సంసారసాగర తరణోపాయం చూపుతాయి. అంధకారంలో అల్లాడేవారికి వెలుగు ప్రసాదిస్తాయి. తాపత్రయంతో పరితపించేవారి తాపాన్ని చల్లారుస్తాయి.

గండి-భూమానందాశ్రమాధిపతులు శ్రీరామకృష్ణానంద స్వామీజీ ఆశ్రమాల అవసరమేమిటో వివరిస్తూ ఇలా ఒకచోట వ్రాశారు—

". . . పెద్దపెద్ద పట్టణాలలో మంచి గాలి దొరకనట్లు ఈ ప్రపంచంలో కూడా శాంతి వెదికితే లభించదు. ఈ లోకము అనిత్యము, అసుఖము, దుఃఖాలయము, అశాశ్వతమైంది. ఇట్టి ఈ లోకంలో మనం శాంతిని వెతుకుతూన్నాం.

. . . . . పార్కులకు వెళ్లి, ఉద్యానవనాలకు వెళ్లి మంచి గాలిని పీల్చి స్థూల శరీరారోగ్యం సంపాదించుకొన్నట్లు ఆశ్రమాలకు వెళ్లి ఆధ్యాత్మిక విషయాలను శ్రవణం చేసి సూక్ష్మశరీరారోగ్యాన్ని పొంది హృదయశాంతిని సంపాదించాలె. ఆశ్రమాలనే పార్కులలో ప్రవేశించి ఉపనిషత్తుల గాలి, భగవద్గీత గాలి, భాగవతం గాలి పీల్చుకోండి. చిత్తస్వాస్థ్యాన్ని, హృదయశాంతిని సంపాదించుకోండి.

. . . . . ఆశ్రమవాతావరణమూ, ఆశ్రమవార్తలూ చిత్తానికి సత్త్వగుణాన్ని ప్రసాదించి మానసికారోగ్యాన్ని నిలుపగల్గుతాయి. . . . . . . ఆశ్రమవాతావరణంలో సద్భావనలూ, సత్ప్రేరణలూ లభిస్తాయి. ఉత్తమ ఔషధాలకు లేని బలం వుత్తమ భావనలకు ఉందనే విషయం అందరికీ తెలుసు. హృదయంలో ఉత్తమభావనలు లేని దరిద్రునికి యెన్ని టానిక్కులు త్రాపినా వాని ముఖం కాలిన వంకాయలాగా దేబరిస్తూనే వుంటుంది.

జనాంగంలో ఆ లోపాన్ని పూరించేకోసం ఆశ్రమాలతో అవసరం వుంది"

(వేదాంతభేరి - జులై - 1986)

శ్రీశుకబ్రహ్మాశ్రమ చరిత్రలో ఇరవైయైదు సంవత్సరాలు గడచాయి. శ్రీ విద్యాప్రకాశానంద స్వామీజీ లోకకల్యాణాన్ని ఉద్దేశించి ఆశ్రమం స్థాపించి తదుపరి ప్రారంభించిన ఆధ్యాత్మికోద్యమం నిరుపహతంగా కొనసాగి ఫలప్రదమయింది. శుకాశ్రమం ఎందరికో శాంతిసుఖాలను ప్రసాదించింది.

**23-3-1975** నుండి **25-3-1975** వరకూ మూడు దినాలు ఆశ్రమంలో రజతోత్సవం నిర్వహించాలని కార్యకర్తలు నిశ్చయించారు. శ్రీ స్వాములవారి 'షష్టిపూర్తి' కూడా రజతోత్సవసమయంతో కలిసిరావడం భక్తులకు ఉత్సాహం కలిగించింది. పెక్కుమంది మహాత్ములకు ఉత్సవాలకు రావలసిందిగా ఆహ్వానాలు వెళ్లాయి. పెక్కు ప్రాంతాలనుండి మహనీయులూ, భక్తులూ సమయానికి ఆశ్రమానికి విచ్చేశారు.

భక్తులు సభాస్థలిని చక్కగా అలంకరించారు. వేలసంఖ్యలో విచ్చేసిన ప్రజల కందరికీ చక్కగా భోజనాది సౌకర్యాలు ఏర్పాటయ్యాయి. భక్తజనుల వసతికై నిర్వికల్పనగర్, అద్వైతనగర్ అనే పేర్లతో రెండు తాత్కాలిక నివేశనాలను ఏర్పాటు చేశారు.

**23-3-1975**నాటి ఉదయం ఐదు గంటలకు శ్రీ వాసుదేవానంద స్వాముల వారు ప్రణవపతాక ఆవిష్కరించారు. వ్యాసాశ్రమాధిపతులు శ్రీవిద్యానందగిరి స్వాములవారు శ్రీ మహర్షి మలయాళస్వాములవారి చిత్రపటాన్ని సభావేదికపై ఆవిష్కరించారు. గీతాపారాయణ కాలంలో శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు విశ్వరూప సందర్శనంలోని నిగూఢ భావాలను శ్రోతల హృదయానికి హత్తుకొనే విధంగా బోధించారు.

మూడు దినాలు సాధుసమ్మేళనాలు జరిగాయి. శ్రీ విద్యానంద స్వాముల వారు, గండి-భూమానందాశ్రమాధిపతులు శ్రీ రామకృష్ణానంద స్వాములవారు, ఆత్మారామాశ్రమ స్థాపకురాలు శ్రీ మతా నిరంజనానందగిరిగారు, సర్వేశ్వర సదన స్థాపకులు శ్రీ సర్వేశ్వరానందస్వాములవారు, శ్రీ గోపాలకృష్ణాశ్రమాధిపతులు శ్రీ అశేషానందస్వాములవారు మొదలైన మహనీయులు తమ ప్రబోధాలతో భక్తులను సంతుష్ట హృదయులను గావించారు.

ఈ సందర్భంలోనే శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు రచించిన 'తత్త్వసారము' అన్న గ్రంథాన్ని శ్రీ రామకృష్ణానంద స్వాములవారు, 'ఆధ్యాత్మికహితోక్తులు' అన్న పొత్తాన్ని కైలాసాశ్రమాధిపతులు శ్రీ నిత్యానందస్వాములవారు ఆవిష్కరించారు.

తరువాత రజతోత్సవ సందేశరూపంగా 'మహర్షుల సందేశము' అన్న ఈ క్రింది సందేశాన్ని పఠించి కరపత్రాలద్వారా భక్తుల కందజేశారు—



## మహర్షుల సందేశం

"ఓ జీవులారా! మీరు సాక్షాత్ శివస్వరూపులు! అమృతస్వరూపమగు ఆత్మకు వారసులు. మీరు అల్పులుకారు. నిత్యశుద్ధ బుద్ధ ముక్త పరమానంద స్వరూపులు. లెండు! ఎన్నిజన్మ లీ తమోమయ జీవితము? మీ నిజస్వరూపమును తెలిసికొనుడు. జ్ఞాననేత్రమును వికసింపజేసికొనుడు. మానవత్వమను ఈ మహోన్నత అవకాశమును జారవిడుచుకొనరాదు. అజ్ఞాననిద్రనుండి మేలుకొనుడు. అనుభవజ్ఞులైన మహాత్ములను సేవించి తరణోపాయమును శీఘ్రముగా వెతకికొనుడు.

పవిత్రమగు ఈ మనుష్యజన్మ అంతము కాకపూర్వమే లక్ష్యమగు నిర్వాణమును సాధించివేయవలెను. సోమరితనమునకు తిలాంజలి యొసంగవలెను. ప్రయత్నశీలురుకండు! పట్టుదలతో సాధించుడు. తప్పక గమ్యస్థానమును చేరగలరు. పాపకార్యములను వదలివైచి పుణ్యకార్యములను, ధర్మకార్యములను ఆత్మోన్నతికి హేతుభూతములగు పవిత్రకార్యములను విరివిగ జేయవలెను. చక్కటి శీలమును అభివృద్ధి జేసికొనవలెను. పుట్టినది భోగముల ననుభవించుటకు గాదు. యోగమును అభ్యసించుటకు. ఇంతవఱకు కెన్నియో జన్మలు విషయభోగములందు గడిపినది చాలదా? ఇకనైనను దైవోన్ముఖముగ మఱలుడు.

ఆత్మవిశ్వాసము గలిగియుండుడు. మిమ్ములను మీరే యుద్ధరించుకొనుడు. దైవము నెడల, పెద్దలయెడల, సద్గురువులయెడల వినయవిధేయతలు గలిగి యుండవలెను. పరప్రాణికి మేలు చేయవలెను. ఎవరికిని అపకారము చేయరాదు. సర్వభూతదయ, అహింస, సత్యము మొదలగు ఉదాత్తధర్మములను కార్యాన్విత మొనర్పవలెను. బాహ్యాభ్యంతర శుచిత్వమును అలవాటు చేసికొనవలెను. మిక్కుటమగు ఓర్పు, దృఢమైన పట్టుదల గలిగి ధర్మము లన్నిటిని క్రమక్రమముగ సాధించివేయవలెను.

ఓ నరులారా! మీరు సాక్షాత్ నారాయణస్వరూపులు! అనర్థకరమగు విషయలోలత్వమునందు ఆయువును వ్యర్థము చేయకుడు. జ్ఞానసారమగు పరమాత్మబోధచే దృశ్యమును ఆత్మయందు లయమొనర్చి పరమశాంతిని బడయుడు. ఇంద్రియములను త్రాళ్లచే కట్టబడి అజ్ఞానమను చీకటినూతియందుపడి నశింపరాదు. వార్ధక్యమరణాది సంసారదుఃఖమును అంతమొనర్చుటకై కృతనిశ్చయులు కండు!

జన్మరాహిత్యమును బడయుటకై లెండు! యత్నశీలురు కండు. చిత్తమను గొలుసును ఆత్మస్వరూపజ్ఞానమను యుక్తిచే ఛేదించివైచి మహోధైర్య మవలంబించి మాయ యను బోనునుండి స్వాత్మయను సింహమును విడిపింపజేయుడు. ధైర్యమొకటితప్ప మఱియేదియును ఈ సంసారసంకటమునుండి జనులను ఉద్ధరింపజాలదు. కావున అపారధైర్యమవలంబించి, ఆత్మవిశ్వాసముతో, అచంచల దీక్షతో ముందునకు కొనసాగుచూ అచిరకాలములోనే బంధవిముక్తిని మీరు బడయుదురుగాక!"

ఉత్సవాలలో పాల్గొన్న మహనీయులూ, ప్రజలూ 25 సంవత్సరాలుగా శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు ఆధ్యాత్మికంగా లోకానికి చేస్తున్న సేవాకార్యక్రమాలను బహుధా ప్రశంసించారు. సాధుసత్కారాలతో, పూర్ణాహుతితో రజతోత్సవం శుభప్రదంగా 25-3-1975 వ తేదీన సమాప్తమయింది.

శ్రీ సద్గురు మలయాళస్వాములవారి శిష్యులు అనేకులు అనేక ప్రాంతాలలో అధ్యాత్మప్రచారకేంద్రాలయిన ఆశ్రమాలను స్థాపించారు. శ్రీశుకబ్రహ్మాశ్రమం వాటికన్నింటికీ మకుటాయమానమై శోభిల్లుతున్నది.

1980లో పేదవిద్యార్థులకు ఆశ్రమంలో భోజన వసతి సౌకర్యాలు సమకూర్చే హాస్టలును శ్రీ స్వాములవారు ఏర్పాటుచేశారు. ఆశ్రమంలో వుంటూ దగ్గఱలో వున్న ప్రాథమిక పాఠశాలలో ఆ విద్యార్థులు చదువుకొనే సదవకాశం కల్పింప బడింది. నిరుపేద కుటుంబాలకు చెందిన పిల్లలు చాలామంది పైయేర్పాటువల్ల ప్రయోజనం పొందారు. ఆశ్రమంలో వున్న ఉచిత వైద్యశాల (ఆనందవైద్యాలయం) వారి ఆరోగ్యపరిరక్షణ విషయంలో కూడా శ్రద్ధ వహించింది.

## గ్రంథాలయ నిర్వహణ

ఆశ్రమంలో ఉన్న విశిష్ట గ్రంథాలయం కూడా ఇక్కడ పేర్కొనదగి వున్నది. ఆశ్రమ ప్రారంభదశనుండీ ఈ గ్రంథాలయం క్రమక్రమంగా అభివృద్ధి పొందుతూ వచ్చింది. ఐదువేలకు పైగా అపూర్వాధ్యాత్మిక గ్రంథాల సేకరణ ఇందులో జరిగింది. ఆశ్రమవాసులూ, అనుదినమూ ఆశ్రమానికి వచ్చే యాత్రికులూ, తదితరులూ ఈ గ్రంథాలయంవల్ల ఎంతో ప్రయోజనం పొందుతున్నారు.

## ఆధ్యాత్మిక సంఘాలు

శ్రీ స్వాములవారి శిష్యులు రాష్ట్రమంతటా విస్తరించివున్నారు. కొన్నిచోట్ల వారు సంఘాలుగా ఏర్పడి శ్రీవారి పేరుతోనే ఆధ్యాత్మిక సమాజాలను స్థాపించుకొన్నారు. అక్కడవారు నిత్యమూ ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించుకొంటున్నారు.



అందులో విశాఖపట్టణములోని 'శ్రీ స్వామి విద్యాప్రకాశానంద గీతాసంఘము', కర్నూలులోని 'స్వామి విద్యాప్రకాశానంద ఆధ్యాత్మిక సమాజము', మండపేటలోని 'స్వామి విద్యాప్రకాశానంద గీతాసేవా సమాజము', నిర్మల్ చెంతనున్న వీరవల్లిలోని 'స్వామి విద్యాప్రకాశానందాశ్రమము', హైదరాబాద్ - దిల్‌సుఖ్ నగర్‌లోని 'శ్రీస్వామి విద్యాప్రకాశానంద సత్సంగం' మొదలైనవి ముఖ్యమైనవి. మహబూబ్ నగర్ భక్తులు శ్రీస్వాములవారిపేరుతో ఒక పాఠశాల నడుపుతున్నారు. బొంబాయిలో వున్న తెలుగువారు శ్రీవారిపేరుతో ఒక గీతాసమాజం స్థాపించుకొన్నారు.

ఈ రీతిగా శ్రీశుకబ్రహ్మాశ్రమదీప్తి నలువైపులకూ ప్రాకింది.

## శిష్యత్రయం

1950లో ఆశ్రమం స్థాపించిన నాటి నుండీ 1964 వరకూ శ్రీస్వాములవారికి అత్యంత సన్నిహితులై ప్రియశిష్యులై ఆశ్రమకార్యనిర్వహణలో తోడ్పడిన వారు శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు. ఆ తరువాత నాటనుండీ నేటివరకూ శ్రీవారికి ప్రేమాస్పదులైన శిష్యులుగా, ఆశ్రమం మేనేజరుగా, వేదాంతభేరి సంపాదకులుగా వుంటూ కార్యక్రమాల నన్నింటినీ చాతుర్యంతో నిర్వహిస్తున్నవారు శ్రీ ఈశ్వర్‌గారు. ఇటీవల ఆశ్రమంలో విద్యార్థిగా చేరిన విజయానందగారు కూడా శ్రీ స్వాములవారి చెంతనే వుంటూ సకలవిధ సేవాకార్యక్రమాలూ మిక్కిలి భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తున్నారు. అందువల్ల వీరి ముగ్గురినీ 'శ్రీవారి శిష్యత్రయం'గా పేర్కొనవచ్చు.

*

# షోడశ ప్రకరణం

## తిరుమల తిరుపతి దేవస్థానం సహకారం

శ్రీస్వాములవారు 108 గీతాయజ్ఞాలు పూర్తిచేయా లని సంకల్పించారు. అనంతపురం జిల్లా కదిరిలో 98వ గీతాజ్ఞానయజ్ఞం 1980 జూన్ నెలలో జరిగింది. ఆ తరువాత నిర్వహింపబడిన యజ్ఞా లన్నీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆధ్వర్యంలోనే జరిగాయి. ఈ జ్ఞానయజ్ఞాలకూ, దేవస్థానానికీ సంబంధం ఎలా ఏర్పడిందో ఇక్కడ కాస్త వివరించవలసి వున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు అనేక విద్యాసంస్థలను నిర్వహిస్తున్న విషయం లోకానికి తెలిసిందే. అందులో పెక్కువిద్యాసంస్థలు తిరుపతిలోనే వున్నాయి. తమ యాజమాన్యంక్రింద నడిచే విద్యాలయాలలోని విద్యార్థులకు కొంత ఆధ్యాత్మిక పరిజ్ఞానం అవసరమని భావించి దేవస్థానం వారు1980 లో ఆధ్యాత్మిక విద్యాకేంద్రాన్ని ప్రారంభించారు. దానికి సమన్వయాధికారిగా సీనియర్ ప్రిన్సిపాల్ ప్రొఫెసర్ శ్రీ సముద్రాల నాగయ్యగారిని నియమించారు. ఆ కేంద్రం తరపున విద్యాసంస్థలలో ప్రముఖులచేత తరచు ధార్మిక - ఆధ్యాత్మిక ఉపన్యాసాలు ఇప్పించేటట్లు ఏర్పాటు జరిగింది. శ్రీ నాగయ్యగారికి సహాయకుడుగా శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో సంస్కృతాధ్యాపకుడుగా వుండిన శ్రీ సముద్రాల లక్ష్మణయ్యను (ఈ గ్రంథరచయిత) కూడా నియమించడ మయింది.

ఆధ్యాత్మిక విద్యాకేంద్రం కళాశాలల్లోనూ, పాఠశాలల్లోనూ కొన్ని కార్యక్రమాలను నిర్వహించింది. ఇంకా విస్తృతంగా ఉపన్యాసకార్యక్రమాలను నిర్వహించాలని ఆలోచించే సందర్భంలో లోకప్రియ మైన శ్రీకాళహస్తి స్వాములవారి గీతోపన్యాసాలు ఏర్పాటుచేస్తే విద్యార్థులకే కాక పురజనులకు కూడా ఉపయోగంగా వుంటుందని శ్రీ సముద్రాల లక్ష్మణయ్య సూచించారు.

పై సూచనకు సమ్మతించి శ్రీ నాగయ్యగారు అప్పటి తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారితో ఈ విషయమై సంప్రదించారు. శ్రీ ప్రసాద్‌గారు దేవస్థానంలో అనేక ధార్మిక కార్యక్రమాలను చాలా చురుకుగా నిర్వహింపజేసి లబ్ధప్రతిష్ఠులైనవారు. వారు ఆధ్యాత్మిక



విద్యాకేంద్రం తరపున శ్రీ స్వాములవారి ఉపన్యాసాల ఏర్పాటుకు సమ్మతించి శ్రీవారితో సంప్రదించి సమయం నిర్ణయించవలసిందిగా శ్రీ నాగయ్యగారిని కోరారు.

## తిరుపతిలో 99వ యజ్ఞం

పిమ్మట శ్రీ నాగయ్యగారు శ్రీ లక్ష్మణయ్యతోసహా శ్రీకాళహస్తికి వెళ్లి శ్రీ స్వాములవారిని సందర్శించి తాము వచ్చిన కార్యాన్ని గూర్చి తెలియజేశారు. అప్పుడు శ్రీ స్వాములవారు చెప్పిన మాట లివి—

"ఇప్పటికి 98 గీతాజ్ఞానయజ్ఞాలు పూర్తి అయ్యాయి. వివిధ ప్రాంతాలలో వీటిని భగవద్దయతో నిర్విఘ్నంగా నిర్వహించడ మయింది. కాని ప్రసిద్ధ పుణ్యక్షేత్ర మయిన తిరుపతిలో ఒక్కయజ్ఞం కూడా జరుగలేదే అన్న భావన మా కిటీవలే కలిగింది. 100వ యజ్ఞం నిర్వహించడానికి హైద్రాబాద్‌వారు సిద్ధంగా వున్నారు. ఇక 99వ యజ్ఞం ఎక్కడ జరపాలి అని ఆలోచిస్తున్న ఈ సమయములో మీరు వచ్చారు. ఇది భగవత్సంకల్పమే. తిరుపతిలో యజ్ఞం జరపడానికి మేము సంతోషంతో సమ్మతిస్తున్నాము."

శ్రీవారి అంగీకారం లభించగానే తిరుపతిలో 99వ గీతాజ్ఞానయజ్ఞానికి అవసరమైన ఏర్పాట్లు చకచకా జరిగిపోయాయి. ఈ యజ్ఞం 12-12-1980 నుండి 31-12-1980వ తేది వరకూ జరిగింది. మొదట అన్నమాచార్య కళామందిరంలో ఏర్పాటైన ఈ కార్యక్రమం అచోటు చాలక తరువాత విశాలమైన శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల ప్రాంగణంలోకి మార్చబడింది. తిరుపతి పట్టణంలో ఆధ్యాత్మికకార్యక్రమం ఇరవైదినాలు అస్థాయిలో జరగడమనేది అపూర్వసంఘటన. పదివేలమందికి పైగా పురప్రజలు పరమోత్సాహంతో ఉపన్యాసాలకు హాజరయ్యారు. పట్టణంలో ఎక్కడ చూచినా సభను గురించీ, శ్రీ స్వాములవారిని గురించిన ముచ్చటలే. ఇంత మంచి కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినందుకు పురప్రజలు దేవస్థానంవారిని అభినందించారు. కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్‌గారు నిత్యం ఉపన్యాసస్థలానికి వెళ్లి ప్రజల శ్రవణౌత్సుక్యాన్నీ, శ్రీ స్వాములవారి ప్రవచనపాటవాన్నీ గమనించి ఆనందభరితు లయ్యారు.

ఈ సందర్భంలో శ్రీ స్వాములవారి ఉపన్యాసవైఖరిని 'స్వతంత్రభారత్' పత్రిక ఇలా అభివర్ణించింది —

"‥ ‥ ‥ ‥ ‥ ‥ శ్రీ స్వాములవారి ప్రసంగం చదువురాని సామాన్య మానవునికి సహా అర్థమగునట్లు సాగింది. గీతలోని ఆధ్యాత్మికసత్యాలు, ఆత్మబోధ అందరికి అర్థమగునట్లు విశదీకరించిరి. వినువారికి విసుగు కలుగకుండా మధ్య మధ్యన పిట్ట కథలు *(Parables)*, ఉపమానములు, హాస్యముతో కూడిన చతురోక్తులు స్వాములవారి ప్రసంగంలో అనేకం ఉన్నందున బాలబాలికలు సహా వచ్చి అధ్యాత్మ ప్రసంగముల ఆలకించుచుండిరి. సంతోషపడుచుండిరి. శ్రీ స్వాములవారికి సంస్కృతము, తెలుగు భాషలే కాక ఇంగ్లీషు కూడా బాగా వచ్చు *(Graduate)*, ఇంగ్లీషు పదాలు వారు ప్రయోగించుచుండినందున విద్యాధికులకు వారి ప్రసంగాలు ఎంతో రుచించినవి.

నేటి సమాజములో ఆవరించియుండు అజ్ఞానం, తప్పుడు విలువలు *(False values)*, అందువల్ల ప్రజలు తమకు తాము తెచ్చిపెట్టుకొన్న దుఃఖమూ, అశాంతి, జీవితంలో అసంతృప్తి, నిరాశనుంచి బయటపడవలెనంటే ఆధ్యాత్మిక విద్య (ఆత్మవిచారం) అత్యవసరం - అని విశదీకరించిరి. గీతలోని శ్లోకములు, యోగవాసిష్ఠములోని శ్లోకాలు స్వాములవారు ఉదాహరిస్తూ ప్రబోధం గావించగా అందరూ *Convince* అయినా రని చెప్పవచ్చు.

గీత బోధించే దేమిటి? *Morality, Spiritual values and Character building* - నీతి, ఆధ్యాత్మికవిలువలు, సద్గుణములు పెంపొందించుకొనుట (అదే పుణ్యం) తద్వారా పాపమును విడనాడ వీలగును. జీవితం పవిత్ర మొనర్చుకొనిన సుఖ శాంతులు తప్పక కలుగును. అందరిలో వుండు ఆత్మ ఒక్కటేగాన ఎవరికీ హాని కలిగించరాదు. ఉపకారం, సహాయం చేయుట అవశ్యకర్తవ్యం.

స్వాములవారు ఉపనిషత్తులనుండి, యోగవాసిష్ఠం, శంకరాచార్యుని భజగోవిదం, శివానందలహరి, వివేకానందుని ఉపన్యాసాలు మొదలగు పుస్తకములనుండి శ్లోకములు ఆశువుగ వల్లిస్తూ ప్రసంగించుతుంటే ఆశ్చర్యపడనివారు లేరు. వారి పాండిత్యం అపారమైనది. హరికథ సాగినట్లుగా వారి ఆధ్యాత్మిక ప్రబోధం సాగింది. వేలమంది స్త్రీ, పురుషులు గల ఆ సభలో నిశ్శబ్దము తాండవమాడుచుండెను. వారి ఆకర్షణశక్తి అలా వుండినది – అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు భగవద్గీత సారాన్ని అందరికి అందించారు. ఆయన ఉపన్యాసాలు (20 దినాలు) విన్న తిరుపతి ప్రజలు నిజముగా ధన్యులు. ఈసభను ఏర్పాటు చేసిన టి.టి.డి. వారి ఆధ్యాత్మిక విద్యాకేంద్రమువారు ప్రజల కృతజ్ఞతకు



పాత్రులయిరి."

(స్వతంత్రభారత్)

కార్యక్రమం చివరిరోజున శ్రీ ప్రసాద్‌గారు శ్రీ స్వాములవారికి కృతజ్ఞతలు ప్రకటిస్తూ "ఈ కార్యక్రమం దేవస్థానం తరఫున నిర్వహించగల్గినందుకు ఎంతో సంతోషిస్తున్నాము. ఇంతమంది జనులు ఈ సభకు రావడం అపూర్వమైన విషయం. దేవస్థానం నిజంగా ఇలాంటి కార్యక్రమాలను నిర్వహించాలి. ఇకమీదట శ్రీ స్వాములవారు నిర్వహించబోయే గీతోపన్యాసకార్యక్రమాల కన్నింటికీ తిరుమల తిరుపతి దేవస్థానమే ఆధ్వర్యం వహిస్తుంది" అని ప్రజల కరతాళధ్వనుల మధ్య ఉద్ఘాటించారు. యజ్ఞం సమాప్తం కాగానే బీదలకు భక్తులిచ్చిన తొమ్మిది బస్తాల బియ్యంతో అన్నదానం జరిగింది.

ఈ రీతిగా 99 వ యజ్ఞం పూర్తిగా దేవస్థానం తరఫుననే నిర్వహింపబడింది. 100 వ యజ్ఞం నుండి 108వ యజ్ఞం వరకూ అన్ని యజ్ఞాలకు తిరుమల తిరుపతి దేవస్థానానికి చెందిన హిందూధర్మ రక్షణ సంస్థ యాజమాన్యం వహించింది. స్థానిక ఆహ్వానసంఘాలవారు తగిన రీతిలో తమ సహకారం అందచేశారు.

## 100వ గీతాజ్ఞానయజ్ఞం

100వ యజ్ఞం హైదరాబాద్‌లో 25-3-1981 నుండి 13-4-1981 వరకూ జరిగింది. రాష్ట్ర రవాణా శాఖామాత్యులు శ్రీ కె. రోశయ్యగారు ఆహ్వాన సంఘానికి అధ్యక్షులై యజ్ఞనిర్వహణకు తగిన ప్రోత్సాహం ఇచ్చారు. కుడ్యపత్రాలు, కరపత్రాలు, విద్యుద్దీపాలు, దూరశ్రవణయంత్రం మొదలైన ఏర్పాట్లన్నీ తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వర్తించింది. ఇరవై వేలమందికి పైగా ప్రజలు ఈ సభలకు హాజరయ్యారు. ప్రజల రాకపోకలకు సౌకర్యం కల్గించడానికి ప్రభుత్వం వారు ప్రత్యేక బస్సులు నడిపారు. సాయంకాల కార్యక్రమానికి హాజరయినట్లే శ్రోతలు ఉదయం జరిగే కార్యక్రమానికి గూడా విశేషంగా హాజరయ్యారు.

ఈ సమయంలో దేవస్థానంవారు శ్రీ స్వాములవారు చేస్తున్న అనన్యసామాన్యమైన గీతాప్రచారకృషికి చిహ్నంగా ఒక ప్రత్యేక సంచికను ప్రకటించారు. ఈ సంచికలో శ్రీవారి జీవిత విశేషాలు, వారు నిర్వహించిన యజ్ఞాల వివరాలు మొదలైన విషయాలతో పాటు శతతమ గీతాయజ్ఞాన్ని ఉద్దేశించి కొందరు మహనీయులు పంపిన సందేశాలు గూడా ప్రచురింపబడ్డాయి.

శ్రీ వ్యాసాశ్రమపీఠాధిపతులు శ్రీ విద్యానందగిరి స్వాములవారు తమ సందేశంలో —

"విద్యాప్రకాశో విమలో వివేకీ
స్వామీ మహానాంధ్రజనోపకారీ|
గీతామహాయజ్ఞకరో హితైషీ
రారాజతే హైదరాబాదు యజ్ఞే||

అని శ్రీ స్వాములవారిని ప్రశంసించారు.

"పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు 'ఆంధ్రలోకము సముద్ధరింపబడుగాక!' అన్న దీక్షతో దేశముయొక్క నలుమూలలా గీతాయజ్ఞముల నిర్వహించుచున్నారు. . . . ఆ యుపన్యాసములలో నీతి, న్యాయము, సత్కర్మనిష్ఠ, భగవద్భక్తి, బ్రహ్మాత్మవిజ్ఞానము, వైరాగ్యము ప్రధానముగా నుండును. మఱియు అవి పండితపామర రంజకములై వేనవేలుగా జనుల నాకర్షించుచుండును." అని కూడా శ్రీ విద్యానందగిరిస్వాములవారు వ్రాశారు.

శ్రీ రామకృష్ణానందస్వామీజీ (గండి) శ్రీ స్వాములవారిని శతక్రతు సోమయాజిగా అభివర్ణిస్తూ తమ సందేశంలో ఇలా అన్నారు —

"ఆంధ్రదేశంలో శ్రీ విద్యాప్రకాశానందస్వాములవా రొక అసామాన్యవిభూతి. శ్రీమంతులు, శుచిమంతులు నైన కుటుబంలో జన్మించిన యోగపురుషులు. ఆంగ్లభాషలో పట్టభద్రులు. నైష్ఠికబ్రహ్మచారులు, వ్యాసాశ్రమ సంస్థాపకులగు శ్రీ మలయాళస్వాములవారి శిష్యులు.

....... అద్భుతమైన తమ వాగ్ధోరణితో వేలాదిజనులను పరవశులను చేస్తుంటారు. వీరి ఉపన్యాసాలలో సరస ఛలోక్తులు ధారాపాతంలాగా జారి జారి వస్తుంటాయి.

...... శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు తొంభైతొమ్మిది జ్ఞానయజ్ఞాలను జరిపి ప్రస్తుతం నూరవ జ్ఞానయజ్ఞం ఆంధ్రరాజధానిలో చేస్తున్నారు. హైదరాబాదుకు భాగ్యనగర మనే పేరుంది. ఆ పేరును అక్షరాలా సార్థకం చేసుకొనే సౌభాగ్యం ఆ పట్టణానికి, ఆ పట్టణప్రజలకు ఈనాడు ఒదిగి వచ్చింది.



...... శ్రీ స్వాములవారు "శివాయ లోకస్య భవాయ భూతయే" అని భాగవతం చెప్పినట్లు జ్ఞానయజ్ఞపరంపరలను "బహుజనహితాయ, బహుజనసుఖాయ" ఆచరిస్తున్నారు. ఆచరించబోతూన్నారు. వారి జీవితము యజ్ఞమయము. వారు యజ్ఞేశ్వరస్వరూపులు. వారి యజ్ఞప్రసాదమును ఆరగించి ఆంధ్రప్రజలు ధన్యులగుదురు గాక! శ్రీవారిని నాయీ వాక్పుష్పాలతో పూజిస్తూ సెలవు తీసుకొంటూన్నాను".

ఈ సందర్భమందే చిన్మయమిషన్ వ్యవస్థాపకులు శ్రీ స్వామి చిన్మయానందజీ తమ సందేశంలో ఈ విధంగా సెలవిచ్చారు —

***"Just now I have received your intimation that Swami Vidya Prakasananda who has been conducting Geeta Yajnas for the last 18 years in various places in Andhra will be conducting his 100th Geeta Yajna in Hyderabad in the month of March 1981. With upraised, folded palms I falicitate Sri Swamiji Maharj for the grace of the Lord Krishna that he has experienced all through-out. Without His immerse blessing it is not easy to conclude, without any obstacle, 100 such divine sessions of spiritual service to Community."***

"ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో గత 18 సంవత్సరాలుగా గీతాయజ్ఞాలు నిర్వహిస్తున్న స్వామి విద్యాప్రకాశానంద తమ 100వ యజ్ఞాన్ని 1981 మార్చిలో హైదరాబాదులో నిర్వహిస్తున్నారని మీరు పంపిన సమాచారం నా కిప్పుడే అందింది. శ్రీ స్వామిజీ మహరాజు శ్రీకృష్ణభగవానుని కృపకు పాత్రులైనందుకు వారికి చేతులెత్తి నా ప్రణామాంజలి ఘటిస్తున్నాను. భగవానుని ఆశీర్వాదం లేకపోతే నిర్విఘ్నంగా ఆధ్యాత్మిక సేవాపరమైన అలాంటి 100 దివ్యసభలను జాతినుద్దేశించి నిర్వహించడం సుకరం కాదు."

(స్వామి చిన్మయానందజీ)

హైదరాబాద్ యజ్ఞం తర్వాత 1981లో శ్రీకాళహస్తి, కర్నూలు, మద్రాసు, వేటపాళెం, 1982 లో సిద్దిపేట, భీమవరం, విశాఖపట్నం, సికింద్రాబాదులలో వరుసగా ఎనిమిది యజ్ఞాలు జరిగాయి. అన్నింటికీ తిరుపతి దేవస్థానం సహాయసంపత్తి లభించింది. అప్పట్లో హిందూ ధర్మరక్షణ సంస్థకు ప్రత్యేకాధికారిగా, కార్యదర్శిగా పనిచేసిన ఈ గ్రంథరచయితకు స్వయంగా పై కార్యక్రమాలన్నింటిలోనూ పాల్గొనే అవకాశం కలిగింది. చివరి రెండు యజ్ఞాలలోనూ శ్రీవారి ఆధ్యాత్మిక సేవలను

వివరించే వ్యాసాలతో గీతాజ్ఞానయజ్ఞస్మరణికలు ప్రకటింపబడ్డాయి.

## 108 వ గీతాజ్ఞానయజ్ఞం

సికింద్రాబాదులో 13-5-82 నుండి 1-6-82 వరకూ 108 వ జ్ఞానయజ్ఞం నిర్వహింపబడింది. ప్రముఖ వాణిజ్యవేత్త శ్రీ సోమా వేంకటేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద ఏర్పడిన ఆహ్వానసంఘం ఈ కార్యక్రమానికి సహకరించింది. కార్యక్రమ ప్రారంభదినాన దేవాదాయశాఖామాత్యులు శ్రీ పి.వి. చౌదరిగారు మొదలైన ప్రముఖులు శ్రీ స్వాములవారి లోకసేవలను వేనోళ్ల ఉగ్గడించారు.

హృషీకేశమునుండి దివ్యజీవన సంఘాధ్యక్షులు శ్రీ స్వామి చిదానందజీ మహరాజ్‌వారు ఈ యజ్ఞానికి పంపిన తమ దివ్యసందేశంలో ఇలా అన్నారు

---

*"…. It is a great privilege and joy to send my message of Good-Wishes for the highest success of the Noble 108th Gita Yajnam that is being conducted by our Revered and beloved H.H. Pujyasri Swami Vidya Prakasanandaji Maharaj, Founder and Prsident of the well-known Suka Brahma Asram at Srikalahasti. I have had the great joy of visiting this holy Asram in an ideal beautifull surroundings.*

*May the 108th Gita Yajna to be performed at Secunderabad in the month of May 1982, be blessed by all the celestial Beings, the Sapta Rishis and all the saints and sages of holy Bharatavarsha. May this holy Gita Yajna bring about Visva Santi, Loka Kalyan and Sarva Bhuta-Hita."*

"మాననీయులు, ప్రేమాస్పదులు, సుప్రసిద్ధ శ్రీకాళహస్తి శుకబ్రహ్మాశ్రమ స్థాపకాధ్యక్షులు, పూజ్యశ్రీ స్వామి విద్యాప్రకాశానందజీ మహరాజ్‌వారు నిర్వహించే ఉదాత్తమైన 108 వ గీతాజ్ఞానయజ్ఞం విజయవంతం కావాలని కాంక్షిస్తూ నా శుభాకాంక్షలను పంపే అవకాశం కల్గినందుకు సంతోషంగా వున్నది. ఆదర్శము, సుందరమూ అయిన వాతావరణంలో ఉన్న వారి పవిత్రాశ్రమాన్ని సందర్శించి నేను ఎంతో ఆనందించాను.

1982 మే నెలలో సికింద్రాబాదులో జరిగే 108వ గీతాయజ్ఞాన్ని సకలదేవతలు, సప్తర్షులు, ప్రాచీన భారతీయ పరమర్షులు, మునులు ఆశీర్వదింతురుగాక! ఈ పవిత్ర గీతాయజ్ఞం విశ్వశాంతిని, లోకకల్యాణాన్ని, సర్వభూతహితాన్ని



చేకూర్చుగాక!"

(శ్రీ స్వామి చిదానందజీ మహరాజ్)

శ్రీ చిదానందస్వాములవారు ఆశించినట్లే 108వ గీతాజ్ఞానయజ్ఞం 1-6-82 తేదీ నాటికి భగవదనుగ్రహంతో, పరమర్షుల ఆశీర్వాదంతో శుభప్రదంగా సమాప్తమయింది. 1957లో నరసారావుపేటలో ప్రారంభమైన జ్ఞానయజ్ఞపరంపర అష్టోత్తరశతసంఖ్యతో సకలలోకకల్యాణకరంగా పూర్తి అయినందుకు శ్రీ స్వాములవారు, భక్తులు అమందానందభరితు లయ్యారు.

## గీతోపన్యాసాల ఆడియో కేసెట్లు

22-12-81 నుండి 10-1-82 వరకూ ప్రకాశం జిల్లా వేటపాలెంలో జరిగిన 104వ జ్ఞానయజ్ఞంలో బహుజనానీకానికి శ్రీ స్వాములవారి ప్రబోధాల నందించాలన్న సత్సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు గీతోపన్యాసాలను రికార్డు చేయించారు. తరువాత వాటిని కేసెట్లుగా విడుదల చేశారు. ప్రస్తుతం ఈ కేసెట్లు బహుళప్రచారంలో వుంటూ ఆంధ్రావని నలుమూలలా శ్రీవారి దివ్యవాణిని వినిపింపజేస్తున్నాయి.



# సప్తదశ ప్రకరణం

## గ్రంథ రచన

ఇదమంధం తమః కృత్స్నం
జాయేత భువనత్రయమ్ ।
యది శబ్దాహ్వయం జ్యోతి
రాసంసారం న దీప్యతే ॥

(కావ్యాదర్శం-1-4)

అని మహాకవి దండి అన్నాడు. వాఙ్మయమనే జ్యోతి లేకపోతే ముల్లోకాలూ అజ్ఞానమనే చీకటిలో మ్రగ్గిపోతాయి. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు మొదలైన ప్రాచీన వాఙ్మయం ద్వారానే మనం ఆనాటి స్థితిగతులనూ, జ్ఞానవిజ్ఞానాలనూ తెలుసుకోగలుగుతున్నాము.

అనాదికాలంనుండీ మహాప్రవక్త లెందరో తమ సమకాలికులకు నేరుగా ప్రబోధాలు చేయడమే కాక రాబోయే తరాల కొరకై తమ అభిప్రాయాలను వాఙ్మయనిబద్ధం చేసి వుంచారు. మొదట సంస్కృతభాషలో ఉద్భవించిన విస్తృతమైన వాఙ్మయం తరువాత ఇతర భాషల్లోకి అనువదించపబడింది. అనంతమైన వాఙ్మయంలో పలుభాషలలో పరిశోధనలూ, గ్రంథరచనలూ సాగుతూనేవున్నాయి. నాగరకత వికాసంపొందేకొద్దీ ఈ కృషి ముమ్మర మవుతూనే వుంటుంది.

ఆధునిక కాలంలో మహర్షిగా, సద్గురువుగా లోకపూజితులైన శ్రీ మలయాళ స్వాములవారు శుష్క వేదాంతతమోభాస్కరాది గ్రంథాలను ఎన్నింటినో వెలయించి తెలుగులో వేదాంత సారస్వతాన్ని పరిపుష్టం చేశారు. వ్యాసాశ్రమంవారి గ్రంథప్రచురణలు విపులవ్యాప్తి పొందిన విషయం లోకవిదితమే.

శ్రీ సద్గురుదేవుల అడుగుజాడలలోనే నడచిన శ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు వక్తృత్వంలోనే కాక రచనావ్యాసంగంలో కూడా పారంగతులే. వారు రచించిన గీతామకరందాదులైన కొన్ని గ్రంథాలను గురించి ఇంతకు ముందే చెప్పుకొన్నాం.



శ్రీ శుకబ్రహ్మాశ్రమం తరపున విడుదలైన మూలం గీతలు, తాత్పర్యగీతలు లక్షల సంఖ్యలో వున్నాయి.

యోగవాసిష్ఠానికి సంగ్రహరూపమైన వసిష్ఠగీత ప్రథమభాగం మాత్రమే 1957లో ప్రకటింపబడింది. ఆ తరువాత 1, 2 భాగాలను కలిపి 1150 పుటల మొదటి సంపుటాన్ని, 1972 లో ప్రకటించారు. పిమ్మట 3, 4 భాగాలను చేర్చి 1127 పుటలుగల రెండవ సంపుటాన్ని గూడా ఆ మరుసంవత్సరమే విడుదల చేశారు. ఈ రెండు సంపుటాలలోను ఒక్కొక్క సంపుటానికి ఐదు వేల శ్లోకాల చొప్పున మొత్తం పదివేల శ్లోకాలు తాత్పర్యముతోసహా ప్రకటింపబడ్డాయి. గహనమైన వేదాంతగ్రంథానికి సరళమైన శైలిలో శ్రీవారు తాత్పర్యరచన కావించారు.

శ్రీ స్వాములవారు రచించిన ఇతర గ్రంథాలను గురించి ఇప్పుడు సంగ్రహంగా తెలుసుకొందాం. ప్రతిసంవత్సరం ఆశ్రమ వార్షికోత్సవాలకు వచ్చే భక్తులకు 'జ్ఞానపుష్పం' అనే పేరుతో ఒక కరపత్రం అందజేసేవారు. భక్తి, జ్ఞాన, ధ్యాన వైరాగ్యాది విషయాలను గూర్చి ఆ కరపత్రాలు వివరించేవి. అలాంటి పన్రెండు కరపత్రాలను చేర్చి 'ద్వాదశమంజరి' అన్న పేరుతో ఒక చిరుపొత్తం ప్రచురించారు.

'ఆత్మ విద్యావిలాసము' అనే మరొక చిన్న పుస్తకం 1968లో ప్రకటితమయింది. అందులో నిగూఢమైన వేదాంత తత్త్వాన్ని సంక్షేపంగా నిరూపించడమయింది.

'యమలోకవార్తలు' అన్న మరొక పుస్తకం కూడా ఆ సంవత్సరమే ముద్రితమయింది. యమలోకప్రాప్తికి హేతువైన పాపాచరణం నుండి తప్పించుకొని మోక్షప్రాప్తికై చేయవలసిన కృషిని ఈ గ్రంథం వివరిస్తున్నది.

ఆత్మోత్తేజం కలిగించే వివేకానందస్వామి వాక్యాలను చక్కని తెలుగులో అనువదించి 1963 నుండి వేదాంతభేరిలో ప్రచురిస్తూ వచ్చారు. ఆ వాక్యాలన్నీ చేర్చి ఆంగ్లమూలంతో సహా 'వివేకానంద సింహనాదము' అన్న పేరుతో మరొక గ్రంథాన్ని 1969లో ఆశ్రమం ప్రచురించింది.

'అధ్యాత్మ జడ్జిమెంటు' అన్న గ్రంథం 1971లో వెలువడింది. ఇది చాలా ఆసక్తిదాయకమైన పుస్తకం. పరమార్థక్షేత్రమనే న్యాయస్థానంలో ముముక్షువనే వాది అజ్ఞానమనే ప్రతివాదిపై దావా వేస్తాడు. సద్గురువనే న్యాయాధిపతి ఇరు

క్షాలనూ విచారించి తీర్పు చెబుతాడు. అంతకముందు వ్యాసాశ్రమం ప్రకటించిన 'పరమార్థ జడ్జిమెంటు' అన్న గ్రంథానికీ, దీనికీ చాలా పోలిక లున్నాయి.

ఈ తరువాత వెలువడిన గ్రంథాలలో 'మోక్ష సాధన రహస్యము' అన్నది చాలా ముఖ్యమైనది. ఇంచుమించు 700 పుటలకు విస్తరించిన ఈ గ్రంథం మొదటిసారిగా 1974లో ప్రచురింపబడింది. ఇందులో ఇరువది అధ్యాయా లున్నాయి. ఆధ్యాత్మికపథంలో పయనించే సాధకులకు అవసరమైన మోక్షసాధనసామగ్రి ఈ పుస్తకంలో విపులంగా వివరింపబడింది. ముక్తికి ఆటంకం కలిగించే ప్రతిపశక్తులను ఎలా ఎదుర్కోవాలి? అన్న విషయాన్ని, ముక్తిసాధన కవసరమైన శాస్త్రప్రమాణాలనూ శ్రీ స్వాములవారు ఇందులో చక్కగా వివరించారు.

శ్రీవారు వేదాంతతత్త్వాన్ని వివరిస్తూ గేయరూపంలో వ్రాసిన తత్త్వాలను 1973 జనవరి నుండి వేదాంతభేరిలో ప్రకటిస్తూ వచ్చారు. 108 తత్త్వాల రచన పూర్తి కాగానే తత్త్వసారమన్న పేరుతో వాటి నొక గ్రంథంగా 1975లో ప్రకటించారు. అవి సులభశైలిలో పాడడానికి అనుకూలంగా వుండడం వల్ల ప్రజానీకంలో బహుళ ప్రచారం పొందాయి. ప్రసిద్ధ గాయకురాలు శ్రీమతి శోభారాజుగారిచే 1988 లో ఈ తత్త్వాలను శ్రావ్యంగా పాడించి రికార్డు చేశారు. పిమ్మట ఆ తత్త్వాలను కేసెట్లరూపంలో విడుదల చేయడం జరిగింది.

తత్త్వసారం లాగానే గేయరూపంలో వున్న మరొక రచన 'మానసబోధ'. 1986 లో అది పుస్తకంగా వెలువడింది. ప్రసిద్ధ గాయనీమణి శ్రీమతి వాణీ జయరాంగారు పాడగా రికార్డు చేసి తర్వాత కేసెట్లరూపంలో మానసబోధను విడుదల చేశారు. పై రెండు రకాల కేసెట్లు విస్తృత వ్యాప్తి పొందాయి.

అధ్యాత్మతత్త్వాన్ని కథలద్వారా తెలిపే మరొక గ్రంథం 'పరమార్థకథలు'. 800 పుటలకు విస్తరించిన ఈ పుస్తకంలో అనేక కథలను శ్రీవారు ఇంపైన పద్ధతిలో వివరించారు. ప్రతి కథ చివరా అందలి నీతినికూడా విశదీకరించారు. 1975 ఏప్రిల్ మాసం నుండీ వరుసగా ఈ కథలు వేదాంతభేరిలో ముద్రింపబడ్డాయి. తరువాత గ్రంథరూపం పొందాయి. ప్రసిద్ధమైన 'స్వాతి' వారపత్రిక ఈ కథలను శ్రీ స్వాములవారి అనుమతితో వరుసగా ప్రచురించింది. ఆ పత్రికమూలంగా లక్షలాది పాఠకులకు ఈకథలు పరిచయ మయ్యాయి.

శ్రీ స్వాములవారు ఉపన్యాసం ప్రారంభించడానికి ముందు భజనలు, కీర్తనలు తాము పాడి భక్తులచేత పాడిస్తూ వుంటారు. విక్షిప్తమైన శ్రోతల చిత్తాన్ని ఏకాగ్రం



చేయడానికి ఈ పద్ధతిని అవలబించారు. భక్తి భావ ప్రచారానికి ఈ ప్రక్రియ ఉపకరిస్తుంది. ఆశ్రమం వారు ఇంచుమించు అలాంటి 550 భజనగేయాలను, కీర్తనలనూ చేర్చి 'భజనలు-కీర్తనలు' అన్న పేరుతో ప్రకటించారు.

బ్రహ్మానందప్రాప్తి కవసరమైన ఉపాయాలను బోధించే మరొక గ్రంథం 'బ్రహ్మానందవైభవము'. విషయానందం క్షణికమనీ, బ్రహ్మానందం శాశ్వతమనీ, బ్రహ్మానందప్రాప్తికి జీవుడు పాటు పడాలనీ శ్రీ స్వాములవారు ఈ గ్రంథంలో నిరూపించారు.

సుభాషితాలు-సదుపదేశాల సముచ్చయరూపమైన 'అమృతబిందువులు', 'వైరాగ్యసాధన', 'మోక్షద్వారపాలకులు', 'మట్టిలో మాణిక్యం', 'ఆత్మతత్త్వ విచారణ', 'ధ్యాన పద్ధతి' మొదలైన లఘుగ్రంథాలు గూడా 1985కు ముందే వెలువడ్డాయి.

1985లో శ్రీ మలయాళస్వాములవారి శతజయంతి మహోత్సవాలు జరిగాయి. ఆ సందర్భంలో 'శ్రీ మలయాళమహర్షి' అన్న పేరుతో ఒక గ్రంథాన్ని శ్రీవారు రచించారు. ఇందులో శ్రీ సద్గురుస్వాములవారి జీవితవిశేషాలనూ, వారి సన్నిధిలో తమ అనుభవాలనూ క్రోడీకరించారు. ఈ పుస్తకాన్ని శ్రీ సద్గురుస్వాములవారి శతజయంత్యుత్సవ సంఘం ప్రచురించింది.

## రత్నాకర పంచకం

తక్కిన రచనల్లో ముఖ్యంగా చెప్పుకోదగినవి రత్నాకరపంచకంగా ప్రసిద్ధి పొందిన ఐదుగ్రంథాలు. అందులో 'యోగవాసిష్ఠరత్నాకరము' అనేది ఒకటి. అంతకు ముందు ప్రచురించిన వసిష్ఠగీత రెండు సంపుటాలకు మారురూపమే ఈ గ్రంథం. పై రెండు సంపుటాలను కలిపి కొంత గ్రంథభాగం కుదించి యోగవాసిష్ఠరత్నాకరమనే పేరుతో ఒకే సంపుటంగా ప్రచురించారు.

1982 లో ముద్రితమైన 'రామాయణరత్నాకరం' లో 800 పుటలున్నాయి. వాల్మీకి మహర్షి విరచిత రామాయణంలోని నీతి, జ్ఞాన ప్రబోధాలకు సంబంధించిన శ్లోకాలను సంగ్రహించి వాటికి తాత్పర్యాలు వ్రాసి శ్రీ స్వామీజీ ఈ గ్రంథాన్ని ప్రకటించారు. ఇందులో కథాభాగం కూడా క్లుప్తంగా నిబద్ధ మయింది. గ్రంథాదిలో శ్రీరామునికి సంబంధించిన వివిధ స్తోత్రాలను కూడా చేర్చారు.

ఇంచుమించు వెయ్యి పుటలుగల 'భాగవతరత్నాకరం' 1985లో ప్రచురి

తమయింది. వ్యాసమునీంద్రవిరచిత భాగవతములోని ప్రబోధాత్మక శ్లోకాలను సంగ్రహించి సరళమైన శైలిలో తాత్పర్యం సమకూర్చి శ్రీవారు ఈ గ్రంథాన్ని వెలువడజేశారు. రామాయణరత్నాకరంలో లాగానే కథాభాగాన్ని కూడా సంగ్రహంగా ఇందులో సంఘటించారు. భక్తులకూ, సాధకులకూ ఎంతో ఉపకరించే భాగవతశ్లోకాల సముచ్చయ మీగ్రంథం.

1986లో ప్రకటింపబడిన మరొకపుస్తకం 'ఉపనిషద్రత్నాకరం'. అష్టోత్తరశతోపనిషత్తులు లోకప్రసిద్ధాలు. అందరి ముఖ్యమైన మంత్రాలను సేకరించి 500 పుటలకు పైగా విస్తరించిన ఈ గ్రంథంలో తాత్పర్యంతో సహా ప్రకటించడం జరిగింది.

తరువాతిది 'భారతరత్నాకరం'. దాదాపు 800 పుటలు కల పుస్తకమిది. దీని ముద్రణ 1987లో జరిగింది. వ్యాసముని విరచిత మహాభారతంలోని ధర్మతత్త్వ ప్రతిపాదకాలైన శ్లోకాలు ఇందులో తాత్పర్యంతో సహా క్రోడీకరింపబడ్డాయి. కథాభాగం కూడా సంగ్రహంగా సంఘటింపబడింది. భారతంలో సుప్రసిద్ధాలైన స్తోత్రాలను గ్రంథాదిలో సమకూర్చారు.

ఈ రీతిగా సనాతనధర్మానికి కాణాచులైన భారత-భాగవత-రామాయణాలను సమగ్రంగా అధ్యయనం చేసి అందరి ముఖ్యభాగాలను క్రోడీకరించి ప్రకటించడం ద్వారా శ్రీ స్వాములవారు అటు పాఠకులకూ, ఇటు ఆంధ్రసారస్వతానికీ ఎనలేని సేవ చేశారు. పై గ్రంథాలలో కొన్నింటి ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానం వారు కొంత ఆర్థికసహాయం అందించారు.

1986లో 'పాండవగీత' గూడా తాత్పర్యంతో సహా ముద్రిత మయింది. బ్రహ్మచర్యము యొక్క ప్రాధాన్యాన్ని విపులంగా వివరించే 'బ్రహ్మచర్య విజయము', యోగవాసిష్ఠంలోని విషయాలను అతిసంగ్రహంగా వివరించే వచనరూపమైన 'వాసిష్ఠ మహారామాయణము', ఆత్మతత్త్వాన్ని విశదంగా నిరూపించే 'ఆత్మానుసంధానము' అన్న మూడు గ్రంథాలు ఇటీవల వెలువడిన ఆశ్రమపుస్తకాలలో ప్రధానమైనవి. ఇంతవరకూ పేర్కొనబడిన ఈ గ్రంథాలలో అనేకం పలుసార్లు పునర్ముద్రణ పొందాయి. జిజ్ఞాసువులైన పాఠకులకు ఈ పుస్తకాలన్నీ మహోపయోగకరంగా వున్నాయి.



## శ్రీ గురుదేవుల సంస్మరణ

శ్రీవారి గురుదేవులు శ్రీసద్గురు మలయాళస్వాములవారి శతజయంతీ మహోత్సవాలు 28-3-1985 నుండి 1-4-1985 వరకూ ఐదురోజులు వ్యాసాశ్రమంలో వైభవోపేతంగా ఉన్నతస్థాయిలో జరిగాయి. వివిధసంస్థలకూ, అనేక సంప్రదాయాలకూ చెందిన వందలకొలది సాధుపుంగవులూ, ఏబదివేలమందికి పైగా ప్రజలు ఆ ఉత్సవాలలో పాల్గొన్నారు. శ్రీ విద్యాప్రకాశానంద స్వామీజీ శతజయంత్యుత్సవాలు జరిగినన్ని రోజులూ వ్యాసాశ్రమంలో తాము పూర్వం తపోనిష్ఠ కొనసాగించిన గుహాశ్రమంలో వుండి చివరిరోజు మహాసభకు అధ్యక్షత వహించారు. శ్రీసద్గురుదేవుల లోక సేవలను బహుధా ప్రశంసిస్తూ ఆ మహాసభలో మాట్లాడారు.

ఆ సందర్భంలోనే ప్రకటింపబడిన 'శ్రీ మలయాళస్వామి శతజయంతీ సంచిక' లో 'చరాచర సుఖాభిలాషి' అన్న శీర్షికతో గురుదేవులను సంస్మరిస్తూ ఇలా వ్రాశారు—

"గుమ్మడితీగ పుట్టినచోట ఫలించదు. చాల దూరముపోయి అచట ఫలమును కలుగజేయును. అట్లే శ్రీ మహర్షి సద్గురు మలయాళస్వాములవారు ఎక్కడో కేరళదేశమున జన్మించి ఉత్తరాభిముఖులై పయనించి ఆంధ్రదేశమున అడుగు పెట్టి అచటనే స్థిరపడి తీవ్రతపం బాచరించి జీవితలక్ష్యమగు ఆత్మానుభూతిని బడసి, అట్టి ఆనందామృతమును ఆంధ్రు లందరికి పంచిపెట్టిరి. 'స్వయం తీర్ణః పరాంస్తారయతి' అను లోకోక్తి ననుసరించి తాము తరించి ఇతరులను తరింపజేసి మహత్తర సనాతన ధర్మమును కార్యాన్విత మొనర్చిరి. ఆంధ్రమాత ఎన్ని నోములు నోచుకొనినదో ఇట్టి సుపుత్రుని బడసి ధన్యురాలైనది.

శుష్కవేదాంతము పట్టపగ్గములు లేక విచ్చలవిడిగ జనులలో వ్యాపించియున్న తరుణమున, దురాచారములు, దుర్వాదములు, మూఢనమ్మకములు, జాతిమత కుల విద్వేషములు, సంకుచిత భావములు జనుల హృదయాంతరాళములలో పాతుకుపోయియున్న సమయమున శ్రీ స్వాములవారు అవతరించి వాని నన్నింటిని ఖండించివైచి జనులకు యథార్థతత్త్వమును బోధించిరి. విశాలభావములను జనులలో వ్యాపింపజేసిరి. స్త్రీ శూద్ర - అంత్యజాతులు కూడ బ్రహ్మజ్ఞానము బడయుటకు అర్హులే యనియు, మానవులందరును ఒకే జాతివారనియు, భేదము కల్పితమనియు

ఎలుగెత్తి చాటిరి. 'అమృతస్య పుత్రాః' అని ఉపనిషత్తులు ఘోషించునట్లు 'ఓ జనులారా! మీ రందఱును నాశరహిత పరబ్రహ్మగోత్రోద్భవులు. మీలో అఖండమైన దైవశక్తి ఇమిడియున్నది. భక్తి వైరాగ్యవిచారణాదిసాధనలచే దానిని లెస్సగ ప్రజ్వలింపజేసి అనుభూత మొనర్చుకొని తరింపుడు అని!' శ్రీవారు గంభీరముగ ఉద్బోధించిరి.

తత్ఫలితముగా ఆంధ్రదేశమున గొప్ప సంచలనము కలిగెను, ఒక గొప్ప ఆధ్యాత్మికవిప్లవము చెలరేగెను. స్త్రీలు, ద్విజేతరులు ఉత్సాహముగ ముందుకువచ్చి సంస్కృతమును, వేదవిద్యను అభ్యసించుటయేకాక, ఆచార్య పీఠములనుకూడ అలంకరించిరి. సంఘములో ఇట్టి అపూర్వక్రాంతి కలిగించి, సమభావమును ఉద్దీపింపజేసి, అందరి చేతను గీతను పట్టించి, బ్రహ్మవిద్యను అధ్యయనము చేయించి శ్రీ స్వాములవారు ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి విశేష దోహదమును కలుగజేసిరి. వారి ప్రబోధమువలననే జనులు హింసాప్రవత్తిని విడనాడి దయ, ప్రేమ మొదలగు ఉదాత్తగుణములకు తమ హృదయములలో తావు కల్పించుకొనిరి.

శ్రీస్వాములవారు గొప్ప అనుష్ఠానపరులు. చేసినదే చెప్పుట, చెప్పినదే చేయుట వారి నైజము. శాస్త్రోక్తములగు శమదమాదులను, సత్యశౌచాదులను వారు స్వయముగా ఆచరించి తదుపరి ఇతరులకు బోధించుదురు. క్రమశిక్షణ సాధకుల కెంతయో అవసరమని వారు పదే పదే నొక్కి చెప్పుచుందురు. ఇంతియే కాదు. అట్టి క్రమశిక్షణను వారు తమ జీవితమున పాలించుచునే వచ్చిరి. ఇదియే శ్రీవారి ప్రత్యేకత. శ్రీవారి పవిత్రసాన్నిధ్యమందు పంద్రెండు సంవత్సరములు గడపి నేను గ్రహించిన ముఖ్యవిషయ మిదియే.

భగవంతుడు సర్వవ్యాపి కావున భగవత్స్వరూపములగు చరాచరము లన్నియు సుఖముగ నుండవలెనని శ్రీ వారి యభీష్టము. కనుకనే శ్రీ స్వాములవారు 'చరాచరసుఖాభిలాషి' అని తమ పేరు ముందుగా వ్రాయుచుందురు. కేవలము మానవుల యొక్క క్షేమమే కాక పశుపక్ష్యాది జీవరాసు లన్నింటియొక్క క్షేమమును శ్రీవారు కాంక్షించుచుందురు.

ఈ ప్రకారముగ విశాలహృదయులును, సర్వప్రాణులయొక్క హితైషియు, చరాచర సుఖాభిలాషియు నగు శ్రీస్వాములవారి యొక్క శతజయంతీ మహోత్సవ కార్యక్రమాలు జరుగుచున్న ఈ శుభసందర్భమున జనులు శ్రీవారి దివ్యబోధలను సంస్మరించి వారి ఆదేశమును శిరసావహించి దైనందిన జీవతమందు ఆబోధలను



కార్యాన్విత మొనర్చుటకు స్థిరనిశ్చయులై పరమానందము ననుభవింతురు గాక !"

(శత జయంతి సంచిక - 44, 45)

శ్రీ స్వాములవారి గురుదేవు 'లెంతటి ప్రభావాన్వితులో పై మాటలను బట్టి తెలుస్తున్నది గదా! వారి శిక్షణలో తీర్చి దిద్దబడుటవల్లనే వీరును విమల చరిత్రులై, వేదవిద్యాప్రకాశాన్ని సర్వత్రా విస్తరింపజేయగలిగారు.

## గీతా పాఠశాల

శ్రీ స్వాములవారికి ఆశ్రమంలో గీతాపాఠశాల స్థాపించాలనీ, తద్వారా గీతా ప్రబోధకులను తయారుచేయాలనీ ఎంతో కాలంగా సంకల్పం వుండేది. ఈ సంకల్పం 1985 లో కార్యరూపం దాల్చింది.

తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తల సంఘంలో అప్పుడు సభ్యులుగా వుండిన కాకతీయ సిమెంట్స్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు దేవస్థానం సహాయంతో గీతాపాఠశాలను ఆశ్రమంలో స్థాపించడానికి సహకరించారు. వ్యాసాశ్రమంలోని బ్రహ్మవిద్యాపాఠశాలకు దేవస్థానం వారు చాలాకాలంనుండీ ఆర్థిక సహకారం అందజేస్తున్నారు. ఆ పద్ధతిలోనే శుకబ్రహ్మాశ్రమంలో గీతాపాఠశాలకు కూడా హిందూధర్మరక్షణసంస్థ (ఇప్పటి ధర్మప్రచార పరిషత్తు) ద్వారా ఆర్థికంగా సహాయపడాలనే సూచనకు దేవస్థానం మేనేజిమెంటు కమిటీవారు అంగీకరించారు. ఉపాధ్యాయులకు వేతనం, విద్యార్థులకు స్టైపండ్ రూపంలో అయ్యే ఖర్చును హిందూధర్మరక్షణసంస్థ భరించాలి అనే నిర్ణయం జరిగింది.

1985 అక్టోబర్ 23వ తేదీ విజయదశమినాడు పదహారుమంది విద్యార్థులతోనూ, ముగ్గురు ఉపాధ్యాయులతోనూ గీతాపాఠశాల ప్రారంభమయింది. అందులో విద్యార్థులు మూడు సంవత్సరాలు క్రమంగా అభ్యసింప దగిన పాఠ్యప్రణాళిక ప్రవేశపెట్టబడింది.

పాఠశాలా ప్రారంభోత్సవ సమావేశానికి శ్రీ స్వాములవారు అధ్యక్షత వహించారు. తిరుమల తిరుపతి దేవస్థానం సంయుక్తకార్య నిర్వహణాధికారి శ్రీ డి. సుబ్బరాయులుగారు ప్రారంభోపన్యాసం చేస్తూ నానాటికీ దిగజారిపోతున్న నైతికవిలువలను పునరుద్ధరించే వ్యక్తులుగా గీతాపాఠశాలలోని విద్యార్థులు తయారుకాగలరన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. దేవస్థానం పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ డా||

రావుల సూర్యనారాయణమూర్తిగారు ప్రసంగిస్తూ ధర్మప్రచారానికై దేవస్థానం చేస్తున్న కృషిని వివరించారు.

శ్రీ స్వాములవారు గీతాప్రాశస్త్యాన్ని వివరించి తమ చిరకాల సంకల్పం దేవస్థానం వారి సహకారంతో నెరవేరినందుకు సంతోషం వ్యక్తం చేశారు.

హిందూధర్మరక్షణ సంస్థ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య మాట్లాడుతూ "జాతిమత లింగాదిభేదాలు పాటించకుండా బ్రహ్మవిద్యను జిజ్ఞాసకలవారి కందరికీ శ్రీ సద్గురు మలయాళస్వాములవారు అందుబాటులోకి తెచ్చారు. శ్రీవారి ప్రియ శిష్యులైన పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారు గీతాప్రచారం ద్వారా గురుదేవుల మహోద్యమాన్ని విజయవంతం చేశారు. ఆ ప్రచారోద్యమం ఇంకా ముందుకు సాగడానికి ఈ గీతాపాఠశాల ఉపకరించగలదు" అని చెప్పారు.

ఈ పాఠశాల కొంతమంది చక్కని ప్రబోధకులను తయారుచేసి వారిని 'గీతాప్రచారక' బిరుదాంకితులను చేసింది.

## మాతృదేవి బ్రహ్మైక్యం

పసితనంలోనే కన్న కుమారుని గురుదేవులకు సమర్పించిన త్యాగశీల, అతడు ముప్పైమూడవ యేటనే సర్వసంగ పరిత్యాగం చేసి సన్న్యసించడానికి సమ్మతించిన మహాసాధ్వీమణి, పుణ్యచరిత్ర మాతృశ్రీ సుశీలాదేవి గారు 1-6-1987వ తేదీన భౌతికకాయం పరిత్యజించి బ్రహ్మైక్యం పొందారు. ఆనాటి కామె వయస్సు 90 సంవత్సరాలు. దాదాపు ముప్పైసంవత్సరాలు శుకబ్రహ్మాశ్రమంలో ఏకాంతంగా ఆధ్యాత్మికమైన జీవితం కొనసాగించిన ధన్యాత్మురా లామె. ఆమె భౌతికకాయాన్ని శ్రీవారి పితృదేవుల సమాధి చెంతనే సమాధి చేశారు.

1936లో ఆనందమోహనుని శ్రీ గురుదేవుల చెంతకు పంపుతూ "నాయనా! గురుసాన్నిధ్యంలో చక్కని సాధనలు చేసి గురుదైవములందు పరిపూర్ణశ్రద్ధాభక్తులు కల్గి వివేకానందుని వలె లోకాద్ధారము గావింపుము" అని ఆశీర్వదించిన ఆ మాతృదేవి తన జీవితకాలంలోనే తాను కావించిన ఆశీర్వాదం ఫలించడం చూచి సంతోషంతో పులకించిపోయింది.

11-7-1987వ తేదీన గురుపూర్ణిమనాడు మాతాజీ మండలారాధన జరిగింది. ఆసందర్భంలో రాజమండ్రి సాధుస్త్రీల మఠానికి చెందిన శ్రీశాంతిబాయిగారికీ, శ్రీదయాబాయిగారికీ, వ్యాసాశ్రమంలో బ్రహ్మవిద్య నభ్యసించే ఐదుగురు సాధుమాతలకూ సప్తయోగినీ పూజాసత్కారం జరుపబడింది.



తొంబదేండ్ల మాతృదేవి నిండుజీవితాన్ని పురస్కరించుకొని 90మంది పేదస్త్రీలకు ఆదినం వస్త్రదానం చేశారు. నాటి సాయంకాలం ఏర్పాటైన సమావేశములో శ్రీ స్వాములవారు మాతృదేవి పవిత్రజీవితాన్ని సంస్మరిస్తూ ఆధ్యాత్మికసందేశంతో భక్తుల ననుగ్రహించారు.



# అష్టాదశ ప్రకరణం

## గీతామహోత్సవాలు

శ్రీ సద్గురు మలయాళస్వాములవారి శిష్యులు శ్రీనిర్విశేషశివానంద స్వాములవారు సనాతన బ్రహ్మజ్ఞాన మహాసభలను స్థాపించారు. ఈ సభల ప్రథమ సమావేశం శ్రీమాణయ్యగారు మొదలైన భక్తుల సహకారంతో సికింద్రాబాదులో జరిగింది. ఈ సభలకు శ్రీవిద్యాప్రకాశానంద స్వాములవారు అధ్యక్షత వహించారు. ఆ తరువాత జరిగిన బ్రహ్మజ్ఞాన సభల వార్షికోత్సవాలలో కూడా పలుసార్లు శ్రీస్వాములవారు అధ్యక్షులుగా వుండినారు.

అఖిలాంధ్ర సాధుపరిషత్తు సభలు ప్రతిసంవత్సరం జనవరిలో పెద్దయెత్తున జరుగుతుంటాయి. ఇటీవల రామకోటి శివకోటి జపయజ్ఞమహోత్సవాలు మున్నగు కార్యక్రమాలు గూడా తెలంగాణా మొదలైన ప్రాంతాలలో ఎక్కువగా జరుగుతున్నాయి. ఈ పైకార్యక్రమాలలో అనేక పర్యాయాలు శ్రీస్వాములవారు అధ్యక్షపీఠంపై వుండి ఆత్మప్రబోధాలు చేశారు. శ్రీగురుదేవులు స్థాపించిన సనాతన వేదాంత జ్ఞానసభలు శ్రీవారి అధ్యక్షతలోనే నేటికీ జయప్రదంగా నడుస్తున్నాయి.

1982 జూన్‌లో 108వ గీతాజ్ఞానయజ్ఞం పూర్తి అయిన తరువాత భక్తుల ఆహ్వానాల మేరకు ఇలాంటి అనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు.

రాష్ట్రం నలుమూలల నుండీ గీతాయజ్ఞాలు నిర్వహించడానికి శ్రీస్వాములవారికి ఆహ్వానాలు కోకొల్లలుగా వస్తూవుండేవి. ఈ విషయంలో భక్తులనుండి వత్తిడి క్రమంగా ఎక్కువ కాజొచ్చింది. పైగా తిరుమలతిరుపతి దేవస్థానం వారు గీతోపన్యాసాలకు తమ సహకారం పూర్వం మాదిరిగానే కొనసాగించడానికి తమ సంసిద్ధత ప్రకటించారు. ఈ కారణాలవల్ల, తిరిగి గీతోపన్యాసాలు ప్రారంభించడానికి శ్రీస్వాములవారు సమ్మతించారు.

ఈ కార్యక్రమాలకు 'గీతామహోత్సవాలు' అని నామకరణం చేశారు. ఇవి పదునొకండురోజులు, లేదా పదునైదురోజులు, లేదా ఇరువదిరోజులు ఆయా ప్రదేశాలనూ, అనుకూల్యాన్నీ బట్టి సాయంసమయాలలో మాత్రమే జరపాలనే



నిర్ణయం జరిగింది. గీతలోని అంశాలను సమయానుకూలంగా కుదించుకొని, లేదా విస్తరించుకొని శ్రీవారు ప్రవచనాలు చేయడానికి ఉద్యుక్తు లయ్యారు.

మొదటి గీతామహోత్సవం 8-3-83 నుండి 12 రోజులు ఆదిలాబాద్ లోనూ, రెండవ గీతామహోత్సవం 31-3-84 నుండి 20 రోజులు హైదరాబాదు లోనూ జరిగాయి. మూడవ గీతామహోత్సవం 15-4-1985 నుండి 25-4-1985 వరకూ 11 రోజులు తిరుమలతిరుపతి దేవస్థానం వారి హిందూధర్మరక్షణ సంస్థ ఆధ్వర్యంలో తిరుపతిలో జరిగింది. తరువాత గద్వాల, మహబూబ్ నగర్ మున్నగు వివిధప్రాంతాలలో జరిగిన గీతామహోత్సవాలకు హిందూధర్మరక్షణ సంస్థ స్థానికాహ్వాన సంఘాలవారికి ఆర్థికసహాయం అందజేస్తూ వచ్చింది. గీతాయజ్ఞాలకు వచ్చినట్లే, గీతోత్సవాలకు గూడా ప్రజానీకం తండోపతండాలుగా హాజరయ్యారు. సంవత్సరానికి సరాసరి 10 గీతామహోత్సవాలు జరుగుతూ వచ్చాయి.

## వీడియో కేసెట్లు

శ్రీ స్వాములవారి గీతోపన్యాసాల ఆడియో క్యాసెట్లు ఎక్కువ వ్యాప్తి పొందాయి. ఈ ప్రసంగాలను వీడియోకేసెట్లలో నిబద్ధం చేసి భక్తుల కందజేయడం మంచిదనీ, రాబోయే తరాలవారికి కూడా అది ఉపయోగపడగల దనీ పెద్దలు కొందరు సంకల్పించారు.

12-4-1987 నుండి 1-5-87 వరకూ సికింద్రాబాద్-మహబూబ్ కాలేజి ఆవరణలో 18వ గీతామహోత్సవం జరిగింది. ఈ ఉత్సవం ఆహ్వానసంఘానికి గౌరవాధ్యక్షులుగా శ్రీ పి. వేంకటేశ్వర్లుగారు, అధ్యక్షులుగా ప్రముఖ వాణిజ్యవేత్త శ్రీ సోమా వేంకటేశ్వరరావుగారూ కార్యరంగంలో నిలబడ్డారు. వీడియోకేసెట్ల కొఱకై జరిగిన వీరి ప్రయత్నం ఫలించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఇరవై దినాలు జరిగిన ఆ గీతోపన్యాసాలను వీడియోటేపులలో రికార్డు చేయించారు. తరువాత అవి 1990 ఏప్రిల్ నెలలో కేసెట్లుగా విడుదలయ్యాయి. ఈ రీతిగా భక్తులకు శ్రీవారి ప్రవచనాలను టెలివిజన్‌లో చూస్తూ శ్రవణం చేసే సదవకాశం కలిగింది.

## 75 వసంతాలు

1989 ఏప్రిల్ 13వ తేదీకి శ్రీ స్వాములవారికి 75 వసంతాలు నిండాయి.

అప్పటికి 36 గీతామహోత్సవాలు పూర్తి అయ్యాయి. ఈ సందర్భంలో శ్రీవారిని 'ఆధ్యాత్మిక విప్లవకర్త'గా వర్ణిస్తూ 'స్వాతి సపరివారపత్రిక' సంపాదకులు శ్రీ వేమూరి బలరామ్‌గారు తమ పత్రికలో ఇలా వ్రాశారు—

"ఆధ్యాత్మికతని జీవితంలో ఒక భాగంగా తీసుకునే వారు ఉండవచ్చుగానీ ఆధ్యాత్మికతనే జీవితంగా మలుచుకున్నవారు అరుదు. అలాంటి అరుదైన మహాపురుషులనే మహర్షులని అంటారు. అటువంటి మహర్షి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు.

మహాత్ములు కారణజన్ములు. ఏదో మహాప్రయోజనాన్ని సాధించి, మానవకోటిని చైతన్యవంతం చేయడమే వారి జన్మ సార్థకత.

సనాతన ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని వాడవాడలా విస్తరింపజేసే మహోద్యమంలో ఎన్నో ఉపన్యాసా లిచ్చి, ఎన్నెన్నో ఉద్గ్రంథాలు రచించి ప్రభావితం చేస్తున్న మహాత్ము లీయన.

. . . . . . . . ఆయన సాధన నంతా ధారపోసి వ్యాఖ్యానించి రచించిన 'గీతామకరందం' ప్రతి యింటి పారాయణ గ్రంథంగా మారింది.

. . . . . . . గీతోపన్యాసాలంటే అందరికీ గుర్తొచ్చేది శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములవారే. గీతలాంటి మహావేదాంత విషయాలను నిత్యజీవిత సంఘటనలకు సమన్వయం చేసి అనుభవానికి అందించి ఆమహాగ్రంథాల సార్వకాలిక, సార్వజనీన విలువల్ని హత్తుకొనేలా ప్రబోధించడం ఆయన ఉపన్యాసాల ప్రత్యేకత.

శ్రీ స్వాములవారి గీతోపన్యాసాలు కేసెట్లుగా విడుదలై ప్రతియింటా ప్రతి ధ్వనిస్తున్నాయి.

సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషల్లో అనర్గళపాండిత్యం వున్న ఈయన శ్రీ మలయాళ స్వాములవారి శిష్యులు. వివేకానందుని వ్యక్తిత్వం, వక్తృత్వం ఈయనపై ప్రభావాన్ని చూపించాయి.

"శ్రీ స్వాములవారు గీతకోసమే అవతరించారా?" అన్నంతగా ఈయన గీతామకరందం, గీతోపన్యాసాలు ప్రసిద్ధి పొందాయి.

. . . . . . 108 గీతాయజ్ఞాలు, అనేక గీతామహోత్సవాలు నిర్వహించి



జీవితాన్ని చరితార్థం చేసుకున్నారు.

. . . . . . . ఏళ్లు గడచి వయస్సు పెరగడంలో ఘనత లేదు. ప్రతిక్షణాన్నీ చరితార్థం చేసుకొని సార్థక జన్ములవడం విశేషం. 75 సంవత్సరాల ఈయన జీవితమంతా సార్థకతని సంతరించుకుంది.

విశ్రాంతి లేకుండా, తలనొప్పనో, జ్వరమనో బాధ లేకుండా పరిపూర్ణారోగ్యంతో పవిత్రసనాతన ధర్మప్రతిష్ఠాపనా దీక్షతో ఎందరి జీవితాలనో పునీతం చేయడం శ్రీ స్వాములవారి 'అసాధారణ జీవిత విధానం.

మానవకోటి సముద్ధరణకై కృషిచేసే మహాత్ముని అవతారపురుషుడు అనవచ్చునంటే శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు ఖచ్చితంగా అవతార పురుషులే.

మానవజాతిని మహోన్నతాదర్శంవైపు నడిపించే ఈ మహాయోగికి సంపూర్ణాయురారోగ్యాలను ప్రసాదించాలని ఆసర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాం".

(స్వాతి వారపత్రిక - 5-5-89)

39వ గీతామహోత్సవం 15-5-89వతేదీన విశాఖపట్నంలోని ఇందిరాప్రియదర్శినీ మునిసిపల్ స్టేడియంలో ప్రారంభమయింది. పోర్టుట్రస్ట్ చేర్మన్ శ్రీపి.వి. ఆర్.కె. ప్రసాద్‌గారి అధ్యక్షతన జరిగిన ఆ ప్రారంభసభలో ఆధ్యాత్మిక తత్త్వ ప్రచారకులు, ఉపన్యాసకేసరి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు ప్రారంభోపన్యాసం చేస్తూ ఇలా అన్నారు—

"రాజకీయ సమావేశాలు జరుగవలసిన స్థలంలో ఆధ్యాత్మిక ప్రచారం జరగడం అదృష్టం. విశాఖపురజనులు భాగ్యశాలురు అన్న విషయ నిరూపణకు ఇంతకన్న వేరే దృష్టాంతం ఏమి కావాలి?

. . . . . ఆధ్యాత్మిక తపన లేకపోతే అశాంతి కలుగుతుంది. ఎవరిని గురించివారు తెలుసుకోకపోవడమే అశాంతికి కారణం. వేదాంతం అందరికోసం పుట్టింది. కాని అది అందరికీ అందక దాగివుంది. దాన్ని అందరికీ అర్థమయ్యేలా చెప్పేవారు తక్కువైపోయారు. గీతాధ్యయనం చేస్తే మనుష్యుడు మనుష్యుడుగా బ్రతకడానికి, తన ప్రవర్తనను తీర్చి దిద్దుకోవడానికి వీలు కలుగుతుంది. మానజీవితమే యజ్ఞం. ప్రవర్తనే ధ్యానం.

శాంతి అంటే ఏమిటో తెలిపేవైద్యులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి

వారు. గీతను ప్రచారం చేయడానికే వారు అవతరించారు. గీతామకరంద గ్రంథం లేని ఇల్లు ఆంధ్రదేశంలో ఉండదంటే అతిశయోక్తి కాదు. గీతవినడం కాదు, త్రాగాలి. చెవులు దోసిళ్లుగా చేసుకొని వాక్కులే అమృతంగా స్వీకరించి మన మందరం తరించనున్నాము' '.

(వేదాంతభేరి - జులై - 1989)

విజయవాడలో 40వ గీతామహోత్సవం 10-6-89 నుండి 29-6-89వ తేదీ వరకూ నిర్వహింపబడింది. ఈ కార్యక్రమానికి ఆపట్టణములోని అనేక సంస్థలు సహకరించాయి. ఈ సందర్భంలో ఒక విశేషసంచికను గూడా ఆహ్వానసంఘం ప్రచురించింది.

సంచికా సంపాదకులు శ్రీదంటు కృష్ణమూర్తిగారు సంపాదకీయంలో ఇలా వ్రాశారు—

". . . . . . . గతకొన్ని దశాబ్దాలనుంచి గీతాప్రచారానికి జీవితాన్ని అంకితం చేసి అహర్నిశలు పాటుపడుతున్న వారిలో అగ్రశ్రేణిలో పేర్కొనవలసిన ప్రముఖులు శ్రీ విద్యాప్రకాశానంద స్వామీజీ. శ్రీ స్వామీజీ తెలుగువారు కావడం మన అదృష్టం.

స్వామీజీ సకలశాస్త్ర పారంగతులు. ఉపనిషత్తుల సారాన్ని సహితం ఆమూలాగ్రం ఆస్వాదించిన మహనీయులు. మకరందాన్ని మించిన మాధుర్యం కల గీతామృతాన్ని ఆపోశనం పట్టిన అపరభగీరథులు. తెలుగులోనూ, సంస్కృతంలోనూ, ఆంగ్లంలోనూ సమానపాండిత్యం గల బహుభాషాకోవిదులు. వీటన్నిటికీ తోడు మహావక్త.

. . . . . . . శ్రీ కాళహస్తిలో శ్రీశుకబ్రహ్మాశ్రమాన్ని స్థాపించి ఎందరో శిష్యులకు శిక్షణనిస్తున్నప్పటికీ తఱచుగా దేశాటనం స్వామీజీకి తప్పనిసరి. నయాగరా జలపాతవేగంతో సాగిపోయేవారి గీతామహోపన్యాసాలు విని తరించాలన్న కోరికతో నిత్యం ఎన్నో ప్రాంతాలనుండి ఎంతో మంది వారిని ఆహ్వానిస్తారు. ఈ వృద్ధాప్యంలో కూడా స్వామీజీ వివిధ ప్రాంతాలకు వెళ్లి ఉపన్యాసా లిస్తూనే వున్నారు".

శ్రీకృష్ణమూర్తి గారన్నట్లు వయస్సు పైబడినా శ్రీవారు తమ ఉపన్యాసకార్యక్రమాలు మానలేదు. గీతామహోత్సవాలు ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఇతర



ప్రాంతాలలో కూడా జరిగాయి. 1990 జనవరిలో 43వ గీతామహోత్సవం బొంబాయిలోనూ, తరువాత 44వ గీతామహోత్సవం షోలాపూర్‌లోనూ నిర్వహింపబడ్డాయి.

స్వామీజీ 77వ జన్మదినోత్సవం 13-4-1990వ తేదీన జరిగింది. సికింద్రాబాద్‌లో జరిగిన 45వ గీతామహోత్సవం ఆనాడే సమాప్తమయింది. తిరుమలతిరుపతి దేవస్థానం వారు తయారుచేసిన వీడియోకేసెట్లను శ్రీ పి.వెంకటేశ్వర్లుగారు, 'స్వాతి' సంపాదకులు శ్రీ వేమూరి బలరామ్‌గారూ అప్పడే ఆవిష్కరించారు.

1991 మే నెలలో హైద్రాబాద్‌లో 50వ గీతామహోత్సవం స్వర్ణోత్సవంగా ఉన్నతస్థాయిలో జరిగింది. ఆపైన నంద్యాల, మార్కాపూర్, తణుకు పట్టణాలలో గీతామహోత్సవాలు నిర్వహింపబడ్డాయి. 54వ గీతామహోత్సవం 18-5-1991 నుండి 3-6-1991 వరకూ హైద్రాబాద్ దిల్‌సుఖ్‌నగర్‌లో నిర్వహింపబడింది. ఈ గ్రంథరచన సమయానికి జరిగిన గీతామహోత్సవాలలో చివరిది ఇదే. ఈ గీతామహోత్సవం ముగింపుసభలో శ్రీవ్యాసాశ్రమవ్యాస పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు కూడా పాల్గొనడం విశేషం.

## ఆధ్యాత్మికజ్ఞానంతో సమస్యల పరిష్కారం

శ్రీ స్వాములవారు గీతోపన్యాసాలకు వెళ్లినప్పుడు పలుచోట్ల పత్రికా విలేకరులు వారిని దర్శించి మతపరంగానే కాక, దేశాన్ని వేధించే అనేక సమస్యల పరిష్కారాన్ని గురించి కూడా ప్రశ్నలు వేసేవారు. 1987 మార్చిలో 17వ గీతా మహోత్సవం జరిగినప్పుడు విజయవాడలో విలేకరుల సమావేశం ఏర్పాటయింది. అప్పుడు వారడిగిన ప్రశ్నలకు శ్రీవా రిలా సమాధానం చెప్పారు—

"తప్పుత్రోవలో పోతున్న యువకులను సక్రమమార్గంలో పెట్టడానికి వారికి భగవంతునిపై విశ్వాసం కలిగించాలి. ప్రస్తుతకాలంలో యువత భోగవిలాసాలపై మనస్సును మళ్లిస్తున్నారు. దీనికి కారణం సరి అయిన ఆధ్యాత్మిక బోధన లేకపోవడమే. . . . . .

భిన్నత్వంలో ఏకత్వం సాధించటానికి కృషి చేయవలసిన బాధ్యత అందరిపైనా ఉన్నది. మితిమీరిపోతున్న హింసను అరికట్టాలి. ఏ ప్రాణిని బాధించినా భగవంతునికి అపకారం చేసినట్లే అవుతుంది.

భగవంతుని దృష్టిలో మానవు లందరూ సమానమే. జాతి మతకులవర్గ భాషా విభేదాలు మనం సృష్టించుకొన్నవే. ప్రజలలో ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రచారం చేయడం ద్వారా శాంతి, సుఖం, ఆనందం ఏర్పడగలవు. ఇందునిమిత్తం గీతాసారాన్ని ప్రజల కందజేయాలి. ఉపనిషత్తుల సారాన్ని భగవద్గీతలో పొందుపరచారు. వాటిని జనబాహుళ్యం లోకి తీసుకువెళ్లి ప్రచారం చేస్తే ప్రజలకు ఆధ్యాత్మిక విజ్ఞానం కలుగుతుంది."

(ఆంధ్రప్రభ - 31-3-1987)

తునిలో 1988 మేనెలలో 29వ గీతామహోత్సవం జరిగినప్పుడు శ్రీ కుండలి మహంతి సన్న్యాసిరావుగారు శ్రీ స్వాములవారితో ఒక ఇష్టాగోష్ఠి నిర్వహించారు. అప్పుడు కొన్ని ప్రశ్నలకు స్వామీజీ ఇచ్చిన సమాధానాలివి—

"ప్ర :- ఆధ్యాత్మిక తత్త్వం అంటే ఏమిటో సమాధానం చెబుతారా?

స్వామి :- పరమాత్మను గూర్చి తెలిపేది ఆధ్యాత్మికతత్త్వం.

ప్ర :- నేడు నవనాగరకత అనే ముసుగులో కొందరు మానవులు అధర్మమార్గాన్ననుసరించి అనేక విషమపరిణామాలకు కారకు లవుతున్నారు. ఇందుకు కారణం విశదీకరిస్తారా?

స్వా :- ప్రాపంచిక విషయాలపై స్వార్థంతో దృష్టిని కేంద్రీకరించడం వలన, బాహ్యసుఖములకు లోబడి వుండుటవలన అధర్మమార్గమున కొందరు మానవులు పయనిస్తున్నారు. ఇట్టి దుఃస్థితికి కారణం వారిలో ఆధ్యాత్మికభావం లేకపోవడమే.

ప్ర :- సమాజంలో ఏనాడో అంతరించిన సతీసహగమనం, బాల్యవివాహాల వంటి మూఢసంప్రదాయాలు తిరిగి మొలకెత్తి చర్చనీయాంశాలుగా మారాయి. దీనిపై మీ అభిప్రాయాలు చెబుతారా?

స్వా :- సతీసహగమనం, బాల్యవివాహాలు సమాజానికి మంచివి కావు.

ప్ర :- నైతిక విలువంటే ఏమిటండీ? సమాజంలో నైతిక సంప్రదాయాలు నెలకొల్పుటకు మీరు ఏమైనా సూచన లిస్తారా?

స్వా :- ప్రతిమానవుడూ నీతికీ, ధర్మానికీ కట్టుబడి సమాజానికీ, సాటి మానవునికీ అపకారం కలగని విధంగా ప్రవర్తించడమే నైతికవిలువ అంటారు. ప్రతి ఒక్కడూ హృదయశుద్ధి కలిగివుండడం, పరోపకారం, సమస్త జీవరాసులపై



దయ కలిగివుండడం, నిస్స్వార్థంగా త్యాగబుద్ధితో బాధితులకు సేవచేయడం వలన సమాజంలో నైతిక సంప్రదాయాలను నెలకొల్పవచ్చు.

ప్ర :- మతాంతరీకరణ జరక్కుండా మీరేమైనా సూచన లిస్తారా?

స్వా :- మనమతం పట్ల సరి అయిన అవగాహన లేకపోవడం వలన మతమార్పిడులు జరుగుతున్నాయి. మన మత ధర్మాలను తెలియజేసి తగిన సదుపాయాలు కలుగజేసినట్లయితే ఒక మతంలోనుంచి మరొక మతంలోనికి మారవలసిన అవసరం వుండదు.

ప్ర :- రాష్ట్రవ్యాప్తంగా మీరు గీతోపన్యాస మహాయజ్ఞం ప్రారంభించుటకు ముఖ్యోద్దేశ్య మేమైనా వుందా?

స్వా :- గీతాబోధను జనసామాన్యానికి అందజేసి భక్తి మార్గాన నడిపించడమే ముఖ్యోద్దేశ్యం".

(తునిసమాచార్ - 1-6-1988)

మానవజీవితంలో పెక్కుచిక్కు సమస్య లెదురవుతూ వుంటాయి. వాటిని మరొకరకంగా తీర్చలేని పరిస్థితులలో ఆధ్యాత్మిక పరిజ్ఞానంతోనే పరిష్కరించుకోవాలని శ్రీస్వాములవారు బోధిస్తూ వుంటారు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమానికి యాత్రికులూ, భక్తులూ, శిష్యులూ, అధికారులూ, మంత్రులూ -- అన్నిరకాలవారు వస్తూ వుంటారు. శ్రీస్వాములవారిని సందర్శించి ఎన్నోరకాల ప్రశ్నలు వేస్తూ వుంటారు. చిరునవ్వుతో అందరినీ పలకరించి శ్రీవారు వారివారికి తగిన రీతిలో ప్రశాంతంగా సమాధానాలు చెప్పి తృప్తిపఱచి పంపుతూ వుంటారు. "చిత్తవృత్తిని పరమాత్మవైపు మళ్లించి నిర్భయులై వుండండి! బ్రహ్మానుభవంతో మానవజన్మను సార్థకం చేసుకోండి!" అన్నది శ్రీవారి సందేశ సారాంశం.

## భక్తకన్నప్ప కంటి ఆస్పత్రి

శ్రీస్వాములవారికి ఆశ్రమంలో ఒక కంటిఆస్పత్రి నెలకొల్పాలనే సంకల్పం కలిగింది. ఆస్పత్రిలో చికిత్స ఉచితంగా ఉండాలనీ, అందువల్ల పేదలు కూడా లాభం పొందగలరనీ శ్రీవారు భావించారు.

శ్రీ కాళహస్తీశ్వరస్వామికి నేత్రం సమర్పించి భక్తాగ్రేసరుడుగా పేరొందిన

కన్నప్ప పేరుతో ఆస్పత్రి ప్రారంభించడానికి నిర్ణయం జరిగింది. శ్రీ స్వాములవారి సంకల్పం కార్యరూపం ధరించడానికి భక్తులు తోడ్పడ్డారు.

5-5-1991వ తేదీ ఉదయం 9గంటలా 48నిముషాలకు 'త్రినేత్రవైద్యాలయం' (భక్తకన్నప్ప నేత్రపరిశోధనా కేంద్రం - ఉచిత కంటిఆస్పత్రి) భవనానికి భూమి పూజ జరిగింది.

జ్ఞానదృష్టిని ప్రసాదించే ఆధ్యాత్మిక కేంద్రంగా ప్రసిద్ధమైన శుకబ్రహ్మాశ్రమం త్వరలో నేత్రదృష్టిని ప్రదానం చేసే నిలయంగా కూడా ప్రశస్తి పొందనున్నది.

శ్రీకాళహస్తిని సద్యోముక్తి క్షేత్రమనీ, దక్షిణకైలాసమనీ, శ్రీ శుకబ్రహ్మతపోవనమనీ, శ్రీజ్ఞానప్రసూనాంబా విహారమనీ పురాణాలు కీర్తిస్తున్నాయి. ఇరవయ్యవ శతాబ్దం మధ్యకాలంలో ఇక్కడ ఆవిర్భవించిన శ్రీ శుకబ్రహ్మాశ్రమం ఈ క్షేత్రపవిత్రతను ద్విగుణీకృతం చేసింది. ఈ ఆశ్రమం శ్రీ వ్యాసాశ్రమానికి అనుబంధంగా కొనసాగాలని ఇటీవలే శ్రీ స్వాములవారు సముచితమైన నిర్ణయం చేశారు.

పూజ్యపాదులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు కారణజన్ములు. వారు బాల్యంలోనే శ్రీ మలయాళ యతీంద్రుల కరుణకు పాత్రులయ్యారు. ద్వాదశవర్ష తపోనిష్ఠతో పవిత్రు లయ్యారు. గీతా ప్రచారమే తమ జీవితపరమావధిగా భావించారు. అశేషజనానీకాన్ని అనర్గళమైన వాగ్ధోరణితో అలరించారు. గీతామకరంద మాధుర్యాన్ని అందరికీ చవి చూపారు. వాడవాడలా వేదాంతభేరి మ్రోగించారు. గీతాజ్ఞానయజ్ఞేశ్వరులై రాణించారు. జాతిమత లింగాదిబేధాలు పాటించకుండా సర్వసమదర్శనులై అందరినీ జ్ఞానగంగలో స్నాన మాడించారు. జ్ఞానరత్నాకరాలను సృష్టించారు. జ్ఞానస్వరూపులై భాసించారు.

శ్రీ స్వాములవారి దివ్యజీవితోద్యానవనంలో డెబ్బై తొమ్మిదవ వసంతం ఉదయించనున్న ఈ శుభసందర్భంలో వారి పాదపద్మాలకు నాసాష్టాంగ ప్రణామాలు సంఘటిస్తూ ఈ రచనను పూజాసుమంగా సమర్పించుకుంటున్నాను.

ఓం లోకా స్సమస్తాస్సుఖినో భవన్తు.

## జయగీతికలు

దైవమతము ప్రతిష్ఠిత మగును గాక!
కరుణామతము వృద్ధి నొందును గాక!



శాంతిమతము స్థాపిత మగును గాక!
సత్యమతము స్థిరప్రతిష్ఠ నొందును గాక!
ధర్మమతము ఉద్ధరింపబడును గాక!
ఋషిమతము వర్ధిల్లును గాక!
స్వాతంత్ర్యమతము జయించును గాక!
జ్ఞానమతము వ్యాపక మగును గాక!



# అనుబంధం - 1

## శ్రీ స్వాములవారి సదుపదేశములు

1. ఉదయమున నాలుగు గంటలకు పడుకనుండి లెమ్ము. అది బ్రహ్మముహూర్తము. భగవద్ధ్యానమునకు మిక్కిలి అనుకూలమైన సమయము.

2. తూర్పుముఖముగా గాని, లేక ఉత్తరముఖముగా గాని పద్మ, లేక సిద్ధ, లేక సుఖాసనమున అర్ధగంటవరకు జపధ్యానములందు కూర్చుండుము. కాలవ్యవధిని క్రమముగ మూడుగంటలకు అధికము చేయుము. బ్రహ్మచర్యమును, ఆరోగ్యమును కాపాడుకొనుటకు శీర్ష- సర్వాంగాసనములను వేయుము. నడచుట మున్నగు తేలికయైన శరీరవ్యాయామమును సక్రమముగ జరుపుము. ఒకింత ప్రాణాయామమును చేయుము.

3. నీ యభిరుచి, లేక యిష్టమున కనుగుణముగ ఓం, ఓం నమోనారాయణాయ, ఓం నమః శివాయ, ఓం నమోభగవతే వాసుదేవాయ, ఓం శరవణభవ, ఓం సీతారాం ఓం శ్రీరామ్, హరిః ఓమ్ అను మంత్రములను గాని లేక గాయత్రీమంత్రమును గాని 108పార్లు గాని అంతకు అధికముగ గాని జపము చేయుము.

4. ధ్యానమునకై ఒక గదిని ప్రత్యేకముగా నీ స్వాధీనమునం దుంచుకొనుము.

5. ప్రతినిత్యము నియమబద్ధముగ గీత, రామాయణము, భారతము, భాగవతము, విష్ణుసహస్రనామము, ఆదిత్యహృదయము, ఉపనిషత్తులు లేక యోగవాసిష్ఠమును అరగంట నుండి ఒక గంటవరకు స్వాధ్యాయముచేసి విచారణ సల్పుము.

6. ప్రార్థనాశ్లోకములను, స్తోత్రములను కొన్నింటిని కంఠస్థమొనర్చి జపధ్యానములకు ముందు ఆసనమున కూర్చుండిన వెంటనే వానిని పునశ్చరణ చేయుము. ఇది మనస్సును త్వరితముగ ఉన్నతపరచును.

7. ఒక జపమాలను నీమెడలో కాని, దిండు క్రిందగాని రాత్రులందుంచుకొనుము.

8. ప్రతిదినము ఒకగంట కాని రెండుగంటలు కాని మౌనవ్రతమును అవలంబింపుము.



9. సత్యమునే పల్కుము. మితముగా మాట్లాడుము. మధురముగ మాట్లాడుము.

10. ఏకాదశినాడు ఉపవాస ముండుము. పాలు లేక పండ్లను మాత్రమే తీసికొనుము.

11. సాత్త్వికాహారమును భుజింపుము. మితాహారము నవలంబింపుము. పొట్టను ఎక్కువగా నింపకుము. ఏ వస్తువులను మనస్సు అధికతమముగా కాంక్షించునో, ఆ వస్తువులను సంవత్సరములో కొంతకాలము తీసికొనకుము. సామాన్యాహారమును భుజించుము. పాలు, పండ్లు ధారణకు దోహదమిచ్చును. జీవనము గడచుటకై ఆహారమును ఔషధము వలె తీసికొనుము. భోగముకొరకు భుజించుట మంచిది కాదు.

12. జీవశక్తియగు వీర్యమును బహు జాగ్రత్తగా కాపాడుకొనుము.

13. నిరంతరము సత్సాంగత్యము కలిగి దుస్సాంగత్యమును విడువుము. పొగ త్రాగుటను, మాంసమును, సారాద్రవ్యములను పూర్తిగా వదలివేయుము. ఏ చెడ్డ యలవాటులను అలవరచుకొనకుము.

14. ప్రతినెల లేక ప్రతినిత్యము నీ ఆదాయము ననుసరించి లేక రూపాయకు 5 పైసల వంతున సక్రమముగ దానము చేయుము.

15. నీ కోరికలను తగ్గించుకొనుము. తృప్తికరమగు ఆనందజీవితమును గడపుము. నిరాడంబరమైన జీవితమును, ఉన్నత భావములను కలిగియుండుము.

16. ఎన్నడును ఎవరిని నొప్పించకుము. కోపమును ప్రేమ క్షమా దయలచే నిగ్రహింపుము.

17. శయనించుటకు ముందు నీవు ఆ దినమున చేసిన తప్పులను గుఱించి యోచింపుము (ఆత్మపరిశీలన గావించుకొనుము). దినచర్య పుస్తకమును ఉంచుకొనుము. గడచిన తప్పులను గూర్చి పశ్చాత్తాపపడుము. క్రొత్తవానిని చేయకుము.

18. ప్రతిదినము మృత్యువు వేచియున్నదని జ్ఞాపకముంచుకొనుము. సత్ప్రవర్తనను కలిగియుండుము.

19. నిదురలేచిన వెంటనే మఱల నిదురించుటకు ముందు భగవంతుని స్మరిం

వుము. నీ సర్వస్వము భగవంతునికి అంకితము చేయుము.

20. అనంతవిశ్వములో ఈ భూగోళము ఒక చిన్న నలుసని భావించి, అహంకారమును దులిపివైచి, నీ సిరిసంపదలను గొప్పగా భావింపక, ఈ విశ్వమున కంతకును ప్రభువైన పరమాత్మయెడల భక్తి ప్రపత్తులు గలిగియుండుము.

21. సాధకుడు ప్రారంభమున చిత్తమును ప్రార్థనా, నామస్మరణాదులచే పరమార్థరంగమున ఒకింతపైకి లేపి, ఆ పిదప తత్త్వవిచారణచే ఊర్ధ్వముగ గొనిపోవును.

22. మనస్సు రాగాది కషాయయుతమై మలినముగా నున్నచో దైవమునందు గాని, దైవవాక్కునందు గాని అభిరుచి కలుగదు. కావున విషయభోగములందు విరక్తి గలిగియుండవలెను.

23. సమస్త భూతకోట్లయందును, సర్వేశ్వరుని అస్తిత్వమును అనుభూత మొనర్చుకొనుచు కరుణ ప్రేమాదులను అభివృద్ధి పరచుకొనుటయే నిజమైన భక్తి యగును.

24. ధర్మాచరణయే మానవుడు కడతేరుటకు ఏకైకమార్గమని యెరుంగవలయును. ధర్మము నుల్లంఘించి ఎవరును దైవమును చేరలేరు.

25. మంచునకు శీతలత్వ మెట్లు స్వభావమో, అగ్నికి ఉష్ణత్వమెట్లు స్వభావమో, అట్లే శరీరమునకున్ను జనన మరణములు స్వభావములై యున్నవి. అందుచే మరణమును గూర్చి యెవరును భయపడ నవసరము లేదు.

26. మనుష్యునకు ఉన్న విలువ మనుష్యుని నీడకు లేదు. బింబమునకు ఉన్న విలువ ప్రతిబింబమునకు లేదు. అట్లే ఆత్మకున్న విలువ దేహమునకు లేదు.

27. సుదర్శనము (అనగా సమ్యక్ దృష్టి లేక సత్యదృష్టి) గల వాడు సుదర్శనధారియే ( అనగా సాక్షాత్ విష్ణువే) అయి చెన్నొందును.

28. దీపపు చిమ్నీని ప్రతిదినము తుడుచుచుండినచో ఎట్లు శుద్ధముగానుండునో, రాగిపాత్రను ప్రతిరోజు తోముచుండినచో ఎట్లు నిర్మలముగా నుండునో, అట్లే ప్రతిదినము ఆత్మపరిశోధన చేసికొనుచుండినచో జీవునియం దిక మాలిన్యము ప్రవేశించుటకు అవకాశముండదు.



29. అంత్యకాలమున జీవుని రక్షించున దేదియో ముందుగనే యోచనచేసి దాని విషయమై తగు జాగ్రత్తలు గైకొనవలెను.

30. లౌకికవిద్యలెన్ని గడించినను చిత్తశుద్ధి లేనిచో ఆత్మతత్త్వము లేశ మైనను అనుభూతము కాదు.

31. తాను ఆత్మ యేకాని దేహము కాదు. తనకు ఏ కాలమందును వినాశము లేదు. నశించునది, వికారము నొందునది, మరణించునది దేహమేకాని దేహియగు తాను కాదు. ఈ ప్రకారముగ తనయొక్క 'సత్' అంశమును మాటిమాటికిని మననము చేయుచుండవలెను.

32. తాను జడమగు మట్టిబొమ్మకాదు. మృణ్మయుడుకాదు. చిన్మయుడు, ప్రజ్ఞానఘనస్వరూపుడు. సుషుప్తియందును మేలుకొనియుండు చిద్రూపాత్మయే తాను. ఈ ప్రకారముగ తనయొక్క "చిత్" అంశమును మఱల మఱల చింతనచేయుచుండవలెను.

33. తాను సంసారదుఃఖములందు పడి క్రుగ్గిపోవు కీటకముకాదు. ఆనందసాగరమున నోలలాడు బ్రహ్మాండాధిపతి. నిప్పును చెదలు అంటజాలనట్లు దుఃఖశోకము లెవ్వియు తన్ను స్పృశింపజాలవు — ఈ ప్రకారముగ తనయొక్క "ఆనంద" అంశమును మాటిమాటికి మననము చేయుచుండవలయును.

34. తాను 'సత్', 'చిత్', 'ఆనంద', రూపుడగు పరబ్రహ్మమే యను పరమ సత్యమును ప్రతిదినము పెక్కుమార్లు జ్ఞాపకము చేసికొనవలయును.

35. ప్రణవమును ఎవరైనా ధ్యానించి తరించవచ్చును. ఇచట జాతి మత కుల లింగ విచక్షణ లేనేలేదు. భక్తి శ్రద్ధలుండిన చాలును.

36. సాధకులు ఆహారవిషయమై కడుజాగ్రత్త వహించవలెను. మధ్యమార్గమును అవలంబించవలెను. అధికముగా తినరాదు. తిండిలేకుండను ఉండరాదు.

37. ఆయాసమును పోగొట్టుకొనుటకే భోజనమేర్పడినది కాని మితిమీరి తినినచో భుక్తాయాసము కలుగును. ఇది జనులు కోరితెచ్చుకొను జబ్బు.

38. అధికముగా తినినందున కలిగిన భుక్తాయాసమును తీర్చు కొనుటకు క్రింద పడి దొర్లుటలోను, నిద్రించుటలోను ఒకటి రెండుగంటల సమయము

అమూల్యమగు ఈ మానవ జీవితములో ప్రతిదినము వ్యర్థమగుచున్నది.

39. తాను అధికముగా తినుటవలన ఇతర ప్రాణులయొక్క ఆహారములో కొంత భాగము తస్కరించినట్లే యగుచున్నది.

40. అధికాహారమువలన ఆరోగ్యముకూడ భంగ మగుచున్నది.

41. ఆహారము తగినంత లేనిచో శరీరము, మనస్సు రెండును శుష్కించును. అత్తరి చింతనకే అవకాశముండదు.

42. దినమున కనేకసార్లు భుజింపరాదు. రెండు పర్యాయములు లేక సాధ్యమైనచో ఒక పర్యాయము భుజించుట ఆరోగ్యకరము.

43. భోజనమునకు భోజనమునకు మధ్య చిరుతిండి తినరాదు.

44. మితముగా పెట్టించుకొని, పెట్టించుకొనిన పదార్థమును పారవేయక భుజించవలెను. పారవేసినచో బ్రహ్మస్వరూపమగు అన్నమును నిందించినట్లే యగును.

45. భోజనకాలమున ఏమియు మాట్లాడరాదు. దైవభావం కల్గి భుజించవలెను.

46. ఆహారముయొక్క సూక్ష్మాంశముచేతనే మనస్సు ఏర్పడుటవలన పవిత్రాహారమువలననే మనస్సు సాత్త్వికమై యలరగలదు. మరియు మనస్సు సాత్త్వికమైయుండునపుడు మాత్రమే ధ్యానము, దైవచింతన, తత్త్వవిచారణ చక్కగా జరుగగలవు.

47. రుచులు కోరకూడదు. సాత్త్వికాహారమునే సేవింపవలెను. అదియు మితముగా భుజించవలెను. భుజించుటకుముందుగా ఆ పదార్థమును దైవమునకర్పించవలెను. మఱియు సేవింపబడు ఆహారము న్యాయార్జితముగా నుండవలెను.

48. పరుల ఔన్నత్యమునకు కారకులై వారు వృద్ధినొందుటను జూచి పరమానందపడువారు ఉత్తమతరగతి వారు.

49. ఇతరుల అభివృద్ధికి ఏ మాత్రము సహాయము చేయక తమ అభివృద్ధిని మాత్రము చూచుకొనువారు మధ్యమ తరగతివారు.

50. తాము ఉన్నతిని పొందకపోయిననూ ఒకరి ఔన్నత్యమును చూచి ఓర్వలేనివారు అధమతరగతివారు.



51. తమ హృదయమును అతి నిర్మలము గావించుకొని మహా జాగరూకులై కామమునకుగాని, క్రోధమునకుగాని, తదితర వికారములకుగాని ఒకింతైనను అవకాశ మివ్వనివారు ఉత్తమోత్తములు.

52. క్రోధాది వికారములు తనయందు ఉదయించిన వెంటనే జాగ్రతపడి వానిని తరిమివేయువారు ఉత్తములు.

53. కామాది వికారములు జనించి కొంత దుష్పరిణామము కలిగిన వెనుక తెప్పరించుకొని తదుపరి వానిని ప్రయత్నపూర్వకముగా సాగనంపువారు మధ్యములు.

54. కామక్రోధాదు లుత్పన్న మైనపుడు అజాగ్రత వహించి ప్రమత్తులై, ఆ దుష్ట వికారములను పారద్రోలక వానికి ఆశ్రయమొసంగి ఆ దుష్టరాక్షసులను యావజ్జీవము చక్కగా మేపువారు అధములు.

55. శాంతిని సుఖమును కాంక్షించు ప్రతిమానవుడును నిర్మల నైతిక వర్తనము ద్వారా తనయందుగల నిగూఢ ఆధ్యాత్మికశక్తులను బహిర్గత మొనర్చుకొనవలయును.

56. ఎంతటి పాపాత్ముడైనను అనన్యభావముతో సర్వేశ్వరుని చింతించుచో, అతడు క్రమముగ తన దుష్టస్వభావమును కోల్పోయి ధర్మాత్ముడగును.

57. ధనముండుగాక, విద్య యుండుగాక, భవనములుండుగాక, క్షేత్రములుండుగాక. కాని వానితోబాటు కోమల హృదయముకూడ ఉండవలెను. దైవీసంపదకూడా ఉండ వలెను. అంతఃకరణ శుద్ధత్వము కూడ ఉండవలెను. సర్వేశ్వరుని యెడల అచంచలమైన భక్తి, సర్వభూతకోట్ల యెడల దయ - ఇవి ప్రధానముగ ఉండవలెను.

58. దూషణభూషణములకు జంకకుండా చేసికొనుట ఒకగొప్ప సాధన. పారమార్థిక అభ్యున్నతికి అది ఏంతేని అవసరమై యున్నది.

59. సద్గుణములను సాధించి దుర్గుణములను దూరీకరించవలెను. సమత్వమును సాధించి అసమత్వమునకు తిలాంజలి యొసంగవలెను.

60. ఇంద్రియములను వశపరచుకొనినచో అవి మనకు మిత్రులవలె సహకరించును. వానికి దాసుడయినచో శత్రువుల చందమున వర్తించును.

61. మనుజుని విలువ అతని రూప సౌందర్యములందు లేదు. ప్రాపంచిక అధికారములందు లేదు. క్షేత్రవిత్తాదులందు లేదు. విద్యావైదుష్యమందును లేదు. మనుజుని విలువ శీలమందు మాత్రమే కలదు. భక్తియందు మాత్రమే కలదు. పారమార్థిక సుగుణములందు మాత్రమే కలదు.

62. మనస్సు నందలి తమోగుణ రజోగుణములు తొలగనిదే చిత్తమందలి జన్మాంతర వాసనాదోషములు హరించిపోవనిదే, అధిష్ఠానముగా నున్న ఆత్మ చక్కగా ప్రకాశింపదు.

63. దేవుడు నిర్మించిన పుష్పములను దేవునకు సమర్పించుటలో అంత గొప్ప తనము లేదు. తన మనస్సును నిర్మలమొనర్చుకొని అట్టి నిర్మల మనః కుసుమమును సర్వేశ్వరుని పాదపద్మములందు సమర్పించినచో భగవంతు డెంతయో సంతుష్టి నొందును.

64. జనులు ప్రారంభములో విగ్రహాదులను బాహ్యపుష్పములచే పూజించినను క్రమముగా మనోవికాసమును సాధించి సద్గుణములచే, సదాచారములచే ఆత్మదేవుని పూజించవలెను. అదియే పరాపూజ యనబడును.

65. అహంకారము వదలి అభిమానమును పరిత్యజించి, దైవము నెడల, పెద్దల యెడల వినయ విధేయతలు కలిగి, దంభ దర్పాదులకు తిలాంజలి యొసంగి, హృదయము శుద్ధమైనప్పుడు మాత్రమే తాను పరబ్రహ్మమను "సోऽహమ్" భావనకు నిలుకడ ఏర్పడును.

66. సేవాభావము అహంకారమును చంపివేయును. దేహాభిమానమును పారద్రోలును. గర్వమును తెగద్రుంచును. పుణ్యరాశిని పెంపొందించును. పెద్దల అనుగ్రహమును సంపాదించిపెట్టును.

67. ఒకవ్యక్తికి సేవ యొనర్చుట సాక్షాత్ భగవత్సేవ యని తలంచువాడు అధ్యాత్మరంగమున శీఘ్రముగ పురోగతిని బడయగలడు. మానవసేవ మాధవసేవ అయినప్పటికి అంతటితో ఆగక తనసేవాపరిధిని ఇంకను విస్తరింపజేసి సమస్త భూతకోట్ల సేవకూడా మాధవసేవయని భావించి "సర్వభూతహితే రతాః" అనుసూక్తిని అమలుపఱచువాడు ఆదర్శసేవకుడు, వాస్తవదైవభక్తుడు అయియున్నాడు.

68. సేవకు మించిన సద్గుణము లేదు. అది లోకసేవయగుగాక, దైవసేవయగుగాక, గురుసేవ అగుగాక, సంఘసేవ అగుగాక. ఏ సేవ అయినను అహంభావమును తొలగించి చిత్తశుద్ధిని గలుగజేసి, జీవుని దైవమునకు సన్నిహితునిగ జేయగలదు. కాబట్టి జీవితములో అవలంబింపదగిన ప్రముఖ గుణమది.



69. శ్రీకృష్ణుడు లోకమున కొసంగిన సందేశమేమి యని ఎవరైన ప్రశ్నించినచో ఆ మహనీయుని జీవితమే అతని సందేశము అని నిష్కర్షగ చెప్పవచ్చును. లోకాధీశుడైనప్పటికిని బండితోలు పనిని అతడు స్వీకరించెను. ఇక్కార్యమున అతని నిరహంభావము, నిరభిమానము, భక్తసేవాపరాయణత్వము కండ్లకుకట్టినట్లు కనబడుచున్నవి. శ్రీకృష్ణుని జీవితమున అతని నిస్స్వార్థగురుసేవ, ప్రగాఢ పరహితవాంఛ, భక్తజన పరిచర్యాభిలాష, నిష్కామసేవాపరాయణత ఎన్నియో చోట్ల చక్కగా వ్యక్తమగుచున్నవి. కావున శ్రీకృష్ణుడు లోకమున కొనర్చినది ఆదర్శసేవయే యని స్పష్టమగుచున్నది.

70. పనిలో దోషము లేదు. పనిచేయు విధానములో దోషము కలదు. కర్తృత్వబుద్ధియే దోషము. అహంభావమే దోషము. అది లేనప్పుడు కర్మ బంధము కాక మోక్షమునే కలుగజేయును. ఎట్టిపని చేయుచున్నాడు అనుప్రశ్న భగవంతుని యొద్ద ఉదయించదు. ఆ పనిని ఏ ప్రకార మాచరించు చున్నాడను ప్రశ్నమాత్రము ఉదయించును. కావున లౌకికరంగమున గాని, పరమార్థక్షేత్రమునగాని జనులు వారివారి కర్మలను వా రాచరించుకొనుచు అహంభావములేక సంగబుద్ధిని త్యజించి ధర్మనిష్ఠతో, న్యాయబుద్ధితో, భక్తిభావముతో మెలంగినచో అచిరకాలములో భగవత్కృపకు పాత్రులై మోక్షధామమును చేరగలరు.

71. కర్మ చెడ్డదికాదు. వ్యవహారము దూష్యముకాదు. నీ దృష్టిని పవిత్ర మొనర్చుకొనుము. అత్తరి నీవు చేయుకర్మ మహాయజ్ఞమై భాసించును. నీ భావమును శుద్ధపరచుకొనుము. అత్తరి నీవుచేయు వ్యవహారము నిశ్శ్రేయసకరమై చెన్నొందును.

72. భగవంతునికి భగవన్నామమునకు ఏ విధమైన భేదము లేదు. కావున భగవంతునివలె భగవన్నామము సత్య శివసుందరము, ఆనందస్వరూపము. ఆనందస్వరూప భగవన్నామస్మరణమున్న యెడల దుఃఖస్వరూప సంసార దుఃఖమను పెనుభూతము దూరముగా పారిపోవును.

73. భగవన్నామ సంకీర్తనను భక్తిపూర్వకముగ నాచరించువారికి భక్తిపారవశ్యముచే భగవానుని యనుగ్రహము లభించుటయే కాక చిత్తమున్ను దైవాణువులచే పరిశుద్ధమగును. జ్ఞానవిచారణచే మోక్షము లభించును.

74. ఎవని హృదయమున అపవిత్రత, దోషము, దుర్మార్గము ఉండునో అతడు కృతయుగమున నుండువాడైనను కలియుగ మానవుడే యగును. ఎవని మనస్సు నిశ్చలముగ, నిర్మలముగ, భగవద్భక్తి సంయుతముగ నుండునో అతడు కలియుగముననున్న వాడైనను కృతయుగ మానవుడే యగును.

75. భగవంతుని ఆశ్రయించి భగవత్సేవానిరతులై సదా భగవత్స్మరణ యొనర్చుచుండువారు లోకమున యమునిగూర్చి కాని లేక మఱెవరిని గూర్చికాని భీతి నొందవలసిన పని లేదు.

76. ప్రపంచములో అనేక లక్షల జీవరాసు లున్నప్పటికిని మోక్షప్రాప్తికి వలయు సాధనములను చక్కగా ఆచరించుటకు అనువైన జన్మమానవజన్మయే యగును. ఇది సర్వోత్కృష్టమగు జన్మము, మహా దుర్లభమైనది. బహుజన్మార్జిత సుకృతమువలననే ఇది లభించును.

77. మోక్షప్రయత్నమున జీవునకు మహత్తర సహాయ మొనగూర్చువాడు సద్గురువు. కనుకనే ఈతనిని మానవ శరీరమను పడవకు చుక్కాని పట్టుకొనువ్యక్తిగా పోల్చిచెప్పిరి. చుక్కానిని పట్టుకొనువాడు తన నైపుణ్యముచే పడవను జాగ్రత్తగ గమ్యస్థానమును చేర్చును. ప్రతిబంధములను తప్పించి పడవను కాపాడును. అట్లే సద్గురువు అజ్ఞానియగు జీవునకు జ్ఞానమును ప్రసాదించి జీవితపథమందలి ప్రమాదములను గూర్చి హెచ్చరించి వానినుండి తప్పించుకొనుటకు ఉపాయములను సెలవిచ్చి సాధనక్రమమును బోధించి పరమానందదాయకమగు మోక్షమను గమ్యస్థానమునకు చేర్చును.

78. మహాత్ములగు సద్గురువుల సాంగత్యముచేతను, శాస్త్రపరిచయముచేతను, పూర్వకాలపు పాత అలవాట్లన్నింటిని మార్పుచేసికొని నూతన ప్రపంచమున అడుగిడవలెను.

79. సంసార దుఃఖరాహిత్యమును గోరువాడు, భయరాహిత్యమును కాంక్షించువాడు, త్రికరణములతోడి భగవత్సేవచేయవలెను. తాను వినున దంతయు దైవసంబంధమైనదిగా ఉండవలయును. పలుకున దంతయు దైవసంబంధమైన



వాణిగనే ఉండవలయును.

80. సముద్రమెట్లు అనంతముగ చూపట్టునో అట్లే ఈ సంసారమున్ను జననమరణపరంపరలతోడ అంతములేనిదై దుఃఖాకులమై దుస్తరమై చూపట్టుచున్నది. సముద్రమునం దెట్లు మొసళ్లు, తిమింగిలములు తదితరములగు భయంకర జల జంతువులు కాపురముండుచున్నవో, అట్లే ఈ సంసారమందును కామక్రోధాదులు, దంభదర్పాసూయాదులు మొదలగు బాధాకరవృత్తులు తిష్ఠవేసికొనియున్నవి. సముద్రమెట్లు అగాధమైయున్నదో అట్లే ఈ సంసార దుఃఖమున్ను అత్యంతగహనమై వర్తించుచున్నది. అయితే సముద్రమెంత విశాలమైనప్పటికిని ఎంత లోతుగలిగి యున్నప్పటికిని ఒక చిన్ననావచే అది యెట్లు దాటివేయబడగలదో అట్లే భగవద్భక్తి అను తెప్పచే ఈ సంసారరూప మహోదధి యంతయు త్రుటిలో దాటివేయబడగలదు.

81. వస్తువునందలి దోషమును తెలిసికొనినవాడు ఇక ఆవస్తువు కొఱకై ఎన్నడును పరుగిడడు. కావున దృశ్యవస్తువునందు గల "నశ్వరత్వము, క్షణికత్వము" అను దోషములను తెలిసికొని మనుజుడు వానికై ఎగబడక శాశ్వతమైన ఆత్మ కొఱకే అన్వేషించుట శ్రేయస్కరము.

82. ఓ జీవుడా! నీవు ఏడుజేనల మనిషివి కావు. భూనభోంతరాళములు పరివేష్టించిన విశ్వవ్యాపక దీర్ఘదేహుడవు. నీవు ప్రకృతిరథచక్రముల క్రింద నలిగి చచ్చు అల్పకీటకముకాదు. ప్రకృతిని శాసించు పరమాత్మవు. నీవు బద్ధుడవు కావు, ముక్తుడవు. కర్మాధీనుడవు కావు, కర్మాతీతుడవు. మృత్యురూపుడవు కావు, అమరుడవు. భృత్యుడవు కావు, రాజాధిరాజువు. పాదుషాచక్రవర్తివి. వేయేల నీవు జీవుడవు కావు, సాక్షాత్ శివుడవే. ఇదియే ఉపనిషత్తుల యొక్క సందేశము.

83. మోక్షమనగా విడుదల. బంధమునుండి విడుదల. దుఃఖభూయిష్ఠమగు సంసార బంధమునుండి విముక్తినొందుటయే మోక్షము. పుట్టుక చావులనుండి తప్పించుకొనుటయే మోక్షము. అవిచ్ఛిన్న ఆత్మానందానుభూతిని బడయుటయే మోక్షము. స్వస్వరూపమగు దైవమునందు నిలుకడ గలిగియుండుటయే మోక్షము. దేహభారమును మనోభారమును వదలించుకొనుటయే మోక్షము. భారరహితమగు ఆత్మయందు నిలుకడ కలిగియుండుటయే మోక్షము.

84. ఓ జనులారా! మృత్యువు దూరముగా నున్నదని భ్రమించకుడు. అది చేరువలోనే యున్నది. కావున త్వరపడుడు. విజ్ఞానమును సముపార్జించుడు. మఱచిన మీదివ్య స్వరూపమును తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనుడు. మహాత్ముల నాశ్రయింపుడు. సాధనయొనర్చి కడతేరుడు. బంధనము నుండి విడుదల పొందుడు. మీ స్వస్వరూపమగు ఆత్మను బడయుటయే మోక్షమని యెఱుంగుడు.

85. మృత్యువు అన్నిటిని మ్రింగివేయవచ్చును. మానవుడు తన ప్రయత్నముచే మృత్యువునుకూడ మ్రింగివేయ గల్గుచున్నాడు. ఇదియే మానవుని విశిష్టత. అట్టి అలౌకికశక్తిని ఈశ్వరుడు మానవున కొసంగెను. ఆ శక్తిని వికసింపజేసి కొనెనా ధన్యుడు. లేకున్న నిరర్థక జన్ముడే కాగలడు.

86. దైవత్వమును బడయుటయే యథార్థ మానవత్వ చిహ్నమగును. కాబట్టి స్వల్పమగు ఆయుర్దాయమును వ్యర్థవిలాసములందు, తుచ్ఛవిషయభోగములందు తగులబెట్టక మనుజుడు తన జన్మహక్కగు స్వారాజ్య సంపాదనయందు యత్నశీలుడు కావలెను.

87. భగవానుడు కరుణించి మానవదేహమను చక్కని ఉపకరణమును మన కొసంగినపుడు అది శిథిలముకాక పూర్వమే దానివలన ఎంత పారమార్థిక లాభమును పొందగలుగుదుమో అంత పొందియే తీరవలెను. ఇట్టి మహదవకాశములు మరి ఏ యితర లోకమునను, ఏ యితర జన్మయందును గూడ లభింపవు.

88. ముముక్షువులు సర్వేశ్వరునిపై, సద్గురునిపై అచంచల విశ్వాసము, భక్తి గలవారై అమూల్యమగు తమ యీ మానవ జీవితమునందు ఒక్క క్షణమైనను వ్యర్థముచేయక సాధనయందు పురోగమించుచు ఆత్మసాక్షాత్కార మను లక్ష్యమును అచిరకాలమునందే సాధించి తీఱవలెను.

89. పశ్చాత్తాపముకంటె పూర్వతాపము మంచిది.

90. సత్యము, ధర్మము, ఆత్మపారిశుద్ధ్యము అను వాటి ననుష్ఠించుటకును, ఈ మూటిని నిరాటంకముగా ప్రపంచమున నుపదేశించుటకును సన్న్యాసమేర్పడినది.

91. దేవుని భజించి జీవుని బాధించినచో ప్రయోజనము లేదు. నారాయణుని



పూజించి నరుని దూషించినచో లాభము లేదు. విష్ణువును ధ్యానించి ధర్మమును ధిక్కరించినచో ఆ ధ్యానమునకు విలువ లేదు.

92. దైవప్రాప్తికై అఱ్ఱులు చాచువారు తమయందు ఏ కోశముననైన ఒకింత ధర్మమున్నదా యని పరీక్షించుకొనుచుండవలెను.

93. దైవము అను భిన్నము *(fraction)* లో క్రిందిసంఖ్య యగు మాయ అధికమగు మాయ
కొలది పైసంఖ్యయగు దైవత్వము తగ్గుచుండును. అట్లే మాయాగుణములు, ఆశాపిశాచము, కామక్రోధాదులు జీవునియందు ఎంతెంత అధికమగుచుండునో ఆతనియందున్న దైవత్వము, అంతంత సన్నగిల్లిపోవుచుండును. అవి ఎంతెంత తగ్గుచుండునో దైవత్వము అతని యం దంతంత ప్రబలుచుండును. ఏనాడు ఈ మాయాగుణములు సంపూర్ణముగ తొలగిపోవునో, అప్పుడు కైవల్యము మాత్రము శేషించును.

94. బిడ్డ ఊయలయందు పరుండి ఏడ్చినచో తల్లి అన్నిపనులు వదలుకొని అచటికి పరుగెత్తుకొని వచ్చి ఆతని యోగక్షేమములు విచారించునట్లు భక్తుని మొరను భగవంతుడు ఆలకించుచునే యుండును. కావున దృష్టిని ప్రాపంచికసుఖములనుండి మరల్చి దైవమునందు నిలిపి ఆ దైవముకొరకై పరితపించుడు.

95. 'దేవుడున్నాడా? ఉన్నచో మాకు కనుపించుట లేదే?' అని యనకుడు. కనిపించని వస్తువు లేదనుట సిద్ధాంతమైనచో వాయువు కన్నులకు కనిపించునా? ఆకాశము కనిపించునా? తన కన్ను తనకు కనుపించునా? పగలు నక్షత్రములు కనుపించునా? లేదు. అంతమాత్రముచేత అవేవియు లేదనవచ్చునా? కాదు. పాలలోని వెన్న స్థూలనేత్రములకు కానరాదు. కాని వివేకముతో తెలిసికొనవచ్చును. ప్రయత్నముతో ప్రత్యక్షముగా చూడవచ్చును. అట్లే భగవంతుని వివేకనేత్రముతో చూడవచ్చును. సాధన చేసినచో ప్రత్యక్షముగా భగవదనుభూతిని పొందవచ్చును.

96. ఈ ప్రపంచమునగల ప్రతివస్తువున్ను పరిణామ శీలమైనది. ఈనాడు రమణీయముగ నున్న పుష్పమాల రేపటికి వాడి పోవుచున్నది. ఆ మరునాటికి క్రుళ్ళిపోవుచున్నది. నే డెంతయో సుందరముగ నున్న సౌధములు, నగరములు, కొంతకాలమునకు శిథిలములై కేవల స్మృతిమాత్రముతో

శేషించుచున్నవి. ఇప్పు డిచ్చటనున్న అణువు రేపు సూర్యునిలోనికి పోవచ్చును. సూర్యునిలోని అణువు రేపు ఇచ్చటికే రావచ్చును. ప్రతి ఏడు సంవత్సరములకు ఈ శరీరములోని అణువు లన్నియు పోయి క్రొత్త అణువులు చేరునని విజ్ఞానశాస్త్ర సిద్ధాంతము. ఈ ప్రకారముగ దృశ్యమంతయు పరిణామశీలమై యున్నది. కాని యివన్నియు మారుచున్నను నశించుచున్నను ఏ పరిణామము లేనిదై, అవినాశియై వీని కన్నింటికిని ఆధారమైనట్టి వస్తు వొకటి కలదు. అదియే దైవము. అట్టి దైవమును హృదయము నందు దర్శించుడు.

97. మానవజన్మము సార్థకము కావలెననిన ప్రజ్ఞానరూప బ్రహ్మమును అనుభూతము చేసికొనవలెను.

98. సామాన్యమానవుని శక్తులన్నియు నశ్వరములగు ప్రాపంచిక పదార్థములను ధ్యానించుటయందే వ్యర్థములై పోవుచున్నవి. అట్లుచేయక శారీరక, మానసిక శక్తు లన్నిటిని దైవధ్యానమునందే వినియోగింపవలయును. ఏలయనిన, ఈ ప్రపంచమున భగవంతు డొక్కడే సత్యము, స్థిరము. మిగిలిన దంతయు అసత్యము, అస్థిరము.

99. ధ్యానించునప్పుడు ధ్యేయవస్తువు తప్ప అన్యమేదియు చిత్తమున ఉదయించకుండులాగున ప్రయత్నించుడు. ఒకవేళ ఉదయించినను, ఆ యా దృశ్యవస్తువులను, సంకల్పములను బలాత్కారముగా తొలగింపక, ఉపాస్య దైవమునందే దృష్టిని సంలగ్నపరచుడు. అప్పుడు వానియంత టవియే తొలగిపోవును.

100. ఏ ప్రీతితో అభీప్సిత ప్రాపంచిక వస్తువునుగూర్చి చింతన చేయుచున్నారో, అట్టి ప్రీతితో భగవంతుని చింతన చేసిన చాలును. లక్ష్యము కరతలామలకమై పోవును. ఇందులకు దైవమునందు అచంచల విశ్వాసము, భక్తి ఆవశ్యకములై యున్నవి. కావున జనులారా! నియమము లేర్పరచుకొని దినమందు కొంతసేపయినను, దృష్టిని బహిఃప్రపంచమునుండి మరల్చి అంతర్ముఖమొనర్చి, భగవత్తత్త్వమును ధ్యానించెదరుగాక! పాపనాశనమునకు, అలౌకిక దివ్యానుభూతికి ఇదియొకటియే మార్గమని మఱువకుందురుగాక!

101. అమూల్యమగు ఈ జన్మను ఇంద్రియసౌఖ్యముల కొఱకు ధారపోసి తుదకు శోకసంతప్తులగుట విజ్ఞులకు పాడి గాదు. కావున ఓ సాధకుడా! రేపు, మాపు అనక ఇప్పటి నుండియే పరమాత్మచింతన కుపక్రమించి, బ్రహ్మానంద సామ్రాజ్యాభిషిక్తుడవు కమ్ము.



102. అసంతుష్టునికి ఏ కాలమందును శాంతి లభించదు. ఏలయనగా మనస్సు 'ఇది కావలెను, అది కావలెను, ఇది చాలదు, అది చాలదు' అను ఆందోళనతో నిండియుండి మహాచంచలమై యుండును. చంచలమనస్సు కలవానికి శాంతిసుఖములు ఏ నాడును సంప్రాప్తించవు. కావున జీవితములో సర్వేశ్వరు డిచ్చినదానితో సంతుష్టి నొంది వ్యవహరించువాడు ధన్యుడు.

103. రాత్రి పరుండబోవునప్పుడు ఇంటిలో నొక పాము జొరబడిన దనుకొనుడు. పెట్టెల సందులలో దూరి, ఎక్కడను కన్పించలేదనుకొనుడు. అత్తఱి ఆ రాత్రి ఆ యింటి యందున్నవారికి నిద్రపట్టునా? ఎట్లయినను మేల్కొని యిల్లంతయు వెదకి వెదకి దానిని సాగనంపుదురుకదా! అట్లే హృదయములందు అనాదిగ ఆశ్రయము కల్పించుకొని బాధించుచు, దుఃఖసాగరమున బడవైచుచున్న యీ అజ్ఞానముయొక్క అస్తిత్వమును తెలిసికొని వెంటనే మహాత్ములయొక్క సంసర్గముద్వారా దానిని బయటకు గెంటివేయవలెను.

104. ప్రపంచములో రెండువస్తువు లున్నవి. ఒకటి శిరస్సు ***(Head)***, రెండు హృదయము ***(Heart)***. ఇందులో మొదటిదానిని ఆశ్రయించుట అనగా, ప్రపంచములోని సమస్త లౌకికవిద్యలను, వాఙ్మయమును పరిగ్రహించుటయగును. రెండవదానిని ఆశ్రయించుట యనగా దైవగుణములు కలిగి భక్తి జ్ఞానవైరాగ్యములను జేపట్టి పవిత్రమైన శీలమును గలిగియుండుట యగును. ఈ రెండింటిలో మొదటిదానికంటె, రెండవది భగవంతుని దృష్టిలో మిన్న. శిరస్సును వికసింపచేసి, హృదయమును సంకుచిత మొనర్చినచో నేమి ప్రయోజనము? అన్ని విద్యలు నేర్చుకొనినప్పటికిని, ప్రేమ, దయ, పరోపకారము, మున్నగు దైవగుణములు లేనిచో, ఏమి లాభము? కావున ప్రపంచవిద్యలతో పాటు దైవగుణములనుకూడ అలవరచుకొనుడు.

105. జీవునిలో అసత్యమగు అహంకారము తొలగినపుడు సత్యమగు దైవము శేషించును. ఇ క్కార్యమును సాధించుటయే సమస్తమతములయొక్క ఆశయము.

106. ప్రియముగను, మితముగను మాట్లాడవలెను.

107. చేసినతప్పులకై పశ్చాత్తాపపడి ఇకమీదట వానిని చేయరాదు.

108. వారములో ఒక్కరోజుగాని, లేక రోజులో కొన్ని గంటలు గాని మౌనము శీలింపుము.

109. అంగడిలో ఏదైనా వస్తువును కొనదలచినచో ముందుగా దాని మూల్యమును చెల్లించవలెను. లేనిచో ఆ వస్తువు లభింపదు. అట్లే మోక్షసుఖమును అభిలషించువాడు ముందుగా విషయసుఖత్యాగమను మూల్యమును చెల్లింపవలెను. అల్పసుఖమును త్యజించనిచో అధికసుఖము లభించదు.

110. ఒకేకుర్చీలో ఇరువురు కూర్చొనజాలరు. ముందుగా కూర్చొనియున్నవాడు లేచిననే మరొకడు కూర్చొనుటకు అవకాశముండును. అట్లే మనుజుని యంతఃకరణమున బహుజన్మార్జిత కామక్రోధాద్యసురసంపద కాపురము చేయుచున్నది. దానిని ఆ చోటినుండి లేపినగాని దైవసంపద ప్రవేశించుటకు వీలుండదు. కావున ప్రయత్నపూర్వకముగా దానిని వెడలగొట్టవలెను.

111. నీటిని ఎక్కడ వదలినను క్రిందకు పోవును. నీటిది అధోదృష్టి. నిప్పును ఎక్కడ వెలిగించినను పైకి పోవును. నిప్పుది ఊర్ధ్వదృష్టి. అగ్నివలె ఊర్ధ్వదృష్టియే కలిగియుండుము. కాని జలమువలె అధోదృష్టి కలిగియుండకుము.

**112.** చేతిగడియారములో మూడు ముండ్లుండును. మొదటిది సెకండుముల్లు, రెండవది నిమిషముల ముల్లు, మూడవది గంటల ముల్లు. సెకండు ముల్లు అరువదిగళ్లు దాటినచో నిముసముల ముల్లు ఒక్కగడి దాటును. అట్లే నిముసముల ముల్లు అరువదిగళ్లు దాటినచో గంటలముల్లు ఒక్కగడి దాటును. అట్లే స్థూలసూక్ష్మ కారణశరీరములు మూడింటిలో స్థూల శరీరముతో ఎంతయో సాధనచేసినచో సూక్ష్మశరీరములో కొంచెము మార్పు వచ్చును. సూక్ష్మశరీరములో ఎంతయో మార్పువచ్చిననే కారణశరీరములో కొంచెము మార్పువచ్చును. కారణశరీరములో గల అజ్ఞానబీజములు, వాసనా బీజముల నాశనమునకు స్థూలసూక్ష్మ శరీరములతో మనుజుడు ఎంతయో సాధన చేయవలసియుండును.

113. బ్రహ్మజ్ఞానసౌధమునకు వైరాగ్యము పునాదివంటిది. పునాది గట్టిగ లేనిచో ఎంత పెద్దభవన మయినను అచిరకాలములో కూలిపోవును. అట్లే విషయ



భోగములయందు విరక్తి సంపూర్ణముగ లేనిచో తత్త్వజ్ఞానము నిలువదు. కావున సాధకుడు సంపూర్ణవిషయవిరక్తి కలిగియుండవలెను.

114. 'సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' — ఏ దేవునకు నమస్కరించినను అది పరమాత్మకే చెందును అనువాక్యముతో బాటు 'సర్వజీవతిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' - ఏ ప్రాణిని బాధపెట్టినను అదియు భగవంతునికే తగులును అనువాక్యమును గూడ ఎవరును మరువరాదు.

115. క్షమ అను ఆయుధము ఎవనిచేతులయం దుండునో అట్టివానిని దుర్జనులేమి చేయగలరు? గడ్డిలేనిచోట పడిన నిప్పు తనంతట తానే చల్లారిపోవునుగదా!

116. యత్నపూర్వకముగ ఈ జీవితమును పవిత్రవంతముగ నొనర్చుకొనవలయును. వార్ధకము రాకపూర్వమే, ఇంద్రియపటుత్వము తగ్గక మునుపే, ఆయుస్సు క్షీణింపకముందే, ఈ శరీరము స్వస్థముగా నున్నప్పుడే మోక్షప్రాప్తికై మహాయత్నమును గావింపవలయును.

117. ఒక్కొక్క భగవన్నామము కోట్లకొలది ధనరాసులకంటెను అధికమగు విలువగలిగియున్నదను విశ్వాసము గలిగియుండవలెను.

118. అనాది మాయాచక్రమున పరిభ్రమించుచు దుఃఖసంతప్తులై యున్న జీవులకు ఆత్మజ్ఞాన మొకటియే తరణోపాయము. కాని బహుజన్మార్జిత పాపపంకము హృదయమున పేరుకొని యుండుటచే అట్టి ఆత్మజ్ఞానము జనులకు కలుగకున్నది. కాబట్టి తత్పాపక్షయమునకై ప్రథమమున ఏదేని యుపాయమన్వేషింపవలెను. భగవన్నామస్మరణ మొకటియే అందులకు సులభమైన యుపాయము.

119. దైవప్రాప్తికి విషయవిరక్తియే ప్రథమసాధనము. భోగభాగ్యములందలి వైరాగ్యభావనయే అద్దానికి మొదటిమెట్టు. కావున దృశ్యవస్తువులయొక్క అశాశ్వతత్వమును చింతనజేయుచు, ప్రబలవైరాగ్యముగలిగి, ఆత్మోన్ముఖులై శాశ్వతబ్రహ్మానందము నొంది జీవితమును ధన్యమొనర్చుకొందురుగాక!

120. జనులు తాము అనాదికాలమున ఏ పరమాత్మనుండి విడివడి ఈ జననమరణప్రవాహమున తగులుకొనియున్నారో, ఆ పరమాత్మను తిరిగి చేరువరకును విశ్రాంతి తీసికొనరాదను పట్టుదల గలిగియుండవలెను. పరమాత్మను చేరినప్పుడే జీవితనాటకము పరిసమాప్తము కాగలదు. మరణముతో జీవితము

ఎన్నిటికిని సమాప్తముకాదు.

121. ఆత్యంతిక దుఃఖవినాశము కొఱకై జీవుడు ఏదియో ఒక కాలమున పరమాత్మతో చేరియే తీరవలెను. అట్లు పరమాత్మతో జీవుని చేర్చునదియే జ్ఞానము. నది తనగమ్యమును చేరువరకు ఎన్ని అడ్డంకులు వచ్చినను ఆగనట్లు సాధకులున్ను తమలక్ష్యమగు దైవమును చేరువరకు మధ్యలో ఎన్ని అవాంతరములు వచ్చినను తమ భగవద్ధ్యాన చింతనాదులను విడువరాదు.

122. దుర్లభమగు మానవజన్మమును బడసియు శాంతిదాయకమగు దైవపథమును విడిచి మనుజుడు విషయోన్ముఖుడై దుఃఖాకులుడై యుండుట కడుంగడు శోచనీయము. అట్టివాని జీవితము ముమ్మాటికి నిరర్థకమే యగును. కావున దైవప్రాప్తికై ధ్యానాదికార్యక్రమమును తప్పక ఏర్పాటు చేసికొనవలయును.

123. దృశ్యమును పూర్ణముగా త్యజింపనంతవరకును ఆత్మ లభింపదు. సమస్తదృశ్యమును త్యజింప శేషించునదే ఆత్మయని చెప్పబడును. కాబట్టి స్వాత్మదర్శనము కొఱకై సమస్త దృశ్యమును మిథ్యాత్వ దృష్టిచే పరిత్యజింపవలెను.

124. శిశువు పుట్టగనే ఏడ్చును. ఏడ్పుతో జీవితము ప్రారంభమైనది. కాని ఆనందముతో అంతము కావలెను. అదియే జీవితలక్ష్యము. అయితే భోగ జనితమగు ఆనందముకాదు మనకు కావలసినది; యోగజనితమగు ఆనందము. భోగానందము అశాశ్వతము, దుఃఖమిశ్రితము; యోగానందము శాశ్వతము, దుఃఖవర్జితము.

125. అధ్యాత్మపథమున పురోగమనము సల్పుసాధకునకు మూడుసుగుణములు అత్యావశ్యకములై యున్నవి. అవియే పవిత్రత, సహనము, పట్టుదల అనునవి. మహత్తర ప్రయత్నముచే ఈ మూడు సుగుణములను మానవుడెట్లయినను సంపాదించవలెను.

126. జీవునియొక్క అజ్ఞానము, సంసారమాలిన్యము బొగ్గుయొక్క నలుపుదనమువలె సహజమైనవికావు. అవి బియ్యము పైని పొట్టువలె, రాగియొక్క చిలుమువలె ఆగంతుకములు. ప్రయత్నముచే అవి తొలగిపోగలవు.

127. విజ్ఞుడగువాడు భుజించుచున్నను, కూర్చొనుచున్నను, నడచుచున్నను, మేలు



కొనుచున్నను తన ప్రజ్ఞచే ఆత్మనుగూర్చి లెస్సగ విచారణ సలుపవలెను. మరియు ఈ దృశ్యప్రపంచము క్షణికమని మనస్సునందు నిశ్చయించి విషయభోగముల యెడల ఆసక్తిని వదలవలయును.

128. ఒకింత అజాగ్రతగ నున్నచో మాయ సంసారసంకటమున జీవుని పడద్రోయగలదు. కావున అనుక్షణము అత్యంతజాగరూకులై వ్యవహరింపవలయును. వ్రణమందు పురుగులవలె అల్పానందమును కాంక్షించుచు జీవితములను ధారబోయరాదు. నిరర్థకములగు వ్యవహారములందు ఆయుస్సును గడపివేయరాదు. మహాధైర్యమవలంబించి ఆత్మజ్ఞానమను యుక్తిచే చిత్తమను గొలుసును ఛేదించివైచి మాయయను బోనునుండి ఆత్మయను సింహమును విడిపింపజేయవలెను.

129. రోగము వచ్చిన పిదప దానికి ప్రతిక్రియ చేయుట మంచిదే. కాని అసలు రోగము రాకుండ చేసికొనుటయే ఉత్తమము. కాబట్టి ఈ భవరోగమునకు, ఈ సమస్త దుఃఖజాలమునకు మూలకారణమేదియో విచారించవలసియున్నది.

130. దేహమను ఉపాధిని ధరించుటవలన జీవుడు దుఃఖముల పాలుపడుచున్నాడు. దేహమో కర్మము వలన ఏర్పడినది. కర్మము రాగద్వేషాదులవలన కలిగినది. రాగాదులు అజ్ఞానమువలన జనించినవి. కాబట్టే అన్ని ఆపదలకును మూలము అజ్ఞానము. ఈ అజ్ఞానమును జ్ఞానముచే తొలగించివైచినచో సమస్తదుఃఖములును త్రుటిలో అంతమై పోగలవు. పరిపూర్ణ దుఃఖరాహిత్యమునకు ఇది యొకటియే మార్గము.

131. తనది కాని వస్తువును తనదని భ్రమించి దానిపై వ్యామోహమును కలిగియుండుటయే అజ్ఞానము. ఆవస్తువుపై మమత్వమును వృద్ధినొందించుకొనుటయే అవిద్య. ఈ దేహము, ఇంద్రియములు తనవికావు. మనస్సుగాని, బుద్ధిగాని తనవికావు. వీని యన్నింటికిని సాక్షియై వెలుగు ఆత్మయే తాను. తాను దృక్స్వరూపుడు, కూటస్థ - అచల - నిర్వికారక్షేత్రజ్ఞుడు. కాబట్టి విచారణచే ఆత్మస్వరూపము నెఱింగి దానియందే నిలుకడ కలవాడై దేహేంద్రియాదులయందు సక్తుడు కాక అసంగముగ వ్యవహరించుచు పరమానందమును జీవుడు పడయవలెను.

132. క్షణికమై, నాశవంతమై, జడమైనట్టి దేహోపాధి తానుకాదనియు, అద్దానికి

సాక్షియై, సచ్చిదానందరూపమై విలసిల్లు ఆత్మయే తన యథార్థస్వరూపమనియు సద్గురూపదేశము చేతను, సచ్ఛాస్త్రపరిచయముచేతను గుర్తెరిగి దానియందెపుడు నిలుకడ కలిగియుండునో అపుడు ఉపాధికి చెందిన దుఃఖము లవలేశమైనను జీవుని బాధింపకుండును.

133. ఈ శరీరము ఆత్మదేవునకు మందిరము. భగవంతుడు ఊరేగు దివ్యరథము. మట్టితో చేయబడిన ఈ శరీరములో ఆత్మయను మాణిక్యము మెఱయుచున్నది. పంచకోశములను బాగుగ విభజించి ఆ ఆత్మ దేవుని సాక్షాత్కరించుకొనవలెను. భగవంతుని కొఱకై బయట దూరముగ వెదకుటకంటె అతిసమీపమున గల శరీరమునందే అతనిని బడసి ధన్యత జెందుట శ్రేయస్కరము.

134. జడమైన ఈ శరీరమందు వెదకుచు రాగారాగా ఒక మహాచైతన్యము ప్రత్యక్షము కాగలదు. మృణ్మయమైన ఈ దేహమును గాలించగా చిన్మయమైన ఆత్మయను రత్నము బయటపడగలదు. కావున దేహాదిపంచకోశములు జడములని నిశ్చయించి వాటికంటె విలక్షణమైన సాక్షియగు పరమాత్మను జ్ఞాననేత్రముచే కనుగొనవలెను. అదియే సమ్యక్‌దృష్టి. వివేకముచేతను, విచారణచేతను ఇట్టి జ్ఞానస్థితి ప్రతివానికిని సాధ్యపడగలదు.

135. యుక్తాహారవిహారములచే దేహమును ఆరోగ్యవంతముగను, శక్తిమంతముగను ఉంచుకొని అందుదాగియున్న పరంజ్యోతిని ధ్యానవిచారణాదులద్వారా వీక్షించి జ్ఞాననేత్రముచే సందర్శించి తరించవలెను. జీవిత లక్ష్యమిదియే. దేహమను దేవాలయములో మూలవిరాట్టగు ఆత్మను సందర్శించుటయే జీవితమందలి ప్రధానకార్యమని జ్ఞప్తియందుంచుకొని అట్టి మహోన్నతాశయసిద్ధికొఱకై అనవరతము యత్నమాచరింపవలెను.

136. సామాన్యజనులు దృశ్యపదార్థములకై వాపోవుచుందురు. ఇవి కావలెను, అవి కావలెను, ఇవి పోవుచున్నవి, అవి పోవుచున్నవి అని ఈ ప్రకారముగ ప్రపంచవస్తువులకై పరితపించుచుందురు. అట్టి విషాదము రోగమే యగునుకాని యోగము కానేరదు. అర్జునుని విషాద మట్టిది కాదు. ధర్మము కొఱకై యాతడు పరితపించెను. కనుక అతని విషాదము యోగముగా పరిణమించినది.

137. దీపజ్యోతి వెలుగవలెనన్న ప్రమిద, తైలము, వత్తి అవసరమైనట్లు జ్ఞానజ్యోతి



వెలుగవలెనన్న వైరాగ్యమను ప్రమిద, భక్తి యను తైలము, చిత్తైకాగ్రత అను వత్తి అవసరములై యున్నవి.

138. నిరుత్సాహము, దుర్బలత్వము అంటువ్యాధి వంటివి. ఒకరికి అంటుకొనినచో అందరిని చెడగొట్టును. అట్టివారు ఏ రంగమునకు ఉపయోగించరు. పరమార్థరంగమునకు అసలు ఉపయోగించరు. దుర్బలత్వము కలవాడు, అధైర్యమును వరించువాడు ఆత్మ నెన్నటికిని పొందజాలడని ఉపనిషత్తు ఉద్ఘోషించుచున్నవి.

139. మాయ బలీయ మైనది. అది ఓడిపోయినట్లు నటించి అమాంతముగ నొకసమయమున విరుచుకుపడును. అది నివురుగప్పిన నిప్పువలె నుండును. సాధకులు బహుజాగ్రత్తగ నుండవలెను.

140. ఆనకట్టలో ఒకచిన్న రంధ్రము పడిన చాలును. దానిగుండ నీరు ప్రవహించి అదియే క్రమక్రమముగ పెద్దదై తుదకు కట్టనే భేదించి వేయును. అట్లే మనస్సును నిగ్రహించునప్పుడును అది ఒకింత నియమోల్లంఘనమునకు అనుజ్ఞ నడుగును. అప్పుడు జాగ్రత్తగ నుండవలెను. దానికి ఏ మాత్రము సందు నివ్వరాదు.

141. ఒక మిద్దె కట్టవలెననిన ఇటుక, సున్నము, కొయ్య ఎట్లు అవసరమో అట్లే మోక్షసౌధ నిర్మాణమునకు భక్తిజ్ఞానకర్మలు మూడున్ను అవసరములై యున్నవి. ఈ మూడున్ను ఎవనియందు మేళవించి యుండునో, అట్టి వాడు అద్భుతమగు శక్తిసామర్థ్యములు కలిగియుండును. అతడే పరిపూర్ణమానవుడు, మోక్షాధికారియు.

142. ఒకడు చూచుటకు దేవుడుగ కనిపించును. కాని కర్మయందు దిగినచో రాక్షసుడుగ ప్రవర్తించును. మరొకడు చూచుటకు రాక్షసుడుగ (వికారముగ) కనిపించును. కాని కార్యములందు దివ్యత్వమును వెదజల్లును. కావున మనుజుని పట్టి చూపునది కర్మయే కాని తదితరము కాదని నిశ్చయించుకొని విజ్ఞులు దానియందు క్షుణ్ణముగ పవిత్రతను సంపాదించవలెను.

143. ఈ ప్రపంచమున మనుజుని ఉద్ధరించునది, క్రిందకు పడద్రోయునది కర్మయే. ఎవని కర్మ శుద్ధముగ నుండునో, పుణ్యవంతముగను, పాపరహితముగను ఉండునో అట్టివాడు సద్గతినే పొందును.

144. ఉదయము 8గం.లకు ఎండలో నిలబడినచో నీడ చాలా పొడవుగా కన్పించును. ఆనీడ తగ్గవలెనని కాని, నశించవలెనని కాని అభిలషించినచో అందులకు ఒకే ఒక ఉపాయము కలదు. దానిని కొట్టినను, తిట్టినను, ఛేదించినను ఏమియు ప్రయోజనము లేదు. సూర్యుడు పైకిలేచిన చాలును. అదియే దా...నా శమునకు ఉపాయము. ఎంతెంత సూర్యుడు పైకి లేచుచుండునో అంతంత నీడ తగ్గుచుండును. సూర్యుడు నడినెత్తి పైకి వచ్చినపుడు అసలు నీడయే ఉండదు. అట్లే కామమను నీడను నశింపజేయుటకై జ్ఞానసూర్యుని పైకి లేపవలయును.

145. కామసంకల్ప ముదయించగనే ఆ సంకల్పమునకు సాక్షిగా నున్న ఆత్మస్థాన మునుండి దానిని వీక్షించినచో వెంటనే అది విలుప్తమై పోవును. దొంగను కనిపెట్టినచో ఇక నాతడు దొంగతనము చేయుటకు సాహసింపడుగదా!

146. అస్త్రశస్త్రములు కలిగియున్నవాడు శూరుడు కాడు. లోకమంతయు దిగ్విజ యమొనర్చువాడు శూరుడు కాడు. ఇంద్రియమనంబులను జయించి కామా దులపై విజ...యము సంపాదింపగలిగినవాడే శూరుడు.

147. ఒకగుహలో చీకటి యున్నదనుకొనుడు. ఆ చీకటి ఎప్పుడు వచ్చినది? అనుప్రశ్న నిరర్థకము. ఒక చిన్న దీపము వెలిగించిన చాలును. అనాదికా లమునుండి యున్న ఆ చీకటి పటాపంచలై పోవును. అట్లే అజ్ఞానము, ఈ జననమరణ పరంపర ఎప్పుడు మొదలుపెట్టినది చెప్పలేకపోయినప్పటికి దానిని పోగొట్టు ఉపాయమును మాత్రము చేయగలరు (జ్ఞానసంపాదనము ద్వారా).

148. ఎవరితల పెద్దల యొద్ద, భగవంతుని యొద్ద వంగునో, వారి యొద్ద ప్రపంచమంతయు తన తలవంచును.

149. ఒక మంగలికత్తియొక్క పదనైన అంచుపై ఒకింతతేనె పూయబడియున్న దనుకొనుడు. దానిని పసిపిల్లవాడు నాకినచో క్షణకాలము మాధుర్యసు ఖము కలిగినను, నాలుక తెగుటచే దీర్ఘకాలము పరితాప మనుభవించును. అట్లే దృశ్యసౌఖ్యములు జనులకు పరిమితానందము, అపరిమితక్లేశము కలుగజేయుచుండును.

150. గంగలో ఎవరైనను జారిపడినచో క్రిందకు పోవుదురుగదా! కాని గీతాగంగలో



ఎవరైన జారిపడినచో పైకిపోవుదురని భగవానుడు పలికెను. (తేషామహం సముద్ధర్తా).

151. అప్పు తీర్చవలెను. సొంతముగ మరికొంత ధనమును సంపాదించవలెను. ఈ రెండును జరిగినప్పుడే ఋణగ్రస్తునకు పూర్ణశాంతి కలుగగలదు. ఆ ప్రకా రముగనే జీవుడు దృశ్యమను ఋణభారమును ముందు తొలగించవలెను, ఆ పిదప దృక్(ఆత్మ)స్వరూప చింతనమను ఆస్తిని సంపాదించవలెను. మొదటిది వైరాగ్యముచే కలుగును. రెండవది ధ్యానముచే సిద్ధించును.

152. చిత్తము ఒక అద్దము వంటిది. అద్దము తన పురోభాగమున నేదియుండునో దానిని తనయందు ప్రతిబింబింప జేసికొని తద్రూపమును బొందుచుండును. అట్లే చిత్తమున్ను అసురసంపత్తిని, దయ్యపుస్వభావమును దాని ముందుం చిన అసురరూపమునే పొందును. దైవసంపత్తిని, సత్త్వగుణస్వభావమును దాని ముందుంచిన చిత్త మా సత్త్వగుణరూపమునే పొందును.

153. బంగారులేడిని చూచి సీత మోసపోయినది. అది సత్యమని భ్రమించి దానిని కాంక్షించినది. ఫలితమేమైనదో మీకు తెలియును గదా! శ్రీరామచంద్రుని పోగొట్టుకొనినది. ఆత్మారామునకు దూరమైనది. కావున మీరున్ను ప్రపంచము యొక్క తళుకుబెళుకులను జూచి మురిసిపోయి వానివెంట పరుగెత్తితిరా, మోకాటి దెబ్బలు తప్ప మరేమియు మీకు మిగులవు.

154. మెల్లమెల్లగ మనస్సును స్వాధీనపరచుకొనవలెను. గడబిడ పడగూడదు. కంగారుపడువాడు తన కర్తవ్యమునుగూడ మరచి పోగలడు. ఉరిత్రాటిని నెమ్మదిగా ఊడదీసికొనవలెను. తొందరపడినచో ఉచ్చు ఇంకను బిగిసి ప్రాణాంతకమగును.

155. ఎవరికైనను కోపము వచ్చినది యనుకొనుడు. 'ఇదిగో కోపము వచ్చుచు న్నది'గదా అని ఆ కోపరూప మానసిక తరంగము నాతడు చూడగల్గుచో, లేక తెలిసికొన గల్గుచో - ఆ కోపము వెంటనే చల్లబడిపోవును. మహాత్ములు అట్లుచూడగలరు.

156. నీటిలో కొద్దిగ ఉప్పుపడి నీరు ఉప్పగా నున్నచో - ఆ ఉప్పదనమును పోగొ ట్టవలెననిన ఎక్కువ చక్కెరకాని, బెల్లముకాని ఆ నీటిలో వైచిన చాలును. ఆ ఉప్పదనము పోయి నీరు తీపిగా మారును. అట్లే ఎవరి హృదయ

మందైన పాపవాసనలు తాండవించుచున్నచో వారు ప్రయత్నపూర్వకముగ పుణ్యకార్యము లాచరించవలెను.

157. పాపమును దాటి, పుణ్యమును జేరి తద్వారా పుణ్యపాపాతీత జ్ఞానస్థితిని (ఆత్మను) పొందవలెను. తమోగుణరజోగుణములను దాటి సత్త్వగుణమును జేరి తద్వారా గుణాతీతస్థితిని జేరవలెను.

158. మాయాంతర్గతమగు సంసారస్థితి యెచట! మాయాతీతమగు పరమాత్మ పదమెచట! ఒకటి దుఃఖాలయము, మరియొకటి సుఖాలయము! ఒకటి అశాశ్వతము, మఱియొకటి శాశ్వతము. రెండిటికిని హస్తిమశకాంతరము కలదు. కాని ఏ పూర్వపాపఫలితమో జనులు దుఃఖభాజనమైన ఆ సంసార స్థితినే కోరుకొనుచు పరమానందనిలయమగు దైవమును ఉపేక్షించుచున్నారు.

159. తుమ్మెద చేవగలిగిన కొయ్యకు గూడ రంధ్రము వేయగలదు. దాని ముక్కు అంతవాడిగా నుండును. ఆ తుమ్మెదయే కమలము నందు ప్రవేశించి మధువు నాస్వాదించు సమయమున సూర్యాస్తమయసమయము అయి కమలము ముడుచుకొనినచో దానియందు చిక్కుకొని, అధైర్యపడి, తన శక్తిపై విశ్వాసము గోల్పోయి కర్తవ్యము మరచి దిగులుతో చనిపోవును. . . . అట్లే మనుజుని యందు అఖండమైన శక్తిసామర్థ్యములు కలవు. అవి నిద్రాణములై యున్నవి. అవి ఉన్నవని మనకు తెలియదు. ఎవరైన చెప్పినను వారివాక్యములందు నమ్మకముండదు. అట్టిచో ఆ శక్తులెట్లు జాగృతములు కాగలవు? అట్లు అవి జాగృతములు కానందువలననే మనుజుడు అధోగతిని జెందుచు మృత్యుసంసారపథమున బడి గిలగిల తన్నుకొనుచున్నాడు. . . . ఈ వైపరీత్యము తొలగిననే తప్ప లోకమున శాంతిసుఖములకు ఆస్కారము లేదు.

160. ఆధారభూతుడగు పరమాత్మలేనిచో ఈ దృశ్యజగత్తు నిర్వీర్యమై, శక్తిరహితమై, క్రియాశూన్యమై యుండును. కరెంటు లేనిచో ఎన్ని బల్బులున్నను ఏమి ప్రయోజనము? అట్లే చైతన్యస్వరూపుడగు పరమాత్మ లేనిచో జగత్తు నిష్ప్రయోజనము.

** 161. మనుజుడు దేవునివైపు ఒక్క అడుగువేసినచో, దేవుడు మనుజునివైపు పది అడుగులు వేసి ముందుకు వచ్చునని శాస్త్రములు వచించుచున్నవి. తన కర్తవ్యమును జీవుడు చేసినచో దేవుడు తన కర్తవ్యమును తాను చేయును.



కొండ దగ్గరకు వెళ్లి కొండపలుకలేదే అని అనవద్దు. నీవు పలికినచో కొండ పలుకును. నీవు ధ్వని చేసినచో కొండ ప్రతిధ్వని చేయును.

162. దేవుడు అందరియందు నున్నాడుకాని అందరు దేవుని యందు లేరు.

163. 'మాకు హక్కులు కావలెను, అధికారము కావలెను, కాని బాధ్యతలు వద్దు' అని యెవరైన అన్నచో అది సంభవమగు విషయముకాదు. అట్లే 'మాకు దేవుడు కావలెను, యోగక్షేమములు కావలెను. కాని భక్తి మాత్రము వద్దు, ధ్యానము మాత్రము వద్దు' అని యెవరైన పలికినచో అది సంభవము కాదు.

164. మేడిపండునందు పురుగులు పుట్టి గిట్టినట్లు ఈ బ్రహ్మాండమున జీవరాసులు అనేకములు పుట్టుచు గిట్టుచు నున్నవి. వారికి పుణ్యములేదు, పురుషార్థము లేదు. ఎంత ఆసక్తితో వారు భౌతిక ప్రపంచమున భౌతికకార్యములందు మెలంగుచుందురో, అంత ఆసక్తితో భగవద్భక్తులు, జ్ఞానులగు మహనీయులు పరమార్థకార్యములందు మెలంగుచుందురు.

165. భక్తి వేఱు, జ్ఞానము వేఱు అని అల్పజ్ఞులు మాత్రము తలంచుదురు. పూవు వేఱు, కాయ వేఱు అని తలంచువారి ప్రజ్ఞ యెటువంటిదో, వీరి ప్రజ్ఞయు అంతమాత్రమే. పూవునుండియే కాయ ఉద్భవించుచున్నది. అట్లే భక్తినుండి జ్ఞానము ఆవిర్భవించుచున్నది.

166. విశ్వమందలి విద్యలన్నిటిని త్రాసుయొక్క ఒక పళ్లెరమున బెట్టి అధ్యాత్మవిద్య ఒక్కదానిని మాత్రము రెండవ పళ్లెరమున బెట్టినచో మొదటి పళ్లెరము పైకిలేచి తన లఘుత్వమును చూపగలదు. దేనిచే జీవునియందలి దైవత్వము వికాసము నొందగలదో దానికే ప్రాధాన్యము కలదు కాని తక్కినవాటికి లేదు.

167. దైవశక్తి ముందు మానవుని శక్తి ఎంత అల్పమైనది? గాలి లేనప్పుడు విసనకర్రలతో విసరుకొందుము. కాని ఎంత అవస్థపడినను ఒకింతమాత్రమే గాలివచ్చును. ఒక్క ఝంఝామారుతము వీచినచో గ్రామగ్రామములు గూడ వ్యాపించునంతటి మహావాయువు ఉద్భూతము కాగలదు. ఇది దైవశక్తి, మొదటిది మనుష్యశక్తి.

168. ఏ ధర్మమైనను అనుష్ఠానమందు దానిని ప్రతిబింబింప జేసికొనిన మాత్రము

ననే సత్ఫలితముల నొసంగగల్గును. దేవుని భజించి జీవులను హింసించినచో భగవంతుడు ప్రీతినొందునా? జీవరాసులన్నియు భగవద్రూపములే. కాబట్టి ఓ సాధకులారా! దేవుని పొందదలంచు మీరు మున్ముందు జీవుని ప్రేమింపుడు.

169. పరమార్థసాధన నిప్పుతోటి చెలగాటము వంటిది. బెబ్బులి తోటి యుద్ధ మువంటిది. ఏ ఒకింత అజాగ్రత్త చూపినను పొంచియున్న మాయ అమాంతముగ మీద పడి జీవుని భవసాగరమున ముంచివేయును.

170. నాగుపాము మహాప్రమాదకరమగు జంతువైనను మంత్రగాని శక్తిచే నిశ్చేష్టి తమై పడియుండును. సింహము మహా హింసకస్వభావము కల్గియున్నను సర్కసులో యజమాని దగ్గర పిల్లివలె అణగిపడియుండును. అట్లే ఈ మనస్సును ముల్లోకములందలి జీవరాసులందరిని గడగడలాడించినప్పటి కిని భక్తియను త్రాటిచే భగవంతుని పాదపద్మములకు కట్టివైచినచో ఇక స్తబ్ధముగా పడియుండును.

171. చెట్టు కొమ్మలు నఱికినను, ఆకులు త్రుంచివేసినను చెట్టు చావదు. తుదకు మొదలు ఛేదించినప్పటికిని చావదు. మూలము పెకలించవలెను. అప్పుడే వృక్షము శాశ్వతముగా నశించిపోగలదు. అట్లే ఈ సంసార మహావృక్షమునకు బీజము,మూలము అజ్ఞానము. దానినట్లే యుంచి పైపై పూతలెన్ని పూసి నను మానవుడు శోభించనేరడు. అది తొలగిననే మానవునకు దివ్యత్వము, పునర్భవరాహిత్యము లభించును.

172. 'శవము, శివము' అనురెండు వస్తువులు ఈ శరీరములో కలవు. అందు శవము నాశ్రయించువాడు, అనగా భోగి ప్రకృతిచే చెంపదెబ్బలు తిని మృత్యురూపమగు సంసారమను మహా అఖాతమున పడిపోవును. 'శివము' నాశ్రయించువాడు అనగా యోగి అమృతరూపమగు పరమాత్మను పొంది నిత్యనిరతిశయానంద మోక్షసామ్రాజ్యము నధిష్ఠించును.

173. భగవానుడు ఒక వ్యక్తిమాత్రమే యను జ్ఞానమును ఎప్పటికైనను దాటవలెను. వ్యష్టి - సమష్టి, -రెండును అతడేయను విశాలభావము హృదయమున అంకురించవలెను. అపుడే జీవుడు ఆధ్యాత్మికలోకమున ఉపరిస్థానము చేరుకొనును.



174. తిరుగలి యొక్క క్రిందిరాయి నిశ్చలముగా నుండును. పైరాయి తిరుగుచుం డును. అట్లున్నందువలననే పిండి విసరుటకు వీలుకలుగుచున్నది. రెండును తిరుగుచున్నను, లేక రెండును నిశ్చలముగ నున్నను పిండి పడదు. అట్లే నిశ్చలుడగు క్షేత్రజ్ఞుడు, చంచలమగు క్షేత్రము- ఈ రెండింటి యొక్క సంయోగమువలననే ఈ స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయు నావిర్భవించినది. క్రియావంతమై యొప్పుచున్నది.

175. ఆధ్యాత్మికరంగములో నేత్రములకంటె శ్రోత్రము ప్రధానమని పెద్దలు చెప్ప చుందురు. ఏలయనగా నేత్రముచే చూడబడునవి (దృశ్యము) ఎప్పటికైనను నశించును. శ్రోత్రముచే వినినది ( గురు వాక్యప్రబోధములు) మాత్రము హృదయమునందు ప్రవేశించి మనన నిదిధ్యాసములకు, ఆత్మానుభూతికి అవకాశమొసంగ గలదు. అందుచే ఒకవేళ ఎవరికైనను చదువురానప్పటి కిని దానివలన చింతలేదు. వారు సద్గురువులయొద్ద, మహాత్ములయొద్ద చక్కగా శ్రవణము చేసి వారుపదేశించిన విధముగా అనుష్ఠించిన చాలును. తరించిపోవుదురు.

176. చందమామ అందరికిని మామయే. అట్లే మోక్షము ప్రతివారియొక్కయు సొత్తు. మునులు నిరంతరము సాధనావశమున దానిని ఏడయగలిగిరి. మననము చేయువాడు ముని యనబడును. ఎవ రెవరు పరమాత్మతత్త్వ మును, ఆధ్యాత్మికముల, ధర్మసూక్ష్మములను నిరంతరము చింతనజేయుచు అభ్యసించుచునుందురో, వారందరున్ను మునులే యగుదురు.

177. జంతువు లన్నియును, మానవులలో అజ్ఞులగు కొందరును నిరంతరము 'ప్రపంచములో దేహముతో కాలక్షేపము చేయుచుందురు. కవులు, పండితులు మున్నగువారు 'మనస్సు' తో కాలక్షేపము చేయుచుందురు. కాని ఈ మూడింటిని దాటి వానికి సాక్షియగు ఆత్మతో కాలక్షేపము చేయువారు చాల అరుదు. అట్టివారే జ్ఞానులు.

178. ఆత్మకు అడ్డుగానున్న మనస్సును తొలగించుటయే అన్ని బోధలయొక్క సారాంశము. అన్ని సాధనలయొక్క పర్యవసానము. అదియే అమనస్కస్థితి. మనస్సు అడ్డు తొలగినచో శేషించునదే ఆత్మ. అట్టి ఆత్మానుభూతియే మోక్షము.

179. జీవితము కామతృప్తి కొరకు కాదు ఏర్పడినది, కామారి తృప్తికొరకు.

భోగ సంపాదనకొరకు కాదు, యోగసంప్రాప్తి కొరకు. పశువికారమునకు లొంగుట కొరకుకాదు, పశుపతి యనుగ్రహమును పొందుటకు కొరకు - అని వివేకవంతులు తెలిసికొనవలెను.

180. సింహము నిద్రపోవునపుడు చిన్న ఎలుకకూడ దానిపైనెక్కి త్రొక్కుచు సవారిచేయుచుండును. కాని అది నిద్రలేచినచో దాని ధాటికి రాజరాజుగూడ గడగడలాడిపోవును. అట్లే జీవుడు అజ్ఞాననిద్రయందున్నప్పుడు కామక్రోధాదిజంతుజాలము పీల్చి పిప్పిచేయును. కాన జనులు మేల్కాంచి తమ జన్మహక్కైన స్వారాజ్యాధిపత్యమును బడయుటకు యత్నింపవలెను.

181. భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద, బ్రహ్మజ్ఞానమే ఐశ్వర్యము. ప్రాపంచిక ధనముతోడి సంబంధము మనుజునకు ఈ శరీరము వరకే. శరీర వియోగముచే ఆ రెండిటికిని ఎడబాటు కలుగును. జ్ఞానసంపద అట్లుకాదు. ఉత్తమ సంస్కారరూపమున అయ్యది, ఆ మోక్షము వానివెంటనే యుండి నీడవలె వెంబడించుచు అభ్యుదయపథమున అతనిని ప్రవేశపెట్టుచు తుట్టతుదకు గమ్యమును చేర్చును. కాబట్టి భౌతిక సిరిసంపదలకంటె ఎన్ని రెట్లో శ్రేష్ఠతరమైనది ఈ ఆధ్యాత్మికసంపద.

182. మోక్షమార్గమున ఇంద్రియములు గొప్ప ప్రతిబంధకములుగా నున్నవి. 'పెన్న దాటితే పెరుమాళ్లసేవ' అనునట్లు ఇంద్రియ సమూహమును నిర్జించి ఆ అడ్డుగోడను దాటినపుడు మాత్రమే జనులకు దైవసాక్షాత్కారము కలుగగలదు.

183. స్వప్నస్థసైన్యము కోట్లసంఖ్యలోనున్నను, మేలుకొనిన ఒక్క మనుజునకు తీసికట్టేయని వివేకవంతులు తెలిసికొనవలెను. భూతాకాశముయొక్క వికారములగు ఆ జగత్పదార్థము లెచట? చిదాకాశస్వరూపమగు పరమాత్మ యెచట? భౌతికశక్తు లెచట? ఆధ్యాత్మికబల మెచట? రెండింటికిని సంబంధమే లేదు. ఒకటి జడమైనది. రెండవది చైతన్యవంతమైనది.

184. నిరతిశయబ్రహ్మానందమునకు దారితీయు దైవసంపదను కాలదన్ని, అనంత యాతనలకు ఆలవాలమౌ అసురసంపద నేల చేపట్టవలెను? ఏ కొంచెము వివేక మున్నను మనుజుడిట్లు ప్రవర్తించునా? సుగంధపూరితమై, దివ్యాలంకారసమన్వితమై, నేత్రోత్సవమైనట్టి నందనవనమును తృణీకరించి కంటకావృతమైన ఘోరారణ్యము నాశ్రయించువాడు మూఢుడుకాక మరి ఎవరు?



185. నీటిలో కుండను పెట్టినచో నీటియందు గుంటగా ఏర్పడును. కాని ఆ కుండను పైకి తీయగానే ఆ గుంట తత్క్షణమే పూడిపోవును. అట్లే ముముక్షువు తన యంతఃకరణమును బాగుగ పరిశీలించి దానియం దేవైన గుంటలు *(loop-holes)* ఉన్నచో, దోషము లున్నచో వెనువెంటనే విచారణముచే వాటిని తొలగించుకొని హృదయమును సమముగా, నిర్మలముగా నొనర్చుకొనవలెను.

186. జీవుడు తన యంతఃకరణమును శుద్ధ మొనర్చుటందే విలంబముగాని మోక్షమును పొందుటయందు గాదు. హృదయనైర్మల్యస్థితి ఏర్పడినప్పుడు మోక్షము త్రుటికాలములో లభించును. ఫోటో తీయు టంత ఆలస్యము కాదు. సెకండులోని నూఱవ భాగమంతకాలము దానికి చాలును. కాని ఆలస్య మంతయు కుర్చీలు సర్దుటలోను, బెంచీలు సరిచేయుటలోను, ముఖవైఖరులను సరిదిద్దుటలోను జరుగుచుండును.

187. 'తేరాహీ తేరా మేరాభీతేరా' - 'నీది నీకే ఉండనీ, దానితో పాటు నాదికూడ నీవే తీసుకో' అని చెప్పువారు సర్వోత్తమ పురుషులు.

'తేరా హీ తేరా, మేరా హీ మేరా' -' నీది నీకుండనీ, నాది నాకుండనీ, నాజోలికి నీవు రావద్దు, నీజోలికి నేనురాను, నీ పొత్తు నాకొద్దు, నాపొత్తు నీకొద్దు - ఈ ధోరణిలో నుండువారు మధ్యరకపు మనుషులు.

'మేరా హీ మేరా, తేరా భీ మేరా' - 'నాది నాకుండనీ, నీది కూడ నాకే రానీ' - అను సిద్ధాంతము ననుసరించువారు కనిష్ఠులు, స్వార్థపరులు, అపరకబంధులు.

188. పెద్ద పెద్ద బ్యాంకులందు రాత్రింబగళ్ళు బంట్రోతులు 'పారా' కాచుచుందురు. ఏలయనగా ఒకింత అజాగ్రతగనున్నచో చోరులు అచటగల ధనరాసులను అపహరించుకొని పోవుదురు. అట్లే జ్ఞానరత్నాపహరణము కొరకు కామక్రోధాది తస్కరులు అహర్నిశము పొంచియున్నారు. వారిని దరికి చేర్చకుండుటకై జీవులు నిరంతరము సావధానచిత్తుడై మెలగవలెను.

189. జాబు వ్రాసినచో తిరుగుజాబు వచ్చును. పిలిచినచో ప్రత్యుత్తరము వచ్చును. అసలు జాబే వ్రాయనిచో అది ఎవరి దోషము? దేవుడు మాత్రము దానికి ప్రత్యుత్తరమెట్లీయగలడు? రైలు ఎక్కినచో గమ్యస్థానమునకు

తీసుకొని పోగలదు. అసలు రైలే ఎక్కనిచో - దానికి ఎవరు ఏమి చేయగలరు? సుఖప్రాప్తికి, నిరతిశయశాంత్యనుభవమునకు, పూర్ణదుఃఖరాహిత్యమునకు భగవానుడు దారి చూపుచుండగా, రెండు చేతులు పైకెత్తి ప్రతిజ్ఞా పూర్వకముగ పలుకుచుండగా, దానిని ఉపేక్షించి నరకద్వారమునే తట్టుచుండినచో ఇక దానికి ఎవరును ఏమియు చేయజాలరు. వారి వారి పతనమునకు వారే బాధ్యులు కాగలరు.

190. తృణముపై మనుజుడు కాలుపెట్టినపుడు అది వంగును. అంతియేగాని ఆ త్రొక్కిన మనుజుని అది బాధింపదు. తృణముయొక్క ఈ అపూర్వ విధేయతను గమనించి బ్రహ్మదేవుడు దానికి పూజలో స్థానము కల్పించి గౌరవించెనట! కనుకనే పూజ చేయునప్పుడు గరికను తెప్పించి వాడు చుందురు.

191. దైవముగాని గురువుగాని, మహాత్ములుగాని తనకు మోక్షము సంపాదించి పెట్టెదరని ఎవరైనను అనుకొనినచో వారు భ్రమయందున్నవారే యగుదురు. మోక్షముగాని, జ్ఞానానుభవముగాని 'పర్మిట్టు' వలె ఒకరిచ్చునది, ఒకరు పుచ్చుకొనునది కాదు. అది పెద్దల సహాయముచే, ఈశ్వరానుగ్రహముచే తన యందుతాను తయారుచేసికొను వస్తువు.

192. ఒక చేపను తీసుకొని వెళ్ళి సింహాసనముపై కూర్చుండబెట్టి, వింజామరలు వీచుచు భక్ష్యభోజ్యము లారగింప జేయుచు దానికి రాజమర్యాదలు చేయుచున్నప్పటికిని ఆ చేపకు వానితో కించిత్తైనను తృప్తి కలుగదు. తన స్వస్థానమైన నీటిలో వదలినప్పుడే అది పరిపూర్ణ సంతృప్తిని పొందగలదు. అట్లే జీవుడు తన నిజస్వరూపమైన పరమాత్మను వదలి ఈ దృశ్యప్రపంచమున బడి నానాయాతనలను పొందుచుండ అట్టివాడు తిరిగి తన స్వస్థానమగు ఆత్మయందు చేరినప్పుడే పూర్ణ సౌఖ్యమును పొందగలడు.

193. జీవు డీలోకమునకు ఏతెంచినది శోకించుటకు కాదని ముమ్మాటికి జ్ఞప్తి యందుంచుకొనవలెను. ఏడ్పును పోగొట్టుకొను ఉపాయమును పెద్దలవలన తెలిసికొని దుఃఖమునకు శాశ్వతముగ తిలాంజలి నొసంగుటకే మానవజన్మ ఏర్పడినదని నిశ్చయించుకొనవలెను. తాను ఏ కాలమందును పరిచ్ఛిన్నుడు కాడనియు, దేహరూపబంధము మధ్యలో వచ్చి మధ్యలో పోవునదనియు, తాను ఉపాధిరహితుడైన సచ్చిదానంద స్వరూపు డనియు పరిపూర్ణముగ



నిశ్చయించుకొనవలెను.

194. నదీప్రవాహమధ్యమున కావలసిన విద్యయేది? ఏ విద్య అత్తఱి జీవున కుపయోగించును? 'ఈత' అను విద్య. ఆ విపత్కర సమయమున తర్కముగాని, జ్యోతిషముగాని, హిస్టరీగాని మరేదిగాని జీవుని రక్షింపజాలదు. మునుగువానికి ఈత విద్య యొక్కటియే శరణ్యము. అట్లే జీవుడు సంసారసాగరమధ్యమున గ్రుంకులిడుచున్నాడు. జననమరణ ప్రవాహమున బడి నానాదుఃఖముల ననుభవించుచున్నాడు. అట్టి వానికి తరణోపాయము బ్రహ్మ విద్యయే. అక్షర పరమాత్మ తత్త్వమే. ఆ విద్య యొక్కటియే జీవుని తరింపజేయగలదు. కనుకనే దానికి 'తారక విద్య' యను పేరు గలిగినది.

195. ఒక సుందరమైన కార్డు ఉన్నదనుకొనుము. దాని చుట్టును అనేకనగిషీలు, కత్తిరింపులు, తళుకుబెళుకులు చేయబడినవని ఊహింపుడు. కాని స్టాంపు అతికించకుండ దానిని పోస్టులో వేసినచో గమ్యస్థానము చేరునా? చేరదు. అతి సామాన్యమైన కార్డు అయినను స్టాంపుబిళ్ళ అతికించినచో ఎన్ని వేల మైళ్ళైనను ప్రయాణము సాగించగలదు. అట్లే ప్రాపంచికములైన చదువు సంధ్యలు లేకపోయినను, పవిత్రత, హృదయనైర్మల్యము, బ్రహ్మానుభూతి కలిగియున్నచో ప్రపంచమున కంతకును అతడు వెలుగును ప్రసాదించగలడు. తాను తరించి ఇతరులను తరింపజేయగలడు. శాంతి సుఖములను ఈ జీవితమునందే అనుభవింపగలడు.

196. భగవత్ప్రోక్తమగు వేదవిద్య నభ్యసించుటకుగాని, లేక భగవంతుని పొందుటకుగాని భగవంతుని బిడ్డలే యగుటవలన సర్వమానవులకు గూడ సమానమైన హక్కుగలదు. కావున జాతి మత కుల విషక్షత లేక సాధనచతుష్టయరూప యోగ్యత గలిగియున్నచో సర్వులును ఈ పరమోన్నతమగు బ్రహ్మవిద్యను బడసి జన్మరాహిత్యమును, నిత్యానందపదవిని అధిష్ఠింపవచ్చును.

197. గూడ్సు పెట్టెలపై, *'Return'* (త్రిప్పి పంపవలెను) అని వ్రాసి దాని ప్రక్కను ఒకతేది వేయుదురు. అనగా ఆ తేది నాటికి ఆ పెట్టె అరిగిపోవునుగాన దానిని గూడ్సు షెడ్డుకు రిపేరుకుగాను త్రిప్పిపంపవలెనని అర్థము. ఆ త్రిప్పిపంపుతేదిని గూడ్సు పెట్టె తయారైన దినమే నిర్ణయించి దానిపై వేయుదురు. అట్లే బ్రహ్మదేవుడు ఈ దేహ పంజరమును సృష్టిచేసి

ప్రపంచమున వదలిన దినమే దాని నొసటపై 'త్రిప్పిపంపవలసిన దినము' గూడ వ్రాసియుండును. అయితే గూడ్సు పెట్టెలపై తేది కనిపించును, జీవుని నొసట కనిపించదు. దానినే బ్రహ్మ వ్రాత, విధి లిఖితము అందురు. కనిపించనంత మాత్రమున అది లేకపోలేదు. మహనీయులందరున్ను తమ జీవిత కాలములోనే ఈ మహాప్రయాణమును గూర్చి యోచించుదురు. వార్ధకమురాక పూర్వమే దానిని గూర్చి చింతించి తన్నివారణకు తగిన మందు కనిపెట్టుదురు.

198. మట్టిలో వెదకుచుండినచో మాణిక్యము ఏ అదృష్టవంతునకో లభించవచ్చు. ఏ దురదృష్టవంతునకో లభించకపోవచ్చును. కాని శరీరములో వెదకు చుండినచో, బుద్ధి గుహలో గాలించుచుండినచో ఆత్మయను మాణిక్యము దొరకక పోవుట అనుట ఉండదు. ప్రతివానికి అది లభించును.

199. నీటిలో అనేక కృము లుండును. అవి సామాన్య నేత్రమునకు కనుపించవు. భూతద్దములో చూచినచో చక్కగా కనిపించును. అట్లే భగవంతుడు అతి సమీపమున హృదయగుహలో కాపుర మున్నప్పటికిని జ్ఞాననేత్రముతో చూచి నపుడు మాత్రమే గోచరించగలడు. ధ్యాన నేత్రముతో అవలోకించినపుడు మాత్రమే ప్రత్యక్షము కాగలడు.

200. శరీరమును ఎవరును ఉపేక్షించరాదు. శరీరస్థమగు ఆత్మను పొందుటకు శరీరమే శరణ్యము. నంది చెవులగుండా ఈశ్వరుని సందర్శించునట్లు క్షేత్ర ముగుండా క్షేత్రజ్ఞుని వీక్షించ వలసియుండును. శరీరమను పడవ ద్వారా సంసార సముద్రమును దాటవలసి యుండును. కాబట్టి అద్దాని స్వాస్థ్య మును బహు జాగ్రత్తగ కాపాడుకొనుచు క్రమముగ మనస్సును లొంగదీసుకొని ఆత్మ సందర్శనమును బడయవలసి యున్నది.

201. బియ్యము, రాళ్ళు కలిసియున్నప్పుడు రాళ్ళను చెరిగివేసి బియ్యమును మాత్రము స్వీకరింతుము. పాలు నీళ్ళు కలసి యున్నప్పుడు హంస ఆ రెండిటిని తన ముక్కుతో వేరుచేసి పాలను స్వీకరించి నీటిని విడిచి వేయును. అట్లే పరమ హంసలను వివేకులు సత్యాసత్యములు, క్షేత్రక్షే త్రజ్ఞులు, దృగ్దృశ్యములు కలసిఉన్న ఈ ప్రపంచమును తత్త్వ విచారణచే చక్కగ వివేచించి, విభజించి దృశ్యముపై ఆసక్తిని వీడి దృగ్రూపముగు పరమాత్మనే స్వీకరించి తదేకపరాయణులై వర్తించుదురు.



202. సామాన్యముగా లోకములో కోతిగాని, కుక్కగాని, పిరికివారలను చూచినచో తరుముకొనును. ధైర్యముగ నిలబడినవారిని చూచి పారిపోవును. అట్లే జీవుని యందుగల విరుద్ధ శక్తులు *(Negative forces)* దుర్బలులను నానా బాధలు పెట్టును. ధైర్యవంతులకు తలయొగ్గి యుండును.

203. పర్వతారోహకులు శిఖరమును చేరునంతవరకు తమ లక్ష్యము నెరవేరినదని తలంపరు. సంగ్రామమున పాల్గొను సైనికులు శత్రువు జయింపబడనంతవ రకు తమ ధ్యేయము సఫలమైనదని భావింపరు. అట్లే అధ్యాత్మ మార్గమున నున్నత శీలుడగు సాధకుడు బహుజన్మలనుండియు వేధించుచున్న మాయను, అజ్ఞానమును, ప్రతీపశక్తులను పూర్తిగ తుడిచిపెట్టనంతవరకు తన కర్తవ్యము పరిసమాప్తమైనదని తలంపరాదు.

204. పరుగిడు పందెములో ఏ కొద్దిమందో పాల్గొందురు, పాల్గొనిన కొద్దిమందిలో మధ్యలోనే కొందరు నిలిచిపోవుదురు. చివరివరకు పోరాడి పందెము గెలు చుకొనువారు ఏ ఒక రిద్దరో ఉందురు. వారే ధీమంతులు. విజయలక్ష్మిని వరించువారు వారే. అట్లే అధ్యాత్మక్షేత్రమునను అకుంఠితమగు దీక్ష, అప్రతిహతమగు అధ్యవసాయము, తీవ్రమగు పట్టుదల, ఆత్మవిశ్వాసము కలవారు మాత్రమే మాయతో చివరివరకు పోరాడి విజయశ్రీని చేపట్టు దురు. అనేకులు మోక్ష ప్రాప్తికై యత్నము చేయుచుండినను, కడవరకు పోరాటము సాగించుచు నిలచిన ఏ ఒకానొక ధీరుడో విజయవంతుడు కాగలుగుచున్నాడు.

205. అనేక జలబిందువులు మేళవించి మేఘముగా ఏర్పడినవి. ఆ బిందువులు లేనిచో మేఘమునకు నామరూపములే ఉండవు. పెక్కు కట్టెలను ఒకచో చేర్చి మండించినచో గొప్ప అగ్ని జ్వాలగా పరిణమించును. ఒక్కొక్క కట్టెను తీసివైచినచో అగ్ని రూపమే మిగులదు. అదే విధముగా జన్మాం తరవాసనలు, అభ్యాసములు, సంకల్పములు చేరి మనస్సునకు రూపము నేర్పరచినవి. కావున అది క్షయించవలెనన్న వాసనలు, సంకల్పములు, క్షయింపవలెను.

206. మానసిక శక్తి ఒక 'టార్చి లైటు' వంటిది. దానిని బాహ్యముగ ప్రస రింప జేసినచో ప్రకృతియందు నిగూఢములై యున్న పెక్కు గొప్ప రహస్యములు బయల్పడగలవు. అట్లే దానిని అంతర్ముఖముగ త్రిప్పినచో,

అనగా ఆత్మ పరిశోధన గావించినచో అమూల్యమైన దైవభండార మంతయు సాక్షాత్కరించును.

207. ఎందరో ముముక్షువులు పరమార్థరంగమున ఒకింత అభివృద్ధిని బడసియు, ప్రాపంచిక జనుల సహవాసముచే విషయగర్తమున కూలిపోయిన ఉదంతములు కలవు. 'పరమపద సోపానపటమున' ఎన్నియో నిచ్చెనలు ఎక్కినప్పటికిని ఒక పెద్దపాము నోటిలో పడినచో క్రింది స్థానమునకు వచ్చివేయునుగదా! కనుకనే ముముక్షువులకు సత్సాంగత్యము పరమావశ్యకమని, ముఖ్యావలంబనీయమని శాస్త్రములందు పేర్కొనబడినది.

208. మానవుడు మాధవుడై పరిఢవిల్లుటకు ధర్మ మొకటియే శరణ్యము. ధర్మము జీవుని అతనిలో విలీనమొనర్చి జీవుని, దేవుని ఏకముగా చేసి వైచును. ఇట్టి మహోత్కృష్టమగు ధర్మమును ముముక్షువులు ఏ కాలమందును విడనాడరాదు.



# అనుబంధం - 2

## నీరాజనం *

మలయాళ మహర్షీణాం శిష్యేషు ప్రథమ స్సుధీః|
జయ త్యసౌ మహాన్ విద్యాప్రకాశానందనామకః||

2

మోక్షశ్రీకంఠహారం చాస్తంగతానాత్మభారం
ప్రాప్త శ్రుత్యన్తసారం చాచ్ఛిన్న తత్త్వ ప్రచారమ్|
ధూతా శాపాశబంధం చావిష్కృతాద్వైతగంధం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్||

3

విద్యావల్యా ఉపఘ్నం గీతాప్రబోధే నిమగ్నం
తత్త్వక్షేత్రే చరంతం మోక్షశ్రియై నిష్టపంతమ్|
చింతాకాంతారదావం చాక్షుద్రయోగప్రభావం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్||

4

బ్రహ్మజ్ఞానానురక్తం వేదోక్త ధర్మాభిషిక్తం
ద్వంద్వాతీతం చ పూతం ఖ్యాతం చ సద్ధర్మకార్యైః|
భక్తై ర్భక్త్యానుయాతై ర్దత్తాభి రర్చాభి రిద్ధం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్ ||

---

* పూజ్యశ్రీ విద్యాప్రకాశానందస్వాములవారిని వినుతిస్తూ సంస్కృతాంధ్రాలలో చాలామంది కవులు వందలకొలది పద్యాలు రచించారు. అందులో కొన్నింటిని చరిత్రలో సందర్భానుసారంగా చేర్చడ మయింది. తక్కిన వాటిలో మరి కొన్నింటిని ఇక్కడ ప్రచురిస్తున్నాం- ప్రకాశకులు.

5

యోగాభ్యాసేన శాంతం చాధ్యాత్మవిద్యాతిదాంతం
పుణ్యాకారం నితాంతం షణ్ణా మరీణాం కృతాంతమ్।
పూతై ర్భావై ర్మహాంతం తృష్ణాతమోభానుమంతం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్॥

6

రోచిష్ణుం దివ్యకాన్త్యా చాఢ్యంభవిష్ణుం యశోభిః
భ్రాజిష్ణుం సత్యవాగ్భి స్తర్కైః కువేదాంతి జిష్ణుమ్।
యోగక్షేత్రే చరిష్ణుం వర్ధిష్ణు మాత్మప్రభావైః
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్॥

7

తృష్ణాతృణ్యాం దిధక్షుం బ్రహ్మప్రకారం దిదృక్షుం
మోక్షగ్రావారురుక్షుం తత్త్వాధిరాజ్యం సిసృక్షుమ్।
సంసారాంధుం ముముక్షుం చానందతత్త్వం వివక్షుం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్॥

8

భర్తారం కీర్తిలక్ష్మ్యా శ్చేత్తార మిహోలతాయాః
హర్తారం పాపరాశే ర్వేత్తార మర్వావిధేశ్చ।
కర్తారం సాధుతాయా స్రష్టార మానందనీవ్యాః
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్॥

9

శ్రౌతాన్ధర్మాన్ వదంతం నిర్వాణమార్గం ప్రయాంతం
యోగివ్యూహే భ్రమంతం లోకస్య భద్రం వహంతమ్।
కీర్త్యాతోద్యం నదంతం విశ్వేశ్వరం భావయంతం
వందే విద్యాప్రకాశానందం చిదానందకందమ్॥



10

స్మారం స్మారం వచో యస్య ప్రీతిం యాంతి ముముక్షవః।
తస్మై విద్యాప్రకాశాయ మునీంద్రాయాస్తు మంగళమ్॥

- శ్రీ బండ్ల వేంకటరమణార్యః

11

ద్రాక్షాం గుడం వామధురేక్షుకాండం
కాంతాధరం చాబ్ధిభవాం సుధాం వా।
పృచ్ఛంతు సర్వే కిము వ స్సమం స్యాత్
విద్యాప్రకాశప్రతి వాజుఖస్య॥

12

గీతామృతం కృష్ణముఖారవిందాత్
వినిస్సృతం సర్వమత ప్రమాణమ్।
విద్యాప్రకాశప్రతిబోధ్యమానం
హారే న్మనః కస్య జనస్య నాలమ్॥

13

విద్యాప్రకాశో వదతీహ గీతాం
సభాతలం పుష్పకమేవ నాన్యత్।
అస్మారయ న్మాం మిలితా స్సదస్యాః
చిత్రార్పితారంభ మివేతి సూక్తిమ్॥

14

గీతారసాస్వాద వశీకృతా వా
వక్తు ర్యతే ర్వాగమృతేన మత్తాః।
నిసర్గత స్సత్త్వగుణాధికా వా
ముగ్ధా స్సదస్యాః ప్రతిమా ఇవాసన్॥

15

విద్యా ప్రకాశస్య యతీశ్వరస్య
వ్యాఖ్యానభంగీ ముద మాతనోతి।
అర్థై రుదారై ర్వివిధై ర్విమర్శైః
కథాభి రుక్తార్థ నిదర్శనీభిః॥

- శ్రీ పల్లె శ్రీ పూర్ణప్రజ్ఞాచార్యః

16

నానాఽనూనకథా సుధారసమయీ నానోపమానాద్భుతా
నానా స్వానుభవోక్త సూక్తినిచయా నానార్థభావోజ్జ్వలా।
గీతాశాస్త్ర వచోవిచారపరమా గీతాసుధావర్షిణీ
గీతా చిన్మకరంద సుందరతనుర్గీతాఽయుత శ్రోతృభిః।
సద్య శ్చేతయ తే ప్రబోధపటిమా యేషామశేషాత్మనాం
విద్యానందగిరిప్రకాశవిదుషాం విద్యోతతే భారతీ॥

- శ్రీ మూలుపూరు సుబ్రహ్మణ్య శాస్త్రీ

17

మందస్మితం సహజ శాంతనిజాంతరంగం
భక్తిప్రచారనిపుణం నిజకార్యదక్షమ్।
విద్యాప్రకాశయతినం మతిమద్వరిష్ఠం
కో వా న వేత్తి మనుజః కరుణార్ద్రచిత్తమ్॥

18

శ్రీమాన్ ద్వాదశ వత్సరాన్ గురకులేఽపక్వాన్న పానాదిభిః
క్లిష్టం నైష్ఠిక బ్రహ్మచర్య మజయ న్మౌనవ్రతం ధారయన్।
స్వామి శ్రీ మలయాళ సద్గురుయతేస్సేవాం విధాయాదరాత్
నానా ద్వంద్వ సహిష్ణు రాఢ్యమతనో ద్ధన్యం స్వకం జీవితమ్॥



19

తీర్త్వా తారయతేతి సద్గురువచస్సంపాలనే తత్పరః
తత్సందర్శిత సత్యవర్త్మని పరానాకర్షయన్ సూక్తిభిః।
స్వామి శ్రీమలయాళ సద్గురు సుధీదేవం సదా చింతయన్
శ్రీ స్వామీ కురుతే ప్రబుద్ధగురువ త్సేవావిచారాన్ ధ్రువమ్॥

20

ప్రాక్పశ్చిమోత్తరదిశోద్భవ సర్వభాషా
పాండిత్య హేతుమతి వైభవలబ్ధకీర్తిః।
శ్రీ స్వామ్యసంగముని పుంగవలబ్ధ దీక్షో
విద్యాప్రకాశయతిరా డధునా విభాతి॥

21

వస్తు స్థితిః పర మియం త్వనువర్ణితా సా
విద్యాప్రకాశయతివర్యగతా సదా యా।
యా హ్యక్షితోఽవ్యవగతా చ మయా కదాచిత్
తస్మా న్మనుధ్వ మిహ నాతిశయోక్తి మీషత్॥

- శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారీ

22

జయతు జయతు శాన్తం శాశ్వతం బ్రహ్మతేజః
జయతు జయతు వేదాంతామృతోదారభూజః।
జయతు జయతు గీతా బోధకాచార్యరాజః
జయతు జయతు విద్యాజ్యోతి రానందతేజః॥

23

అచంచలాత్మవిశ్వాసం తీవ్రవైరాగ్యసంపదమ్।
సుదృఢం చ ముముక్షుత్వం లేభే వాచంయమాగ్రణీః॥

24

ద్వాదశాబ్ద తపశ్చర్యా మాచార్యసవిధే వసన్।
సంయతో బ్రహ్మనిష్ఠాయాం స్థితశ్చక్రే యథాతథమ్॥

25

ఆజన్మ బ్రహ్మచర్యేణ చావక్వాహారచర్యయా।
విద్యయా తపసా శుద్ధః ప్రాప్తవాన్ బ్రహ్మ శాశ్వతమ్॥

26

అధ జాతు శుభే కాలే సద్గురూద్దేశ పూర్వకమ్।
లోక శ్రేయస్కరం భద్రం సన్న్యాసాశ్రమ మావిశత్॥

27

అచిరేణ కృతాత్మాఽయం స్వయం శ్రీకాళహస్తిని।
స్థాపయామాస శాన్తం శ్రీశుకబ్రహ్మాశ్రమం శుభమ్॥

28

గీతాయా స్సర్వసారాంశం మకరందాభిధం బుధైః।
బహుధాఽభిష్టుతం చక్రే వ్యాఖ్యానం ధీరధీ ర్యతీ॥

29

దేశే దేశే సౌహృదశీలా మహితాత్మా
ఆమ్నాయాంతోద్బోధితధర్మా ననుశాస్తే।
పుణ్యశ్లోకా శాశ్వతశాంతిం కలయన్తీ
సా వేదాంతోదీరితభేరీ కృతి రేకా ॥



30

దిశి దిశి జగదజ్ఞానాంధకారాపనోదీ
శ్రుతి శిరసి నివిష్టో బ్రహ్మనిష్ఠా ప్రమృష్టః।
హృదివిమతవినాశః శాశ్వతః స్వప్రకాశః
జగతి విజయతాం తే బోధరూపః ప్రదీపః॥

శ్రీ ఆకురాతి బసవయ్య.

31

మాఅట శుకయోగి మహో
దార చరిత్రుండు త్యాగి ధార్మికుడు దయా
పూరితచిత్తుడు విద్యా
వారిధి విద్యాప్రకాశు భక్తి భజింతున్.

32

తేనెల్ చిందెదు నే యతీంద్రు భగవద్గీతా ప్రసంగంబులన్
నానాపండిత పామరౌఘము మహానందంబుతో వించు వి
జ్ఞానంబున్ గడియించు; న వ్వరమ పుణ్యశ్లోకు విద్యాప్రకా
శానందాఖ్య శుకాశ్రమాధిపతి నే నశ్రాంతమున్ గొల్చెదన్.

33

ఆ మహనీయమూర్తి రచనావళిలోని 'వసిష్ఠగీత', 'గీ
తా మకరంద' ముఖ్యకృతి దర్పణముల్ గనకుండ కోవిద
గ్రామణులేని చేత పులకండము పల్కుల నుంచినట్లు తా
మే మొగమెత్తి యింపు లిగురెత్తగ జూపెద రాత్మతత్త్వమున్?

34

అతని కతండె సాటి హృదయంగమ వాఙ్ముఖమందు; ఏమియా
కుతుకము? నేల యీనినటు గుంపులు గూడెదరెల్లవార; లా

కతలను స్వామి తెల్పవలె; కమ్మని కంఠమునెత్తి స్వామియే
మతి కరగంగ పాడవలె; మాటలు స్వామియె చెప్పగా వలెన్.

35

అది మురళీ నినదంబా?
అది శంఖారవమ? అంబుదార్భటియా? కా
దది 'కాళహస్తి స్వాముల'
సదమల మృదుమధుర వాక్ప్రసారము సుమ్మీ!

36

ద్వైత విశిష్టాద్వైతా
ద్వైత సమన్వయ మనస్కుతన్ దేశములో
గీతాప్రచార మెవ్వడు
నీతో సమముగ నొనర్చె నేడు గురువరా !

37

పంచరత్నాకరము లీది ప్రత్నసూత్న
సూక్తి మణు లేరి కొనితెచ్చి సొబగుమీను
హారములు గూర్చి కైసేసి తాంధ్రవాణి
మౌని మండన! మిము మెచ్చ మాతరంబె ?

38

పరమత దూషణంబునకు పాల్పడకుండ సమస్తమానవుల్
పరమ ముదంబునంద నుతి పాత్రముగాగ శతాధికంబుగా
జరిపితి జ్ఞానయజ్ఞములు ఛాత్రునిగా మిము బొందినట్టి స
ద్గురు మలయాళయోగివరు తొల్లిటి పుణ్యవిశేష మెట్టిదో !

-విద్వాన్ శ్రీ ముదివర్తి కొండమాచార్యులు



39

భగవద్గీత నఖండపండితు లిటన్ వ్యాఖ్యానముం జేసి చ
క్కగ బోధించిరి కాని, నీవలె ననేకంబైన సూత్నాంశముల్
తగురీతిన్ వివరించి మోక్షమును జెందంగల్గు మార్గంబు సూ
క్ష్మగతిన్ జూపగ గల్గినారె? మహితాత్మా ! మీకు జే జే లివే.

40

క్రమమారన్ నుతి కెక్కునంచు మలయాళస్వామికిన్ పుత్రదా
నము గావింప నినున్ భవత్పిత; మహానందంబునన్ స్వామి యా
జ్ఞమెయిన్ ఘోరతపం బొనర్చితివి దీక్షన్నీవు పంద్రెండు వ
ర్షము లత్యంత భయానకంబగు గుహన్, శ్లాఘింప నా స్వామియే.

41

రమణీయ మగు "శుక బ్రహ్మాశ్రమము" కాళ
హస్తిలో నెలకొల్పి యలరినావు;
తరియింప జేయు "గీతామకరందంబు"
విరచించి ప్రజల కర్పించినావు;
"వేదాంతభేరిని" వెలయించి విజ్ఞాన
ధనమును వెదజల్లి తనరినావు
స్వీయ రాష్ట్రమున "గీతా యజ్ఞము"లొనర్చి
స్థిరతరకీర్తి నార్జించినావు
పదియు నెనిమిది దినము లీ పగిది పరమ
పావనంబగు గీతా ప్రభావ మీవు
చాటి యజ్ఞానమును బాపజాలినావు
నీ ఋణము దీర్ప శక్య మౌనే? మహాత్మ !

42

ఎన్నో వేదము, లెన్నొ శాస్త్రములు, నింకెన్నో పురాణంబు, లె
న్నెన్నో గ్రంథములన్ బఠించి భువి నెంతే జ్ఞానమార్జించి శ్రీ

మన్నారాయణ దివ్యలీల లెరిగింపన్ మీర; లాలింపగాన్
దిన్నల్ పెద్దలు వేనవేలు సతమున్ విచ్చేయరే సద్గురూ !

\- కవిరత్న శ్రీ సున్నంవీరరాజు కవి

43

అఖిల పురాణేతి హాసాలు మథియించి
బ్రహ్మాభావంబును బడయగలిగి
స్థావర జంగమ జీవజాలంబును
సమబుద్ధితో జూచు శక్తి గలిగి
ఆంధ్రాంగ్ల సంస్కృతాధ్యయనంబు నొనరించి
సమధిక ధీశక్తి సంతరించి
త్యాగంబుపై దానధర్మాలపై ప్రేమ
ప్రతిరక్తకణమున బాదు కొలిపి
రాగమోహిత మైనట్టి భోగములను
తెగడి పయనించుచున్న ఓ దేశికేంద్ర !
భక్తితోడ హేలాపురీప్రజలు నేడు
ప్రణతు లర్పించినారు శుభాల నిమ్ము !

44

విశ్వమయున్ భజించుటకు వేడ్కను జూపుడి ! ఎల్లవేళలన్
నశ్వరమైన భోగములు నమ్మకుడీ ! పరమార్థదృష్టియున్
శాశ్వతమైన మోక్షమును సాధన జేయ కృషింబొనర్చుడీ !
విశ్వహితంబు కోరుడని విజ్ఞులు గండని బోధ జేసితే !

45

ఎచ్చట జన్మ మెత్తితివొ ఎచ్చట విద్యల నెల్ల నేర్చితో
సచ్చరితుండవై ప్రగతిసాధనకున్ నడుముం బిగించి నీ
ముచ్చట దీర్చుకొంటివి; ప్రమోదము మీరగ నాత్మతత్త్వమున్
అచ్చెరువంద బల్కితివి; అందఱి గుండెలు పుల్కరించెలే !



46

పలికిన పల్కులేమి, ప్రతిభన్ చవిచూపుటలోన నేమి, మా
తలపులు పొంగునట్లుగ సుధారసధారల నొల్కబోసి సం
చలనము గల్గజేసితివి సత్యమెదో యెరుగంగ జెప్పి ఓ
లలిత మనోజ్ఞ మంజుల కళానిలయా ! తలవంచినామయా !

\- మధురకవి శ్రీ భాగవతుల సత్యనారాయణ శర్మ

47

మాధుర్యమా ! నీదు మాన్యమౌ నిలయంబు
కలకండ యౌనటే? కాదు కాదు
మాధుర్యమా ! నీదు మాన్యమౌ నిలయంబు
ఇక్షు సారంబౌనె? యెబ్బె యెబ్బె
మాధుర్యమా ! నీదు మాన్యమౌ నిలయంబు
గోస్తనీ రసమటే? నాస్తి నాస్తి
మాధుర్యమా ! నీదు మాన్యమౌ నిలయంబు
మంచి మామిడిలోన? నెంచవలదు
తెలియగోరెదరా మీకు తెలుపుచుంటి
నాదు వసతిని గూర్చి మాన్యతములార !
శ్రీ ప్రకాశకగిరి యన్ ప్రసిద్ధి గన్న
స్వామి యమృతమయంబైన వాక్కునందు.

\- శ్రీ జమిలి నమ్మాళ్వార్

48

పుచ్చుకొనెడివా రధికము;
ఇచ్చెడివా రరుదు; మీర లిచ్చిన జ్ఞానం
బచ్చెరువుగ గొన్న జన స
ముచ్చయ మిక భక్తి మార్గమున జను టరుదే !

49

ఓంకారంబో ? త్రిమూర్తులందున నొకండో శక్తియో ధ్యాన దీ
క్షాంకంబై తనరార దైహిక సుఖం బర్థింప కెందేని ని
శ్శంకం గృష్ణ పవిత్ర వాక్తతి ప్రజాసందోహ మాలింప ని
స్సంకోచాశయభక్తి దేర్చిన యతిస్వామీ ! నమస్కారముల్.

50

వందనము లివె ప్రకాశా
నందగిరి యతీంద్ర ! కృప ననారతమును బ్రో
వం దగు సమస్తమానవ
బృందంబుల దైవభక్తి పెంపొందంగన్.

- శ్రీ ఆకిరి మల్లికార్జునయ్య

51

నిర్మలమైన వర్తనము నిశ్చలమైన తపోవిభూతియున్
ధర్మమునందు శ్రద్ధయును తాత్త్విక శోధనమందు చింతయున్
కర్మము లంటబోని యొక జ్ఞాన మయానుభవస్వరూపమున్
మర్మము లేని ప్రేమయె సుమా ! యతిమూర్తిగ గానిపించెడిన్.

52

అర్జునత్వము గూర్చు గీతారవింద
సాంద్ర మకరంద మాధుర్యసార మొలయు
మీ యుపన్యాస దివ్యరసాయనంబు
స్వామిచంద్రమ! భవరోగవారణంబు.

53

అట్టడుగు లోని మనుజునకైన ఇట్టె
యర్థమగు నట్లు గీతార్థమంద జేసి



దివ్యసందేశ దీప్తి వాతేనె లొసగి
పూజ లందిన స్వామి ! నమోఽస్తు మీకు.

- ఆర్యవైశ్య సంఘము - తణుకు

54

ఓంకారమునకు నత్యున్నత వేదాంత
గోష్ఠికి స్త్రీలును కొన్ని కులము
లందు బుట్టిన వా రనర్హులన్ ఛాందస
ప్రవరుల వాదనల్ బదబదలుగ
జేయు వ్యాసాశ్రమశ్రీకి శుక బ్రహ్మ
యాశ్రమం బత్యంత మండగాగ
శుష్క వేదాంతు లెచ్చోనున్న సత్యమున్
బలికించి మించి సత్ప్రభల నించి
కరము భారత భూమి నల్గడలయందు
దివ్యవేదాంత సారమున్ భవ్యమతుల
కంద జేయుచు నైక్యత నలరుచుండు
గాత ! వ్యాసాశ్రమమ్ము శుకాశ్రమమ్ము !

- శ్రీ యడ్లపల్లి కోటయ్య

55

గీతామకరందము సం
ప్రీతిగ పరమార్థకథలు వెలయించియు వి
ఖ్యాతిని గాంచిన స్వామికి
పూతచరిత్రునకు మా నమోవాకంబుల్.

56

గంభీరమైన ముఖ్యాంశంబులను జెప్పి
దీక్షతో భక్తిసందేశ మిచ్చు
సర్వజనాలికి సరళమౌ భాషలో

తత్త్వాలు పాడి బోధనలు సలుపు
విశ్వవిఖ్యాతమౌ విజ్ఞాన మిది యన
అంగ్లేయుల ప్రశంస లందజేయు
వినువారలకు నుంత వినుగు రాకుండగ
తగినట్టి కథల నుదాహరించు
పద్యములు శ్లోకములు కథల్ పాటలెన్నొ
గాంగ నిర్ఝరి వంటి వాగ్ధాటితోడ
శ్రోత లెల్లరు ప్రతిమలై చూచి వినగ
ప్రవచనం బిచ్చినారు శ్రీ స్వామివారు.

57

శివునికిని నేత్రదానంబు జేసినట్టి
భక్త కన్నప్ప పేరున వరలు నుచిత
నేత్ర వైద్యాలయంబు త్రినేత్రు కృపను
స్వామిసేవానిరతి చాటు శాశ్వతముగ.

- శ్రీ డి.వి.ఎల్.ఎన్.మూ॥

58

శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతింపగా లేక యీ
లోకంబందలి సౌఖ్యసంపదలకున్ లోనైన చిత్తంబునన్
చీకాకుల్ పడు మానవాళికి శుభశ్రీ లిచ్చు విద్యాప్రకా
శైకానంద గిరీంద్ర యోగులకు నే నిష్ఠుండనై మ్రొక్కెదన్.

59

ధర్మదేశం బొచు తనరారు నీ క్షోణి
నాధ్యాత్మిక స్వరం బమర బల్కి
వీనులవిందైన గానంబు జోడించి
భక్తిగీతంబుల రక్తి బాడి
స్మితపూర్వ భాషణం బతిహితంబును గూర్ప



మోక్షార్థి జనులకు మూర్పు లిచ్చి
సంసార జంబాల సంచయంబును దుల్చు
ఆస్తికభావంబు నమర గూర్చి
దినదినంబును వాసిష్ఠ దివ్యగీత
మరియు భగవానుడగు కృష్ణు మహితగీత
క్రమరీతుల బోధించు కాళహస్తి
ఆశ్రమోపాంత శుకమున కంజలింతు.

60

విద్యన్ముఖ్యుడు, శాంతశీలుడు, మహావేదాంతతత్త్వజ్ఞుడున్
సద్వంశప్రభవుండు, సాధువరుడున్, సద్వక్త, సత్యాత్ముడున్
సద్వ్యాఖ్యానభూషణధుర్యుడున్, సరసుడున్, సంపూర్ణసిద్ధాత్ముడున్
విద్యాంసుండగు నీ మహాత్ము దలతున్ వేదాంతసంసిద్ధికై.

- శ్రీ వడ్డూరి వేంకటేశ్వరసోమయాజి

61

కైలాసాచలశృంగ భూతల లసత్కాదంబినీ నవ్య మా
లాలంకార విచిత్ర వేదికల సాయాహ్నోత్సవోసాంచితో
ద్వేలప్రాక్తన నాట్యభంగిమ కళాభిజ్ఞుండు శ్రీశంకరుం
డాలంబ మ్మయి శ్రీ ప్రకాశగురు నత్యంతమ్ము గాపాడుతన్.

62

దైవమ్ము పేరిట తన పొట్టకూటికై
కుమిలెడు నొక పొట్ట కూటినంబి
మతమంచు సత్యసంగతి దుల్చి జనులకు
విసము దిన్పించు రక్కసు డొకండు
కుల కక్షలం బెంచి కూర్చుండనీయక
మానవత్వము జీల్చు మనుజు డొకడు
శాంతి సందేశమ్ము నసుయించి విశ్వమ్ము

గాల్పు జూచెడునట్టి ఖలు డొకండు
గలుగు భువి కింత గీతను గరపి శాంతి
సౌమనస్యాల వెదజల్లు శాంతిదూత
వీవు విద్యాప్రకాశ ! సద్విమలచరిత !
బ్రహ్మవిద్యానిధాన ! తుభ్యం నమోஉస్తు !

- విద్వాన్ శ్రీ కోనేరు వేంకట పూర్ణకుటుంబరావు

63

దీనిష్ఠాపరు లుల్లసిల్ల భగవద్గీతార్థసారంబు గీ
ర్వాణాంధ్ర ద్రవిడాంగ్ల భాషల యథార్థ జ్ఞాన సౌధాగ్ర సో
పానం బౌనన నిర్వచించి భవవిభ్రాంతిం బ్రవర్తిల్లు క
ర్మానుష్ఠానుల నుద్ధరించిరి ప్రకాశానంద యోగీశ్వరుల్.

64

ఒకమాటు యోగ ప్రయోక్త వసిష్ఠర్షి
జ్ఞానోపదేశ ప్రశస్తి దెలుపు
ఒకమాటు ద్వీపపుణ్యోదయు వేదార్థ
వివరణ ప్రజ్ఞా విభవము దెలుపు
ఒకమాటు శ్రీ శుకయోగి పావనభాగ
వత మహోపన్యాస పటిమ దెలుపు
ఒకమాటు పరమహంసోత్తంసు శంకరా
చార్యు భాష్యవిధానశక్తి దెలుపు
భవదుపన్యస్త గీతార్థ వివరణంబు
విన్న మహనీయుల కయారె ! యెన్న నిట్టి
తత్త్వవిద్యాప్రకారంబు దైవయోగ
వశత గాక ప్రాప్తించునే స్వామివర్య !

- విద్వాన్ శ్రీ బి. శ్యామరాజు



65

కోరికలేక భక్తతతి కోరికపై నిటు లేగుదెంచి యే
కోరికలేని కోరికల గోరగ నేర్పుట లెంచి చూడ నా
కారము దాల్చి భక్తుల కకారణదర్శన భాగ్యమౌ నిరా
కారముగా దలంచెదము కారణజన్ముల మిమ్ము సద్గురూ !

66

పావన మయ్యె మాపురము; పావన మయ్యెను మాగృహంబులున్;
పావన మయ్యె మాతపము; పావన మయ్యెను మాదు జన్మముల్;
పావనజన్మ ! మీ మృదుల పావనపాద సరోజధూళిచే
పావన మయ్యె సర్వము కృపాకర ! శ్రీకర ! సద్గురూత్తమా !

67

పదునెన్మిది యోగంబులు
పదునెన్మిది దినములందు ప్రత్యక్షముగా
సదయత గీతార్థంబుల
వెదజల్లుట మాదు పుణ్యవిభవము నగదే !

68

వింటిమి మీ మహోదయ పవిత్రచరిత్రము, బ్రహ్మచర్యమున్
గంటిమి బ్రహ్మతేజము నఖండము ద్వాదశవర్ష సాధ్యమున్
మంటిమి మోహసంజనిత మార్గమహాంబుధి దాటి, భక్తి జే
కొంటిమి మీ పవిత్ర పదకోమల దివ్యసరోజధామమున్.

69

పరిశుద్ధ వేదాంత పరిచయ వాక్యార్థ
భావముల్ దివ్యమౌ వంటకముగ
సర్వోపనిషదర్థ సార ప్రబోధముల్
సొంపారు ఘృత పాక సూపములుగ

ఖండశర్కర మించు కమ్మని యుపమాన
    ఫక్కికల్ మధురమౌ భక్ష్యములుగ
ప్రత్యక్ష పరమార్థ ప్రముఖ గీతా పుష్ప
    సారామృతము దధిక్షీరములుగ
భక్తజనముల హృదయముల్ పాత్రములుగ
పంక్తి గూర్చుండ గీతా భవనమునందు
విందు గావించితిరి మహానంద మొదవ
బ్రహ్మయజ్ఞైకనిష్ఠ ! విద్వద్వరిష్ఠ !

- శ్రీ కర్నాటి బాలనాగయ్య గుప్త

70

శ్రీనాథాది గురుత్రయ మ్మొకట రాశీభూత మైనట్లు వ్యా
ఖ్యానంబుల్ వెలయింపజేసి సులభగ్రాహ్యంబుగా దత్త్వ వి
జ్ఞాన మ్మెల్లర కందజేయగల సాక్షాద్బ్రహ్మవిద్యాప్రకా
శానందాచలదేవ ! కైకొనుము సాష్టాంగప్రణామంబులన్.

71

స్వామీ ! నిత్య వినూత్న ధోరణులతో శాస్త్రార్థసందర్భ సం
ధా మాహాత్మ్యముతో వినోదమును నానందమ్ము గల్గించు వా
చా మాధుర్యము గూర్చి తామిడిన స్వచ్ఛమ్మైన గీతామృతం
బీమా జగ్గయపేటకున్ దొరకె నే డిన్నాళ్ల పుణ్యంబునన్.

72

ఉపనిష ద్వాక్యంబు లుచ్చరించెడు వేళ
    ధీరతన్ మెఱయు గంభీరరవము
గతచరిత్రలలోని కథలు చెప్పెడు వేళ
    సరసమై యొప్పు స్వచ్ఛస్వరమ్ము
నేటి కాలపు తీరు చాటి చెప్పెడు వేళ
    చిరునవ్వు లొలికింప జేయు రవళి
అజ్ఞానులకు బోధ లందజేసెడు వేళ
    నమృత వాహినియైన యమరవాణి
విశ్వ సిద్ధాంత రీతి విన్పించు వేళ
సారతరమై ధ్వనించు ఘంటారవమ్ము
తమ మహోన్నత వాగ్గుంభనముల సొంపు
లెన్ని రూపంబులో వచియింప దరమె ?

73

శ్రీచరణ ప్రబోధము లశేష జనమ్ముల సంస్కరించి యా
లోచన లన్ని క్రొత్త దిశలో బయనింపగ జేసి సత్య ధ
ర్మాచరణమ్ము నన్ మనగ మార్గము జూపెను; మామనస్సులన్
బూచెను క్రొత్త పూవులు తపోధన ! ధన్యము లయ్యె జన్మముల్.

- శ్రీ వాసవీ గ్రంథాలయము - జగ్గయ్యపేట

74

శ్రీయుతమై, మహర్షి జనసేవితమై, రవివహ్ని చంద్రమో
ద్యేయ విశిష్ట తేజమయి, దృప్త భవాంబుధి మూత్న పోతక
ప్రాయమునై, ముముక్షుజన బంధవిదారకమౌ మహామహం
బీయెడ మిమ్ము బ్రోచుత మహీయసియౌ కరుణాస్వరూపమై.

75

జ్ఞానానంద మయస్వరూపుడు, కృపాస్వచ్ఛంద చిత్తుండు, స
న్మానామానసమత్వ బుద్ధియుతుడున్, నైర్మల్యబోధ ప్రధా
నానూనుం, డవధూత, శిష్యజనదివ్య జ్ఞాన సంధాత, బ్ర
హ్మానందస్థిరసద్గురూత్తముడు యోగానందమున్ గూర్చుతన్.

76

పటుతరతర్కకర్కశవివాదపటుత్వము జీవగఱ్ఱయై
కటువుగనుండు నా శ్రుతిశిఖాభిధశాస్త్రము శుష్కకాష్ఠ సం

పుటమగు దాని శ్రోతృజనబుద్ధికి హత్తెడి రీతి మార్దవ
స్ఫుటముగ సామ్యయుక్తముగ బోధ నొనర్చెడి మీకు మ్రొక్కెదన్.

77

గీతాచార్యముఖోద్గతంబు భగవద్గీతాభిధంబైన యీ
గీతాశాస్త్రము విప్పిచెప్పెడి భవద్గీఃప్రజ్ఞ నూహింపగా
గీతాచార్యుడ వంచు నెంచెద సుమీ! గీర్దేవతామూర్తియే
చాతుర్యం బలరార నీవ యగుచున్ జన్మించెనం చెంచెదన్.

78

సత్ శుక బ్రహ్మానామకాశ్రమ విధాత
సరస విద్యాప్రకాశాఖ్య గురువరుండు
తమమస న్మృత్యువుల బాపి దయ దలిర్ప
జ్యోతియును, సత్తు, అమృతంబు జొనుపుగాత!

— విద్వాన్ శ్రీ వనమా వేంకటరమణగుప్త

79

బ్రహ్మవిద్యానిధిభ్యోఽస్తు బ్రహ్మాదిభ్యో నమో నమః |
నమో వంశ ఋషిభ్యోఽస్తు సద్గురుభ్యో నమో నమః ||

80

విద్యయా తపసా చైవ పూతాత్మా యతిపుంగవః |
స్వామీ విద్యాప్రకాశాఖ్యో గురుర్విజయతేతరామ్ ||

81

మలయాళయతీంద్రస్య శిష్యశ్రేష్ఠాయ ధీమతే |
శుకాశ్రమప్రతిష్ఠాత్రే తస్మై శ్రీగురవే నమః ||



82

ద్వాదశాబ్ద తపోనిష్ఠా గరిష్ఠాయ మహాత్మనే |
సాక్షాత్కృతాత్మతత్త్వాయ గురుదేవాయ తే నమః ||

83

సర్వేషా మేవ యోగానాం మతానాం చ సమన్వయః |
సాధితో యేన తం విద్యాప్రకాశం ప్రణమామ్యహమ్ ||

84

జాతిలింగాదిభేదానాం కల్పితానాం వినాశకః |
సమదర్శీ గురుర్విద్యాప్రకాశానంద సద్యతిః ||

85

వాగ్వైభవం యతేర్యస్య సర్వలోకముదావహమ్ |
జాడ్యాపహం చ చైతన్యదాయకం తం గురుం భజే ||

86

గీతాప్రచారలోలాయ గీతాతత్త్వార్థ వేదినే |
గీతాయజ్ఞేశ్వరాయాస్తు గురుదేవాయ మంగళమ్ ||

— శ్రీ సముద్రాల లక్ష్మణయ్య



# అనుబంధం - 3

## 108 గీతాయజ్ఞముల వివరములు

| సంఖ్య | గీతాయజ్ఞం జరిగినచోటు | జిల్లా | నుండి | వరకు | రోజులు |
|---|---|---|---|---|---|
| 1. | నర్సరావుపేట | గుంటూరు | 3-12-57 | 20-12-57 | 18 |
| 2. | కాకినాడ | తూర్పుగోదావరి | 10-12-59 | 27-12-59 | 18 |
| 3. | తెనాలి | గుంటూరు | 30-12-60 | 15-1-61 | 18 |
| 4. | ప్రొద్దుటూరు | కడప | 24-7-61 | 10-8-61 | 18 |
| 5. | బెంగుళూరు | కర్ణాటక | 11-5-63 | 28-5-63 | 18 |
| 6. | మద్రాసు | తమిళనాడు | 20-6-63 | 7-7-63 | 18 |
| 7. | నంద్యాల | కర్నూలు | 18-7-63 | 4-8-63 | 18 |
| 8. | అనకాపల్లి | విశాఖపట్నం | 7-11-63 | 24-11-63 | 18 |
| 9. | మదనపల్లి | చిత్తూరు | 5-12-63 | 22-12-63 | 18 |
| 10. | విజయనగరం | విజయనగరం | 12-1-64 | 29-2-64 | 18 |
| 11. | విశాఖపట్నం | విశాఖపట్నం | 9-4-64 | 26-4-64 | 18 |
| 12. | గుంటూరు | గుంటూరు | 8-6-64 | 26-6-64 | 18 |
| 13. | సూర్యాపేట | నల్లగొండ | 19-11-64 | 6-12-64 | 18 |
| 14. | సిద్దిపేట | మెదక్ | 21-1-65 | 7-2-65 | 18 |
| 15. | మచిలీపట్నం | కృష్ణా | 31-3-65 | 18-4-65 | 18 |
| 16. | నల్లగొండ | నల్లగొండ | 6-5-65 | 23-6-65 | 18 |
| 17. | మిర్యాలగూడెం | నల్లగొండ | 26-11-65 | 12-12-65 | 18 |
| 18. | తెనాలి-2 | గుంటూరు | 5-1-66 | 23-1-66 | 18 |
| 19. | పాలకొల్లు | పశ్చిమగోదావరి | 2-2-66 | 20-2-66 | 18 |
| 20. | విజయవాడ | కృష్ణా | 5-4-66 | 24-4-66 | 20 |
| 21. | సికింద్రాబాద్ | హైదరాబాద్ | 10-5-66 | 29-5-66 | 18 |
| 22. | కాకినాడ | తూర్పుగోదావరి | 22-11-66 | 14-12-66 | 20 |
| 23. | జమ్మలమడుగు | కడప | 20-12-66 | 8-1-67 | 20 |
| 24. | నర్సరావుపేట | గుంటూరు | 10-1-67 | 29-1-67 | 20 |
| 25. | కడప | కడప | 22-2-67 | 13-3-67 | 20 |
| 26. | ఏలూరు | పశ్చిమగోదావరి | 28-3-67 | 16-4-67 | 20 |
| 27. | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ | 19-4-67 | 8-5-67 | 20 |
| 28. | నెల్లూరు | నెల్లూరు | 23-5-67 | 11-6-67 | 20 |
| 29. | జగ్గయ్యపేట | నల్లగొండ | 7-11-67 | 26-11-67 | 20 |
| 30. | ఖమ్మంమెట్టు | వరంగల్ | 12-12-67 | 31-12-67 | 20 |
| 31. | వరంగల్ | వరంగల్ | 15-1-68 | 2-2-68 | 20 |
| 32. | బెంగుళూరు | కర్ణాటకస్టేటు | 7-2-68 | 25-2-68 | 20 |
| 33. | షోలాపూర్ | మహారాష్ట్రస్టేటు | 29-3-68 | 17-4-68 | 20 |
| 34. | గుడివాడ | కృష్ణా | 23-4-68 | 12-5-68 | 20 |
| 35. | రాజమండ్రి | తూర్పుగోదావరి | 14-5-68 | 4-6-68 | 22 |
| 36. | హిందూపురం | అనంతపురం | 11-6-68 | 30-6-68 | 20 |
| 37. | భువనగిరి | నల్లగొండ | 12-11-68 | 1-12-69 | 20 |
| 38. | మహబూబనగర్ | వరంగల్ | 9-12-69 | 29-12-69 | 21 |
| 39. | కొడంగల్ | మహబూబ్‌నగర్ | 21-1-69 | 9-2-69 | 20 |
| 40. | కిర్లంపూడి | తూర్పుగోదావరి | 17-4-69 | 4-5-69 | 18 |
| 41. | కర్నూల్-1 | కర్నూలు | 11-5-69 | 1-6-69 | 22 |
| 42. | నరసాపురం | పశ్చిమగోదావరి | 23-12-69 | 11-1-70 | 20 |
| 43. | ఏలేశ్వరం | తూర్పుగోదావరి | 19-1-70 | 7-2-70 | 20 |
| 44. | కాకినాడ-3 | తూర్పుగోదావరి | 8-2-70 | 1-3-70 | 21 |
| 45. | చిలకలపూడి | కృష్ణా | 28-3-70 | 16-4-70 | 20 |
| 46. | తుని | తూర్పుగోదావరి | 20-4-70 | 11-5-70 | 22 |
| 47. | గుంటూరు | గుంటూరు | 15-5-70 | 7-6-70 | 24 |

